# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..







"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంథాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు డిజిటల్ లైబ్రరీ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Help Line / WhatsApp: 904 202 0123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan | INSA | Times of India | Tamil Heritage Foundation |
| CMU-Books | | Indian Express | AnnaUniversity NEW! |
| Sanskrit | | The Hindu | |
| TTD,Tirupathi | | Deccan Herald | |
| Kerala Sahitya Akademi | | Eenadu | |
| | | Vaartha | |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014



# కల్కి పురాణము

ప్రథమ భాగము

అనువక్త

ప్రొ॥ శ్రీపాద సత్యనారాయణ మూర్తి

సంపాదకురాలు

శ్రీమతి. ఎస్. వి. ఫణీశ్వరి

తిరుపతి

# సంపాదకీయం

## కల్కి పురాణము- ఆంధ్రానువాదము

భారతీయ సంస్కృతికి మూలాధారమగు వైదిక వాఙ్మయము విశ్వసాహిత్యములో ప్రథమ స్థానమలంకరించినది. శ్రుతులు, స్మృతులు యజ్ఞయాగాది క్రియా కలాపమునకే పరిమితము కాక కర్తవ్యాకర్తవ్యములబ నుపదేశించుచు అధునిక జ్ఞానమునకు సయితము నిధిగ విలసిల్లుచున్నవి. ఆస్తిక జగత్తునందు వేదస్మృతులకు పిమ్మట పురాణములకు విశిష్టస్థానముగలదు. ప్రభువు వలె శాసించెడివి వేదములైతే, స్నేహితుని వలె కర్తవ్యాకర్తవ్యముల నుపదేశించునవి పురాణములు శిక్ష, వ్యాకరణాదులు వేదోపకారకములైనట్లు వేదార్థమును పరిపూర్ణముగ తెలుసుకొనుటకు పురాణము లెంతయో ఉపకరించు చున్నవి. కనుకనే

''ఇతిహాసపురాణాభ్యాం వేదార్థముపబృంహయేత్'' అని మహాభారతము ఆదిపర్వమున (1-267) పేర్కొనబడినది.

వేదములకు పుట్టి నిల్లగు భరత ఖండము ప్రపంచములోనే పవిత్రభూమి. మనుష్యుని సన్మార్గమందు ప్రవర్తింపజేయుచు, మానవత్వపు విలువలను చాటి చెప్పుచు, కర్తవ్యాకర్తవ్యముల నుపదేశించు వైదిక వాఙ్మయము సామాన్యుల కందుబాటులో లేదు. ఈ కారణముచే పరమ కారుణికుడగు వేదవ్యాస మహర్షి సమాజకల్యాణమునకై సామాన్య ప్రజలను సయితం ముద్ధరించుటకు ఇతిహాసపురాణములను రచించి వైదిక ధర్మముల నందరికి అందుబాటులోనికి తెచ్చెను. వ్యాసమహర్షి బ్రహ్మసూత్రములు అద్వైత - ద్వైత - విశిష్టాద్వైత సంప్రదాయములకు పట్టుగొమ్మలు. భవసాగరమున మునిగి తేలుచు, పాపపంకిలమగు జీవనమున కలవాటు పడి ఐహిక సుఖభోగముల కలవాటు పడిన ప్రాణులను భవబంధముల నుండి విముక్తి చేయుట శ్రుతి స్మృతి పురాణముల ప్రధానోద్దేశ్యము.

''పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణాస్మృతమ్
అనంతరంచ వక్త్రేభ్యో వేదాస్తస్య వినిర్గతాః''

అని మత్స్యపురాణమున (53-3) పురాణముల వైశిష్ట్యము చెప్పబడినది. వేదములను విభజించిన వ్యాస మహర్షిచే ఇతిహాస పురాణములు రచింపబడుటచే వైదిక విషయములన్నియు పురాణముల యందు నిగూఢములై యున్నవి.

''పురాణన్యాయమీమాంసాధర్మశాస్త్రాఙ్గమిశ్రితాః
వేదాః స్థానాని విద్యానాం ధర్మస్య చ చతుర్దశ''
వేదములు (4) మీమాంస(2) వేదాంగములు (6) పురాణధర్మశాస్త్రములను చతుర్దశ విద్యలలో పురాణములకు స్థానము గలదు.

యజ్ఞ-యాగ-దాన-తీర్థ-వ్రత-ఉత్సవములే కాక భౌగోళిక, సాంఘిక, సామాజిక స్థితిగతులెన్నియో ఇతిహాస పురాణముల వలన మనము తెలిసికొనవచ్చును.

''జననీ సర్వభూతానాం సర్వభూతధరా ధరా
నానాజనపదాకీర్ణా నానాధిష్ఠానపత్తనా.
నానానదనదీశైలా నైకజాతి సమాకులా
అనంతా గీయతే దేవీ పృధ్వీచబహువిస్తరా.''

అని వాయు పురాణమున (5-23) భూమండలస్వరూపము పేర్కొనబడినది. విష్ణుపురాణమున

II 2-3-4-22

''తత్రాపి భారతం శ్రేష్ఠం జంబూద్వీపే మహామునే
యతో హి కర్మ భూరేషా తతోఽన్యా భోగభూమయః.
ఇతః సంప్రాప్యతే స్వర్గో ముక్తిమస్మాత్ ప్రయాంతి వై
తిర్యక్త్వం నరకం చాపి యాంత్యతః పురుషాః మునే.''

అని జంబూద్వీపమున ఇతరప్రదేశములు భోగనిలయములు కాగా భారతవర్షము కర్మభూమియని పేర్కొనబడినది. ఇందు వర్ణించని విషయము లేదు. శిల్పము, కళ, రాజనీతి, ఆయుర్వేదము, ఆచారవ్యవహారములు, ధార్మిక స్థితిగతులు, సృష్టిప్రళయ ప్రక్రియ, కృతయుగ, త్రేతాయుగ, ద్వాపరయుగ, కలియుగ స్థితిగతులు, భూగోళ పరిస్థితులు, నదులు, పర్వతములు, రాజుల చరితము---- ఒక్కటేమిటి? సమస్తము ఇతిహాస పురాణములలో నిబద్ధమైయున్నది. భగవదవతారములు, మాహాత్మ్యము, ఉపాసనా పద్ధతి, భక్తి మార్గము, ముక్త్యుపాయము వివరింపబడినవి. కనుకనే మహాభారతమున వ్యాసమహర్షి-

''ధర్మేచార్థే చ కామే చ మోక్షేచ భరతర్షభ
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్.''

(స్వర్గ.ప. 5-50) అని స్వయముగ చెప్పినాడు.

వేదములలో సంగ్రహముగ పేర్కొనబడిన విషయములు ఉపాఖ్యానముల ద్వారా విస్తృత పరచి సామాన్య ప్రజల కందించిన మహాపురుషుడు వ్యాసమహర్షి.

''విష్ణుర్విచక్రమే త్రేధాఽనిదధే పదమ్'' అని ఋగ్వేదసూక్తమున వామనావతారము

ప్రస్తుతింపబడెను. కేవలము బీజరూపముగ అహల్యాది వృత్తాంతములు వేదములలో పేర్కొనబడినవి. వాటి విస్తారము పురాణములలో కలదు. కనుక పురాణజ్ఞానము లేనిచో వైదిక విషయములను సంపూర్ణముగ అవగాహన చేసుకొనలేము.

ధర్మార్థకామమోక్షములను చతుర్విధ పురుషార్థములలో తురీయమగు మోక్షము పరమపురుషార్థము ధర్మార్థకామములను సమపాళ్ళలో ఆచరించుట ద్వారా పరమ పురుషార్థమును పొందవలెను. సత్త్వ రజస్తమోగుణములలో తామసము రాక్షస ప్రవృత్తికి బీజము. ఇట్టి ఆత్మ వినాశకమగు గుణమును పరిహరించుటకు భక్తి మార్గ మొక్కటే సామాన్యులకు శరణ్యము. భక్తిమార్గముచే ఐహికాముష్మిక ఫల సంపాదనమే పురాణముల పరమ లక్ష్యము.

పురాణ మనగా నేమి?

"సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ
వంశాను చరితం చేతి పురాణం పంచలక్షణమ్."

సర్గ, ప్రతిసర్గ, వంశ, మన్వంతర, వంశానుచరితములు కలది. పురాణమనబడును. ఈ అయిదు లక్షణములు పురాణములయందు కన్పట్టును. సర్గ అనగా ప్రపంచము యొక్కసృష్టి.

"అవ్యాకృత గుణక్షోభాన్ మహతస్త్రివృతోఽహమః
భూతమాత్రేంద్రియార్థానాం సంభవః సర్గ ఉచ్యతే."

శ్రీమద్భాగవతం - 12-7-11.

సామ్యావస్థాపన్నమగు సత్త్వరజస్తమోరూపత్రిగుణాత్మక ప్రధాన తత్త్వము యొక్క క్షోభవలన మహత్తత్త్వము, దాని వలన అహంకారము, అహంకారము వలన ఏకాదశేంద్రియములు, పంచతన్మాత్రలు, పంచమహాభూతముల ఉత్పత్తి సర్గమన బడును. ప్రతిసర్గ మనగా ప్రపంచము యొక్క ప్రళయము. ఇది నైమిత్తిక ప్రళయము, ప్రాకృతిక ప్రళయము, నిత్యప్రళయము, ఆత్యంతిక ప్రళయమని నాలుగు విధములు. శ్రీమద్భాగవతమున, అన్య పురాణముల యందు వీటి వివరణ గలదు.

3. వంశము. "రాజ్ఞాం బ్రహ్మ ప్రసూతానాం వంశస్త్రైకాలికోఽన్వయః" భా.పు. 17-7-16 బ్రహ్మ వలన పుట్టిన రాజులు, మహర్షుల భూత భవిష్యద్వర్తమాన కులపరంపర వంశమనబడును.

4. మన్వంతర మనగా మనువు, మనుపుత్రులు, ఇంద్రుడు, దేవతలు, ఋషులు, విష్ణువు యొక్క అవతార సంఘటనల ఉల్లేఖము.

"మన్వంతరం మనుర్దేవా మనుపుత్రాః సురేశ్వరః
ఋషయోఽంశావతారశ్చ హరేః షడ్విధముచ్యతే."

భా.పు. 12-7-15

5. వంశాను చరిత మనగా మర్త్యలోకమున పుట్టిన పుణ్య కర్మశాలురగు ఋషుల, ధర్మ రక్షా తత్పరులగు రాజుల వంశ వంశ చరిత్ర. ''వంశానుచరితం తేషాం వృత్తం వంశధరాశ్చయే'' అని పురాణలక్షణములైదు.

ఆయాపురాణములననుసరించి కాలనిర్ణయము.

| | |
|---|---|
| కృతయుగము | 1728000సం॥లు |
| త్రేతాయుగము | 1296000సం॥లు |
| ద్వాపర యుగము | 864000సం॥లు |
| కలియుగము | 432000సం॥లు |

నాలుగు యుగములు కలిసి మహాయుగమనబడును. దీని పరిమాణము 4320000సం॥లు. 71 మహాయుగములు ఒక మన్వంతరము. దీని పరిమాణము 306720000సం॥లు. పదునాలుగు మన్వంతరములు ఒక కల్పమనబడును. కల్పపరిమాణము (4320000000) బ్రహ్మకు ఒక
II పగలు . ఈ విధముగ నూరు సంవత్సరములు బ్రహ్మ ఆయుర్దాయము. అనగా 31104000000000సం॥లు. ఈ విధముగ జగత్తు యొక్క వాస్తవ పరిచయము పురాణముల వలన లభించు చున్నది.

పురాణములు పదునెనిమిది. వీటికున్న ప్రసిద్ధి ఉప పురాణములకు కన్పించుట లేదు. కాని ఉపపురాణములలో కొన్ని పురాణములకు పూరకములు కాగా మరికొన్ని స్వతంత్రములు. ఉపపురాణములలో కల్కి పురాణమునకు విశిష్టస్థానముము గలదు. భాగవత పురాణమునకు పూరకమై భవిష్యత్తులో కలియుగమున జరుగు వృత్తములిందు పేర్కొనబడినవి. కలియుగాంతమున విష్ణుమూర్తి కల్కిగ అవతరించి కలిని నాశము చేసి కృతయుగమును స్థాపించుట ప్రధానవృత్తము. ఇందు మూడు అంశలు గలవు. ఒక్కొక్క అంశ మరల అధ్యాయములుగా విభజింపబడినది. ప్రధానముగ భక్తి ఇందు నిరూపింపబడినది. కల్కి పురాణము యొక్క పఠన శ్రవణముల వలన పరమపురుషార్థము లభించును. దీనిని చక్కగా పఠించి భక్తులు ముక్తి నొందుదురు గాక! దీని ప్రచురణమునకై ఆర్థిక సహాయ మొనరించిన తిరుమల తిరుపతి దేవస్థానం వారికి నా కృతజ్ఞతాభి వందనములు.

స్వల్ప కాలములో ఈ గ్రంథము ననువదించి యిచ్చిన శ్రీపాద సత్యనారాయణమూర్తి గారికి నా నమస్సులు.

చక్కగా DTP చేసి యిచ్చిన వ్యాసగ్రాఫిక్స్ కాకినాడ వారికి నా కృతజ్ఞతాభి వందనములు.

సంపాదకురాలు

కల్కి పురాణము- ప్రథమ భాగము

# విషయ సూచిక

## ప్రథమాంశము



## ద్వితీయాంశము



---------------

# కల్కి పురాణము

## ప్రథమాంశము -- ప్రథమాధ్యాయము



సేంద్రా దేవగణా మునీశ్వరజనా లోకాః సపాలాః సదా
స్వం స్వం కర్మ సుసిద్ధయే ప్రతిదినం భక్త్యా భజం త్యుత్తమాః
తం విఘ్నేశ మనంత మచ్యుత మజం సర్వజ్ఞ సర్వాశ్రయమ్
వందే వైదిక తాంత్రికాది వివిధైః శాస్త్రైః పురోవందితమ్. 1

**అవతారిక :** గ్రంథారంభమున విఘ్న నాశము కొఱకు వ్యాసమహర్షి ఇష్ట దైవ మగు నారాయణునికి నమస్కారము చేయుచున్నాడు.

**భావము :** ఇంద్రాది దేవతలు, మునీశ్వరులు, అష్టదిక్పాలురు మొదలగు వారిచే తమ తమ అభీష్ట కార్యసిద్ధికొఱకు ప్రతిదినము భక్తితో పూజింపబడువాడు, పూర్వకాలమున దేవతలచే వివిధ వైదికతాంత్రికాది శాస్త్రములచే ఆరాధింపబడినవాడు, సమస్తము నెరిగినవాడు సమస్తమున ాధారభూతుడు, విఘ్నములను పోగొట్టువాడు ఆద్యంత రహితుడు నగు అచ్యుతుని నమస్కరించుచున్నాను.

★ ఇచట శ్లోకమున రెండవ పాదమున యం సర్వార్థ సుసిద్ధయే అని పాఠాంతర మున్నది.

వి: ఇంద్రో వహ్నిః పితృపతిః నిర్‌ఋతి ర్వరుణో౽ నిలః
ధనదః శంకర శ్చైవ లోకపాలాః పురాతనాః. (అగ్ని పు.)

( ఇంద్రుడు, అగ్ని, యముడు, నిర్‌ఋతి, వరుణుడు, వాయువు, కుబేరుడు, శంకరుడు అనువారు దిక్పాలకులు)

నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం చైవ తతో జయ ముదీరయేత్. 2

భా: నారాయణుని, నరోత్తముడగు నరుని , సరస్వతీదేవిని నమస్కరించి పిమ్మట జయమును అనగా ఇతిహాస పురాణముల నుచ్చరింపవలెను.

వి: అష్టాదశ పురాణాని రామస్య చరితం తథా
కార్ష్ణం వేదం పంచమం చ యన్మహాభారతం విదుః
తథైవ శివధర్మాశ్చ విష్ణుధర్మాశ్చ శాశ్వతాః
జయేతి నామ తేషాం చ ప్రవదంతి మనీషిణః
సంసార జయనం గ్రంథం జయ నామాన మీరయేత్.

అని భవిష్యపురాణమున చెప్పబడినది. సంసారబంధము నుండి విముక్తి కలుగ జేయునది గావున జయ మనబడును. నారాయణు డనగా విష్ణుమూర్తి అవతారము. నార మనగా జలము. ప్రలయ కాలమున జలమును అయనము = ఆశ్రయముగ చేసికొనుట వలన **నారాయణుడని** పేరు. విష్ణుపురాణమున

ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః
అయనం తస్య తాః పూర్వం తేన నారాయణః స్మృతః

అని చెప్పబడినది. విష్ణువు యొక్క అవతారవిశేషమే నరుడు. (ఋషి విశేషము) శ్రీ మద్భాగవతమున

ధర్మస్య దక్షదుహిత ర్యజనిష్ట మూర్త్యాం
నారాయణో నర ఇతి స్వతపః ప్రభావః 2-7-7

అని పేర్కొనబడినది. దక్షపుత్రికయందు జన్మించిన విష్ణువు యొక్క అంశలు నరనారాయణులు. ఋషులగు వీరు ఘోరతప మాచరించిరి.

తుర్యే ధర్మకలాసర్గే నరనారాయణా వృషీ
భూత్వాత్మోపశమోపేత మకరో ద్దుశ్చరం తపః. 1-3-7

**యద్దోర్దండ కరాల సర్ప కవల జ్వాలా జ్వలద్విగ్రహాః**
**నేతుః సత్కరవాల దండ దలితా భూపాః క్షితిక్షోభకాః**
**శశ్వత్ సైంధవవాహనో ద్విజజనిః కల్కిః పరాత్మా హరిః**
**పాయాత్ సత్యయుగాది కృత్ స భగవాన్ ధర్మప్రవృత్తిప్రియః. 3**

భా: రాజ్యమును రక్షింపవలసిన రాజులు భూమండలమున క్షోభకలుగజేయు సమయమున, పరమాత్మ యగుకల్కియొక్క బాహువులనెడి భయంకర సర్పముల విషజ్వాలలచే రాజులశరీరములు భస్మీభూతములగును. కల్కి తీక్ష్ణ కరవాలముచే (కత్తి) రాజులు చంపబడుదురు. బ్రాహ్మణవంశమందు జన్మించి అశ్వము వాహనముగ కలిగి, కృతాదియుగములకు ప్రవర్తకుడై ధర్మప్రవృత్తి యందు ప్రియుడగు కల్కిఅవతారమునుధరించిన భగవంతుడగు శ్రీహరి రక్షించుగాక.

వి : చత్వారి భారతే వర్షే యుగాని ఋషయోఽ బ్రువన్

కృతం త్రేతా ద్వాపరశ్చ కలిశ్చేతి చతుర్యుగమ్ .

అని మత్స్యపురాణమున (118 అధ్యా) నాలుగు యుగములు చెప్పబడినవి. కృతయుగమున ధర్మము నాలుగు పాదములతో నడవగ క్రమముగ హ్రాసము చెందుచు కలియుగమున ఒక్కపాదముతో నడుచు నని చెప్పబడినది.

**ఇతి సూతవచః శ్రుత్వా నైమిషారణ్యవాసినః**

**శౌనకాద్యా మహాభాగాః పప్రచ్ఛు స్తం కథా మిమామ్. 4**

**హేసూత! సర్వధర్మజ్ఞ ! లోమహర్షణ పుత్రక**

**త్రికాలజ్ఞ ! పురాణజ్ఞ! వద భాగవతీం కథామ్. 5**

భా: లోమహర్షణ పుత్రుడగు ఉగ్రశ్రవసుని మాటలు వినిన నైమిషారణ్య వాసులగు మునిజనము భూత, భవిష్యద్వర్తమానములను, సర్వధర్మములను పురాణములను తెలిసిన లోమహర్షణ పుత్రుని చూచి సూత! భగవత్సంబంధమగు కథను చెప్పుమని అడిగిరి.

వి : 'బ్రాహ్మణ్యాం క్షత్రియాత్ సూతః ' అని యాజ్ఞవల్క్యస్మృతిలో చెప్పబడినది. విష్ణుపురాణమున(3-6-16)

ప్రఖ్యాతో వ్యాస శిష్యోఽ భూత్ సూతో వై లోమహర్షణః

పురాణసంహితా స్తస్మై దదౌ వ్యాసో మహామునిః.

అని లోమహర్షణుడు వేదవ్యాసులవారి ప్రధానశిష్యుడుగ పేర్కొనబడినది. వ్యాసుడు ప్రసన్నుడై తనగ్రంథముల నన్నిటిని లోమహర్షణున కిచ్చెను. శ్రీమద్భాగవతమున లోమహర్షణుని వృత్తాంతము( 10-7-13 )ఇటులున్నది. వ్యాసాసనమునకూర్చుండి లోమహర్షణుడు నైమిషారణ్యవాసులగు మహర్షులకు పురాణములను వినిపించుచుండెను. ఆ సమయమున తీర్థయాత్రలు చేయుచు బలదేవు డచ్చటకు వచ్చెను. ఋషు లందరు లేచి నిలబడి అతనికి నమస్కరించిరి. కాని లోమహర్షణుడు లేవలేదు. బలదేవుడు అతనిని అహంకారిగ తలచి క్రుద్ధుడై సంహరించెను. ఋషు లందరు తిరిగి అతనిని బ్రతికించుమని వేడుకొనగ బలదేవుడు 'రోమహర్షణుడు తిరిగి బ్రతుకుట సాధ్యము కాదు. ఇతని పుత్రుడగు ఉగ్రశ్రవసుడు ( ఉగ్రశ్రవాః) మీకు పురాణశ్రవణము చేయు' నని చెప్పెను. కల్కి పురాణమునకు వక్త కూడా ఉగ్రశ్రవసుడే.

**కః కలిః? కుత్ర వా జాతో జగతా మీశ్వరః ప్రభుః**

**కథం వా నిత్యధర్మస్య వినాశః కలినా కృతః. 6**

ఇతి తేషాం వచః శ్రుత్వా సూతో ధ్యాత్వా హరిం ప్రభుమ్
సహర్షపులకోద్భిన్నసర్వాంగః ప్రాహ తాన్ మునీన్. 7

భా: కల్కి ఎవరు? ఎక్కడ జన్మించెను? ఎట్లు లోకముల కధిపతి ఆయెను? ఎట్లు నిత్యధర్మమును నాశముజేసెనని మహర్షులు ప్రశ్నించిరి. వారి మాటలు విని ఉగ్రశ్రవసుడు హరిని ధ్యానించి, ఆనందపులకితుడై మహర్షుల కిట్లు చెప్పెను.

సూత ఉవాచ

శృణుధ్వ మిద మాఖ్యానం భవిష్యం పరమాద్భుతమ్
కథితం బ్రహ్మణా పూర్వం నారదాయ విపృచ్ఛతే. 8
నారదః ప్రాహ మునయే వ్యాసా యామితతేజసే
స వ్యాసో నిజపుత్రాయ బ్రహ్మరాతాయ ధీమతే. 9

భా: ఓమహర్షులారా! మిక్కిలి ఆశ్చర్యమును గొలుపు వృత్తాంతమును మీరు వినుడు. పూర్వకాలమున నారదు డడుగగ బ్రహ్మ అతనికి ఈ ఉపాఖ్యానము చెప్పెను. నారదుడు అమితతేజస్వియగు వ్యాసునకు, వ్యాసమహర్షి తనపుత్రుడగు బ్రహ్మరాతునకు ఈ కథను చెప్పెను.

స చాభిమన్యుపుత్రాయ విష్ణు రాతాయ సంసది
ప్రాహ భాగవతాన్ ధర్మా నష్టాదశసహస్రకాన్. 10
తదా నృపే లయం ప్రాప్తే సప్తాహే ప్రశ్నశేషితమ్
మార్కండేయాదిభిః పృష్టః ప్రాహ పుణ్యాశ్రమే శుకః. 11

భా: బ్రహ్మరాతుడు అభిమన్యు పుత్రుడగు విష్ణురాతునికి సభలో భాగవతధర్మములను వినిపించెను. అందు 18000 శ్లోకములు గలవు. రాజగు విష్ణురాతుడు మరణించగా పుణ్యాశ్రమమున మిగిలిన భాగవతధర్మములను మార్కండేయాది మహర్షులడుగగ శుకమహర్షి వారికి వివరించెను.

తత్రాహం తదనుజ్ఞాతః శ్రుతవా నస్మి యాః కథాః
భవిష్యాః కథయామీహ పుణ్యా భాగవతీః శుభాః. 12
తాః శృణుధ్వం మహాభాగాః సమాహితధియోఽనిశమ్
గతే కృష్ణే స్వనిలయం ప్రాదుర్భూతో యథా కలిః. 13

భా: శుకమహర్షి వలన పుణ్యాశ్రమమున వినిన పుణ్యప్రదమగు భాగవతవృత్తాంతమును మీకు చెప్పెదను. శ్రీకృష్ణభగవానుడు వైకుంఠమునకు వెడలిన పిమ్మట కలి పుట్టిన వృత్తాంతమును

సావధానముగ వినుడు.

ప్రలయాంతే జగత్స్రష్టా బ్రహ్మా లోకపితామహః
ససర్జ ఘోరం మలినం పృష్ఠదేశాత్ స్వపాతకమ్. 14
స చాధర్మ ఇతి ఖ్యాత స్తస్య వంశాను కీర్తనాత్
శ్రవణాత్ స్మరణాల్లోకః సర్వపాపైః ప్రముచ్యతే. 15

భా : ప్రలయాంతమున సృష్టికర్తయగు బ్రహ్మ తన పృష్ఠ దేశమునుండి ఘోరము, మలినమునగు స్వీయ పాతకమును సృజించెను. ఆపాతకము అధర్ముడను పేరుతో ప్రసిద్ధి నొందెను. తద్వంశమును కీర్తించుట వలన వినుట వలన స్మరించుట వలన ప్రజలు సర్వపాపములనుండి ముక్తులగుదురు.

అధర్మస్య ప్రియా రమ్యా మిథ్యా మార్జారలోచనా
తస్య పుత్రోఽతితేజస్వీ దంభః పరమకోపనః 16
సమాయాయాం భగిన్యాం తు లోభం పుత్రం చ కన్యకామ్
నికృతిం జనయామాస తయోః క్రోధః సుతోఽభవత్ 17

భా: అధర్ముని భార్య పేరు మిథ్య. పిల్లి కళ్లు గలది. అయినా మనోహరమైనది . వారికి మిక్కిలి తేజస్సు, కోపముగల దంభుడను పుత్రుడు కలిగెను. మాయ వారి పుత్రిక. దంభునివలన తనసోదరియగు మాయయొక్క గర్భమున లోభుడను పుత్రుడు, నికృతి యను కన్యకయు కలిగిరి. లోభనికృతులకు క్రోధుడను కొడుకు పుట్టెను.

స హింసాయాం భగిన్యాం తు జనయామాస తం కలిమ్
వామహస్తధృతోపస్థం తైలాభ్యక్తాంజన ప్రభమ్. 18
కాకోదరం కరాలాస్యం లోలజిహ్వం భయానకమ్
పూతిగంధం ద్యూతమద్య స్త్రీసువర్ణకృతాశ్రయమ్. 19

భా: క్రోధుని సోదరి హింస. క్రోధుని వలన హింసకు కలి జన్మించెను. కలి ఎడమచేతిలో లింగమును ( గుహ్యాంగము ) ధరించెను. అతడు తైలమిశ్రితము అగు అంజనము ( కాటుక ) వలె నల్లగ నుండెను. కాకి పొట్ట, నల్లని ముఖము , వ్రేలాడు ( జిహ్వ ) నాలుక కలిగి కలి భయంకరు డయ్యెను. కలి జూదము, మద్యము, స్త్రీ, సువర్ణముల నాశ్రయించి యుండెను.

భగిన్యాం తు దురుక్త్యాం స భయం పుత్రం చ కన్యకామ్
మృత్యుం స జనయామాస తయోశ్చ నిరయోఽభవత్. 20

యాతనాయాం భగిన్యాం తు లేభే పుత్రాయుతాయుతమ్
ఇత్థం కలికులే జాతో బహవో ధర్మనిందకాః 21

భా: కలికి తన సోదరియగు దురుక్తి వలన భయ నామకపుత్రుడు మృత్యువను పుత్రికయ కలిగిరి. మృత్యువునకు భయునివలన నిరయుడు జన్మించెను. యాతన నిరయుని సోదరి వారిద్దరికి అసంఖ్యాకులగు పుత్రులు జన్మించిరి. ఇట్లు కలి వంశమున అనేకులు ధర్మనిందకుల పుట్టిరి.

యజ్ఞాధ్యయనదానాది వేదతంత్రవినాశకాః
ఆధివ్యాధి జరాగ్లాని దుఃఖశోక భయాశ్రయాః. 22
కలిరాజానుగాశ్చేరు ర్యూథశో లోక నాశకాః
బభూవుః కాలవిభ్రష్టాః క్షణికాః కాముకా నరాః. 23

భా: కలి వంశీయులు యజ్ఞము, అధ్యయనము, దానము మున్నగు వైదిక ధార్మిక కార్యములను నాశము చేయుచు, ఆధి, వ్యాధి, ముసలితనము, గ్లాని, దుఃఖము, శోకము, భయముల నాశ్రయించి యుండిరి. ( ఆధి=మానసిక వ్యథ) కలిరాజు ననుసరించు సేవకజనము లోకమును పీడించుచు గుంపుగ తిరుగసాగిరి. వీరు కాలమున కతీతులై భోగలాలసులై, కామ స్వభావము గల వారయిరి.

దంభాచార దురాచారా స్తాతమాతృ విహింసకాః
వేదహీనా ద్విజా దీనాః శూద్రసేవాపరాః సదా. 24
కుతర్కవాదబహులా ధర్మవిక్రయిణోఽధమాః
వేదవిక్రయిణో వ్రాత్యా రస విక్రయిణ స్తథా. 25
మాంస విక్రయిణః క్రూరాః శిశ్నోదరపరాయణాః
పరదారరతా మత్తా వర్ణసంకర కారకాః. 26

భా. కలిరాజ జనము దంభాచారులు, దురాచారులై తల్లిదండ్రులను హింసించు చుండిరి. బ్రాహ్మణవంశమున పుట్టిన వారు వేదశాస్త్రములకు దూరమై , దరిద్రులై నిరంతరము శూద్రసేవాతత్పరులైరి. వారు (బ్రాహ్మణులు) కుతర్కములతో కాలయాపన చేయుచు అధార్మికులు, అధములు, ఉపనయనాది సంస్కార బాహ్యులు నయిరి. వారు ( కలిసేవకజనము) నిషిద్ధమగు వేద- మాంస -రస విక్రయము జేయుచు క్రూరులై, కామతత్పరులై ఉదరతృప్తియే లక్ష్యముగ పరదారలయం దాసక్తులై మదించిన వారై వర్ణసంకర కారకు లగుచున్నారు.

హ్రస్వాకారాః ; పాపసారాః శఠా మఠ నివాసినః
షోడశాబ్దాయుషః శ్యాల బాంధవా నీచసంగమాః. 27
వాదకలహాకుబ్ధాః కేశవేశ విభూషణాః
కలౌ కులీనా ధనినః పూజ్యా వార్ధుషికా ద్విజాః. 28

భా: కలిని అనుసరించు జనులు పొట్టివారు, పాపపరాయణులు, వంచకులు, మఠనివాసులు, పదహారుసంవత్సరము లాయుర్దాయము గలవారు శ్యాలబాంధవులు నీచసాంగత్యము గలవారునైరి. వివాద, కలహములకు కారణభూతులై, కేశాదుల నలంకరించుకొనుటయందాసక్తి కలవారైరి. కలి యుగమున కులీనులు, ధనికులు వార్ధుషికులగు ( వడ్డీ వ్యాపారము చేయువారు) బ్రాహ్మణులు పూజ్యులగుచున్నారు.

సన్యాసినో గృహాసక్తా గృహస్థా స్త్వవివేకినః
గురునిందాపరా ధర్మధ్వజినః సాధువంచకాః. 29
ప్రతిగ్రహరతాః శూద్రాః పరస్వ హరణాదరాః
ద్వయోః స్వీకార ముద్వాహః శఠే మైత్రీ వదాన్యతా . 30
ప్రతిదానే క్షమాశక్తౌ విరక్తి కరణాక్షమే
వాచాలత్వం చ పాండిత్యే యశోఽర్థే ధర్మసేవనమ్. 31

భా: న సన్యాసులు గృహస్థధర్మమం దనురక్తు లయిరి. గృహస్థులు అవివేకులైగురునిందను చేయుచు, సాధువంచకులై తా మాచరించునదియే ధర్మమని తలచుచున్నారు. ప్రతిగ్రహమం దాసక్తి కల్గిన శూద్రులు పరధనము నపహరించు వారయిరి. స్త్రీ పురుషుల సమ్మతియే వివాహము. వంచకులతో మైత్రి చేయుదురు. ప్రతిదానమునుచేయుచు తమను తాము ప్రశంసించుకొందురు. అపరాధము చేసినవారిని దండించక క్షమించెదరు. దుర్బలుల యెడ విరక్తి ప్రకటించెదరు. ఎక్కువ మాట్లాడుటయే పాండిత్యము. యశస్సును పొందుటకు మాత్రమే ధర్మకార్యములు చేయుదురు.

ధనాఢ్యత్వం చ సాధుత్వే దూరే నీరే చ తీర్థతా
సూత్రమాత్రేణ విప్రత్వం దండమాత్రేణ మస్కరే. 32
అల్పసస్యా వసుమతీ నదీతీరేఽవరోపితా
స్త్రియో వేశ్యాలాపసుఖాః స్వపుంసా త్యక్తమానసాః. 33

భా: ధనవంతుని సాధుపురుషునిగ, దూరమందున్న జలము తీర్థజలముగ, యజ్ఞోపవీతధారణము చేతనే బ్రాహ్మణుడుగ, దండధారణము చేతనే సన్యాసిగ తలచుదురు. భూమి అల్పసస్యము పండునదగును. జలము సమృద్ధిగ లేకపోవుటచే నదులు తీరములవెంబడి

ప్రవహించును. స్త్రీలు తమ భర్తలయం దనురాగము లేనివారై వేశ్యాలాపములచే సుఖపడుదురు.

పరాన్న లోలుపా విప్రా శ్చండాల గృహయాజకాః
స్త్రియో వైధవ్యహీనాశ్చ స్వచ్ఛందాచరణప్రియాః. 34
చిత్రవృష్టికరా మేఘా మందసస్యా చ మేదినీ
ప్రజాభక్షా నృపా లోకాః కరపీడాప్రపీడితాః. 35

భా: పరాన్నమందు లోభముచే బ్రాహ్మణులు చండాలగృహములయందు పౌరోహిత్యము చేయుదురు. స్త్రీలు వైధవ్యము లేనివారై స్వచ్ఛందముగ తిరుగుదురు. మేఘములు చిత్రముగ వర్షించుచుండుటచే భూమియందు పంటలు తగ్గును. ప్రజారక్షకులు కావలసిన రాజులు కలియుగమున పన్నులచే ప్రజలను బాధించుచు ప్రజాభక్షకు లగుదురు.

స్కంధే భారం కరే పుత్రం కృత్వా క్షుబ్ధాః ప్రజా జనాః
గిరి దుర్గం వనం ఘోర మాశ్రయిష్యంతి దుర్భగాః. 36
మధు మాంసై ర్మూలఫలై రాహారైః ప్రాణధారిణః
ఏవం తు ప్రథమే పాదే కలేః కృష్ణవినిందకాః. 37

భా: అభాగ్యజనము భుజమున భారము, చేతిలో పుత్రునితో దుర్గమ పర్వతములను ఘోరారణ్యములను ప్రవేశించి మధు-మాంస-కందమూల ఫలములను ఆహారముగ స్వీకరించుచు ప్రాణధారణ చేయుదురు. ఆవిధముగ కలియుగము ప్రథమపాదమున జనులు కాలయాపన చేయుచు శ్రీ కృష్ణనిందకు లగుదురు.

ద్వితీయే తన్నామహీనా స్తృతీయే వర్ణసంకరాః
ఏక వర్ణా శ్చతుర్థే చ విస్మృతాచ్యుత సత్క్రియాః. 38
నిఃస్వాధ్యాయ స్వధా స్వాహా వౌష డోంకార వర్జితాః
దేవాః సర్వే నిరాహారాః బ్రహ్మాణం శరణం యయుః. 39

భా: కలియుగము ద్వితీయ పాదమున ప్రజలు శ్రీకృష్ణుని నామోచ్చారణము కూడ చేయరు. మూడవ పాదమున వర్ణసాంకర్యము, నాల్గవ పాదమున బ్రాహ్మణాది నాలుగు వర్ణముల స్థానమున ఒక్క వర్ణమే యేర్పడి శ్రీకృష్ణుని ఆరాధించుట పూర్తిగ మరచెదరు. ఇట్లు స్వాధ్యాయము, స్వధా, స్వాహా, వషట్, ఓం కారాదులు అంతర్హితమగుటచే (యజ్ఞయాగాది క్రియాకలాపము లుప్తమగుటచే) సమస్త దేవతలు ఆహారము లేనివా రయిరి. అప్పుడు వారు బ్రహ్మదేవుని శరణు వేడిరి.

ధరిత్రీ మగ్రతః కృత్వా క్షీణాం దీనాం మనస్వినీమ్
దదృశు ర్బ్రహ్మణో లోకం వేదధ్వని నినాదితమ్ . 40
యజ్ఞధూమైః సమాకీర్ణం మునివర్యనిషేవితమ్
సువర్ణవేదికామధ్యే దక్షిణావర్త ముజ్జ్వలమ్ . 41

భా: దుర్బలము దీనము నయి, మనస్విని యగు భూమిదేవిని ముందుంచి కొని దేవతలందరు బ్రహ్మలోకమునకు వెడలిరి. వేదగానములతో ప్రతిధ్వనించు బ్రహ్మలోకమును వారు చూచిరి. అచ్చట సువర్ణవేదికామధ్యదేశమున దక్షిణావర్తమును అగ్ని జ్వలించు చున్నది. అప్రదేశమంతయు మునీశ్వరులచే సేవింబడుచు యజ్ఞధూమముచే వ్యాప్తమైయున్నది.

వహ్నియూపాంకితోద్యాన వన పుష్ప ఫలాన్వితమ్
సరోభిః సారసైః హంసై రాహ్వయంత మివాతిథిమ్. 42
వాయులోల లతాజాల కుసుమాలికులాకులైః
ప్రణామాహ్వాన సత్కార మధురాలాపవీక్షణైః . 43

భా : యాగీయ పశుబంధము కొఱకు ఉపయోగించు స్తంభమునకు యూపమని పేరు. అట్టి యూపముతో కూడినదై బ్రహ్మలోకము పుష్ప ఫలాన్వితములయిన ఉద్యానవనములతో శోభిల్లుచుండెను. అతిథులను అహ్వానించుచున్నవా యన్నట్లు శబ్దములు చేయు సారస - హంసలతో నిండిన సరోవరము లచ్చట గలవు. వాయుసంచారముచే కదలుచున్న లతా పుష్పముల పైప్రాలెడి తుమ్మెదల ఝుంకారములు పథిక జనమునకు ప్రణామ- ఆహ్వాన- సత్కార- మధురాలాప- వీక్షణములు చేయుచున్నవా యన్న ట్లున్నవి.

తద్బ్రహ్మసదనం దేవాః సేశ్వరాః క్లిన్నమానసాః
వివిశు స్తదనుజ్ఞాతాః నిజకార్యం నివేదితుమ్. 44
త్రిభువనజనకం సదాసనస్థం సనక సనందన సనాత నైశ్చసిద్ధైః
పరిసేవిత పాదకమలం బ్రహ్మాణం దేవతా నేముః. 45

భా: ఖిన్నమనస్కులయిన దేవతలు ఇంద్రునితో గూడి బ్రహ్మయనుజ్ఞ పొందినవారై తమకార్యమును నివేదించుటకు బ్రహ్మభవనమునకు వెడలిరి. సనక సనందనాది ఋషులచే, సిద్ధులచే సేవింపబడు చున్న బ్రహ్మకు దేవతలు నమస్కరించిరి.

ఇతి శ్రీకల్కి పురాణేఽను భాగవతే
భవిష్యే కలి వివరణం నామ
ప్రథమోఽధ్యాయః

ఇది భాగవతానుబంధము భవిష్యము నగు
శ్రీ కల్కి పురాణమున
కలివివరణ మను
ప్రథమాధ్యాయము.

★★★

# కల్కిపురాణము

## ప్రథమాంశము--ద్వితీయాధ్యాయము



సూత ఉవాచ.

ఉపవిష్టా స్తతో దేవా బ్రహ్మణో వచనాత్ పురః
కలే ర్దోషా ద్ధర్మహానిం కథయామాసు రాదరాత్. 1
దేవానాం తద్వచః శ్రుత్వా బ్రహ్మా తానిహ దుఃఖితాన్
ప్రసాదయిత్వా తం విష్ణుం సాధయిష్యా మ్యభీప్సితమ్. 2

భా: సూతుడు పలికెను. దేవతలు బ్రహ్మ భవనమును ప్రవేశించి బ్రహ్మ యనుమతితో కూర్చుండిరి. పిమ్మట కలిదోషము వలన కలుగు ధర్మహానిని విన్నవించిరి. దేవతల వచనములు విని బ్రహ్మ దుఃఖితు లయిన దేవతలను గూర్చి 'విష్ణుమూర్తిని ప్రసన్నుని చేసుకొని మీకోరిక తీర్తు'నని చెప్పెను.

ఇతి దేవైః పరివృతో గత్వా గోలోకవాసినమ్
స్తుత్వా ప్రాహ పురో బ్రహ్మా దేవానాం హృదయేప్సితమ్. 3
తచ్ఛ్రుత్వా పుండరీకాక్షో బ్రహ్మాణ మిద మబ్రవీత్
శంభలే విష్ణుయశసో గృహే ప్రాదుర్భవా మ్యహమ్
సుమత్యాం మాతరి విభో! కన్యాయాం త్వన్నిదేశతః. 4

భా: ఇట్లు చెప్పి బ్రహ్మ దేవతలను తీసుకొని వైకుంఠమునకు వెడలి విష్ణుమూర్తిని స్తుతించి దేవతల యభీష్టమును నివేదించెను. పిమ్మట పుండరీకాక్షుడు బ్రహ్మతో 'హేవిభో! నీవు చెప్పిన ప్రకారము నేను శంభలనగరమున్న విష్ణుయశసుని గృహమున సుమతియను కన్యకు జన్మించగలనని పలికెను.

చతుర్భిః భ్రాతృభి ర్దేవ! కరిష్యామి కలిక్షయమ్
భవంతో బాంధవా దేవాః స్వాంశే నావతరిష్యథ. 5

ఇయం మమ ప్రియా లక్ష్మీః సింహలే సంభవిష్యతి
బృహద్రథస్య భూపస్య కౌముద్యాం కమలేక్షణా
భార్యాయాం మమ భార్యైషా పద్మా నామ్నీ జనిష్యతి. 6

భా: నలుగురు సోదరులతో కలిసి కలినాశమును చేయగలను. మీరందరుబంధుజనముగ తమతమ అంశలతో భూమండలమున అవతరించెదరు. మాకు మిక్కిలి ప్రీతిపాత్రురాలయిన లక్ష్మీదేవి సింహలదేశమున బృహద్రథ రాజపత్నియగు కౌముది గర్భమున పద్మ అను పేరుతో జన్మించగలదు.

యాత యూయం భువం దేవాః స్వాంశావతరణే రతాః
రాజానౌ మరుదేవాపీ స్థాపయిష్యా మ్యహం భువి. 7
పునః కృతయుగం కృత్వా ధర్మాన్ సంస్థాప్య పూర్వవత్
కలివ్యాలం సంనిరస్య ప్రయాస్యే స్వాలయం విభో. 8

భా: ఓ దేవతలార! మీరు మీమీ అంశలతో అవతరించుటకు భూమండలమునకు వెడలుడు. నేను మరుడు , దేవాపి అను ఇద్దరు రాజులను పృథ్వియందు నిలుపుదును. ఓ బ్రహ్మదేవ! నేను మరల కృతయుగమునుజేసి ధర్మసంస్థాపన గావించెదను. కలియను సర్పమును సంహరించి నేను వైకుంఠమునకు తిరిగి వెళ్ళెదను.

ఇత్యుదీరిత మాకర్ణ్య బ్రహ్మా దేవగణై ర్వృతః
జగామ బ్రహ్మసదనం దేవాశ్చ త్రిదివం యయుః. 9
మహిమాం స్వస్య భగవాన్ నిజజన్మకృతోద్యమః
విప్రర్ష! శంభలగ్రామ మావివేశ పరాత్మకః. 10

భా: విష్ణుమూర్తి మాటలు వినిన పిమ్మట బ్రహ్మ బ్రహ్మలోకమునకు, దేవతలు స్వర్గలోకమునకు వెడలిరి. ఓ విప్రశ్రేష్ఠ! విష్ణుభగవానుడు దేవతలకు చెప్పిన ప్రకారము జన్మించుటకై శంభల గ్రామమును ప్రవేశించెను.

సు. త్యాం విష్ణుయశసా గర్భ మాధత్త వైష్ణవమ్
గ్రహనక్షత్ర రాశ్యాది సేవిత శ్రీపదాంబుజమ్. 11
సరిత్సముద్రా గిరయో లోకాః సస్థాణుజంగమాః
సహర్షా ఋషయో దేవా జాతే విష్ణౌ జగత్పతౌ. 12

బభూవుః సర్వసత్త్వానా మానందా వివిధాశ్రయాః
నృత్యంతి పితరో హృష్టాస్తుష్టా దేవా జగుర్యశః . 13
చక్రు ర్వాద్యాని గంధర్వా ననృతు శ్చాప్సరో గణాః . 14

భా: జగత్పతి యగు శ్రీమహావిష్ణువు మానవ గర్భమున జన్మించగనే నదులు, సముద్రములు, పర్వతములు, లోకములు అనగా స్థావరజంగమములు, ఋషిగణము, దేవతలు మిక్కిలి ప్రసన్నులయిరి. సమస్తప్రాణులు తమ తమ ఆనందమును ప్రకటించినవి. పితృదేవతలు ఆనందముతో నృత్యము చేసిరి. దేవతలు సంతోషముతో విష్ణుమూర్తి యశస్సును గానము చేసిరి. గంధర్వులు వాద్యములు వాయించిరి . అప్సర స్త్రీలు నృత్యము చేసిరి.

ద్వాదశ్యాం శుక్లపక్షస్య మాధవే మాసి మాధవమ్
జాతం దదృశతుః పుత్రం పితరౌ హృష్టమానసౌ. 15
ధాత్రృమాతా మహాషష్ఠీ నాభిచ్ఛేత్రీ తదంబికా
గంగోదకక్లేదమోక్షా సావిత్రీ మార్జనోద్యతా. 16

భా : వైశాఖశుక్ల ద్వాదశి నాడు మాధవుడు భూమియం దవతరించెను. తండ్రి విష్ణుయశస్సు, తల్లి సుమతి మిక్కిలి ఆనందముతో పుత్రుని చూచిరి. మహాషష్ఠి (దుర్గాదేవి యొక్క ఒకమూర్తిపేరు) బాలునికి ధాత్రి (రక్షకురాలు) ఆయెను. అంబిక (దుర్గ) బాలుని బొడ్డు కోసెను. సావిత్రి గంగాజలముతో బాలునికి నీళ్లు పోసెను.

వి. గాయత్రీ నామ పూర్వాహ్ణే సావిత్రీ మధ్యమే దినే
సరస్వతీ చ సాయాహ్నే సైవ సంధ్యా త్రిధా స్మృతా.

కాలభేదముచే సంధ్యకు గాయత్రి, సావిత్రి, సరస్వతి అని పేర్లు. ఉదయమున గాయత్రి, మధ్యాహ్నమున సావిత్రి, సాయంకాలమున సరస్వతి అని సంధ్యా దేవికి పేర్లు.

తస్య విష్ణో రనంతస్య వసుధాऽధాత్ పయః సుధామ్
మాతృకా మాంగల్యవచః కృష్ణజన్మదినే తథా. 17
బ్రహ్మా తదుపధార్యాశు స్వాశుగం ప్రాహ సేవకమ్
యాహీతి సూతికాగారం గత్వా విష్ణుం ప్రబోధయ. 18
చతుర్భుజమిదం రూపం దేవానామపి దుర్లభమ్
త్యక్త్వా మానుషవద్రూపం కురు నాథ! విచారితమ్. 19

భా: విష్ణుమూర్తి కృష్ణావతార దినమున వలె విష్ణువు కల్కి అవతారమెత్తిన రోజున పృథ్వి

దుగ్ధరూపమగు సుధాధారను ధరించెను. మాతృక యను దేవి బాలున కాశీర్వాదముల నొసగెను. విష్ణువు చతుర్భుజములతో శంభల గ్రామమున జన్మించె నను విషయము తెలిసి బ్రహ్మ శీఘ్రగతి గల సేవకుడగు పవనుని 'నీవు సూతికా గృహమునుకు వెళ్ళి విష్ణుమూర్తిని 'ఓనాథ! చతుర్భుజరూపమును విడిచి మానుషరూపము ధరించవలసినదని' ప్రబోధించు'మని పలికెను.

**ఇతి బ్రహ్మావచః శ్రుత్వా పవనః సురభిః సుఖమ్**
**సశీతః ప్రాహ తరసా బ్రహ్మణో వచనాదృతః . 20**
**తచ్ఛ్రుత్వా పుండరీకాక్షః తత్‌క్షణాద్ ద్విభుజోఽభవత్**
**తదా తత్పితరౌ దృష్ట్వా విస్మయాపన్నమానసౌ. 21**

భా: శీతలుడు, సుగంధయుక్తుడగు పవనుడు బ్రహ్మవచనమును విని శీఘ్రముగ వెడలి విష్ణుమూర్తికి నివేదించెను. పుండరీకాక్షుడు బ్రహ్మవచనాను సారము చతుర్భుజమూర్తి నుప సంహరించుకొని రెండు భుజములు కలవాడాయెను. నాలుగు భుజములుగల బాలుని రెండు భుజములు కలవానిగ మారుటను చూసి తల్లిదండ్రులు ఆశ్చర్యచకితు లయిరి.

**భ్రమ సంస్కారవ త్తత్ర మేనాతే తస్య మాయయా**
**తతస్తు శంభలగ్రామే సోత్సవా జీవజాతయః**
**మంగళా చారబహులాః పాపతాపవివర్జితాః 22**

భా: కాని వారు విష్ణుమూర్తి మాయచే మోహితులై తామే భ్రమచే రెండు భుజములు గలవానిని నాలుగుభుజములు గల వానిగ తలచితి మనుకొనిరి. శంభల గ్రామమున ప్రజలందరు పాపతాపములను విడిచి మంగళాచరణ కలవారై ఉత్సవము జరుపుకొనిరి.

**సుమతి స్తం సుతం లబ్ధ్వా విష్ణుం జిష్ణుం జగత్పతిమ్**
**పూర్ణకామా విప్రముఖ్యా నాహూయాదా ద్గవాం శతమ్. 23**
**హరేః కళ్యాణకృ ద్విష్ణుయశాః శుద్ధేన చేతసా**
**సామర్గ్యజు ర్విద్భి రగ్ర్యై స్తన్నామకరణే రతః. 24**

భా: జగత్పతి, జిష్ణువు నగు విష్ణుమూర్తిని పుత్రునిగ పొంది సుమతి బ్రాహ్మణోత్తములను ఆహ్వానించి నూరుగోవులను దానముగ నిచ్చెను. తండ్రియగు విష్ణుయశసుడు బాలుడగు హరికి శుభము కోరి ఋగ్వేద-యజుర్వేద-సామవేద విదులగు బ్రాహ్మణులను నామకరణమందు నియోగించెను.

తదా రామః కృపో వ్యాసో ద్రౌణి ర్భిక్షుశరీరిణః
సమాయాతా హరిం ద్రష్టుం బాలకత్వ ముపాగతమ్. 25
తా నాగతాన్ సమాలోక్య చతురః సూర్యసన్నిభాన్
హృష్టరోమా ద్విజవరః పూజయాఞ్చక్ర ఈశ్వరాన్. 26

భా: అప్పుడు పరశురాముడు, కృపాచార్యుడు, అశ్వత్థామ, వ్యాసుడు భిక్షురూపమును ధరించి బాలకుడగు హరిని చూచుటకు వచ్చిరి. బ్రాహ్మణోత్తముడగు విష్ణుయశసుడు సూర్యుని వలె ప్రకాశించెడి నలుగురిని చూచి హర్షపులకితుడై పూజించెను.

పూజితా స్తే స్వాసనేషు సంవిష్టాః స్వసుఖాశ్రయాః
హరిం క్రోడగతం తస్య దదృశుః సర్వమూర్తయః. 27
తం బాలం నరాకారం విష్ణుం నత్వా మునీశ్వరాః
కల్కిం కల్కవినాశార్థ మావిర్భూతం విదు ర్బుధాః. 28

భా: నలుగురు మహర్షులు యథోచితముగ పూజింపబడినవారై తృప్తిని పొంది ఆసనములయం దుపవిష్టులై తండ్రి ఒడిలోనున్న బాలుడగు హరిని చూచిరి. మునీశ్వరులు మనుష్యరూపమును ధరించిన హరికి నమస్కరించిరి; అతనిని భూకలంకవినాశనము కొఱకు ఆవిర్భవించిన కల్కి అవతారముగ వారు తెలిసికొనిరి.

నామాకుర్వం స్తత స్తస్య కల్కిరిత్యభివిశ్రుతమ్
కృత్వా సంస్కారకర్మాణి యయు స్తే హృష్టమానసాః. 29
తతః స వవృధే తత్ర సుమత్యా పరిపాలితః
కాలే నాల్పేన కంసారిః శుక్లపక్షే యథా శశీ. 30

భా: మహర్షులు ఆబాలునికి కల్కమును( పాపమును) పోగొట్టువాడగుటచే కల్కియని ప్రసిద్ధమగు నామకరణము చేసిరి. పిమ్మట జాతకర్మలను పూర్తి చేసి సంతుష్టమనస్కులై అక్కడినుండి వెడలిరి. జాతసంస్కారములు పూర్తియయిన బాలుడు సుమతిచే పోషింప బడుచు అల్పకాలముననే శుక్లపక్ష చంద్రుని వలె వృద్ధిపొందెను.

కల్కేః జ్యేష్ఠాస్త్రయః శూరాః కవి ప్రాజ్ఞసుమంత్రకాః
పితృమాతృప్రియకరా గురువిప్రప్రతిష్ఠితాః. 31
కల్కే రంశాః పురా జాతాః సాధవో ధర్మతత్పరాః
గార్గ్య భార్గ్య విశాలాద్యా జ్ఞాతయ స్తదనువ్రతాః. 32

భా. తల్లిదండ్రులకు ప్రియమును కల్గించువారు, గురువిప్రుల ప్రతిష్ఠకు కారణభూతులగు కవి- ప్రాజ్ఞ-సుమంత్రకులు కల్కికి జ్యేష్ఠసోదరులు. సజ్జనులు, ధర్మతత్పరులు, విష్ణుమూర్తి యొక్క అంశలగు గార్గ్య భార్గ్య విశాలాదులు కల్కి ననుసరించు వారై కల్కి వంశమున జ్ఞాతులుగ జన్మించిరి.

**విశాఖయూపభూపాల పాలితా స్తాపవర్జితాః**
**బ్రాహ్మణాః కల్కి మాలోక్య పరాం ప్రీతి ముపాగతాః. 33**
**తతో విష్ణుయశాః పుత్రం ధీరం సర్వగుణాకరమ్**
**కల్కిం కమలపత్రాక్షం ప్రోవాచ పఠనాదృతమ్. 34**

భా: విశాఖయూప భూపాలునిచే రక్షింపబడువారు, శోకరహితులునగు బ్రాహ్మణులు కల్కిని చూచి అత్యంతము ప్రసన్నులైరి. ధీరుడు, సర్వగుణ సంపన్నుడు, పద్మనేత్రుడగు పుత్రుని విద్యాభ్యాసమునకు యోగ్యునిగ తలచి తండ్రి విష్ణుయశుడు ఇట్లు పలికెను.

**తాత! తే బ్రహ్మసంస్కారం యజ్ఞసూత్ర మనుత్తమమ్**
**సావిత్రీం వాచయిష్యామి తతో వేదాన్ పఠిష్యసి. 35**

**కల్కిరువాచ........**

**కో వేదః కా చ సావిత్రీ కేన సూత్రేణ సంస్కృతాః**
**బ్రాహ్మణా విదితా లోకే త తత్త్వం వద తాత మామ్. 36**

భా: కుమారా! యజ్ఞసూత్రధారణరూపమగు ప్రధానమయిన బ్రహ్మసంస్కారమును గావించి సావిత్రిని ( గాయత్రి మంత్రమును) చెప్పించెదను. పిమ్మట నీవు వేదముల నధ్యయనము జేయుము అనగానే కల్కి యిట్లు పలికెను. తండ్రీ! వేద మననేమి? సావిత్రి ఎవరు? ఎటువంటి సూత్రసంస్కారముచే లోకమున బ్రాహ్మణులుగ ప్రసిద్ధ మగుచున్నారు? ఈతత్త్వము లన్నియు నాకు చెప్పుము.

పితోవాచ......

వేదో హరేర్వాక్ సావిత్రీ వేదమాతా ప్రతిష్ఠితా
త్రిగుణఞ్చ త్రివృత్సూత్రం తేన విప్రాః ప్రతిష్ఠితాః . 37
దశయజ్ఞైః సంస్కృతా యే బ్రాహ్మణా బ్రహ్మవాదినః
తత్ర వేదాశ్చ లోకానాం త్రయాణామిహ పోషకాః . 38

భా: తండ్రిపలికెను. హరియొక్కవాక్కువేదము. సావిత్రి వేదమాత. మూడుగ చేయబడిన సూత్రమును మూడుమార్లు ధరించుటవలన బ్రాహ్మణునిగ ప్రసిద్ధుడు.

దశయజ్ఞములచే సంస్కారింపబడిన వేదవేత్తలగు బ్రాహ్మణులు లోకత్రయరక్షకము లగు వేదములకు రక్షకులు.

యజ్ఞాధ్యయనదానాది తపః స్వాధ్యాయ సంయమైః
ప్రీణయంతి హరిం భక్త్యా వేదతంత్ర విధానతః . 39
తస్మాద్యథోపనయన కర్మణోఽహం ద్విజైః సహ
సంస్కర్తుం బాంధవజనై స్త్వా మిచ్ఛామి శుభే దినే. 40

భా : వారు ముఖ్యమగు వైదిక మార్గమును అనుసరించి యజ్ఞము, అధ్యయనము దానము, తపస్సు, స్వాధ్యాయము, సంయమనము మున్నగువానిచే భక్తి పూర్వకముగ హరిని తృప్తిపరచెదరు. కనుక నేను ద్విజులు, బాంధవులతో శుభదినమున నీకు ఉపనయనసంస్కారమును చేయవలె ననుకొనుచున్నాను.

పుత్ర ఉవాచ .......

కే చ తే దశ సంస్కారా బ్రాహ్మణేషు ప్రతిష్ఠితాః
బ్రాహ్మణాః కేనవా విష్ణుమర్చయంతి విధానతః. 41

భా: పుత్రుడు పలికెను. బ్రాహ్మణులకొఱకైన పదిసంస్కారములేవి? బ్రాహ్మణులు ఏప్రకారముగ విష్ణువు నారాధించెదరు?

వి: దశవిధ సంస్కారము లివి వివాహము, గర్భాధానము, పుంసవనము, ( 3వమాసమున) సీమంతోన్నయనము ( 4,6 లేక 8 మాసములలో) జాతకర్మ, నామకరణము , అన్న ప్రాశనము, చూడాకరణము , ఉపనయనము, సమావర్తనము ( విద్యపూర్తి చేసుకొని గురుగృహమునుండి తిరిగి వచ్చు సందర్భమున జరుగు సంస్కారము).

పితోవాచ------

బ్రాహ్మణ్యాం బ్రాహ్మణా జ్జాతో గర్భాధానాదిసంస్కృతః
సంధ్యాత్రయేణ సావిత్రీ పూజాజపపరాయణః . 42
తపస్వీ సత్యవాగ్ధీరో ధర్మాత్మా త్రాతి సంసృతిమ్
విష్ణ్వర్చనమిదం జ్ఞాత్వా సదానందమయో ద్విజః . 43

భా: బ్రాహ్మణుని వలన బ్రాహ్మణస్త్రీయందు జన్మించి గర్భాధానాదులచే సంస్కారింపబడినవాడై సంధ్యాత్రయ మందు సావిత్రీ పూజాజపపరాయణుడై తపస్వి, సత్యవాది, ధీరుడు, ధర్మాత్ముడైన ద్విజుడు విష్ణువు నర్చించు విధానము తెలుసుకొని నిత్యానందమయుడై లోకమును రక్షించును.

పుత్ర ఉవాచ.........

పుత్రాస్తే స ద్విజో యేన తారయం త్యఖిలం జగత్
సన్మార్గేణ హరిం ప్రీణన్ కామదోగ్ధా జగత్త్రయే. **44**

భా: కల్కి పలికెను. సదాచారసంపన్నుడై హరిని కొలుచుచు, ముల్లోకములలో మనోరథములను తీర్చుచు, నిఖిలజగత్తును ఉద్ధరించు బ్రాహ్మణు డెక్కడ కలడు?

పితోవాచ.........

కలినా బలినా ధర్మఘాతినా ద్విజపాతినా
నిరాకృతా ధర్మరతా గతా వర్షాంతరాంతరమ్. **45**
యేస్వల్ప తపసో విప్రాః స్థితాః కలియుగాంతరే
శిశ్నోదరభృతోఽధర్మనిరతా విరతక్రియాః . **46**

భా: తండ్రి పలికెను. బలవంతుడు, ధర్మనాశకుడు, బ్రాహ్మణహంతకుడగు కలిచే పీడింపబడిన ధర్మతత్పరులగు ద్విజులు వర్షాంతరమునకు వెడలిరి. స్వల్ప తపస్సంపన్నులగు మిగిలిన బ్రాహ్మణులు కలియుగమున అధర్మమందాసక్తి కలవారై ఉదర, ఇంద్రియ సఖములయందు వ్యాప్తులై తామాచరింపవలసిన క్రియాకలాపమును మరచిరి.

పాపసారా దురాచారాస్తేజోహీనాః కలావిహ
ఆత్మానం రక్షితుంనైవ శక్తాః శూద్రస్య సేవకాః. **47**
ఇతి జనకవచో నిశమ్య కల్కిః కలికులనాశ మనోఽభిలాష జన్మా
ద్విజనిజవచనైస్తదోపనీతో గురుకులవాస మువాస సాధునాథః. **48**

భా: కలికాలమున బ్రాహ్మణులు పాపకర్మలయందు ప్రవృత్తికలవారై, దురాచారులై తేజోహీనులై , తమను తాము రక్షించుకొనుట కసమర్థులై శూద్రులను సేవించుచున్నారు. తండ్రిమాటలు విన్న కల్కికి కలివంశమును నాశమును చేయవలెనని అభిలాష కలిగెను. పిమ్మట బ్రాహ్మణుల వచనముల ననుసరించి ఉపనయన సంస్కారము పూర్తి చేసుకొని గురుకుల వాసమునకు వెడలెను.

ఇతి శ్రీ కల్కి పురాణేఽనుభాగవతే భవిష్యే కల్కి జన్మోపనయనం నామ
ద్వితీయోఽధ్యాయః

ఇది భాగవతానుబంధముగు భవిష్యమునగు శ్రీ కల్కిపురాణమున కల్కి జన్మ
ఉపనయనము అను రెండవ అధ్యాయము.



# కల్కిపురాణము

## ప్రథమాంశము--తృతీయాధ్యాయము

సూత ఉవాచ......

తతో వస్తుం గురుకులే యాంతం కల్కిం నిరీక్ష్య సః 1
మహేంద్రాద్రిస్థితో రామః సవనీయాశ్రమం ప్రభుః.
ప్రాహ త్వాం పాఠయిష్యామి గురుం మాం విద్ధి ధర్మతః 2
భృగువంశసముత్పన్నం జామదగ్న్యం మహాప్రభుమ్.
వేదవేదాంగతత్త్వజ్ఞం ధనుర్వేద విశారదమ్ 3
కృత్వా నిఃక్షత్రియాం పృథ్వీం దత్వా విప్రాయ దక్షిణామ్.
మహేంద్రాద్రౌ తప స్తప్తుమాగతోఽహం ద్విజాత్మజ 4
త్వం పఠాత్ర నిజం వేదం యచ్చాన్య చ్ఛాస్త్రముత్తమమ్.

భా: సూతుడు పలికెను. మహేంద్రపర్వతమందు నివసించు పరశురాముడు విద్యాభ్యాసము కొఱకు గురుకులమునకు వెళ్ళుచున్న కల్కిని చూచి, అతనిని తన ఆశ్రమమునకు తీసుకువచ్చి '' నేను నీకు అధ్యాపనము చేయుదును. నన్ను నీవు గురువుగ తెలిసికొనుము. భృగువంశమందు పుట్టిన జమదగ్ని పుత్రుడను నేను. వేదవేదాంగతత్త్వమును తెలిసినవాడను. ధనుర్విద్యావిశారదుడను. ఓ బ్రాహ్మణ కుమార! నేను భూమినంతటిని క్షత్రియరహితముగ చేసి బ్రాహ్మణులకు దక్షిణగనిచ్చి తపస్సునాచరించుటకు మహేంద్రపర్వతమునకు వచ్చితిని. నీవు ఇచ్చట వేదశాస్త్రముల నధ్యయనము జేయుము'' అని చెప్పెను.

ఇతి తద్వచ ఆశ్రుత్య సంప్రహృష్టతనూరుహః 5
కల్కిః పురో నమస్కృత్య వేదాధీతీ తతోఽభవత్.
సాంగం చతుష్షష్టికలం ధనుర్వేదాదికం చ యత్ 6
సమధీత్య జామదగ్న్యాత్ కల్కిః ప్రాహ కృతాంజలిః.

భా: పరశురాముని వచనములు విని హర్షపులకితుడయిన కల్కి గురువులకు నమస్కరించి వేదాధ్యయనము జేసెను. జామదగ్ని నుండి 64 కళలు ధనుర్వేదాది విద్యలను నేర్చుకొని,

—

కల్కి చేతులు జోడించి యిట్లు పలికెను.

వి : శుక్రనీతిలో 64 కళల వివరణము కలదు. ఆయుర్వేదము ధనుర్వేదను, గంధర్వ వేదము, అర్థశాస్త్రమని ఉపవేదములు నాలుగు.

దక్షిణాం ప్రార్థయ విభో! యా దేయా తవ సన్నిధౌ
యయా మే సర్వసిద్ధిః స్యా ద్యా స్యాత్ త్వత్తోషకారిణీ. 7

భా: గురుదేవా! మీకు తప్పక ఈయదగినదియు, నాకు సర్వము సిద్ధింపజేయునదియు, మీసంతోషమునకు కారణభూతమునగు దక్షిణను కోరుడు.

రామ ఉవాచ........

బ్రహ్మణా ప్రార్థితో భూమన్! కలి నిగ్రహ కారణాత్
విష్ణుః సర్వాశ్రయం పూర్ణః సజాతః శంభలే భవాన్. 8
మత్తో విద్యాం శివాదస్త్రం లబ్ధ్వా వేదమయం శుకమ్
సింహలే చ ప్రియాం పద్మాం ధర్మాన్ సంస్థాపయిష్యసి. 9

భా: పరశురాముడు పలికెను. కలిసంహారము కొఱకు బ్రహ్మదేవుని ప్రార్థనచే మీరు కల్కి రూపమున శంభలగ్రామమున జన్మించిరి. మీరు మానుండి విద్యను, శివుని వలన అస్త్రములను, వేదమయమగు శుకమును పొంది, సింహలదేశమునుండి పద్మను భార్యగపొంది ధర్మ సంస్థాపన చేయగలరు.

తతో దిగ్విజయే భూపాన్ ధర్మహీనాన్ కలిప్రియాన్
నిగృహ్య బౌద్ధాన్ దేవాపిం మరుఞ్చ స్థాపయిష్యసి. 10
వయమేతైస్తు సంతుష్టాః సాధుకృత్యైః సదక్షిణాః
యజ్ఞం దానం తపః కర్మ కరిష్యామో యథోచితమ్. 11

భా: అనంతరము మీరు దిగ్విజయ యాత్ర చేపి కలిప్రియులు ధర్మహీనులగు రాజులను, బౌద్ధులను నాశముజేసి మరు దేవాపులను రాజ్యమందు నియమించగలరు. ఈ సాధుకార్యము చే మేము సంతుష్టుల మగుదుము. ఇదియే మాకు దక్షిణ. దీని వలన యజ్ఞము, దానము, తపము మున్నగు కర్మలను యధోచితముగ చేయగలము. (అని పలికెను)

ఇత్యేత ద్వచనం శ్రుత్వా నమస్కృత్య మునిం గురుమ్
బిల్వోదకేశ్వరం దేవం గత్వా తుష్టావ శంకరమ్. 12

పూజయిత్వా యథాన్యాయం శివం శాంతం మహేశ్వరమ్
ప్రణిపత్యాశుతోషం తం ధ్యాత్వా ప్రాహ హృది స్థితమ్. 13

భా: పరశురాముని మాటలు వినిన కల్కి గురువులకు నమస్కరించి బిల్వోదకేశ్వరుడగు శంకరుని జేరి స్తోత్రము జేసి యథోచితముగ పూజించి నమస్కరించెను. అల్పసంతోషియు హృదయస్థుడునగు శివుని ధ్యానించి కల్కి పలికెను.

కల్కిరువాచ......

గౌరీనాథం విశ్వనాథం శరణ్యం భూతావాసం వాసుకీకంఠభూషమ్
త్ర్యక్షం పంచాస్యాదిదేవం పురాణం వందే సాంద్రానందసందోహదక్షమ్. 14
యోగాధీశం కామనాశం కరాలం గంగాసంగా క్లిన్న మూర్ధానమీశమ్
జటాజూటాటోపరిక్షిప్తభావం మహాకాలం చంద్రభాలం నమామి. 15

భా: కల్కి ఇట్లు స్తుతించెను. గౌరీనాథుడు, విశ్వనాథుడు, రక్షణ సమర్థుడు, సమస్త ప్రాణుల హృదయములందున్న వాడు, వాసుకి కంఠాభరణముగ గలవాడు, త్రిలోచనుడు, పంచవదనుడు, ఆదిదేవుడు, పురాతనుడు, అమితానంద సందోహదక్షుడగు పరమేశ్వరుని నమస్కరించుచున్నాను. ధ్యానమున కధిపతి, కామ్యకర్మలను నాశముచేయువాడు, భయంకరుడు, గంగచేతడిసిన శిరస్సుగలవాడు, ఆహ్లాదముకలుగజేయులలాటము కలవాడు అగు మహా కాలుని నమస్కరించుచున్నాను.

శ్మసానస్థం భూతవేతాలసంగం నానాశస్త్రైః ఖడ్గశూలాదిభిశ్చ
వ్యగ్రాత్యుగ్రా బాహవోలోకనాశే యస్య క్రోధోద్ధూతలోకోఽస్తమేతి.16
యోభూతాదిః పంచభూతైః సిసృక్షు స్తన్మాత్రాత్మా కాలకర్మస్వభావైః
ప్రహృత్యేదం ప్రాప్యజీవత్వమీశో బ్రహ్మానందో రమతే తం నమామి. 17

భా : భూత, పిశాచములతో గూడి శ్మశానమందుండు వాడు, బహువిధశస్త్రములు, ఖడ్గశూలాదులచే మిక్కిలి భయంకరములగు బాహువులు కలవాడు, ప్రళయకాలమున కోపాగ్నిచే సమస్తలోకమును భస్మముగావించువాడు, పంచమహాభూతములకు కారణభూతమగు అహంకారస్వరూపుడు ( సత్వరజస్తమోగుణమయములు మయాడు అహంకారములు, తామసాహంకారముచే పంచమహాభూత సృష్టి జరిగెనని సాంఖ్యమతము. తామసమగు అహంకారా వచ్చిన్నచైతన్యమే మహాదేవుడని తాత్పర్యము. వేదాంతమతముననుసరించి సృష్టికారణము బ్రహ్మపదార్థము తన్మాత్రస్వరూపుడు ( శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు తన్మాత్రలు ) కాలకర్మ

స్వభావములచే జగత్తును సృజించు కోరిక గలవాడు , ప్రళయకాలమున సమస్తమునపహరించి బ్రహ్మానందము పొందువాడగు పరమేశ్వరుని నమస్కరించుచున్నాను.

స్థితౌ విష్ణుః సర్వజిష్ణుః సురాత్మా లోకాన్ సాధూన్ ధర్మసేతూన్ బిభర్తి
బ్రహ్మాద్యంశే యోఽభిమానీ గుణాత్మా శబ్దాద్యంగైస్తం పరేశం నమామి.18
యస్యాజ్ఞయా వాయవో వాంతి లోకే జ్వలత్యగ్నిః సవితా యాతి తప్యన్
శీతాంశుః ఖే తారకైః సగ్రహైశ్చ ప్రవర్తతే తం పరేశం ప్రపద్యే. 19
యస్యాశ్వాత్ సర్వధాత్రీ ధరిత్రీ దేవో వర్షత్యంబు కాలః ప్రమాతా
మేరుర్మధ్యే భవనానాఞ్చ భర్తా తమీశానం విశ్వరూపం నమామి . 20

భా: లోకములను రక్షించుటయందు సర్వజయశీలుడగు విష్ణువై ధర్మసేతువులగు సాధువులను పాలించువాడు, శబ్దాద్యవయువములచే సగుణ స్వరూపుడవై బ్రహ్మాద్యంశములయందు అభిమానముకలిగిన పరమేశ్వరుడవగునీకు నమస్కారము. ఎవరి ఆజ్ఞచే వాయువు వీచునో, అగ్ని మండునో సూర్యుడు ప్రకాశించునో, చంద్రుడు నక్షత్రములతో గూడి ఆకాశమున సంచరించునో అట్టి పరేశునకు నమస్కారము . ఎవరి ఆదేశముచే భూమిసమస్తమును వహించునో, మేఘుడు వర్షించునో, కాలము కొలబద్ధయగునో, సుమేరు పర్వతము భూమండలమును వహించునో అట్టి విశ్వరూపుడగు పరమేశ్వరునికి నమస్కారము.

ఇతి కల్కిస్తవం శ్రుత్వా శివః సర్వాత్మదర్శనః
సాక్షాత్ ప్రాహ హసన్నీశం పార్వతీసహితోఽగ్రతః. 21
కల్కేః సంస్పృశ్యహస్తేన సమస్తావయవం ముదా
తమాహ వరయ శ్రేష్ఠ! వరం యత్తేఽభికాంక్షితమ్. 22

భా: కల్కి చేసిన స్తోత్రమును విని సర్వజ్ఞుడగు శివుడు పార్వతీ సహితుడై సాక్షాత్కరించి సంతుష్టుడై కల్కిని చేతితో స్పృశించి ఓ శ్రేష్ఠుడ! నీకు అభిలషితమగు వరమును కోరుకొనుమని పలికెను.

త్వయా కృత మిదం స్తోత్రం యే పఠంతి జనా భువి
తేషాం సర్వార్థసిద్ధిః స్యాదిహలోకే పరత్రచ. 23
విద్యార్థీ చాప్నుయాద్విద్యాం ధర్మార్థీ ధర్మ మాప్నుయాత్
కామా నవాప్నుయాత్ కామీ పఠనాచ్ఛ్రవణాదపి. 24

భా: నీవు చేసిన శివస్తోత్రమును లోకవమున పఠించుజనులు సర్వార్థవములను

ఇహపరలోకములలో పొందగలరు. ఇది చదివిన లేక విన్నను విద్యార్థి విద్యను కామార్థి కోరికలను ధర్మార్థి ధర్మమును పొందగలడు.

త్వం గారుడ మిదం చాశ్వం కామగం బహురూపిణమ్
శుక మేనఞ్చసర్వజ్ఞం మయాదత్తం గృహాణ భోః. 25
సర్వశస్త్రాస్త్రవిద్వాంసం సర్వవేదార్థపారగమ్
జయినం సర్వభూతానాం త్వాం వదిష్యంతి మానవాః. 26
రత్నత్సరుం కరాలఞ్చ కరవాలం మహాప్రభమ్
గృహాణ గురుభారాయాః పృథివ్యా భారసాధనమ్. 27

భా: ఓ కల్కి! నీకు సమస్తకోరికలు తీర్చునది, బహురూపములు గలదియగు గారుడమను ( గరుత్మంతుని వలన బుట్టినది) అశ్వము, సర్వజ్ఞుడగు చిలుకను ఇచ్చెదను. గ్రహింపుము. జనులు నిన్ను సర్వశాస్త్రవిద్వాంసునిగ, సర్వవేదార్థపారంగతునిగ జయశీలునిగ ప్రశంసించెదరు. రత్న మయమైన పిడికిలి గల్గి, పొడవైన తేజోమయమయిన ఖడ్గమును గ్రహింపుము. ఇది మిక్కిలి భారము ననుభవించు భూమియొక్క భారమును పోగొట్ట గలదు.

ఇతి తద్వచ ఆశ్రుత్య నమస్కృత్య మహేశ్వరమ్
శంభలగ్రామమగత్ తురగేణ త్వరాన్వితః. 28
పితరం మాతరం భ్రాతౄన్ నమస్కృత్య యథావిధి
సర్వం తద్వర్ణయామాస జామదగ్న్యస్య భాషితమ్. 29

భా: పరమేశ్వరుని వచనములను విని కల్కి వారికి నమస్కరించి గుఱ్ఱముమీద శీఘ్రముగ శంభల గ్రామము చేరెను. తల్లిదండ్రులకు సోదరులకు నమస్కరించి పరశురాముని వద్ద అధ్యయనము చేసినది వివరించి చెప్పెను.

శివస్య వరదానఞ్చ కథయిత్వా శుభాః కథాః
కల్కిః పరమతేజస్వీ జ్ఞాతిభ్యోఽప్యవదన్ ముదా. 30
గార్గ్యభార్గ్యవిశాలాద్యాః తచ్ఛ్రుత్వా నందితాః స్థితాః
కథోపకథనం జాతం శంభలగ్రామవాసినామ్. 31

భా: శివుడు వరమిచ్చిన శుభవృత్తాంతమును తల్లిదండ్రులతో బాటు తన బంధువులకు కూడ పరమతేజస్వియగు కల్కి చెప్పెను. గార్గ్య భార్గ్య విశాలాదులు ఈ వృత్తాంతమును విని మిక్కిలి సంతోషించిరి. శంభలగ్రామవాసులు దీనిని కథలు కథలుగ చెప్పుకొనసాగిరి.

విశాఖయూపభూపాలః శ్రుత్వా తేషాఞ్చ భాషితమ్
ప్రాదుర్భావం హరే ర్మేనే కలినిగ్రహకారకమ్. 32
మాహిష్మత్యాం నిజపురే యాగదానతపోవ్రతాన్
బ్రాహ్మణాన్ క్షత్రియాన్ వైశ్యాన్ శూద్రానపి హరేః ప్రియాన్. 33

భా: శంభలగ్రామవాసుల మాటలు విని విశాఖయూప భూపాలుడు కలిని సంహరించుటకు అవతరించిన విష్ణుమూర్తి అవతారముగ కల్కిని తెలుసుకొనెను. మాహిష్మతీ నగరమున యాగదాన తపోవ్రతములనాచరించి బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు నాలుగు వర్ణముల వారు హరికి ఇష్టులైరి.

స్వధర్మనిరతాన్ దృష్ట్వా ధర్మిష్ఠోఽభూత్ నృపః స్వయమ్
ప్రజాపాలః శుద్ధమనాః ప్రాదుర్భావాత్ శ్రియః పతేః. 34
అధర్మవంశ్యాస్తాన్ దృష్ట్వాజనాన్ ధర్మక్రియాపరాన్
లోభానృతాదయో జగ్ముస్తద్దేశా ద్దుఃఖితాభయమ్. 35

భా: బ్రాహ్మణ క్షత్రియాదులు తమతమ ధర్మములయందాసక్తి కలిగియుండుటను చూచి రాజగు విశాఖయూపుడు ధర్మతత్పరుడాయెను. లక్ష్మీపతి ప్రాదుర్భావము వలన శుద్ధమనస్కుడై ప్రజలను పాలించెను. మాహిష్మతీనగరమందు జనులందరు ధర్మతత్పరులగుట చూచి అధర్మవంశీయులగు లోభము అనృతము మున్నగునవి మిక్కిలి దుఃఖముతో భయముతో నగరమును విడిచిపోయినవి.

జైత్రం తురగమారుహ్య ఖడ్గఞ్చ విమలప్రభమ్
దంశితః సశరం చాపం గృహీత్వాగాత్ పురాద్బహిః. 36
విశాఖయూప భూపాలః ప్రాయాత్ సాధుజనప్రియః

విశాఖయూపో దదృశే చంద్రం తారాగణైరివ
పురాద్భహిః సురైర్యద్వ దింద్రముచ్చైః శ్రవః స్థితమ్. **39**

భా: తేజస్సంపన్నులగు కవిప్రాజ్ఞసుమంతులు ముందుండగ జ్ఞాతులగు గార్గ్య భార్గ్య విశాలురు కల్కిని చుట్టి యుండిరి. నక్షత్రసముదాయముతో చుట్టుముట్టిన చంద్రునివలె, దేవతలతోకూడి ఉచ్చైః శ్రవ మధిరోహించిన ఇంద్రునివలె ఉన్న కల్కిని విశాఖయూపుడు చూసెను.

విశాఖయూపోఽవనతః సంప్రహృష్ట తనూరుహః
కల్కే రాలోకనాత్ సద్యః పూర్ణాత్మా వైష్ణవోఽభవత్. **40**
సహరాజ్ఞా వసన్ కల్కిః ధర్మానాహ పురోదితాన్
బ్రాహ్మణక్షత్రియ విశా మాశ్రమాణాం సమాసతః. **41**

భా: కల్కిని చూచి హర్షముతో పులకితుడయిన విశాఖయూపుడు అవనతుడాయెను. కల్కిదర్శనము వలన రాజు పరిపూర్ణమగు విష్ణుభక్తుడాయెను. రాజుతోకూడ నివసించు కల్కి అతనికి బ్రాహ్మణ క్షత్రియవైశ్యుల ఆశ్రమధర్మములను సంగ్రహముగ చెప్పెను.

మమాంశాన్ కలివిభ్రష్టా నితి మజ్జన్మ సంగతాన్
రాజసూయాశ్వమేధాభ్యాం మాం యజస్వ సమాహితః. **42**
అహమేవ పరోలోకో ధర్మశ్చాహం సనాతనః
కాలస్వభావ సంస్కారాః కర్మానుగతయో మమ. **43**

భా: కలిపాపముచే భ్రష్టములయిన నాఅంశలు నేను అవతరించుట వలన తిరిగి లభించినవి. రాజసూయ అశ్వమేధముల నాచరించి మమ్ములను సేవింపుము. నేనే ఉత్కృష్టమగు పరలోకము, సనాతన ధర్మము నేనే. కాలస్వభావ సంస్కారములు నాకర్మల ననుసరించినవే యని కల్కి పలికెను.

సోమసూర్యకులే జాతౌ దేవాపిమరుసంజ్ఞకౌ
స్థాపయిత్వా కృతయుగం కృత్వా యాస్యామి సద్గతిమ్. **44**
ఇతి తద్వచనం శ్రుత్వా రాజా కల్కిం హరిం ప్రభుమ్
ప్రణమ్య ప్రాహ సద్ధర్మాన్ వైష్ణవాన్ మనసేప్సితాన్. **45**

ఇతి నృపవచనం నిశమ్య కల్కిః
కలికులనాశనవాసనావతారః
నిజజనపరిషద్వినోదకారీ
మధురవచోభిరాహ సాధుధర్మాన్. 46

భా: చంద్రవంశమున పుట్టిన దేవాపిని, సూర్యవంశమున జన్మించిన మరుని రాజులను చేసి కృతయుగమును ప్రవర్తింపజేసి సద్గతిని పొందగలనని కల్కి పలికెను. భగవానుని మాటలు విని రాజు అతనికి నమస్కరించి మనోభీష్టములగు వైష్ణవ సద్ధర్మములను గూర్చి ప్రశ్నించెను. కలికుల నాశమున కవతరించిన కల్కిదేవుడు తనభక్తజనమునకు విజ్ఞానము వినోదమును కల్గించువాడై రాజు ప్రశ్నించిన సాధుధర్మములను మధురవాక్కులతో సమాధానము చెప్పెను.

ఇతి శ్రీ కల్కిపురాణేఽను భాగవతే
భవిష్యే కల్కివరలాభనామక
స్తృతీయోఽధ్యాయః

ఇది భాగవతానుబంధము భవిష్యమునగు
శ్రీ కల్కిపురాణమున
కల్కి వరలాభమను పేరుగల
తృతీయాధ్యాయము.



# కల్కి పురాణము

## ప్రథమాంశము--చతుర్థాధ్యాయము

సూత ఉవాచ....

తతః కల్కిః సభామధ్యే రాజమానో రవిర్యథా
బభాషే తం నృపం ధర్మమయో ధర్మాన్ ద్విజప్రియాన్. 1

భా: సూతుడు పలికెను. ఎమ్మట విశాఖయూపుని సభలో సూర్యునివలె ప్రకాశించు కల్కి ద్విజప్రియములగు సాధు ధర్మములను రాజునకు చెప్పెను.

కల్కిరువాచ....

కరేన బ్రహ్మణో నాశే ప్రలయే మయి సంగతాః
అహమేవాసమేవాగ్రే నాన్యత్ కార్యమిదం మమ. 2

ప్రసుప్తలోకతంత్రస్య ద్వైతహీనస్య చాత్మనః
మహానిశాంతే రంతుం మే సముద్భూతో విరాట్ ప్రభుః. 3

భా: కల్కి పలికెను. ప్రళయకాలమున బ్రహ్మాండము నాశము కాగా సర్వప్రాణులు నాయందులీనమగును. సృష్టికి పూర్వము నేనేయుంటిని. మరేమియు లేదు. సృష్టికి కారణము నేనే. ప్రళయ కాలమున సర్వప్రాణులు నాయందు లీనమై సుప్తావస్థలోనుండగ నేను తప్ప మరొకటి లేదు. ప్రళయకాలము అంతముకాగా సృష్టిరూప క్రీడకొఱకు మాయొక్క సర్వశక్తులతో గూడిన విరాణ్మూర్తి ఆవిర్భవించెను.

సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్
తదంగజోఽభవద్బ్రహ్మా వేదవక్త్రో మహా ప్రభుః. 4

జీవోపాధేర్మమాంశాచ్చ ప్రకృత్యా మాయయా స్వయా
బ్రహ్మోపాధిః స సర్వజ్ఞో మమ వాగ్వేదశాసితః. 5

ససర్జ జీవజాతాని కాలమాయాంశ యోగతః
దేవా మన్వాదయో లోకాః సప్రజాపతయః ప్రభుః. 6

భా: విరాట్పురుషుడు సహస్రశీర్షములు, సహస్రనేత్రములు, సహస్రపాదములు కలవాడు. అతని అవయవములనుండి వేదముఖుడగు బ్రహ్మ ఉద్భవించెను. బ్రహ్మకు ఉపాధి అయిన సర్వజ్ఞుడగు విరాట్పురుషుడు మా అంశయగు ప్రకృతి, స్వీయమగు మాయతో సమస్తజీవములను సృజించెను. ఇట్లే మన్వాదుల, ప్రజాపతుల సృష్టి జరిగెను. ( స్వాయంభువ, స్వారోచిష, ఉత్తమ, తామస, రైవత, చాక్షుష, వైవస్వత, సావర్ణి, దక్షసావర్ణి , బ్రహ్మసావర్ణి, ధర్మసావర్ణి , చంద్రసావర్ణి , దైవసావర్ణి, ఇంద్రసావర్ణి అను వారు పదునల్గురు మనువులు. మరీచి, అత్రి, అంగిరసుడు, పులహుడు, క్రతువు, ప్రచేతసుడు, వశిష్ఠుడు, భృగువు, నారదుడు లనువారు పదిమంది ప్రజాపతులు.)

**గుణిన్యా మాయయాంశా మే నానోపాధౌ ససర్జిరే**
**సోపాధయ ఇమే లోకా దేవాః సస్థాణు జంగమాః. 7**
**మమాంశా మాయయా సృష్టా యతో మయ్యావిశన్ లయే**
**ఏవంవిధా బ్రాహ్మణా యే మచ్ఛరీరా మదాత్మికాః. 8**

భా: సత్వరజస్తమోరూపత్రిగుణాత్మకమగు ప్రకృతితో కూడిన మాయచే ఉపాధిభేదమువలన నాఅంశలు దేవ, మానవ, స్థావర, జంగమముల సృష్టి జరిగినది. మాయచే సృజించబు మా అంశలు ప్రళయకాలమున నాయందే లీనమగును. ఇట్లు సృజింపబడిన బ్రాహ్మణులు నాయొక్క శరీర, ఆత్మస్వరూపులు.

**మాముద్ధరంతి భువనే యజ్ఞాధ్యయన సత్క్రియాః**
**మాం ప్రసేవంతి శంసంతి తపోదాన క్రియాస్విహ. 9**
**స్మరంత్యామోదయంత్యేవ నాన్యే దేవాదయస్తథా**
**బ్రాహ్మణా దేవవక్తారో వేదామే మూర్తయః పరాః. 10**

భా: యజ్ఞము, అధ్యయనము మున్నగు సత్క్రియలనాచరించు బ్రాహ్మణులు నన్ను ఉద్ధరించెదరు. తపస్సు, దానము మున్నగు కర్మలతో నన్ను సేవించుచు స్మరించెదరు. వేదములు నా యొక్క ఉత్కృష్టములగు మూర్తులు. అట్టి వేదములను పలుకు బ్రాహ్మణులు నన్ను కొలుచునట్లు , ఆనందపరచునట్లు దేవాదులెవ్వరు చేయలేరు.

**తస్మాదిమే బ్రాహ్మణజాస్తైః పుష్టాస్త్రిజగజ్జనాః**
**జగంతి మే శరీరాణి తత్పోషే బ్రహ్మణోవరః. 11**

తేనాహం తాన్నమస్యామి శుద్ధసత్త్వగుణాశ్రయః
తతో జగన్మయం పూర్వం మాం సేవతేఽఖిలాశ్రయాః. 12

భా: బ్రాహ్మణుల వలన ప్రచారము నొందిన వేదముల వలన ముల్లోకముల జనులు పరిపుష్టు లగుచున్నారు. ముల్లోకములు నాశరీరము. శరీరపోషణకు ముఖ్యసాధనములు బ్రాహ్మణులు. కనుక శుద్ధ సత్త్వగుణమును నాశ్రయించిన నేను బ్రాహ్మణులకు నమస్కరించుచున్నాను. నేను నమస్కరించినపిమ్మట శుద్ధాంతః కరణులగు బ్రాహ్మణులు జగన్మయునిగ నన్ను తెలుసుకొని సేవించెదరు.

విశాఖయూప ఉవాచ.......

విప్రస్య లక్షణం బ్రూహి త్వద్భక్తిః కాచ తత్కృతా
యతస్తవానుగ్రహేణ వాగ్బాణా బ్రాహ్మణాః కృతాః. 13

కల్కిరువాచ......

వేదా మామీశ్వరం ప్రాహురవ్యక్తం వ్యక్తిమత్పరమ్
తే వేదా బ్రాహ్మణముఖే నానాధర్మే ప్రకాశితాః. 14

భా: విశాఖయూపుడు పలికెను... ఓదేవ! తమ అనుగ్రహము వాక్కులే బాణములుగ కలవారిగ చేయబడిన బ్రాహ్మణుల లక్షణములను వివరింపుడు. మీయెడల వారికి గల భక్తి ఎటువంటిది?

కల్కి పలికెను..... వేదములు నన్ను అవ్యక్తుడు, వ్యక్తుడు, పరాత్పరుడు, ఈశ్వరుడు అని స్తుతించుచున్నవి. నానాధర్మప్రకాశకములగు అట్టివేదములు బ్రాహ్మణ ముఖమునుండి వ్యక్తములైనవి,

యో ధర్మో బ్రాహ్మణానాం హి సా భక్తిర్మమ పుష్కలా
తయాహం తోషితః శ్రీశః సంభవామి యుగే యుగే. 15

ఊర్ధ్వం తు త్రివృతం సూత్రం సధవానిర్మితం శనైః
తంతుత్రయమధోవృత్తం యజ్ఞసూత్రం విదుర్బుధాః. 16

భా: బ్రాహ్మణులు యథావిధిగ తమ ధర్మములను ఆచరించుటయే నాయెడల భక్తిభావమని తెలిసికొనుము. వారి ధర్మాచరణముచే సంతుష్టుడనై యుగయుగమున లక్ష్మీపతిగ అవతరించెదను.

త్రిగుణం తద్గ్రంథియుక్తం వేదప్రవరసంమితమ్
శిరోధరాన్నాభిమధ్యాత్ పృష్ఠార్ధ పరిమాణకమ్. 17

యజుర్వేదాం నాభిమితం సామగానామయం విధిః
వామస్కంధేన విధృతం యజ్ఞసూత్రం బలప్రదమ్. 18

భా: మూడుపేటలుగ చేయబడి ( మూడు దారములతో గూడిన ) గ్రంథులతో గూడిన యజ్ఞసూత్రమును యజ్ఞోపవీతధారణయోగ్యములగు వేదప్రవరలతో గూడి ధారణచేయవలెను. కంఠదేశము నుండి.

మృద్భస్మచందనాద్యైస్తు ధారయేత్తిలకం ద్విజః
భాలే త్రిపుండ్రం కర్మాఙ్గం కేశపర్యంతముజ్జ్వలమ్. 19
పుండ్రమంగుళిమానం తు త్రిపుండ్రం తత్త్రిధా కృతమ్
బ్రహ్మవిష్ణుశివావాసం దర్శనాత్ పాపనాశనమ్. 20

భా: బ్రాహ్మణుడు మట్టి, భస్మ, చందనాదులతో తిలకమును, లలాటమందు పుండ్రధారణము చేయవలెను. కేశపర్యంతము చేయబడిన ఉజ్వలమగు త్రిపుండ్రము ధార్మికమగుకర్మకు అంగము. అంగుళిపరిమాణకమగు పుండ్రమును మూడుసార్లు ధారణచేసిన త్రిపుండ్రమందురు. ఇందు బ్రహ్మ విష్ణు పరమేశ్వరులు నివాసముందురు. త్రిపుండ్రదర్శనము పాపనాశకము.

బ్రాహ్మణానాం కరే స్వర్గా వాచో వేదాః కరే హరిః
గాత్రే తీర్థాని రాగాశ్చ నాడీషు ప్రకృతి స్త్రివృత్. 21
సావిత్రీ కంఠకుహరా హృదయం బ్రహ్మసంజ్ఞితమ్
తేషాం స్తనాంతరే ధర్మః పృష్ఠోఽధర్మః ప్రకీర్తితః. 22

భా: బ్రాహ్మణుల వాక్కులయందు వేదము హస్తమున స్వర్గము , శరీరమందు తీర్థములు, ప్రీతి నాడుల యందు త్రివృత్ ప్రకృతి ( తేజస్సు జలము అన్నములను త్రివృత్ ప్రకృతి యందురు. ) కంఠదేశమున సావిత్రి విరాజిల్లుచున్నవి. బ్రాహ్మణుని హృదయము బ్రహ్మస్వరూపము, వారి స్తనములనడుమ ధర్మము, పృష్ఠభాగమున అధర్మము కలవు.

భూదేవా బ్రాహ్మణా రాజన్! పూజ్యా వంద్యాః సదుక్తిభిః
చతురాశ్రమ్యకుశలా మమ ధర్మప్రవర్తకాః. 23
బాలాశ్చాపి జ్ఞానవృద్ధాస్తపోవృద్ధా మమ ప్రియాః
తేషాం వచః పాలయితు మవతారాః కృతామయా. 24

భా: ఓ రాజా! భూదేవులగు బ్రాహ్మణులు బ్రహ్మచర్యము గార్హస్థ్యము, వానప్రస్థము,

సన్యాసమను నాలుగు ఆశ్రమముల యందు నిపుణులు, సనాతనధర్మ ప్రవర్తకులు కనుక వారు సదుక్తులచే పూజ్యులు వంద్యులు; జ్ఞానవృద్ధులు, తపోవృద్ధులగు బ్రాహ్మణులు బాలురయినను ప్రియులు. వారి ఆజ్ఞను పాలించుటకు నేను అవతరించెదను.

**మహాభాగ్యం బ్రాహ్మణానాం సర్వపాప ప్రణాశనమ్**
**కలిదోషహరం శ్రుత్వా ముచ్యతే సర్వతో భయాత్. 25**
**ఇతి కల్కి వచః శ్రుత్వా కలిదోషవిశాతనమ్**
**ప్రణమ్య తం శుద్ధమనాః ప్రయయౌ వైష్ణవాగ్రణీః. 26**

భా: బ్రాహ్మణుల నుండి ధర్మమునువినుట వలన సర్వపాపములును పోవును. కలిదోషములు దూరమగును. సమస్త భయములు నశించును. ఇది యెంతయో మహాభాగ్యము. కలిదోషములను పోగొట్టు కల్కి వచనములు విని శుద్ధమనస్కుడు, వైష్ణవాగ్ర గణ్యుడు నగు విశాఖయూపుడు కల్కికి నమస్కరించి వెడలెను.

**గతే రాజని సంధ్యాయాం శివదత్తశుకో బుధః**
**చరిత్వాకల్కిపురతః స్తుత్వా తం పురతః స్థితః. 27**
**తం శుకం ప్రాహ కల్కిస్తు సస్మితం స్తుతి పాఠకమ్**
**స్వాగతం భవతా కస్మాద్దేశాత్ కిం ఖాదితం తతః. 28**

భా: విశాఖయూపరాజు వెడలిన పిమ్మట శివునిచే ఈయబడిన పండితుడగు శుకము సంధ్యాసమయమున కల్కి వద్దకు వచ్చి అతనిని స్తుతించి నిలిచెను. కల్కి మందహాసముతో స్తోత్రపాఠకుడగు శుకమునకు స్వాగతము పలికి నీవు ఏదేశమునకేగి ఏ వృత్తాంతమును తీసుకువచ్చితివని అడిగెను.

**శుక ఉవాచ......**

**శృణు నాథ! వచో మహ్యం కౌతూహలసమన్వితమ్**
**అహం గతశ్చ జలధేర్మధ్యే సింహలసంజ్ఞకే. 29**
**యథావృత్తం ద్వీపగతం తచ్చిత్రం శ్రవణప్రియమ్**
**బృహద్రథస్య నృపతేః కన్యాయాశ్చరితామృతమ్. 30**

భా: శుకము పలికెను. ఓరాజా ! కుతూహలమునుకల్గించు వచనములను నా వలన మీరు వినుడు. సముద్రమధ్యమున గల సింహలమను ద్వీపమునకు నేను వెళ్ళితిని. సింహలమందలి సమస్తవృత్తము ఆశ్చర్యము గొలుపునది. బృహద్రథరాజు కన్యాచరితము వినుట కింపైనది.

కౌముద్యామిహ జాతాయా జగతాం పాపనాశనమ్
చరితం సింహాలే ద్వీపే చాతుర్వర్ణ్య జనావృతే. 31
ప్రాసాదహర్మ్య సదన పురరాజి విరాజితే
రత్నస్ఫాటికకుడ్యాది స్వర్ణతాభిర్విభూషితే. 32

భా: కౌముదియను మహారాణికి జన్మించిన రాజపుత్రిక చరితము పాపనాశకము. సింహళ దేశమున బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు నాలుగు వర్ణములవారు గలరు. ఆ నగరము రత్నస్ఫటికమయములగు గోడలతో కూడిన ప్రాసాదములతో, హర్మ్యములతో, గృహములతో ప్రకాశించుచుండెను. స్వర్ణలతలతో అలంకరింపబడెను. (ప్రశస్తములగు తీగలు పారిజాతము మొదలగునవి.) (ప్రాసాదము = రాజగృహము, హర్మ్యము = ధనిక గృహము సదనము= సామాన్య గృహము).

స్త్రీభిరుత్తమ వేశాభిః పద్మినీభిః సమావృతే
సరోభిః సారసైర్హంసై రుపకూల జలాకులే. 33
భృంగరంగ ప్రసంగాఢ్యే పద్మైః కల్హారకుందకైః
నానాంబుజలతాజాల వనోపవన మండితే. 34

భా: అచ్చట నల్లని కేశ పాశములు గల పద్మినీజాతి స్త్రీలు గలరు. బెగ్గురు పక్షులు, జలచరపక్షులు హంసలతో గూడిన సరస్సులు గలవు. తుమ్మెదల ఝుంకారములచే ఆ ప్రదేశము మనోహరముగ నున్నది. పద్మములు, కలువలు, కుందపుష్పములు, వివిధములగు ఎఱ్ఱగన్నేరు పుష్పములు, లతలతో గూడిన వన, ఉపవనములతో సింహళదేశము విభూషిత మైయున్నది.

దేశే బృహద్రథో రాజా మహాబల పరాక్రమః
తస్య పద్మావతీ కన్యా ధన్యా రేజే యశస్వినీ. 35
భువనే దుర్లభా లోకేఽప్రతిమా వరవర్ణినీ
కామమోహకరీ చారుచరిత్రా చిత్రనిర్మితా. 36

భా: మహాపరాక్రమ వంతుడగు బృహద్రథుడు సింహళదేశమునకు ప్రభువు. బృహద్రథుని కూతురు పద్మావతి. ఆమె యశస్విని. అద్వితీయ సౌందర్యవతి. కామమోహములను కల్గించు రూపము కల్గిన ఆమె చిత్రమందు గీయబడిన యువతి వలె మనోహరముగ నుండును. ఆమె చరితము అత్యంతరమణీయము.

శివసేవాపరా గౌరీ యథా పూజ్యా సుసమ్మతా
సఖీభిః కన్యకాభిశ్చ జపధ్యాన పరాయణా. 37

**జ్ఞాత్వా తాంచ హరేర్లక్ష్మీం సముద్భూతాం వరాంగనామ్**
**హరః ప్రాదురభూత్ సాక్షాత్ పార్వత్యా సహ హర్షితః. 38**

భా: మిక్కిలి గౌరవింపదగినది, పూజింపదగినదియగు పార్వతి శివసేవా తత్పరురాలయినట్లు పద్మావతి సఖులయిన కన్యకలతో జపధ్యానపరాయణురాలాయెను. లక్ష్మీదేవి పార్వతిగ భూమండలమున అవతరించినదని తెలిసి పార్వతీపరమేశ్వరులు హర్షచిత్తులై సాక్షాత్కరించిరి.

**సా తమాలోక్య వరదం శివం గౌరీసమన్వితమ్**
**లజ్జయాధోముఖీ కించిన్నోవాచ పురతః స్థితా. 39**
**హరస్తామాహ సుభగే తవ నారాయణః పతిః**
**పాణిం గ్రహీష్యతి ముదా నాన్యో యోగ్యో నృపాత్మజః. 40**

భా: పార్వతీదేవితో గూడిన వరదాతయగు శివుని చూచి పద్మావతి వారికి ఎదురుగ నున్నదై సిగ్గుతో తలవంచుకున్నదై ఏమియు మాట్లాడలేదు. పరమేశ్వరుడు ఆమెతో ఓ పద్మావతి! నీ భర్తయగు విష్ణుమూర్తి నిన్ను పాణిగ్రహణము చేయగలడు. ఇతర రాజకుమారులెవరు యోగ్యులు కారు.

**కామభావేన భువనే యే త్వాం పశ్యంతి మానవాః**
**తేనైవ వయసా నార్యో భవిష్యంత్యపి తక్షణాత్. 41**
**దేవాసురాస్తథా నాగా గంధర్వాశ్చారణాదయః**
**త్వయా రంతుం యథా భవిష్యంతి కిల స్త్రియః. 42**

భా: లోకమున ఎవరు నిన్ను కామభావముతో చూచెదరో అట్టి పురుషులు తక్షణము నుండి సమవయస్కులగు స్త్రీలుగ మారగలరు. దేవ అసుర నాగ గంధర్వ చారణాదులు నీతోరమింపగోరినచో వెంటనే స్త్రీ రూపమును పొందుదురు.

**వినా నారాయణం దేవం త్వత్పాణి గ్రహణార్థినమ్**
**గృహం యాహి తపస్త్యక్త్వా భోగాయతనముత్తమమ్. 43**
**మా క్షోభాయ హరేః పత్ని కమలే విమలం కురు**
**ఇతి దత్వా వరం సోమస్తత్రైవాంతర్దధే హరః. 44**

హరవరమితి సానిశమ్య పద్మా
సముచితమాత్మ మనోరథప్రకాశమ్
వికసితవదనా ప్రణమ్య సోయం
నిజజనకాలయమా వివేశ రామా. 45

భా: విష్ణుమూర్తి తప్ప మరెవరయినను వివాహమాడగోరినచో ఇట్టి అవస్థనే పొందుదురు. తపస్సును విడిచి ఇంటికి వెళ్ళుము. భోగములకు యోగ్యమగు ఉత్తమ శరీరమును క్షోభపెట్టకుము. పాపరహితము చేయుము. పరమేశ్వరుడు పూర్వోక్త ప్రకారముగ పద్మావతికి వరమిచ్చి అంతర్ధానమయ్యెను. తన మనోభీష్టమునకు అనుకూలముగ పరమేశ్వరుడు వరమిచ్చుటను తెలుసుకొని పద్మావతి వికసించిన వదనకములము కలదై అతనికి నమస్కరించి పితృగృహమునకు వెడలెను.

ఇతి శ్రీ కల్కిపురాణేఽనుభాగవతే
భవిష్యేహరవరప్రదానం నామ
చతుర్థోధ్యాయః

ఇది భాగవతానుబంధము భవిష్యమునగు
శ్రీ కల్కి పురాణమున
హరవరప్రదానమును నాల్గవ అధ్యాయము .

★★★

# కల్కిపురాణము

## ప్రథమాంశము--పంచమాధ్యాయము

శుక ఉవాచ.....

గతే బహుతిథే కాలే పద్మాం వీక్ష్య బృహద్రథః
నిరూఢయౌవనాం పుత్రీం విస్మితః పాపశంకయా. 1
కౌముదీం ప్రాహ మహిషీం పద్మోద్వాహేఽత్ర కం నృపమ్
వరయిష్యామి సుభగే ! కులశీలసమన్వితమ్. 2

భా: శుకము చెప్పెను. బహు కాలము పిమ్మట బృహద్రథుడు నవయౌవనము నొందిన తనపుత్రికను చూచి విస్మితుడై వివాహప్రయత్నము చేయక పోవుటచే పాపమును శంకించుచు రాణియగు కౌముదితో ఓ సుందరి ! పద్మావతికియోగ్యుడగు కులశీల సమన్వితుడగు రాజును వరునిగ నెంచెద నని అడిగెను.

సా తమాహ పతిం దేవీ శివేన ప్రతిభాషితమ్
విష్ణురస్యాః పతిరితి భవిష్యతి న సంశయః. 3
ఇతి తస్యా వచః శ్రుత్వా రాజా ప్రాహ కదేతి తామ్
విష్ణుః సర్వగుహావాసః పాణిమస్యా గ్రహీష్యతి. 4

భా: కౌముది తన భర్తతో శివుడు పలికిన విధముగ విష్ణువు తప్పక పద్మావతికి భర్త కాగలడని చెప్పెను. ఆమె మాటలు విని బృహద్రథుడు అందరి హృదయములలో విహరించు విష్ణువు ఎప్పుడు పద్మావతిని పరిణయమాడును? అనిప్రశ్నించెను.

నమే భాగ్యోదయః కశ్చిద్యేన జామాతరం హరిమ్
వరయిష్యామి కన్యార్థే వేదవత్యా మునేర్యథా. 5
ఇమాం స్వయంవరాం పద్మాం పద్మామివ మహోదధేః
మథనేఽసురదేవానాం తథా విష్ణుః గ్రహీష్యతి. 6

భా: శ్రీమహావిష్ణువును అల్లునిగపొందు భాగ్యము నాకుదక్కునా? అట్టైన హరిని జామాతగ పొందగలను. మునికన్యయగు వేదవతి స్వయంవరసభను ప్రవేశించినట్లు పద్మావతిని

కూడ స్వయంవర సభలో ప్రవేశపెట్టెదను. దేవాసురులు సముద్రమథనము చేసినపుడు సాగరమునుండి పుట్టిన లక్ష్మీదేవిని గ్రహించినట్లు స్వయంవరమున పద్మావతిని విష్ణుమూర్తి గ్రహించగలడు.

**ఇతి భూపగణాన్ భూపః సమాహూయ పురస్కృతాన్**
**గుణశీలవయోరూప విద్యాద్రవిణ సంవృతాన్.** 7
**స్వయంవరార్థం పద్మాయాః సింహళే బహుమంగళే**
**విచార్య కారయామాస స్థానం భూపనివేశనమ్.** 8

భా: ఇట్లు ఆలోచించిన బృహద్రథుడు గుణశీల సంపన్నులు రూపవయో విద్యాధనవంతులగు రాజులను పద్మావతి స్వయంవరమున కాహ్వానించెను. సింహళదేశమున అనేకవిధములగు మంగళకార్యములు జరుగుచుండెను. బృహద్రథుడు స్వయంవరమునకు వచ్చు రాజుల కొఱకు యోగ్యనివాసముల నేర్పాటు చేసెను.

**తత్రాయాతాః నృపాః సర్వే వివాహకృత నిశ్చయాః**
**నిజసైన్యైః పరివృతాః స్వర్ణరత్న విభూషితాః.** 9
**రథాన్ గజానశ్వవరాన్ సమారూఢా మహాబలాః**
**శ్వేత చ్ఛత్రకృతచ్ఛాయాః శ్వేతచామరవీజితాః.** 10

భా: పద్మావతిని వివాహమాడవలెనని రాజులు స్వర్ణభూషితులై తమతమ సైన్యములతో గూడి సింహళదేశమునకు రథములను, గజములను, అశ్వముల నధిరోహించి వచ్చిరి. బలవంతులగు నీరాజులు తెల్లనిగొడుగులు ధరించి వచ్చిరి. ఆగొడుగుల నీడలో వారికి సేవకులు తెల్లని వింజామరలు వీచుచుండిరి.

**శస్త్రాస్త్రతేజసా దీప్తా దేవాః సేంద్రా ఇవాభవన్**
**రుచిరాశ్వః సుకర్మాచ మదిరాక్షో దృఢాశుగః.** 11
**కృష్ణసారః పారదశ్చ జీమూతః క్రూరమర్దనః**
**కాశః కుశాంబుర్వసుమాన్ కఙ్కః క్రథనసంజయౌ.** 12
**గురుమిత్రః ప్రమాథీచ విజృమ్భః సృంజయోఽక్షమాః**
**ఏతే చాన్యేచ బహవః సమాయాతా మహాబలాః.** 13

భా: అస్త్రశస్త్రముల కాంతులతో ప్రకాశించెడి రాజులు ఇంద్రునితోగూడినదేవతలవలె నుండిరి. రుచిరాశ్వ, సుకర్మ, మదిరాక్ష, దృఢాశుగ, కృష్ణసార, పారద, జీమూత, క్రూరమర్దన,

కాశ, కుశాంబు, బహుమాన, కంక , క్రథన, సంజయ, గురుమిత్ర, ప్రమాథి, **విజృంభ, సంజయ,** అక్షములు మున్నగు పరాక్రమవంతులగు రాజులు సింహళదేశమునకు వచ్చిరి.

వివిశుస్తే రంగగతాః స్వస్వస్థానేషుపూజితాః
వాద్యతాండవ సంహృష్టాశ్చిత్రమాల్యాంబరాధరాః. 14
నానాభోగ సుఖోద్రిక్తాః కామరామా రతిప్రదాః
తానాలోక్య సింహలేశః స్వాం కన్యాం వరవర్ణినీమ్. 15

భా: చిత్రవిచిత్రములగు **పుష్పమాల**లను, వస్త్రములను ధరించి వేదికపై తమతమ ఆసనముల నలంకరించి రాజులు **వాద్యతాండవ**ములచే సంతుష్టులైరి. సుఖభోగములయందు ఆసక్తులయిన రాజులను చూచి సింహలేశుడు సౌందర్యవతియగు తన పుత్రికను సభకు రప్పించెను.

గౌరీం చంద్రాననాం శ్యామాం తారహారవిభూషితామ్
మణిముక్తాప్రవాళైశ్చ సర్వాంగాలంకృతాం శుభామ్. 16
కిం మాయాం మోహజననీం కింవా కామప్రియాం భువి
రూపలావణ్యసంపత్త్యా న చాన్యామిహ దృష్టవాన్. 17

భా: కన్యయు (గౌరి ), చంద్రబింబము వంటి ముఖము గలది, శ్యామవర్ణముగలది, శుద్ధములగు ముత్యముల హారములచే అలంకరింపబడినది, మణులు, ముత్యములు, పగడములచే సర్వావయవ భూషితురాతగు పద్మావతి మోహమును కల్గించు మాయయా? భూమి యందవతరించిన మన్మథుని భార్యయగు రతీదేవియా? ఇంతటి రూపలావణ్యవతిని నేను (శుకము) మునుపెన్నడు చూడలేదు.

స్వర్గే క్షితౌవా పాతాలేఽప్యహం సర్వత్రగో యది
పశ్చాద్దాసీగణాకీర్ణాం సఖీభిః పరివారితామ్. 18
దౌవారికైర్వేత్రహస్తైః శాసితాంతఃపురాద్బహిః
పురోబందిగణాకీర్ణాం ప్రాపయామాస తాం శనైః. 19

భా: ఓ రాజా! నేను ముల్లోకములు తిరిగితిని. స్వర్గపాతాళ లోకములలో కూడ ఈమెతో సమానమగు **యువతిని** చూడలేదు. దాసీగణము వెనుక రాగా సఖురాండ్రతో కూడిన పద్మావతిని వేత్రహస్తులగు **దౌవారికులు** వందిమాగదులు ముందుడగ అంతఃపురమునుండి సభలోనికి ప్రవేశపెట్టిరి.

నూపురైః కింకిణీభిశ్చ క్వణంతీ జనమోహినీ
స్వాగతానాం నృపాణాంచ కులశీలగుణాన్ బహూన్. 20
శృణ్వంతీ హంసగమనా రత్నమాలాకరగ్రహా
రుచిరాపాంగభంగేన ప్రేక్షంతీ లోలకుండలా. 21

భా: ఘల్లు ఘల్లు మనుచు జనమోహకమగు కాలి యందెల శబ్దము చేయుచు పద్మావతి ఏతెంచినది. అక్కడకేతెంచిన రాజుల కులశీల గుణములను వినుచు రత్నమాలను చేతియందుంచుకొని కుండలములు వ్రేలాడుచుండ మెల్లగ నడుచుచు క్రీగంటి చూపులతో రాజులను చూడసాగెను.

నృత్యత్కుంతల సోపాన గండమండల మండితా
కించిత్ స్మేరోల్లసద్వ క్త్ర దశన ద్యోత దీపితా. 22
వేదీమధ్యారుణ క్షౌమవసనా కోకిలస్వనా
రూపలావణ్య పణ్యేన క్రేతు కామా జగత్త్రయమ్. 23

భా: ఆమె చెక్కిళ్లు ముంగురుల నాట్యముచే శోభిల్లుచుండెను. మందహాసముచే ప్రకాశించు ముఖము దశనకాంతులచే మరింత అందముగనుండెను. చూడముచ్చటైన (సన్నని) నడుముగలది, ఎరుపురంగు వస్త్రమును ధరించినది, కోకిలకంఠము గలది యగు పద్మావతి రూపలావణ్యములనెడి పణ్యము= అమ్మదగిన వస్తువుచే ముల్లోకములను కొనవలెనని కోరుచున్నాదా? అన్నట్లుండెను.

సమాగతాం తాం ప్రసమీక్ష్య భూపాః సంమోహినీం కామవిమూఢచిత్తాః
పేతుః క్షితౌ విస్మృతవస్త్రశస్త్రః రథాశ్వమత్త ద్విపవాహనాస్తే. 24
తస్యాః స్మరక్షోభనిరీక్షణేన స్త్రియో బభూవుః కమనీయరూపాః
బృహన్నితంబస్తనభారనమ్రాః సుమధ్యమాస్తత్ స్మృతి జాతరూపాః. 25

భా: స్వయంవరసభకు విచ్చేసి సంమోహమును కలిగించు పద్మావతిని చూచి రథ-అశ్వ-గజములు వాహనులగు రాజులు కామవిమూఢులయిరి. శస్త్రములు ఊడి భూమిమీదపడిరి. కామమోహితులై పద్మావతిని చూచుటవలన రాజులందరు మనోహరమగు రూపము పెద్ద పిఱుదులు, స్తనభారము, సన్నని నడుము గల స్త్రీరూపములను ధరించిరి.

విలాసహాసవ్యసనాతిచిత్రాః కాంతాననాః శోణసరోజనేత్రాః
స్త్రీరూపమాత్మానమవేక్ష్య భూపాస్తామన్వగచ్ఛన్ విశదానువృత్త్యా. 26

అహం వటస్థః పరిధర్షితాత్మా పద్మావివాహోత్సవ దర్శనాకులః
తస్యా వచోఽంతర్హృది దుఃఖితాయాః శ్రోతుం స్థితః స్త్రీత్వమితేషు తేషు.**27**

భా: కటాక్షభ్రూవికారాది శృంగారభావములు, హాసము, వ్యసనములచే మిక్కిలి చిత్రముగ కనబడువారు, మనోహరములగు ముఖములు గలవారు, రక్తపద్మములవంటి నేత్రములు గలవారుఅగురాజులు స్త్రీరూపముగతమను చూచుకొని నిష్కల్మషులై పద్మావతిని అనుసరించిరి. పద్మావతి వివాహోత్సవమును చూచుకోరికతో నేను సమీపమందలి వటవృక్షమందు కూర్చుంటిని. కాని రాజులందరు స్త్రీరూపములను ధరించుటనుచూచి మిక్కిలి ఖిన్నుడనైతిని. వారి వార్తాలాపములను వినుటకు అచ్చటనుంటిని.

జహీహి కల్కే కమలావిలాసం శ్రుతం విచిత్రం జగతామధీశ
గతే వివాహోత్సవమంగళే సా శివం శరణ్యం హృదయే నిధాయ. **28**
తాన్ దృష్ట్వా నృపతీన్ గజాశ్వరథిభిస్త్యక్తాన్ సఖిత్వం గతాన్
స్త్రీభావేన సమన్వితాననుగతాన్ పద్మాం విలోక్యాంతికే.
దీనా త్యక్తవిభూషణా విలిఖతీ పాదాంగుళైః కామినీ
శం కర్తుం నిజనాథమీశ్వరవచస్తథ్యం హరిం సాఽస్మరత్. **29**

భా: ఓజగదీశ! మంగళమయమగు వివాహోత్సవ సమయమున రాజులందరు స్త్రీరూపమును పొందుటచూచి పద్మావతి విలపించెను. శరణాగతరక్షకుడగు పరమేశ్వరుని ధ్యానించెను. వెంటనే స్త్రీరూపములను పొందిన రాజులు గజాశ్వరథములను విడిచి సఖురాండ్రుగ ఆమెవెంట నడవసాగిరి. వారిని చూచి దీనురాలై, అలంకారములను తీసివేసి, పాదాంగుళిచే నేలమీద రాయుచు పరమేశ్వరుని వరమును సఫలము చేసుకొనుటకై పతిభావముతో విష్ణువును ధ్యానించెను.

ఇతి శ్రీ కల్కిపురాణేఽను భాగవతే భవిష్యే పద్మాస్వయంవరే
భూపతీనాం స్త్రీత్వకథనం నామ పంచమోఽధ్యాయః

ఇది భాగవతాను బంధము భవిష్యమునగు శ్రీకల్కిపురాణమున
పద్మాస్వయంవరమున రాజులు స్త్రీత్వము నొందుట అను
అయిదవ అధ్యాయము.



# కల్కి పురాణము
## ప్రథమాంశము -- షష్ఠాధ్యాయము

శుక ఉవాచ......

తతః సావిస్మితముఖీ పద్మా నిజజనైర్వృతా
హరిం పతిం చింతయంతీ ప్రోవాచ విమలాం స్థితామ్. 1

పద్మోవాచ.......

విమలే! కింకృతం ధాత్రా లలాటే లేఖనం మమ
దర్శనాదపి లోకానాం పుంసాం స్త్రీభావకారకమ్. 2

భా: శుకము పలికెను. పిమ్మట స్వకీయ పరిజనముతో గూడిన పద్మావతి విస్మితముఖియై హరిని పతిగ ధ్యానించుచు విమలయను సఖురాలితో ఇట్లు పలికెను. (పద్మావతి పలికెను.) ఓవిమల! విధాత నాభాగ్యము గూర్చి లలాటమందు ఎట్లు వ్రాసెనోగదా! నన్ను కామభావముతో చూచి పురుషులు స్త్రీరూపమును పొందుచున్నారు.

మమాపి మందభాగ్యాయాః పాపిన్యాః శివసేవనమ్
విఫలత్వమనుప్రాప్తం బీజముప్తం యథోషరే. 3

హరిర్లక్ష్మీపతిః సర్వజగతామధిపః ప్రభుః
మత్కృతేఽప్యభిలాషం కిం కరిష్యతి జగత్పతిః. 4

భా: నేను మిక్కిలి దురదృష్టవంతురాలను, పాపాత్మురాలను మరుభూమియందు నాటిన బీజమువలె నాశివసేవనము నిష్ఫలమాయెను. సర్వజగద్రక్షకుడు , వృద్ధిబొందువాడు, లక్ష్మీపతి యగు హరినాయెడలకోరిక గలవాడగునా? (నన్ను అభిలషించునందువా? )

యది శంభోర్వచో మిథ్యా యది విష్ణుర్న మాం స్మరేత్
తదాహమనలే దేహం త్యక్ష్యామి హరిభావతా. 5

క్వచాహం మానుషీ దీనా క్వాస్తే దేవో జనార్దనః
నిగృహీతా విధాత్రాహం శివేన పరివంచితా. 6

భా: పరమేశ్వరుని వచనము లసత్యములైనను శ్రీహరి నన్ను స్మరించకపోయినను నేను

హరినామస్మరణచేయుచు అగ్నిగుండమున దేహత్యాగము చేయగలను. మానుషియగు నేను ఎక్కడ? ఆదిదేవుడువిష్ణుమూర్తి ఎక్కడ? ( మాయిద్దరికి వివాహము ఎట్లు సంభవము?) విధాతచే తిరస్కరింపబడిన నేను పరమేశ్వరునిచే వంచింపబడితిని.

విష్ణునా చ పరిత్యక్తా మదన్యా కాత్ర జీవతి?
ఇతి నానా విలాపిన్యా వచనం శోచనాశ్రయమ్
పద్మాయాశ్చారుచేష్టాయాః శ్రుత్వా యాతస్తవాంతికే. 7
శుకస్యవచనం శ్రుత్వా కల్కిః పరమవిస్మితః
తం జగాద పునర్యాహి పద్మాం బోధయితుం ప్రియామ్. 8

భా: విష్ణుమూర్తిచే విడువబడి, ఇతర స్త్రీజీవించియుండగలదు? నేను తప్ప.... నేను ఇంకను జీవించి యుంటిని అని సచ్చరిత అయినపద్మావతి విలాపములను విని నేను మీద్దగ్గరకు వచ్చితి నని శుకము పలుకగ విని ఆశ్చర్యచకితుడైన కల్కి శుకముతో 'పద్మను అనునయించుటకు తిరిగి వెళ్ళు మని పలికెను.

మత్సందేశహరో భూత్వా మద్రూపగుణకీర్తనమ్
శ్రావయిత్వా పునః కీర! సమాయాస్యసి బాంధవ. 9
సామే ప్రియా పతిరహం తస్యా దైవవినిర్మితః
మధ్యస్థేన త్వయా యోగమావయోశ్చ భవిష్యతి. 10

భా: ప్రియ బంధువగు శుకమ ! నీవు మాసందేశమును చేర్చువాడవై మారూపగుణములను పద్మావతికి వినిపించి తిరిగి రావలసినది. పద్మ నాకు ప్రియురాలు. నేను ఆమెకు భర్తను. ఇది దైవనిర్ణయము. నీవు మధ్యస్థుడవై మమ్ములను కలుపవలసినది.

సర్వజ్ఞోఽసి విధిజ్ఞోఽసి కాలజ్ఞోఽసి కథామృతైః
తామాశ్వాస్య మమాశ్వాస కథాయాస్తస్యాః సమాహర. 11
ఇతి కల్కేర్వచః శ్రుత్వా శుకః పరమహర్షితః
ప్రణమ్య తం ప్రీతమనాః ప్రయయౌ సింహళం త్వరన్. 12

భా: నీవు సర్వము తెలిసినవాడవు. నియమముల నెరిగినవాడవు. కాలజ్ఞానముకలవాడవు. అమృతతుల్యములగు కథలతో ఆమెను ఓదార్చినా ప్రీతికొఱకు తిరిగివచ్చి ఆశ్వాసన పూర్వకమయిన ఆమె కథలను తిరిగివచ్చినాకు వినిపించుము. కల్కిమాటలను విని శుకము మిక్కిలి ఆ నందించినదై అతనికి నమస్కరించి తొందరగ సింహళ దేశమునకేగెను.

ఖగః సముద్రపారేణ స్నాత్వా పీత్వామృతం పయః
బీజపూర ఫలాహారో యయౌ రాజనివేశనమ్. 13
తత్రకన్యాపురం గత్వా వృక్షే నాగేశ్వరే వసన్
పద్మామాలోక్య తాం ప్రాహ శుకో మానుష భాషయా. 14

భా: శుకము సముద్రము దాటి స్నానమాచరించి అమృతమయమగు జలమును త్రాగి మాదీ ఫలములను భుజించి రాజభవనము ప్రవేశించెను. తరువాత కన్యాంతఃపురము ప్రవేశించి నాగకేసర వృక్షమధిరోహించి పద్మావతిని చూచి ఆమెతో మనుష్య వాక్కుతో ఇట్లు పలికెను.

కుశలం తే వరారోహే! రూపయౌవన శాలిని!
త్వాం లోలనయనాం మన్యే లక్ష్మీరూపామి వాపరామ్. 15
పద్మాననాం పద్మగంధాం పద్మనేత్రాం కరాంబుజే
కమలం కాలయంతీం త్వాం లక్షయామి పరాం శ్రియమ్. 16

భా: రూపయౌవనములతో ఒప్పు నీవు క్షేమమే కదా. చంచల నేత్రియగు నిన్ను రెండవ లక్ష్మిగ తెలుసుకొనుచున్నాను. పద్మమువంటి ముఖము, పద్మగంధమువంటి గంధము కలదానవు. పద్మముల వంటి నేత్రములు హస్తములు గలదానవు, చేతిలో పద్మము కల్గియుండుట మున్నగు లక్షణములచే నిన్ను లక్ష్మిగ తెలుసుకొనుచున్నాను.

కిం ధాత్రా సర్వజగతాం రూపలావణ్య సంనదామ్
నిర్మితాసి వరారోహే ! జీవానాం మోహకారిణి. 17
ఇతిభాషితమాకర్ణ్య కీరస్యామితమద్భుతమ్
హసంతీ ప్రాహ సాదేవీ తం పద్మా పద్మమాలినీ. 18

భా: సమస్త జీవులకు మోహము కల్గించు దాన ! సర్వలోకములయందలి రూపలావణ్యసంపదను పోగుచేసి విధాత నిన్నుసృష్టించెనా? పద్మమాలిని యగు పద్మావతి చిలుక పలికిన అద్భుత వచనములను విని మందహాసముతో ఇట్లనెను.

కస్త్వం కస్మాదాగతోఽసి కథం మాం శుకరూపధృక్
దేవో వా దానవో వా త్వమాగతోఽసి దయాపరః . 19

శుక ఉవాచ ......

సర్వజ్ఞోఽహం కామగామీ సర్వశాస్త్రార్థ తత్త్వవిత్
దేవగంధర్వభూపానాం సభాసు పరిపూజితః. 20

భా: నీవు ఎవరు? ఎచ్చటినుండి వచ్చితివి? శుకరూపమును ధరించిన దేవతవా? దైత్యుడవా? దయాపరుడవైన నీవు ఏకారణముతో నాదగ్గరకు వచ్చితివి? శుకము పలికెను. నేను సర్వజ్ఞుడను. సర్వశాస్త్రార్థతత్త్వములను తెలిసినవాడను. యథేచ్ఛగ సంచరించగలను. దేవగంధర్వ రాజసభలయందు సమ్మానింపబడితిని.

చరామి స్వేచ్ఛయా ఖే త్వామీక్షణార్థమిహాగతః
త్వామహం హృది సంతప్తాం త్యక్తభోగాం మనస్వినీమ్. **21**
హాస్యాలాప-సఖీసంగ-దేహాభరణ-వర్జితామ్
విలోక్యాహం దీనచేతాః పృచ్ఛామి శ్రోతుమీరితమ్
కోకిలాలాప సంతాపజనకం మధురం మృదు. **22**

భా: నేను ఆకాశమార్గమున స్వేచ్ఛగ తిరగగలను. నిన్నుచూచుటకు ఇచ్చటకు వచ్చితిని. ప్రశస్తమయిన మనస్సుగల నీవు సంతప్తురాలవై భోగములను విడిచిన దానవైతివి. హాస్యాలాపములు, సఖీసాంగత్యము, దేహాలంకారములను విడిచిననిన్ను దీనహృదయుడనైన నేను సంతాపమునకు కారణము అడుగదలచితిని. మృదుమధురములగు నీమాటలను వినవలెనని కోరికగలదు.

తవ దంతౌష్ఠ జిహ్వాగ్ర లులితాక్షర పంక్తయః
యత్ కర్ణకుహరే మగ్నాస్తేషాం కిం వర్ణ్యతే తపః. **23**
సౌకుమార్యం శిరీషస్య క్వ కాంతిర్వా నిశాకరే
పీయూషం క్వ వదంత్యేవానందం బ్రహ్మణి తే బుధాః. **24**
తవ బాహులతాబద్ధా యే పాస్యంతి సుధాననమ్
తేషాం తపోదానజపైర్వ్యర్థైః కిం జనయిష్యతి **25**

భా: నీదంతములు, పెదవులు, నాలుక నుండి వెలువడిన అక్షరసముదాయమును వినిన వారి సౌభాగ్య మేమని వర్ణింతును. శిరీష పుష్పసౌకుమార్యము, చంద్రుని కాంతి నీముందు ఎంతటివి? అమృతము బ్రహ్మానందము కూడ అతిసాధారణమైనవే. నీబాహులతల యందు బంధింపబడి ఎవరు ముఖచంద్రుని ఆస్వాదించెదరో అట్టివారికి తపస్సు దానముజపము వ్యర్థములే. అవి ఎట్టి ఫలము నీయగలవు?

తిలకాలక సంమిశ్రం లోలకుండల మండితమ్
లోలేక్షణోల్లసద్వక్త్రం పశ్యతాం న పునర్భవః. **26**

బృహ[ద్రథసుతే ! స్వాధింవద భామిని యత్కృతే
తపఃక్షీణామివ తనుం లక్షయామి రుజం వినా
కనక ప్రతిమా యద్వత్ పాంసుభిర్మలినీకృతా. 27

భా: తిలకము, ముంగురులతో సంమిశ్రితము, వ్రేలాడు కుండలములతో భూషితము, చంచలమగు చూపులతో ప్రకాశితమగు పద్మావతి ముఖము చూచు వారికి పునర్జన్మయుండదు. బృహద్రథపుత్రి ! నీమానసికదుఃఖమునకు కారణమేమి ? మానసికవ్యథ, రోగములేకపోయినను తపస్సువలన క్షీణించినట్లు నీశరీరము కనబడుచున్నది. సువర్ణ ప్రతిమ ధూళిధూసరితమైనట్లు నీశరీరము మలిన మైనది.

పద్మోవాచ....

కిం రూపేణ కులేనాపి ధనేనాభిజనేన వా
సర్వం నిష్ఫలతామేతి యస్యదైవమదక్షిణమ్. 28
శ్రుణు వీర సమాఖ్యానం యది వా విదితం తవ
బాల్యపౌగండ కైశోరే హరసేవాం కరోమ్యహమ్. 29

భా: పద్మావతి పలికెను. దైవముఅనుకూలముగా లేనివారికి రూపము, కులము, ధనము, వంశములతో ప్రయోజనమేమి ? సమస్తము నిష్ఫలమే. ఓశుకమ! మావృత్తాంతమును వినుము. నేను బాల్య-పౌగండ-కిశోరావస్థలలో శివపూజ చేసెడిదానను.

తేన పూజావిధానేన తుష్టో భూత్వా మహేశ్వరః
వరం వరయ పద్మే ! త్వమిత్యాహ ప్రియయా సహ. 30
లజ్జయాధోముఖీమగ్రే స్థితాం మాం వీక్ష్య శంకరః
ప్రాహతే భవితా స్వామీ హరిర్నారాయణః ప్రభుః. 31

భా: శివార్చనచే సంతుష్టుడైన పరమేశ్వరుడు పార్వతితో గూడి ప్రత్యక్షమై వరముకోరుకొనుమని నన్నడిగెను. సిగ్గుతో నమ్రముఖియైన నన్ను చూచి పరమేశ్వరుడు విష్ణుమూర్తి నీకు భర్త కాగలడని పలికెను.

దేవో వా దానవో వాఽన్యో గంధర్వోవా తవేక్షణాత్
కామేన మనసా నారీ భవిష్యతి న సంశయః. 32
ఇతి దత్వా వరం సోమః ప్రాహ విష్ణ్వర్చనం యథా
తథాహం తే ప్రవక్ష్యామి సమాహితమనాః శృణు. 33

భా: దేవతలు గాని, దానవులుగాని, గంధర్వులు గాని కోరికతో నిన్ను చూచినయెడల నిస్సంశయముగ స్త్రీరూపము పొందగలరని వరమిచ్చి విష్ణుపూజ చేయువిధానము తెలిపెను. దానిని వివరించెదను, సావధానచిత్తుడవై వినుము.

ఏతాః సఖ్యో నృపాః పూర్వమాహూతా యే స్వయంవరే
పిత్రాధర్మార్థినా దృష్ట్వా రమ్యాం మాం యౌవనాన్వితామ్. **34**
స్వాగతాస్తే సుఖాసీనా వివాహకృతనిశ్చయాః
యువానో గుణవంతశ్చరూపద్రవిణసమ్మతాః. **35**

భా: యౌవనవతియగు నన్నుచూచి ధర్మపాలకుడగు నాతండ్రి స్వయంవరమునకు రాజులనందరిని ఆహ్వానించెను. రూప, సంపదలతో గూడిన గుణవంతులగు రాజులు నన్ను వివాహమాడవలెనను నిశ్చయము గలవారై స్వయంవర సభామంటపమునకు విచ్చేసి కూర్చొనిరి.

స్వయంవరగతాం మాంతే విలోక్య రుచిర ప్రభామ్
రత్నమాలా శ్రితకరాం నిపేతుః కామమోహితాః. **36**
తత ఉత్థాయ సంభ్రాంతాః సంప్రేక్ష్య స్త్రీత్వమాత్మనః
స్తనభారనితంబేన గురుణా పరిణామితాః. **37**

భా: రత్నమాలను హస్తమున గ్రహించి కాంతులు విరజిమ్ముచు స్వయంవర సభను ప్రవేశించిన నన్ను చూచి కామమోహితులయిన రాజులు భూమిమీద పడిరి. పిమ్మట లేచి స్తనభారనితంబముతో స్త్రీరూపమును పొందుటను చూచి ఆశ్చర్య చకితులైరి.

హ్రియా భియా చ శత్రూణాం మిత్రాణామతి దుఃఖదమ్
స్త్రీభావం మనసా ధ్యాత్వా మామేవానుగతాః శుక. **38**
పరిచర్యో హరరతాః సఖ్యః సర్వగుణాన్వితాః
మయా సహ తపో ధ్యానం పూజాం కుర్వంతి సమ్మతాః. **39**
**తదుదితమితి సంనిశమ్య కీరః శ్రవణసుఖం నిజమానసప్రకాశమ్**
**సముచితవచనైః ప్రతీక్ష్య పద్మా మురహరయజనం పునః ప్రచష్టే.** **40**

భా: ఓశుకమ! పిమ్మట రాజులందరు శత్రు మిత్రులందరికి మిక్కిలి దుఃఖము కల్గించు స్త్రీరూపమును తలచుకొనుచు సిగ్గుతో భయముతో సఖురాండ్రుగ నన్ను అనుసరించి.ి. విష్ణుభక్తులై సఖీభావమును పొంది సర్వగుణాన్వితులగు రాజులు నాతో కలసి విష్ణుపూజ, తపస్సు, ధ్యానమాచరించసాగిరి. శుక వచనములు మనస్సుకు అనురూపముగ శ్రవణసుఖమును కల్గించు పద్మావతి

వచనములను విని సంతుష్టుడైన శుకము విష్ణుపూజనుగూర్చి తిరిగిపలికెను.

ఇతి శ్రీ కల్కి పురాణేఽను భాగవతే
భవిష్యే శుకపద్మాసంవాదే
షష్ఠోఽధ్యాయః

ఇది భాగవతాను బంధము భవిష్యమునగు
శ్రీ కల్కి పురాణమున
శుకపద్మాసంవాదమను ఆరవఅధ్యాయము.



# కల్కి పురాణము
## ప్రథమాంశము--సప్తమ అధ్యాయము

శుక ఉవాచ......

విష్ణ్వర్చనం శివేనోక్తం శ్రోతుమిచ్ఛామ్యహం శుభే!
ధన్యాసి కృతపుణ్యాసి శివశిష్యత్వమాగతా. 1
అహం భాగ్యవశాదత్ర సమాగమ్య తవాంతికమ్
శృణోమి పరమాశ్చర్యం కీరాకారనివారణమ్. 2

భా: శుకము పలికెను. పద్మావతి! పరమేశ్వరునిచే చెప్పబడిన విష్ణుపూజావిధానమును నేను వినదలచితిని. శివునికి శిష్యురాలగుటవలన నీవు ధన్యురాలవు, ఎంతో పుణ్యముచేసినదానవు. నేను భాగ్యవశముచే నీ వద్దకు వచ్చితిని. మిక్కిలి ఆశ్చర్యకరము శుకరూపనివారకమునగు పూజావిధానమును వినెదను.

భగవద్భక్తి యోగం చ జపధ్యానవిధిం ముదా
పరమానందసందోహదాన దక్షం శ్రుతిప్రియమ్. 3

పద్మోవాచ.......

శ్రీవిష్ణోరర్చనం పుణ్యం శివేనపరిభాషితమ్
యచ్ఛ్రద్ధయానుష్ఠితస్య శ్రుతస్య గదితస్య చ. 4

భా: శ్రుతిమధురము, పరమానందదాయకమగు విష్ణు జపధ్యానవిధానమును భగవద్భక్తియోగమును ఆనందముతో వినెదను.

పద్మావతి పలికెను. శివునిచే చెప్పబడిన శ్రీవిష్ణుపూజావిధానము పుణ్యదాయకము. శ్రద్ధతో అనుష్ఠించినను, వినినపాపవిముక్తుడగును. చెప్పినవానికిని సర్వపాపములు నివృత్తమగును.

సద్యః పాపహరం పుంసాం గురుగోబ్రహ్మ ఘాతినామ్
సమాహితేన మనసా శృణు కీర యథోదితమ్. 5
కృత్వా యథోక్తకర్మాణి పూర్వాహ్నే స్నానకృచ్ఛుచిః
ప్రక్షాల్య పాణీ పాదౌచ స్పృష్ట్వాపః స్వాసనే వసేత్. 6

భా: ఓశుకమ ! గురు, గో, బ్రహ్మ హత్యవలన కల్గిన పాపమును వెంటనేపోగొట్టు విష్ణుపూజను సావధానచిత్తుడవై వినుము. ప్రాతఃకాలమున స్నానమాచరించి నిత్యకర్మల నాచరించి పిమ్మట పాణి పాదములను ప్రక్షాళనచేసుకొని జలమును స్పృశించి ( శిరమున చల్లుకొని ) తన ఆసనముమీదకూర్చొనవలెను.

**ప్రాచీముఖః సంయతాత్మా సాంగన్యాసం ప్రకల్పయేత్**
**భూతశుద్ధిం తతో ఉర్ఘ్యస్య స్థాపనం విధివచ్చరేత్.** 7
**తతః కేశవకృత్యాదిన్యాసేన తన్మయో భవేత్**
**ఆత్మానం తన్మయం ధ్యాత్వా హృదిస్థం స్వాసనే న్యసేత్.** 8

భా: మనస్సును నియంత్రించుకొని ప్రాచీముఖుడై అంగన్యాసమునుచేయవలెను. పిమ్మట భూతశుద్ధిని చేసి విధిపూర్వకముగ అర్ఘ్య స్థాపనము చేయవలెను. కేశవకృత్యాదిన్యాసముతో తన్మయుడై తనను విష్ణువుగ ధ్యానముచేసి హృదయమందలి రూపమును ఆసనమున న్యాసము చేయవలెను.

**పాద్యార్ఘ్యాచ మనీయాద్యైః స్నానవాసోవిభూషణైః**
**యథోపచారైః సంపూజ్య మూలమంత్రేణ దేశికః.** 9
**ధ్యాయేత్ పాదాదికేశాంతం హృదయాంబుజ మధ్యగమ్**
**ప్రసన్నవదనం దేవం భక్తాభీష్ట ఫలప్రదమ్.** 10

భా: దేశికుడు ( ఇచట పూజకుడు ) పాద్యము, అర్ఘ్యము, ఆచమనీయము, స్నానము, వస్త్రము, అలంకారము మున్నగు షోడ శోపచారములతో మూలమంత్రముతో పూజించవలెను. అనంతరము భక్తులకోరికలను తీర్చువాడు, ప్రసన్నవదనుడు, హృదయపద్మములయందు విహరించువాడగు దేవుని ఆపాదమస్తకము ధ్యానము చేయవలెను.

ఓం నమో నారాయణాయ స్వాహా

యోగేన సిద్ధవిబుధైః పరిభావ్యమానం లక్ష్మ్యాలయం
తులసికాంచిత భక్తభృంగమ్
ప్రోత్తుంగ రక్త నఖరాంగుళి పత్రచిత్రం గంగారసం
హరిపదాంబుజ మాశ్రయేఉహమ్. 11

భా. ధ్యానము చేసిన తరువాత ' ఓంనమో నారాయణాయ స్వాహా ' అని అనుకొని చెప్పబోవు స్తోత్రము చదువవలెను.

సిద్ధులు దేవతలు ధ్యానపూర్వకముగ సేవించు హరి పాదపద్మములను సేవింతును అని లక్ష్మీదేవికి నిలయమైనవి. వానిని భక్తులు తులసిపత్రములతో పూజింతురు. ఎత్తయిన ఎఱ్ఱని గోళ్లతో కూడిన అంగుళులు కలవి. అవి గంగచే సేవింపబడును. అట్టి హరి పాదపద్మ ములను నేను సేవించెదను. (దేవతలను పాదములనుండి మస్తకము వరకు; మానవులను శిరస్సు నుండి పాదములవరకు వర్ణించుట స్తుతించుట పంప్రదాయము.)

గుంఫన్మణి ప్రచయఘట్టిత రాజహంస
సించత్సునూపురయుతం పదపద్మవృంతమ్
పీతాంబరాంచల విలోల వలత్ పతాకం
స్వర్ణ త్రివక్త్ర వలయఞ్చ హరేః స్మరామి. 12

భా: మణి సముదాయముచే గ్రుచ్చబడి రాజహంసల వలె శబ్దముచేసెడి నూపురములతో కూడినవి, సువర్ణమయ త్రివక్త్రవలయమతో భాసించు శ్రీహరి పాదపద్మములను సేవించుచున్నాను. చరణములయందు పీతాంబరము యొక్క కదిలెడి అంచులు చంచలమగు పతాకమువలె ప్రకాశించుచున్నవి.

జంఘే సుపర్ణగలనీల మణిప్రవృద్ధే
శోభాస్పదారుణమణిద్యుతి చంచుమధ్యే
రక్తపాదతలలంబనశోభమానే
లోకేక్షణోత్సవకరే చ హరేః స్మరామి. 13

అవ: ఇందు విష్ణుమూర్తి యొక్క పిక్కలు వర్ణింపబడు చున్నవి.

భా: గరుత్మంతుని అధిరోహించినపుడు గరుత్మంతున కటు నిటునున్న శ్రీ విష్ణుమూర్తి యొక్క పిక్కలను వర్ణించు చున్నాడు. గరుత్మంతుని చాయ బంగరుచాయ. విష్ణువు రంగు నీలమేఘచ్ఛాయ. గరుత్మంతుని చంచువులు ఎర్రగా ఉండును. గరుత్మంతుని అధిరోహించినపుడు రెండు ప్రక్కల నున్న విష్ణుని పిక్కలు ఇంద్రనీల మణుల వలె నున్నవి. అట్టి ఇంద్రనీల మణుల కాంతులతో మెఱుగెక్కిన సూర్యకాంతి వలె గరుత్మంతుని చంచువు (ముక్కు) ఉన్నది. విష్ణుమూర్తి పాదములు క్రిందికి వ్రేలాడుచున్నవి. ఆ పాదములు లోకుల నయనములకు ఆనందదాయకము లగుచున్నవి. (సూర్యసమప్రభ) లతో కూడిన ఇంద్రనీలమణుల వలె జంఘలు ప్రకాశించుచున్నవని భావము.

తే జానునీ ఖగపతేర్భుజమూల సంగ
రంగోత్సవావృత తడిద్వసనే విచిత్రే
చంచత్పతత్రముఖనిర్గత సామగీత
విస్తారితాత్మ యశసీ చ హరేః స్మరామి. 14

భా : గరుత్మంతుని అధిరోహించిన విష్ణుమూర్తి మోకాళ్లను వర్ణించు చున్నాడు. విష్ణుమూర్తి మోకాళ్లు గరుత్మంతుని భుజములతో కలిసి యున్నవి. వానిపై భాగము రంగోత్సవాలంకారమునకై మెఱుపు వంటి వస్త్రముతో కప్పబడినది. గరుత్మంతుని ముఖము నుండి విష్ణుమూర్తి యశస్సనెడి సామగానము వినిపించు చున్నది. అట్టి విష్ణుమూర్తి జానువులను స్మరింతును.

విష్ణోః కటిం విధికృతాంతమనోజ భూమిం
జీవాండకోచగణ సంగదుకూలమధ్యామ్
నానాగుణప్రకృతి పీతవిచిత్రవస్త్రాం
ధ్యాయేన్నిబద్ధవసనాం ఖగపృష్ఠసంస్థామ్. 15

గరుత్మంతునిపై నున్న విష్ణుమూర్తి కటిభాగమును వర్ణించుచున్నాడు.

భా: విష్ణుమూర్తి కటిభాగము బ్రహ్మ, యముడు, మన్మథుడు అను వారికి ఆధారమయినది. శ్రేష్ఠ మయిన పట్టు వస్త్రము ధరించినది. నానాగుణములతో కూడిన ప్రకృతి అనెడి విచిత్ర వస్త్రమును ధరించినది. ఇట్టి విష్ణుమూర్తి జఘన భాగమును ధ్యానింతును.

శాతోదరం భగవతస్త్రివలి ప్రకాశ
మావర్తనాభివికసద్విధిజన్మపద్మమ్
నాడీనదీగణరసోత్థసితాంత్రసింధుం
ధ్యాయేఽండకోశనిలయం తనులోమరేఖమ్. 16

భా: త్రివళులచే ప్రకాశించునది, సుడితిరిగిన నాభినుండి వికసించిన, బ్రహ్మకు జన్మస్థానమగు పద్మముగలది, నాడులనెడు నదీగణము యొక్క రసమునుండి ఉత్థితమయిన స్వచ్ఛమయిన ప్రేగులనెడు సముద్రుడుగలది, బ్రహ్మాండమునకు ఆధారము, సూక్ష్మమైన రోమపంక్తిగలది అగు శ్రీహరి యొక్క దుఃఖనివారకమగు ఉదరమును ధ్యానించుచున్నాను.

వక్షః పయోధితనయాకుచకుంకుమేన
హారేణ కౌస్తుభమణిప్రభయా విభాతమ్

శ్రీవత్సలక్ష్మ హరిచందనజప్రసూన
మాలాచితం భగవతఃసుభగం స్మరామి. 17

భా: సముద్ర తనయ యగు లక్ష్మీదేవి కుచకుంకుమచే, కంఠహార, కౌస్తుభమణికాంతులచే శోభాయమానము, శ్రీవత్సమనెడి మచ్చగలది, హరి చందన వృక్ష పుష్పమాలచే విభూషితము మనోహరమగు శ్రీమహావిష్ణువు వక్షఃస్థలమును ధ్యానించెదను.

బాహూ సువేశసదనౌ వలయాంగదాది
శోభాస్పదౌ దురితదైత్య వినాశదక్షౌ
తౌ దక్షిణౌ భగవతశ్చ గదాసునాభ
తేజోర్జితౌ సులలితే మనసా స్మరామి. 18

భా: భక్తులకాధారభూతములు, వలయము అంగదము మున్నగు అలంకారములతో కూడిన, రాక్షససంహారమున సమర్ధములు, కౌమోదకియను గద, సుదర్శనమను చక్రములచే తేజస్సంపన్నములు, మనోహరములైన భగవంతుని దక్షిణబాహువులను ధ్యానించెదను.

వామౌ భుజౌ మురరిపోర్ధృత పద్మశంఖౌ
శ్యామౌ కరీంద్రకరవన్మణిభూషణాఢ్యౌ
రక్తాంగుళి ప్రచయచుంబిత జానుమధ్యౌ
పద్మాలయా ప్రియకరౌ రుచిరౌ స్మరామి. 19

భా: పద్మశంఖవములతో గూడినవి, గజరాజు తొండము వలె శ్యామవర్ణములు, మణిభూషణమనులతో ప్రకాశించునవి, మోకాళ్ళను తాకెడి రక్తాంగుళలతో శోభిల్లునవి, లక్ష్మీదేవికి ప్రీతి పాత్రములు, మనోహరములగు శ్రీహరి వామహస్తములను ధ్యానించెదను.

కంఠం మృణాలమమలం ముఖపంకజస్య
లేఖాత్రయేణ వనమాలికయా నివీతమ్
కిం వా విముక్తివశమంత్రక సత్ఫలస్య
వృంతం చిరం భగవతః సుభగం స్మరామి. 20

భా: ముఖమనెడి పద్మము యొక్క స్వచ్ఛమైన తామర తూడు, మూడుపేటల వనమాలచే విభూషితము, మోక్షసాధనమగు మంత్రరూప సత్ఫలమునకు తొడిమవంటిది, మనోహరమగు భగవంతుని కంఠమును స్మరించుచున్నాను.

వక్త్రాంబుజం దశనహాస వికాసరమ్యం
రక్తాధరౌష్ఠ వరకోమలవాక్ సుధాఢ్యమ్
సన్మానసోద్భవచలేక్షణ పత్రచిత్రం
లోకాభిరామమమలం చ హరేః స్మరామి. 21

భా: దంత కాంతులచే మందహాసముచే రమ్యము, రక్తాధర, ఓష్ఠ, కోమలవచనామృతములచే శోభితము, సత్పురుషుల మనస్సులను రంజింపజేయు చంచలనేత్రపత్రములతో చిత్రితము, సమస్త జనరంజకము, నిర్మలమగు శ్రీహరి ముఖపద్మమును స్మరించెదను.

సూరాత్మజావసథగంధవిదం సునాసం
భ్రూపల్లవం స్థితిలయోదయకర్మదక్షమ్
కామోత్సవంచ కమలాహృదయ ప్రకాశం
సంచింతయామి హరివక్త్రవిలాసదక్షమ్. 22

భా: యముని యింటిని వాసన పట్టు నాసిక కలదియు, సృష్టిస్థితిలయములకు సమర్థమైనవి, మనోభీష్టములను నెరవేర్చునవి, లక్ష్మీదేవి హృదయమున కానందాయకములు, శ్రీ మహావిష్ణువు ముఖపద్మమునశోభిల్లునవి, అగు శ్రీహరి భ్రూపల్లవములను ( కనుబొమలను) ధ్యానించెదను.

కర్ణౌ లసన్మకరకుండలగండలోలౌ
నానాదిశాఞ్చనభసశ్చ వికాసగేహౌ
లోలాలకప్రచయ చుంబనకుంచితాగ్రౌ
లగ్నౌ హరేర్మణి కిరీటతటే స్మరామి. 23

భా: కర్ణాభరణములగు మకరకుండలములచే ప్రకాశించెడి చెక్కిళ్ళుకలవి, నానాదిక్కులు, ఆకాశమండలము ప్రకాశమునకు కారణములు, చంచలమగు ముంగురుల చుంబనముచే వక్రత్వము నొందిన అగ్రభాగము గలవి, మణిమయకిరీటతటదేశమందు లగ్నమైన శ్రీహరి కర్ణములను ధ్యానించెదను.

భాలం విచిత్రతిలకం ప్రియాచారు గంధ
గోరోచనారచనయా లలనాక్షిసఖ్యమ్
బ్రహ్మైకధామమణికాంత కిరీటజుష్టం
ధ్యాయేన్మనయనహారకమీశ్వరస్య. 24

భా: మనోహరము సుగంధితమైన గోరోచనముచే తిలకధారణ చేయబడినది, విలాసవంతములగు నేత్రములతో సఖ్యతగలది, బ్రహ్మమునకు ముఖ్యస్థానము, మణిమయమగు కిరీటకాంతిచే ప్రకాశించునది, మనసును నేత్రములనాకర్షించునదగు భగవంతుని లలాటదేశమును స్మరించెదను.

శ్రీవాసుదేవచికురం కుటిలం నిబద్ధం
నానాసుగంధి కుసుమైః స్వజనాదరేణ
దీర్ఘం రమాహృదయగాశమనం ఘనంతం
ధ్యాయేఽంబు వాహరుచిరం హృదయాబ్జమధ్యే. **25**

భా: బహువిధసుగంధయుక్తపుష్పములతో భక్తజనము ప్రీతితో వాసుదేవుని తలవెంద్రుకలను జడగ చేయుచున్నారో, అట్టిదీర్ఘములైనవి, లక్ష్మీదేవి మనోవికారములను శాంతింపజేయునవి, గాలికి కదులునవి, మేఘునివలె మనోహరమైన శ్రీహరి చికురములను హృదయాంతరాళమున భావించెదను.

మేఘాకారం సోమసూర్యప్రకాశం
సుభ్రూన్నసం చక్రచాపైకమానమ్
లోకాతీతం పుండరీకాయతాక్షం
విద్యుచ్చేలం చాశ్రయేఽహం త్వపూర్వమ్. **26**

భా: మేఘసదృశుడు, సూర్యచంద్రులవలె ప్రకాశించువాడు శోభనములగు కనుబొమలు, ఉన్నతమగు నాసికకలవాడు, చక్రచాపయుక్తుడు, లోకాతీతుడు, పుండరీకమువంటి విశాలమయిన నేత్రములుగలవాడు, మెరుపులవలె శోభిల్లు పీతాంబరమును ధరించిన విష్ణువును భజించెదను.

దీనం హీనం సేవయా వేదవత్యా
పాపైస్తాపైః పూరితం మే శరీరమ్
లోభాక్రాంతం శోకమోహాదివిద్ధం
కృపాదృష్ట్యా పాహి మాం వాసుదేవ. **27**

భా: ఓ వాసుదేవ ! నేనుదీనుడను, వేదోక్తప్రకారముగ సేవించుటకు అసమర్థుడను. నాశరీరము పాపతాపములతో నిండినది. లోభము, శోకము, మోహము, మానసికవ్యాధులతో కూడిన నన్ను కృపాదృష్టితో రక్షించుము.

యే భక్త్యాద్య ధ్యాయమానాం మనోజ్ఞాం
వ్యక్తిం విష్ణోః షోడశశ్లోకపుష్పైః
స్తుత్వా నత్వా పూజయిత్వా విధిజ్ఞాః
శుద్ధా ముక్తా బ్రహ్మసౌఖ్యం ప్రయాంతి. 28

భా: మనోహరమగు భగవంతునిరూపమును భక్తిపూర్వకముగ ధ్యానించిపదహారు శ్లోకపుష్పములతో స్తుతించుచు నమస్కరించి అర్చించు భక్తులు బ్రహ్మానందమును పొందగలరు.

పఠితమిదం పుణ్యాం శివేన పరిభాషితమ్
ధన్యం యశస్యమాయుష్యం స్వర్గ్యం స్వస్త్యయనం పరమ్. 29
పఠంతి యే మహాభాగాస్తే ముచ్యంతేఽంహసాఽఖిలాత్
ధర్మార్థకామమోక్షాణాం పరత్రేహ ఫలప్రదమ్. 30

భా: శివప్రోక్తము పద్మావతి ఆచరించినది ఈస్తోత్రము. ఇది పుణ్యదాయకము. ఇది సంపదలను, యశస్సును ఆయువును , స్వర్గఫలమును, శభములను కలుగుచేయును. ఈస్తోత్రము నెవరు పఠించెదరో వారికిసకల పాపములు తొలగును. ధర్మార్థకామమోక్షములను కోరుభక్తులకు విష్ణుస్తోత్రము ఇహపరలోకములలో సమస్త ఫలములనిచ్చును.

ఇతిశ్రీ కల్కిపురాణేఽను భాగవతే
భవిష్యే హరిభక్తి వివరణం నామ
సప్తమోఽధ్యాయః

ఇది శ్రీ భాగతానుబంధము భవిష్యమునగు
శ్రీ కల్కి పురాణమున
హరిభక్తి వివరణమను ఏడవ అధ్యాయము.

★★★

# కల్కిపురాణము

## ద్వితీయాంశము - ప్రథమాధ్యాయము

సూత ఉవాచ......

ఇతి పద్మావచః శ్రుత్వా కీరోధీరః సతాం మతః
కల్కిదూతః సఖీమధ్యే స్థితాం పద్మామథాబ్రవీత్. 1
వద పద్మే సాంగపూజాం హరేరద్భుతకర్మణః
యామాస్థాయ విధానేన చరామి భువనత్రయమ్. 2

భా: సూతుడు పలికెను. సత్పురుషులచే పూజింపబడువాడు, ధీమంతుడు, కల్కిదూతయగు శుకముపద్మావతి మాటలను విని సఖురాండ్రనడుమ నున్న ఆమెతో ఇట్లు పలికెను. ఓపద్మావతి ! అద్భుతకర్మలను చేయుహరియొక్క సాంగపూజను చెప్పుము. విధిపూర్వకముగ అంగపూజనాచరించి ముల్లోకములను భ్రమించెదను.

పద్మోవాచ......

ఏవం పాదాదికేశాంతం ధ్యాత్వా తం జగదీశ్వరమ్
పూర్ణాత్మా దేశికో మూలం మంత్రం జపతి మంత్రవిత్. 3
జపాదనంతరం దండప్రణతిం మతిమాంశ్చరేత్
విష్వక్సేనాదికానాం తు దత్వా విష్ణునివేదితమ్. 4

భా: పద్మ పలికెను. మంత్రజ్ఞానము కల్గిన భక్తుడు పాదాదికేశాంతము జగదీశ్వరుని ధ్యానించి నిండుమనస్సు కలవాడై మూల మంత్రమును జపించవలెను. బుద్ధిమంతుడు జపము పిమ్మట దండప్రణామమువాచరించి ఉపచారములనాచరించి విష్ణువునకు నివేదనము చేయవలెను. ప్రసాదమును విష్వక్సేనాదుల కీయవలెను.

తత ఉద్వాస్య హృదయే స్థాపయేన్మనసా సహ
నృత్యన్ గాయన్ హరేర్నామ తం పశ్యన్ సర్వతః స్థితమ్. 5
తతః శేషం మస్తకేన కృత్వానైవేద్యభుగ్ భవేత్
ఇత్యేతత్కథితంకీర ! కమలానాథ సేవనమ్. 6

భా. పిమ్మట హృదయమందు ఉద్వాసన చెప్పి మానసికముగ స్నపనమును చేసి నృత్యగానములతో హరినామ సంకీర్తనజేయవలెను. తరువాత పూజించిన పుష్పమును శిరస్సున ధరించి నైవేద్యమును భుజించవలెను. ఓశుకమ! కమలాపతిని సేవించువిధమును (అంగపూజ) చెప్పియుంటిని.

సకామానాం కామపూరమకామామృతదాయకమ్
శ్రోత్రానందకరం దేవ-గంధర్వ-నర-హృత్ప్రియమ్. 7

శుక ఉవాచ .......

సమీరితం శ్రుతం సాధ్వి భగవద్భక్తి లక్షణమ్
త్వత్ప్రసాదాత్ పాపినో మే కీరస్య భువి ముక్తిదమ్. 8

భా: పూర్వోక్త ప్రకారముగ విష్ణుమూర్తి నర్చించుట వలనకోరికలు కల్గిన వారికోరికలు తీరును. నిష్కాములకు మోక్షములభించును. విష్ణు స్తోత్రము శ్రవణానందకరము, దేవగంధర్వ మానవుల హృదయరంజకము. శుకము పలికెను. ఓ సాధ్వి! శుకజన్మనెత్తిన పాపియగు నాకు నీఅనుగ్రహము వలన ముక్తిని కల్గించు నీవు చెప్పిన భగవద్భక్తిని బాగుగవింటిని.

కింతు త్వాం కాంచనమయీం ప్రతిమాం రత్నభూషితామ్
సజీవామివ పశ్యామి దుర్లభాం రూపిణీం శ్రియమ్. 9

నాన్యాం పశ్యామి సదృశీం రూపశీలగుణైస్తవ
నాన్యో యోగ్యో గుణీ భర్తా భువనేఽపి నదృశ్యతే. 10

భా: రత్నభూషితమైన కుందనపు బొమ్మ సజీవమైనట్లున్నావు. దుర్లభమయిన లక్ష్మి యొక్క రూపముగా నిన్ను భావించుచున్నాను. రూపశీల గుణ సంపన్నమగు నీతో సమానమయిన మరియొకరిని నేను చూడలేదు. విష్ణువుతో సమానమైన యోగ్యగుణములు కల్గిన నీకు భర్త కాగలిగిన మరియొకరు భూలోకమున లేరు.

కింతు పారే సముద్రస్య పరమాశ్చర్యరూపవాన్
గుణవానీశ్వరః సాక్షాత్ కశ్చిద్దృష్టోఽతి మానుషః. 11

నహి ధాతృకృతం మన్యే శరీరం సర్వసౌభగమ్
యస్య శ్రీవాసుదేవస్య నాంతరం ధ్యానయోగతః . 12

భా: కాని సముద్రమునకు సరిహద్దు దేశమున మిక్కిలి ఆశ్చర్యము గొలుపు రూపముగలవాడు, గుణవంతుడు, అతిక్రమించిన మానుషరూపము కల్గిన సాక్షాత్ ఈశ్వరునినేను చూచితిని. సర్వాంగ సుందరమగు శరీరమును బ్రహ్మసృష్టిగ నేను తలచుటలేదు. శ్రీ మహావిష్ణువుతో అతనికి ఎట్టి భేదము కన్పించుట లేదు.

త్వయా ధ్యాతం తు యద్రూపం విష్ణోరమితతేజసః
తత్ సాక్షాత్ కృతమిత్యేవ న తత్ర కియదంతరమ్. 13

పద్మోవాచ.....

బ్రూహి తన్మమ కిం కుత్ర జాతః కీర పరావరమ్
జానాసి తత్కృతం కర్మ విస్తరేణాత్ర వర్ణయ. 14

భా: అసమాన తేజస్సు కల యేవిష్ణురూపమును నీవు ధ్యానించితివో అట్టి రూపమును నేను చూచితిని. ఏమియు భేదము లేదు. అపుడు పద్మ ఇట్లనెను. శుకమా ! పరాత్పరుడగు పరమాత్మ ఎక్కడ జన్మించెనో చెప్పుము. నీకుతెలిసిన అతని కృత్యములను విస్తారముగ వివరింపుము.

వృక్షాదాగచ్ఛ పూజాం తే కరోమి విధిబోధితామ్
బీజపూరఫలాహారం కురు సాధు పయః పిబ. 15
తవ చంచుయుగం పద్మరాగాదరుణ ముజ్జ్వలమ్
రత్న సంఘట్టితమహం కరోమి మనసః ప్రియమ్. 16

భా: నీవు వృక్షమునుండి ఇక్కడకు రమ్ము. విధిపూర్వకముగ నిన్ను అర్చించెదను. బీజపూరఫలములను భుజించి పయస్సును త్రాగుము. పద్మరాగమణులకంటె ఎఱ్ఱనై, ప్రకాశించెడి నీ చంచువును ( ముక్కు ) రత్నములతో అలంకరించెదను.

కంధరం సూర్యకాంతేన, మణినా స్వర్ణఘట్టినా
కరోమ్యాచ్ఛాదనం చారు ముక్తాభిః పక్షతిం తవ. 17
పతత్రం కుంకుమేనాంగం సౌరభేణాతిచిత్రితమ్
కరోమి నయనానందదాయకం రూపమీదృశమ్. 18

భా: సువర్ణమయమగు సుర్యకాంతమణితో నీకంఠమును, మంచి ముత్యములతో రెక్కలను అలంకరించెదను. నీ రెక్కలును, శరీరమును, సుగంధయుక్త కుంకుమరాగముతో చిత్రితము చేసి నేత్రానందదాయమమగు రూపమును కల్పించెదను.

పుచ్ఛయచ్ఛమణి వ్రాత ఘర్ఘరేణాతిశబ్దితమ్
పాదయోర్నూపురాలాప లాపినం తాం కరోమ్యహమ్. 19
నవామృత కథావ్రాతత్యక్తాధిం శాధిమామిహ
సఖీభిః సంగతాభిస్తే కిం కరిష్యామి తద్వద. 20

భా: మనోహరముగ శబ్దము చేయునట్లు నీతోకను మణులతో అలంకరించెదను. నూపురధ్వనులు చేయునట్లు నీ పాదములను భూషించెదను. నీకథామృతమునాస్వాదించుటవలన సమస్త మానసికవ్యథలు దూరమయినవి. సఖురాండ్రతో కలసి నీకు నేనేమి చేయవలెనో ఆజ్ఞాపించుము.

ఇతి పద్మావచః శ్రుత్వా తదంతికముపాగతః
కీరోధీరః ప్రసన్నాత్మా ప్రవక్తు ముప చక్రమే. 21

కీర ఉవాచ....

బ్రహ్మణా ప్రార్థితః శ్రీశో మహాకారుణికో బభౌ
శంభలే విష్ణుయశసో గృహే ధర్మరిరక్షిషుః. 22

భా: పద్మావతి మాటలు వినిన శుకము ఆమెనుసమీపించి ప్రసన్నమనస్కుడై చెప్పుటకు ప్రక్రమించెను. శుకమిట్లు చెప్పెను. బ్రహ్మ శ్రీమహావిష్ణువును ప్రార్థించెను. అపుడతడు కరుణతో ధర్మరక్షణార్థము శంభలగ్రామమున విష్ణుయశు నింట జన్మించెను.

చతుర్భిః భ్రాతృభిః జ్ఞాతిగోత్రజైః పరివారితః
కృతోపనయనో వేదమధీత్య రామసన్నిధౌ. 23
ధనుర్వేదంచ గాంధర్వం శివాదశ్వమసిం శుకమ్
కవచం చ వరం లబ్ధ్వాశంభలం పునరాగతః. 24

భా: నలుగురుసోదరులు, జ్ఞాతులు, స్వగోత్రోద్భవులతో కూడిన అతడు ఉపనయన సంస్కారమైన పిమ్మట పరశురాముని వద్ద వేదాధ్యయనము చేసెను. ధనుర్వేదమును, గాంధర్వ వేదమును అధ్యయనముజేసి మహాదేవుని వలన అశ్వము, ఖడ్గము, శుకము, కవచములను వరముగ పొంది శంభల గ్రామమునకుతిరిగి వచ్చెను.

విశాఖయూపభూపాలం ప్రాప్య శిక్షావిశేషతః
ధర్మానాఖ్యాయ మతిమాన్ అధర్మాంశ్చ నిరాకరోత్. 25

ఇతి పద్మా తదాఖ్యానం నిశమ్య ముదితాననా
పసాపయామాస శుకం కల్కేః రానయనాదృతా
భూషయిత్వా స్వర్ణరత్నైస్తమువాచ కృతాంజలిః. 26

భా: విశాఖయూపభూపాలుని చేరి ధర్మబోధగావించి అధర్మములను పరిహరించెను. ఈవృత్తాంతమంతయు వినిన పద్మ ఆనందించినదై శుకుడు కల్కిని తీసుకువచ్చుటకు ఏర్పాటు గావించెను. సువర్ణరత్నములతో శుకమును అలంకరించి చేతులు జోడించి అతనితో ఇట్లు పలికెను.

పద్మోవాచ.......

నివేదితం తు జానాసి కిమన్యత్ కథయామ్యహమ్
స్త్రీభావభయభీతాత్మా యది నాయాతి స ప్రభుః. 27
తథాపి మేకర్మదోషాత్ ప్రణతిం కథయిష్యసి
శివేన యో వరో దత్తఃస మే శాపోఽభవత్ కిల. 28

భా: పద్మావతి పలికెను. నేను చెప్పదలచుకొన్నవిషయము నీకు తెలియనిది కాదు. నీకు నేనేమి నివేదించగలను. నాకర్మదోషములచే ప్రభువు ఇక్కడకురాకపోయినచో నానమస్కారములను చెప్పి శివుని వరము నాకు శాపము అయినట్లు తెలియజేయగలవు.

పుంసాం మద్దర్శనేనాసి స్త్రీభావం కామతః శుక
శ్రుత్వేతి పద్మామామంత్ర్య ప్రణమ్యచ పునః పునః. 29
ఉడ్డీయ ప్రయయౌ కీరః శంభలం కల్కిపాలితమ్
తమాగతం సమాకర్ణ్య కల్కిః పరపురంజయః. 30

భా: పురుషులుకామముతో నన్ను చూడగనే స్త్రీరూపము పొందుచున్నారు. పద్మవచనములను వినిశుకము పలుమార్లు ఆమెకు నమస్కరించి సెలవు తీసికొనెను. పిమ్మట ఆకాశమార్గమున ఎగురుచు కల్కిపాలితమగు శంభలగ్రామముచేరెను. శత్రుపుర ములను జయించు కల్కి శుకుని ఆగమనవార్త విని.........

క్రోడే కృత్వా తం దదర్శ స్వర్ణరత్న విభూషితమ్
సానందం పరమానందదాయకం ప్రాహ తం తదా. 31
కల్కిః పరమతేజస్వీ పరస్మిన్నమలం శుకమ్
పూజయిత్వా కరే స్పృష్ట్వా పయః పానేన తర్పయన్. 32

భా: శుకమును ఒడిలో కూర్చుండబెట్టుకుని స్వర్ణరత్న విభూషితుడగు అతనిని చూచి ఆనందముతో పలికెను. పరమతేజస్వియగు కల్కి దోషరహితుడగు శుకమును పూజించి చేతితో స్పృశించి జలమునిచ్చి తృప్తిపరచి.......

తన్ముఖే స్వముఖం దత్వా పప్రచ్ఛ వివిధాః కథాః
కస్మాద్దేశాచ్చరిత్వా త్వం దృష్ట్వాపూర్వం కిమాగతః. 33
కుత్రోషితః కుతో లబ్ధం మణికాంచనభూషణమ్
అహర్నిశం త్వన్మిలనం వాంఛితం మమ సర్వతః. 34
తవానాలోకనేనాసి క్షణం మే యుగవద్భవేత్. 35

భా: స్వయముగ ఎన్నో వృత్తాంతముల నడిగెను. ఏ యే దేశములలో తిరిగి ఏ యే అపూర్వ వస్తువులను చూచితివి. ఇంతవరకు ఎక్కడుంటివి ? ఈమణికాంచన భూషణము ఎట్లు లభించినది. అహోరాత్రులు, నిన్ను కలవవలెనని కోరితిని. నిన్ను చూడనిక్షణము నాకు యుగమగుచున్నది.

ఇతి కల్కేర్వచః శ్రుత్వా ప్రణిపత్య శుకో భృశమ్
కథయామాస పద్మాయాః కథాః పూర్వోదితా యథా. 36
సంవాదమాత్మనస్తస్యా నిజాలంకారధారణమ్. 37

భా: కల్కి మాటలు వినిన శుకము పలుమార్లు అతనికి నమస్కరించి పద్మావతికి సంబంధించిన పూర్వవృత్తాంతమును నివేదించెను. తనయెడల పద్మ వ్యవహారము ఇరువురి సంభాషణము తన అలంకార ధారణము సమస్తము నమస్కారపూర్వకముగ వివరించెను.

శ్రుత్వేతి వచనం కల్కిః శుకేన సహితో ముదా
జగామ త్వరితోఽశ్వేన శివదత్తేన తన్మనాః. 38
సముద్రపారమమలం సింహలం జలసంకులమ్
నానావిమానబహుళం భాస్వరం మణికాంచనైః. 39

భా: శుకవచనములు వినిన కల్కి సంతుష్టుడై అతనితోగూడ శివునిచే వరముగ నీయబడిన గుఱ్ఱము మీద వెంటనే బయలుదేరెను. సముద్రమునకు అవతలి భాగముననున్న సింహళము చుట్టూ జలముతో నిండియున్నది. బహు విధములగుభవనాములతో నిండిన ఆదేశము మణికాంచనములతో ప్రకాశించుచుండెను.

ప్రాసాదసదనాగ్రేషు పతాకా తోరణాకులమ్
శ్రేణీసభాపణాట్టాల పురగోపురమండితమ్. 40
పురస్త్రీపద్మినీ పద్మగంధామోద ద్విరేఫిణీమ్
పురీం కారుమతీం తత్ర దదర్శ పురతః స్థితామ్. 41

భా: సింహళద్వీపమున రాజభవన, గృహముల పైభాగమున పతాక తోరణములు శోభిల్లుచున్నవి. సభామంటపములు, విక్రయశాలలు, మేడలు, పురములు, పురవులుతో నగరములలంకృతమైయున్నది. కల్కి సింహళదీవమున కారుమతి అనుపేరుగల పురమును ప్రవేశించెను. అచ్చటి పద్మినీజాతి స్త్రీల పద్మగంధముచే భ్రమరములాకృష్టములగుచున్నవి.

మరాలజాల సంచాలర వలోల కమలాంతరామ్
ఉన్మీలితాబ్జమాలాలికలితాకులితం సరః. 42
జలకుక్కుటదాత్యూహ నాదితం హంససారసైః
దదర్శ స్వచ్ఛనయసాం లహరీలోల వీజితమ్ 43

భా: రాజహంసల సంచారముతో ఆసరస్సులలోని నీరుకల్లోలితమగుచున్నది. వికసించిన పద్మములయందు భ్రమర సముదాయము వ్యాపించియున్నవి. సరః ప్రదేశమున బాతులు, భరతపక్షులు, హంసలు, సారసపక్షులు ధ్వనిచేయుచున్నవి. స్వచ్ఛ జల తరంగముల నుండిచల్లని గాలులు వీచుచున్నవి. కల్కి అట్టి సరస్సులను చూచెను.

వనం కదంబకుద్దాల శాలతాలామ్రకేసరైః
కపిత్థాశ్వత్థఖర్జూర బీజపూరకరంజకైః. 44
పున్నాగపనసైర్నాగరంగైరర్జున శింశపైః
క్రముకైర్నాలికేలైశ్చ నానావృక్షైశ్చక శోభితమ్
వనం దదర్శ రుచిరం ఫలపుష్పదలావృతమ్. 45
దృష్ట్వా హృష్టతనుః శుకం సకరుణః కల్కిః పురాంతే వనే
ప్రాహ ప్రీతికరం వచోఽత్ర సరసి స్నాతవ్యమిత్యాదృతః
తచ్ఛ్రుత్వా వినయాన్వితః ప్రభుమతం యామీతి పద్మాశ్రమం
తత్సందేశమిహ ప్రయాణమధునా గత్వాస కీరోఽవదత్. 46

భా: కదంబ, కుద్దాల ( ఎఱ్ఱకాంచనము ), శాల, ఆమ్ర, కేసర, కపిత్థ, అశ్వత్థ, ఖర్జూర, బీజపూర, కరంజక, (కానుగుచెట్టు) పున్నాగ, పనస, నాగరంగ ( నారింజ ), అర్జున, శింశప,

క్రముక, నారికేలాది బహువిధ వృక్షములతో శోభితము, ఫల, పుష్ప, పత్ర వ్యాప్తమగు మనోహర వనమును కల్కి చూచి సంతసించెను. సరస్సులు వనములతో గూడిన కారుమతీ పుర శోభను వీక్షించి పులకితుడై కల్కి పుర సమీపమందలి సరోవరమున స్నానమాచరించెదమని ప్రీతిపాత్రములగు వచనములను పలికెను. అదివిని వినయసంపన్నుడగు శుకము ప్రభువు యొక్క అంతరార్థమును తెలుసుకొని పద్మావతి ఆశ్రమమునకు వెళ్ళెదనని పలికెను. పిమ్మట అతడు పద్మావతిని చేరి విషయమంతయు వివరించెను.

**ఇతి శ్రీ కల్కిపురాణేఽను భాగవతే భవిష్యే ద్వితీయాంశే**
**కల్కేరాగమన వర్ణనం నామ**
**ప్రథమోఽధ్యాయః**

**ఇది భాగవతాను బంధము భవిష్యమునగు**
**శ్రీ కల్కి పురాణమున**
**ద్వితీయాంశమున కల్కి ఆగమన వర్ణనము అను**
**ప్రథమాధ్యాయము.**



# కల్కి పురాణము

## ద్వితీయాంశము - ద్వితీయాధ్యాయము

సూత ఉవాచ......

కల్కిః సరోవరాభ్యాసే జలాహరణవర్త్మని
స్వచ్ఛస్ఫటికసోపానే ప్రవాలాచితవేదికే. 1
సరోజసౌరభవ్యగ్రభ్రమద్భ్రమరనాదితే
కదంబపోతపత్రాలి వారితాదిత్యదర్శనే. 2
సముపాసాసనే చిత్రే సదశ్వేనావతారితః
కల్కిః ప్రస్థాపయామాస శుకం పద్మాశ్రమం ముదా. 3

భా: కల్కి భగవానుడు కారుమతీపురము ప్రవేశించి సరోవరసమీపమున జలాహరణమార్గమున గుఱ్ఱమునుండి దిగి ప్రవాళములచే అలంకరింపబడిన వేదికపై కూర్చొని శుకుని పద్మావతి ఆశ్రమమునకు పంపెను. సరోవరమున స్ఫటికమయమగు మెట్లు గలవు. పద్మగంధమందు వ్యగ్రమైన తుమ్మెదలు మనోహరముగ శబ్దము చేయుచున్నవి. సమీపమున కదంబ వృక్షములు దట్టముగనుండి సూర్యకిరణముల నడ్డుకొనుచున్నవి.

సనాగేశ్వరమధ్యస్థః శుకో గత్వా దదర్శ తామ్
హర్మ్యస్థాం బిసినీపత్రశాయినీం సఖీభిర్వృతామ్. 4
నిఃశ్వాసవాతతాపేన మ్లాయతీం వదనాంబుజమ్
ఉత్క్షిపంతీం సఖీదత్తకమలం చందనోక్షితమ్. 5

భా: శుకము పద్మావతి నిలయమునకు వెళ్ళి అచ్చట నాగకేసర వృక్షమున కూర్చొని హర్మ్యమందు తామరతూళ్ళ పక్కయందు శయనించిన పద్మావతిని చూచెను. ఆమె చుట్టూ సఖురాండ్రు చేరి విరహోపచారములు చేయుచుండిరి. నిఃశ్వాసల వేడిమిచే ముఖపద్మము వాడిపోవుచున్నది. సఖి ఇచ్చిన చందనయుక్త పద్మమును పద్మ విసరివేయుచున్నది.

రేవావారిపరిస్నాతం పరాగాస్యం సమాగతమ్
ధృతనీరం రసగతం నిందంతీం పవనం ప్రియమ్. 6

శుకః సకరుణః సాధు వచనైస్తా మతోషయత్
సా త్వమేహ్యాహి తే స్వస్తి స్వాగతం స్వస్తి మే శుభే. 7

భా: రేవానదిమీదుగ వచ్చు సుగంధయుక్తమగు వాయువు అందరికి ఆహ్లాదమును కల్గించునదైనను విరహిణియగు పద్మకు తాపము కల్గించుటచే దానిని నిందించుచున్నది. విరహిణియగు పద్మను దయార్ద్రహృదయుడగు శుకము ప్రియవచనములతో సాంత్వనపరచెను. పద్మ శుకమును ఆహ్వానించి కుశలమడుగగ మేమందరము క్షేమ మని సమాధానము చెప్పెను.

గతే త్వయ్యతివ్యగ్రాహం శాంతిస్తేఽస్తు రసాయనాత్
రసాయనం దుర్లభం మే, సులభం తే శివాశ్రమే. 8
క్వమే భాగ్యవిహీనాయా ఇహైవ వరవర్ణిని
దేవి ! తం సరసస్తీరే ప్రతిష్ఠా ప్యాగతా వయమ్. 9

భా: పద్మావతి శుకముతో నీవు వెడలినప్పటి నుండి మిక్కిలి వ్యాకులతను చెందియుంటి నని పలికెను. అంతట శుకము రసాయనము వలన నీతాపము దూరమై శాంతి లభించునని పలికెను. రసాయనము నాకు దుర్లభమని పద్మ పలుకగ నీకు రసాయనము శివాశ్రమములో దొరకు నని శుకము సమాధానపరచెను. మందభాగ్యురాలగు నాకు అంత అదృష్టమెక్కడిది? అన్నది పద్మ. శుకము నీ మనోభీష్టము ఇచ్చుటనే నెరవేరును. నేను సరోవరతీరమున వారిని ఉంచి వచ్చితినని చెప్పెను.

ఏవమన్యోన్య సంవాద ముదితాత్మమనోరథే
ముఖం ముఖేన నయనం నయనే సాదృతా దదౌ. 10
విమాలా మాలినీ లోలా కమలా కామకందలా
విలాసినీ చారుమతీ కుముదేత్యష్టనాయికాః. 11

భా: పద్మ శుకముల పరస్పర సంవాదముచే తనమనోరథము సిద్ధించుచున్నదని తెలుసుకుని ఆపద్మావతి మిక్కిలి సంతసించెను. శుకమును ఆసక్తితోచూచెను. విమల, మాలిని, లోల, కమల. కామకందల , విలాసిని, చారుమతి, కుముద అను ఎనమండుగురు నాయికలు పద్మావతికి చెలికత్తెలు.

సఖ్యః ఏతా మతాస్తాభిర్జలక్రీడార్థముద్యతా
పద్మా ప్రాహ సరస్తీరమాయాస్త్వేతా మయా స్త్రియః. 12

ఇత్యాఖ్యాయాశు శిబికామారుహ్యా పరివారితా
సఖీభిశ్చారువేశాభిర్యాత్వా స్వాంతఃపురాద్బహిః
ప్రయౌ త్వరితం ద్రష్టుం భైష్మీ యదుపతిం యథా. 13

భా: తన చెలికత్తెలతో జలక్రీడకు పద్మ బయలుదేరెను. సరోవరతీరమునకు రమ్మని ఆమె తన సఖురాండ్రకు చెప్పి పల్లకి యెక్కి పరివారముతో తన అంతఃపురమునుండిబయటకు వచ్చెను. కృష్ణుని చూచుటకు రుక్మిణి వలె కల్కిని చూచుటకు పద్మ శీఘ్రముగ బయలుదేరెను.

జనాః పుమాంసః పథి యే పురస్థాః
ప్రదుద్రువుః స్త్రీత్వభయాద్దిగంతరమ్
శృంగాటకే వా విపణి స్థితా యే
నిజాంగనా స్థాపిత పుణ్యకార్యాః. 14
నివారితాం తాం శిబికాం వహంత్యో
నార్యోఽతిమత్తా బలవత్తరాశ్చ
పద్మా శుకోక్త్యా తదుపర్యుపస్థా
జగామ తాభిః పరివారితాభిః. 15

భా: పద్మావతి వెడలు మార్గమున పురుషులందరు స్త్రీలుగ మారుదుమను భయముతో పారిపోయిరి. వారి స్త్రీలు తమభర్తలను ఆపదలనుండి తప్పించుటకు పుణ్యకర్మలాచరించిరి.పురుష సంపర్కములేని మార్గమున బలశాలుల గు స్త్రీలు పల్లకి మోయ, పద్మావతి అందు కూర్చొని సఖురాండ్ర తో వెడలెను.

సరోజలం సారసహంసనాదితం
ప్రఫుల్ల పద్మోత్పలరేణు వాసితమ్
చేరుర్విగాహ్యాశు సుధాకరాలసాః
కుముద్వతీనా ముదయాయ శోభనాః. 16
తాసాం ముఖామోద మదాంధభృంగా
విహాయ పద్మాని ముఖారవిందే
లగ్నాః సుగంధాధికమాకలయ్య
నివారితాశ్చాపి న తత్యజుస్తే. 17

భా: పిమ్మట వారందరు సారస, హంసల ధ్వనితో గూడిన, వికసించిన పద్మముల

గంధముచే సువాసనగ చేయబడిన సరోవరజలమును ప్రవేశించి కుముద బాంధవుడగు చంద్రుని రాకను నిరీక్షించిరి. ముఖపద్మముల సుగంధముచే ఉన్మత్తమయిన తుమ్మెదలు, నివారింపబడినను అవి వారిని విడిచిపెట్టుటలేదు.

హాసోపహాసైః సరసప్రకాశైర్వాద్యైశ్చ నృత్యైశ్చ జలే విహారైః
కరగ్రహైస్తా జలయోధనార్తా శ్చకర్ష తాభిర్వనితాభి రుచ్చైః. **18**
సా కామ తప్తా మనసా శుకోక్తిం వివిచ్య పద్మా సఖిభిః సమేతా
జలాత్ సముత్థాయ మహార్హభూషా జగామ నిర్దిష్టకదంబషండమ్. **19**

భా: పద్మ సరసవచనములు, హాసోపహాసములు, వాద్యము నృత్యము, జలవిహారము లతో చేతులు పట్టుకొని నీటిలో ఈదులాడుచు సఖురాండ్రనాకర్షించెను. వారిచే పద్మ మనస్సుకూడ హరింపబడెను. కామసంతప్తురాలగు పద్మ శుకుని మాటలను మనస్సున ధ్యానించుచు సఖురాండ్రతోకూడి జలమునుండి పైకి వచ్చి విలువైన ఆభరణములు కలదై శుకము చెప్పిన కదంబ ప్రదేశము చేరెను.

సుఖే శయానం మణివేదికాగతం కల్కిం పురస్తా దతి సూర్య వర్చసమ్
మహామణివ్రాత విభూషణాచితం శుకేన సార్ధం తముదైక్షతేశమ్. **20**
తమాలనీలం కమలాపతిం ప్రభుం
పీతాంబరం చారుసరోజలోచనమ్
ఆజానుబాహుం పృథుపీనవక్షసం
శ్రీసత్ కౌస్తుభకాంతిరాజితమ్. **21**
తదద్భుతం రూపమవేక్ష్య పద్మా
సంస్తంభితా విస్మృత సత్క్రియార్థా
సుప్తం తు సంబోధయితుం ప్రవృత్తం
నివారయామాస విశంకితాత్మా. **22**

భా: అచ్చట ఎదురుగ మణిమయ వేదికయందు సుఖముగ శయనించిన, సూర్యతేజస్సును మించిన తేజస్సుగల, మహామణి భూషణములతో అలంకృతమైన కల్కి భగవానుని శుకముతో కూడిపద్మ చూచెను. తమాలవృక్షము వలె శ్యామ వర్ణుడు, పీతాంబరధారి, కమలనేత్రుడు, ఆజానుబాహువు, విశాలమై, బలిసిన వక్షఃస్థలము గలవాడు, శ్రీవత్స కౌస్తుభమణులతో ప్రకాశించు శ్రీహరి అద్భుతరూపమునుచూచి పద్మ ఆశ్చర్యచకితురాలై ఉచితసత్కారమును

మరచెను. నిద్రించు కల్కిని మేల్కొలుపు శుకమును గూడ శంకితహృదయయై వారించెను.

**కదాచిదేషో౽తిబలో౽తిరూపీ మద్దర్శనాత్ స్త్రీత్వముపైతి సాక్షాత్**
**తదాత్ర కిం మే భవితా భవస్య వరేణ శాపప్రతిమేన లోకే. 23**
**చరాచరాత్మా జగతామధీశః ప్రబోధితస్తద్ధృదయం వివిచ్య**
**దదర్శ పద్మాం ప్రియరూపశోభాం యథా రమా శ్రీమధుసూదనాగ్రే. 24**

భా: మహాబలుడు, రూపవంతుడగు ఇతడు నన్ను చూచుటవలన స్త్రీరూపమును పొందగలడు. నావలన వరులందరు స్త్రీలుగ మారుచున్న పరమేశ్వరుని వరమువలన నాకేమి ప్రయోజనము? చరాచర (మిక్కిలి తిరుగు స్వభావముగల మనుష్యుల ) రూపముగల జగదీశ్వరుడగు కల్కి పద్మ హృదయము తెలుసుకొని మేల్కొని శ్రీమహావిష్ణువు ఎదుట లక్ష్మీదేవి వలె రూపవతియగు పద్మావతిని తన ఎదుట చూచెను.

**సంవీక్ష్య మాయామివ మోహినీం తాం జగాద కామాకులితః స కల్కిః**
**సఖీభిరీశాం సముపాగతాం తాం కటాక్షవిక్షేప వినామితాస్యామ్. 25**
**ఇహైహి సుస్వాగతమస్తు భాగ్యాత్ సమాగమస్తే కుశలాయ మే స్యాత్**
**తవాననేందుః కిల కామపూరతాపాపనోదాయ సుఖాయ కాంతే. 26**

భా: సఖురాండ్రతో అక్కడకేతెంచిన, కటాక్షవిక్షేపముచే అధోముఖియైన మోహినియగు పద్మావతిని మాయను వలె వీక్షించి కామ సంతప్తుడగు కల్కి ఇట్లు పలికెను. ఓ కాంత ! దగ్గరకు రమ్ము. నీకుస్వాగతము. భాగ్యముచే కల్గిన నీసమాగమము నాకు మంగళ హేతువు కాగలదు. నీముఖ చంద్రుడు తాపమును దూరముజేసి నాకు సుఖమును కలుగజేయగలడు.

**లోలాక్షి ! లావణ్య రసామృతంతే కామాహిదష్టస్య విధాతురస్య**
**తనోతు శాంతిం సుకృతేన కృత్యా సుదుర్లభాం జీవనమాశ్రితస్య. 27**
**బాహూ త్వదైతౌ కురుతాం మనోజ్ఞౌ హృది స్థితం కామముదంతవాసమ్**
**చార్వాయతౌ చారనఖాంకుశేన ద్విపం యథా సాదివిదీర్ణకుంభమ్. 28**

భా: ఓ చంచలాక్షి ! మన్మథుడను విషసర్పముచే కాటువేయబడిన జగత్పతి యగు నాకు సత్కర్మలచే కూడ దుర్లభమగుశాంతిని నీలావణ్య రూపామృతముకలుగజేయుగాక. నఖము లనెడి అంకుశము మదపుటేనుగు కుంభస్థలమును చీల్చినట్లు రమణీయము, దీర్ఘములగు నీబాహువులు హృదయమందు నివసించెడి మన్మథుని పారద్రోలుగాక.

స్తనావిమావుత్థితమస్తకౌ తే
కామప్రతోదావివ వాససాక్తౌ
మమోరసా భిన్ననిజాభిమానౌ
సువర్తులౌ వ్యాదిశతాం ప్రియం మే . 29
కాంతస్యసోపానమిదం వలిత్రయం
సూత్రేణ లోమావలి లేఖలక్షితమ్
విభాజితం వేది విలగ్నమధ్యమే !
కామస్య దుర్గాశ్రయమస్తు మే ప్రియమ్. 30

భా: వస్త్రముచే కప్పబడినవి, తలెత్తిన అగ్రభాగము గలవి, మన్మథుని ఆయుధములవంటివి వర్తులాకారములగు స్తనములు నాహృదయ సంబంధముచే తొలగిన నిజాభిమానము గలవై నామనోవాంఛను తీర్చగలవు. ఓకృశోదరి ! రోమరేఖలతో గూడిన వలిత్రయము ప్రియుని రాకకు సోపానమార్గము. మన్మథునికి దుర్గము ఆశ్రయమునైన త్రివలి నాకు ప్రియము కలుగజేయుగాక.

రంభోరు ! సంభోగసుఖాయ మే స్యా
న్నితంబ బింబం పులినోపమం తే
తన్వంగి ! తన్వంశుక సంగశోభం
ప్రమత్తకామావిమదోద్యమాలమ్. 31
పాదాంబుజం తేऽంగుళిపత్రచిత్రితం
వరం మరాలక్వణనూపురావృతమ్
కామాహిదష్టస్య మమాస్తు శాంతయే
హృదిస్థితం పద్మఘనే సుశోభనే. 32

భా: ఓ రంభోరు ! పులినసదృశమగు నీనితంబబింబము మాకు సంభోగసుఖము కలుగజేయుగాక. ఓతన్వంగి ! సూక్ష్మవస్త్రముచే కప్పబడిన హృద్యమగు నితంబదేశము కామోద్దీపకము. అంగుళి రూపపత్రములచే చిత్రవర్ణముగ చేయబడినవి. హంసల వలెనాదము జేయు నూపురములతోగూడినరమణీయములగు హృదయ పాదపద్మములు మన్మథుడను విషసర్పముచే కాటువేయబడిన నాకు ఉపశమనము కల్గించుగాక.

శ్రుత్వైతద్వచనామృతం కలికుల ధ్వంసస్య కల్కేరలం
దృష్ట్వా సత్పురుషత్వమస్య ముదితా పద్మా సఖీభిర్వృతా
కాంతం క్లాంతమనా కృతాంజలి పుటా ప్రోవాచ తత్సాదరం
ధీరం ధీరపురస్కృతం నిజపతిం నత్వా నమత్కంధరా. **33**

భా: కలికులనాశకుడగు కల్కియొక్క అమృత తుల్యములగు వచనములను విని, సత్పురుష లక్షణములను వీక్షించి పద్మ మిక్కిలి సంతోషించెను. సఖురాండ్రతో కూడిన ఆమె వ్యగ్రమనస్కురాలై తనప్రభువుకు శిరస్సు వంచి నమస్కరించి చేతులు జోడించి ఆదరపూర్వకముగ మెల్లమెల్లగ ఇట్లు పలికెను.

ఇతి శ్రీకల్కిపురాణే ఽనుభాగవతే భవిష్యే
పద్మా కల్కి సాక్షాత్సం వాదో నామ
ద్వితీయోఽధ్యాయః

ఇది భాగవతానుబంధము భవిష్యము నగు
శ్రీకల్కి పురాణమున
పద్మాకల్కి సాక్షాత్సంవాదము అను
రెండవ అధ్యాయము.



# కల్కి పురాణము

## ద్వితీయాంశము - తృతీయాధ్యాయము

సూత ఉవాచ.....

సా పద్మా తం హరిం మత్వా ప్రేమగద్గదభాషిణీ
తుష్టావ వ్రీడితా దేవీ కరుణా వరుణాలయమ్. 1
ప్రసీద జగతాం నాథ ! ధర్మ వర్మన్! రమాపతే !
విదితోఽసి విశుద్ధాత్మన్ ! వశగాం త్రాహి మాం ప్రభో. 2

భా: సూతుడు పలికెను. పద్మావతి కల్కిని సాక్షాత్ శ్రీహరిగ తెలుసుకొని సిగ్గుపడి , ప్రేమచే గద్గదమైన మాటలు కలదై కరుణాసాగరుని స్తోత్రము చేసెను. ఓరమాపతీ! జగన్నాథ! ధర్మరక్షక ! నన్ను అనుగ్రహింపుడు. విశుద్ధాత్మ ! నిన్ను నేను తెలుసికొంటిని. శరణాగతురాలగు నన్ను రక్షించుము.

ధన్యాహం కృతపుణ్యాహం తపోదానజపవ్రతైః
త్వాం ప్రతోష్య దురారాధ్యం లబ్ధం తవ పదాంబుజమ్. 3
ఆజ్ఞాంకురు పదాంభోజం తవ సంస్పృశ్య శోభనమ్
భవనం యామి రాజానమాఖ్యాతుం స్వాగతం తవ. 4

భా: నేను ధన్యురాలను. పుణ్యవతిని. తపస్సు, దానము, జపము, వ్రతములచే నిన్నుసంతోషపరచి ఆరాధించుటకు దుర్లభ మగు నీ పాదపద్మములను పొందితిని. నన్ను ఆజ్ఞాపించుడు. శోభనములగు పాద పద్మములను స్పృశించి ఇంటికి వెడలి తమ రాకను మహారాజునకు నివేదించగలను.

ఇతి పద్మా రూపసద్మా గత్వా స్వపితరం నృపమ్
ప్రోవాచాగమనం కల్కేర్విష్ణోరంశస్య దౌత్యకైః. 5
సఖీముఖేన పద్మాయాః పాణిగ్రహణకామ్యయా
హరేరాగమనం శ్రుత్వా సహర్షోఽభూద్ బృహద్రథః. 6

భా: అనుపమసౌందర్యవతియగు పద్మావతి తన తండ్రి దగ్గరకు వెడలి దూతద్వారా విష్ణువు అవతారమగు కల్కి యొక్క ఆగమనవార్తను తెలియజేసెను. పద్మను వివాహమాడవలయునను కోరికతో హరి వచ్చిన వార్తను సఖి వలన వినిన బృహద్రథుడు మిక్కిలి సంతోషించెను.

పురోధసా బ్రాహ్మణైశ్చ పాత్రైర్మిత్రైః సుమంగళైః
వాద్యతాండవగీతైశ్చ పూజాయోజనపాణిభిః. 7
జగామానయితుం కల్కిం సార్థం నిజజనైః ప్రభుః
మండయిత్వా కారుమతీం పతాకాస్వర్ణతోరణైః. 8

భా: బృహద్రథుడు పురోహిత, బ్రాహ్మణ, పరిజన, మిత్రులతోకూడి పూజాసామగ్రిని తీసుకొని మంగళప్రదములగు వాద్యతాండవగీతములతో కల్కిని తీసుకువచ్చుటకు బయలుదేరెను. కారుమతీనగరము స్వర్ణమయతోరణములతో అలంకరింపబడినది.

తతో జలాశయాభ్యాసం గత్వా విష్ణుయశస్సుతమ్
మణివేదికయాసీనం భువనైకగతిం పతిమ్. 9
ఘనా ఘనోపరి యథా శోభంతే రుచిరాణ్యహో
విద్యుదింద్రాయుధాదీని తథైవ భూషణాన్యుత. 10

భా: పిమ్మట రాజు జలాశయ సమీపమునకు వెళ్ళి మణిమయ వేదికపై ఆసీనుడైన జగత్పతియగు విష్ణుయశస్సు పుత్రుని చూచెను. వర్షాకాలపు మేఘములపై మెరుపులవలె మేఘశ్యాముని శరీరము మీద మనోహరములగు ఆభరణములు ప్రకాశించుచున్నవి.

శరీరే పీతవాసాగ్రఘోరభాసా విభూషితమ్
రూపలావణ్యసదనే మదనోద్యమనాశనే. 11
దదర్శ పురతో రాజా రూపశీలగుణాకరమ్
సాశ్రుః సపులకః శ్రీశం దృష్ట్వాసాధు తమర్చయత్. 12

భా: పీతాంబరాగ్రభాగము యొక్క ఉత్కటమగు కాంతిచే భూషితమగుశరీరము కలవాడు, రూపలావణ్యనిధి, మదనప్రయత్ననాశకుడు రూపశీలగుణ సంపన్నుడగు కల్కి భగవానుని ఎదురుగ చూచి రాజు ఆనందబాష్పములతో పులకితుడై విధిపూర్వకముగ అతనిని పూజించెను.

జ్ఞానాగోచరమేతన్మే తవాగమనమీశ్వర !
యథా మాంధాతృపుత్రస్య యదునాథేన కాననే. 13

ఇత్యుక్త్వా తం పూజయిత్వా సమానీయ నిజాశ్రమే
హర్మ్యప్రాసాద సంబాధే స్థాపయిత్వా దదౌ సుతామ్. 14

భా: ఓ ప్రభు! అడవులలో మాంధాతృపుత్రునికి యదునాథ సమాగమము వలె తమరాక నా కొఱకు జ్ఞానగోచరము అగుటలేదని పలికి రాజు అతనిని యథోచితముగ పూజించి హర్మ్యప్రాసాదశోభితమగు తన నివాసమునకు తీసుకువెళ్ళి కన్యాదాన మొనర్చెను.

పద్మాం పద్మపలాశాక్షీం పద్మనేత్రాయ పద్మినీమ్
పద్మజాదేశతః పద్మనాభాయాదాద్యథాక్రమమ్. 15

కల్కిర్లబ్ధ్వా ప్రియాం భార్యాం సింహలే సాధుసత్కృతః
సమువాస విశేషజ్ఞః సమీక్ష్య ద్వీపముత్తమమ్. 16

భా: బృహద్రథుడు బ్రహ్మ ఆదేశానుసారము పద్మదలాక్షియగు పద్మను పద్మనేత్రుడగు పద్మనాభునకు యథానియమము సమర్పించెను. ప్రియమయిన భార్యను పొందిన బుద్ధిమంతుడగు కల్కి బాగుగ సత్కరింపబడినవాడై సింహళద్వీపమును ఉత్తమస్థానముగ నెంచి కొంతకాలమక్కడ నివసించెను.

రాజానః స్త్రీత్వమాపన్నాః పద్మాయాః సఖితాంగతాః
ద్రష్టుం సమీయుస్త్వరితాః కల్కిం విష్ణుం జగత్పతిమ్. 17

తాః స్త్రియోఽపి తమాలోక్య సంస్పృశ్య చరణాంబుజమ్
పునః పుంస్త్వం సమాపన్నా రేవాస్నానాత్తదాజ్ఞయా. 18

భా: స్త్రీరూపమునొంది పద్మకు సఖురాండ్రయిన రాజులు జగత్పతియగు కల్కిని చూచుటకు మిక్కిలి శీఘ్రముగ వచ్చిరి. వారు కల్కి భగవానుని చూచి చరణకమలములను స్పృశించి, హరి ఆదేశానుసారము రేవానదిలో స్నానమాచరించిరి. వెంటనే వారు స్త్రీరూపమును విడిచి పురుషులుగ మారిరి.

పద్మా కల్కీ గౌరకృష్ణౌ విపరీతాంతరావుభౌ
బహిః స్ఫుటౌ నీల పీత వాసో వ్యాజేన పశ్యతు. 19

దృష్ట్వా ప్రభావం కల్కేస్తు రాజానః పరమాద్భుతమ్
ప్రణమ్య పరయా భక్త్యా తుష్టువుః శరణార్థినః. 20

భా: పద్మావతి గౌరవర్ణము, కల్కి నీలవర్ణము రెండును పరస్పరము విపరీతములే అయినను పద్మయొక్క నీలాంబరము, కల్కి పీతాంబరముల బాహ్య వర్ణములు పరస్పరము సమన్వయము

చేయుచున్నవా యన్నట్లుండెను. కల్కి యొక్క అద్భుతప్రభావమును చూచిన రాజులు అతనిని శరణుపొంది భక్తిపూర్వకముగ నమస్కరించి స్తుతించిరి.

**జయజయ నిజమాయయా కల్పితాశేష విశేష కల్పనా పరిణామ! జలాప్లుత లోకత్రయోపకరణమాకలయ్యామనుమనిశమ్య పూరితమవిజనా విజనా విఖ్యాతమహా మీనశరీర ! త్వం నిజకృత ధర్మసేతుసంరక్షణ కృతావతారః.** **21**

భా: రాజు ఇట్లు పలికెను. ఓదేవ ! నీకు జయమగుగాక. నిజమాయాశక్తిచే లోకమున అనేక కల్పములు, పరిణామములు జరుగుచున్నవి. ప్రళయకాలమున ముల్లోకములు నీటమునిగి జనరహితముకాగా ధర్మరూపమగు సేతువును రక్షించుటకు నీవు మత్స్యావతారమెత్తితివి.

**పునరిహదితిజ బల పరిలంఘిత వాసవసూద నాదృత జితత్రిభువన పరాక్రమ హిరణ్యాక్షనిధన పృథివ్యుద్ధరణ సంకల్పాభినివేశేన ధృతకోలావతారః పాహి నః.22**

భా: రాక్షససేన పరాజితుడైన ఇంద్రుని ముల్లోకములను జయించిన పరాక్రమవంతుడగు హిరణ్యాక్షుడు సంహరించుటకు సిద్ధము కాగా అతనిని సంహరించుటకు, పృథివిని ఉద్ధరించుటకు వరాహావతారమెత్తిన శ్రీమహావిష్ణువు మమ్ములను రక్షించుగాక.

**పున రిహ జలధిమథనాదృత దేవదానవగణ మందరాచలానయన వ్యాకులితానాం సాహాయ్యేనాదృతచిత్తః పర్వతోద్ధరణామృత ప్రాశనరచనావతారః కూర్మాకారః ప్రసీద పరేశ ! త్వం దీననృపాణామ్.** **23**

భా: దేవదానవులు సముద్రమథనము కొఱకు మందర పర్వతమును తీసుకువచ్చుటలో వ్యాకులపడుచు మిమ్ములను శరణు వేడు వారికి,సహాయ మొనర్చిరి. మందర పర్వతమునకు ఆధారభూమికై మీరు కూర్మావతారమెత్తి దేవతల అమృతపానమునకు సహాయపడితిరి. అట్టి మీరు దీనులగు మమ్ములను అనుగ్రహింపుడు.

**పునరిహ త్రిభువనజయినో మహాబల పరాక్రమస్య హిరణ్య కశిపోరర్దితానాం దేవవరాణాం భయభీతానాం కళ్యాణాయ దితిసుతవధప్రేప్సుర్బ్రహ్మణో వరదానా దవధ్యస్య న శస్త్రాస్త్రరాత్ర దివాస్వర్గమర్త్యపాతాలతలే దేవగంధర్వ కిన్నర నదనస్తైరితి విచింత్య నరహరి రూపేణనఖాగ్రభిన్నోరుం దష్టదంతచ్ఛదం త్యక్తాసుం కృతవానసి.** **24**

భా: ముల్లోకములను జయించిన మహాపరాక్రమవంతుడగు హిరణ్యకశిపుడు దేవతలను బాధించుచుండ భయభీతులగు దేవతల కళ్యాణము కొఱకు రాక్షస రాజునుకసంహరింపదలచితివి.

అతడు బ్రహ్మవరముచే దేవ గంధర్వ కిన్నర నర నాగములచే శస్త్రములవలన అస్త్రములవలన రాత్రిగాని, పగలుగాని, స్వర్గమర్త్య పాతాళములయందెచ్చటను సంహరింపబడడని తలచి నరసింహావతారమెత్తి యుద్ధసన్నద్ధుడైన హిరణ్యాయకశిపు నఖాగ్రములతో ఊరువులను చీల్చి సంహరించితివి.

పునరిహ త్రిజగజ్జయినో బలేః సత్రే శక్రానుజో వటువామనో దైత్య సంమోహనాయ త్రిపదభూమి యాఙ్ఞాచ్ఛలేన విశ్వకాయస్తదుత్సృష్ట జలసంస్పర్శ వివృద్ధమనోఽఖిలాషస్త్వం భూతలే బలేర్ద్వారికత్వ మంగీతకృతముచితం దానఫలమ్. 25

భా: త్రిభువన విజేతయగు బలి చక్రవర్తిచేయు యజ్ఞమున ఇంద్రానుజుడవై వామనావతారమెత్తి దైత్యరాజును సంమోహపెట్టుటకు మూడుపాదములభూమిని వ్యాజముతో యాచించితివి. అతడు దానసంకల్పము చేయగనే నీవిరాడ్ రూపమును ప్రదర్శించి ఒకపాదముతో భూమిని, రెండవపాదముతో స్వర్గమును వ్యాపించి మూడవపాదమును బలి శిరస్సున నుంచి పాతాళమున కణగద్రొక్కితివి. త్రిభువన దానఫలముగ బలికి దౌవారికత్వము (ద్వారపాలకత్వము) అంగీకరించితివి.

పునరిహ హైహయాదినృపాణా మమితబల పరాక్రమాణాం నానా మదోల్లంఘితమర్యాదా వర్త్మనాం నిధనాయ భృగువంశజో జామదగ్న్యః పితృహోమ ధేనుహరణ ప్రవృద్ధమన్యువశాత్ త్రిసప్తకృత్వో నిఃక్షత్రియాం పృథివీం కృతవానసి 26
పశురామావతారః

భా: అత్యంత బలపరాక్రమ సంపన్నులగు హైహయాది రాజులు మదోన్మత్తులై హద్దులు మీర, వారిని సంహరించుటకు భృగువంశమున పరశురామావతారమెత్తి, తండ్రి హోమధేనువునపహరించుట వలన మిక్కిలి కోపముతో ఇరువదియొక్కమార్లు భూమండలమును క్షత్రియరహితముగ చేసితివి.

పునరిహ పులస్త్యవంశావతంసస్య విశ్రవసః పుత్రస్య నిశాచరస్య రావణస్య లోకత్రయ తాపనస్య నిధన మురరీకృత్య రవికులజాత దశరథాత్మజో విశ్వామిత్రాద స్త్రాణ్యుపలభ్య వనే సీతాహరణవశాత్ ప్రవృద్ధమన్యునా అంబుధిం వానరైర్నిబధ్య సగణం దశకంధరం హతవానసి రామావతారః. 27

భా: పులస్త్య వంశాభరణమగు విశ్రవస్సు పుత్రుడు రావణుని లోకత్రయపీడనమును

గుర్తించి అతని సంహారమున్నకై సూర్యవంశధ్రువుడగు దశరథునికి పుత్రునిగ జన్మించి విశ్వామిత్రుని నుండి అస్త్రములను పొంది కైకేయి వరము ప్రకారము వనవాసము చేసెను. అచ్చట రావణుడు సీతనపహరింపగ క్రుద్ధులై వానరసహాయముతో సేతువును నిర్మించి రామావతారమున రావణుని సంహరించితిరి.

**పునరిహ యదుకుల జలధి కలానిధిః సకలసురగణ సేవిత పాదారవింద ద్వంద్వః వివిధ దానవదైత్యదలన లోకత్రయదురితతాపనో వసుదేవాత్మజో రామావతారో బల భద్రస్త్వమసి. 28**

భా: మరల యదువంశమనెడి సాగరమున చంద్రుని వలె వసుదేవ పుత్రునిగ బలరామునిగ జన్మించి దైత్యదానవులను సంహరించి ముల్లోకములను పాపమునుండి విముక్తి చేసితివి. కృష్ణావతారమున నీపాద పద్మములను దేవతలందరు సేవించిరి. ఆసమయమునవే బలదేవరూపమును కూడ పొందితివి.

**పునరిహ విధికృతవేద ధర్మానుష్ఠాన విహిత నానాదర్శన సంఘృణః సంసారకర్మత్యాగవిధినా బ్రహ్మాభాస విలాసచాతురీ ప్రకృతివిమాననామ సంపాదయన్ బుద్ధావతారస్త్వమసి. 29**

భా: వైదికర్మానుష్ఠానమను పేరుతోజరుగు ప్రాణిహింసనుమాన్పుటకు, ప్రపంచము మిథ్యయని ఉపదేశించుటకు బుద్ధునిగ అవతరించి ప్రాకృతిక విషయములను తిరస్కరించలేదు.

**అధునా కలికుల నాశావతారో బౌద్ధపాఖండ మ్లేచ్ఛాదీనాంచ వేదధర్మసేతు పరిపాలనాయ కృతావతారః కల్కిరూపేణాస్మాన్ స్త్రీత్వనిరయా దుద్ధృతవానసి తవానుకంపాం కిమిహ కథయామః. 30**

భా: కలికులమును నాశము చేయుటకు, బౌద్ధ, పాఖండ, మ్లేచ్ఛాదులను శాసించుటకు వైదికధర్మమును రక్షించుటకు కల్కి రూపమున అవతరించి స్త్రీత్వమను నరకమునుండిమమ్ముల నుద్ధరించి అనుగ్రహించితివి.

**క్వ తే బ్రహ్మాదీనామవిదిత విలాసావతరణం క్వనః కామా వామాకులిత మృగతృష్ణార్తమనసామ్ సుదుష్ప్రాప్యం యుష్మచ్చరణ జలజాలోకనమిదం కృపా పారావారః ప్రముదితదృశాశ్వాసయ నిజాన్. 31**

భా: బ్రహ్మాది దేవతలుకూడ తెలుసుకోలేని విలాసములు గల్గిన మీరెక్కడ ? విషయవాసనలచే పీడింపబడు మేమెక్కడ? మీపాదపద్మ దర్శనము మాకెంతో దుర్లభము.

కృపాసాగరులగు మిమ్ములను అనుసరించు మమ్ము కృపావీక్షణములతో అనుగ్రహింపుడు.

**ఇతి శ్రీ కల్కి పురాణేఽనుభాగవతే భవిష్యే ద్వితీయాంశే**
**నృపాణాంస్తవో నామ తృతీయోధ్యాయః**

ఇది భాగవతాను బంధము భవిష్యమునగు శ్రీకల్కిపురాణమున ద్వితీయాంశమున
రాజులచే చేయబడిన కల్కిస్తవమను తృతీయాధ్యాయము.



# కల్కి పురాణము

## ద్వితీయాంశము - చతుర్థాధ్యాయము

సూత ఉవాచ.......

శ్రుత్వా నృపాణాం భక్తానాం వచనం పురుషోత్తమః
బ్రాహ్మణక్షత్రియ విట్ శూద్రవర్ణానాం ధర్మమాహ యత్. 1
ప్రవృత్తానాం నివృత్తానాం కర్మ యత్ పరికీర్తితమ్
సర్వం సంశ్రావ యామాస వేదానామనుశాసనమ్. 2

భా: సూతుడు పలికెను. భక్తులగు రాజుల మాటలు వినిన పురుషోత్తముడగు కల్కి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాలుగు వర్ణముల వారి ధర్మములను చెప్పెను. సంసారమున ఆసక్తులు, అనాసక్తులగు పురుషులకు వేదోక్తములగు కర్మలను వినిపించెను.

ఇతి కల్కేర్వచః శ్రుత్వా రాజానో విశదాశయాః
ప్రణిపత్య పునః ప్రాహుః పూర్వాంతు గతిమాత్మన. 3
స్త్రీత్వం వాప్యథవా పుంస్త్వం కస్య వా కేన వా కృతమ్
జరాయౌవన బాల్యాది సుఖదుఃఖాదికం చ యత్. 4

భా: కల్కి మాటలు విని నిర్మలహృదయులగు రాజులు అతనికి నమస్కరించి తమ పూర్వావస్థను గూర్చి అడిగిరి. స్త్రీపురుషభేదము ఎవరివలన ఎందుకు కలుగుచున్నది. బాల్య యౌవన వార్ధక్యములు, సుఖదుఃఖములు...........

కస్మాత్ కుతోవా కస్మిన్ వా కిమేతదితి వా విభో
అనిర్ణీతాన్యవిదితాన్యపి కర్మాణి వర్ణయ. 5
సోఽప్యనంతో మునివరస్తీర్థపాదో బృహద్వ్రతః
కల్కేర్దర్శనతో ముక్తిమాకలయ్యాగతస్త్వరన్. 6

భా: ఏకారణమువలన ఎట్లు కలుగుచున్నవి? అనిర్ణీతములు, అజ్ఞాతములగు కర్మలను మాకు వివరించి చెప్పుడు. కల్కి మునిశ్రేష్ఠుడగు అనంతునిస్మరించగనే వ్రతధారి, తీర్థ వాసియగు అనంతుడు మోక్షమును కోరినవాడై శీఘ్రముగ కల్కిని చూచుటకు వచ్చెను.

సమాగత్య పునః ప్రాహ కింకరిష్యామి కుత్ర వా
యాస్యామీతి వచః శ్రుత్వా కల్కిః ప్రాహ హసన్ మునిమ్. 7
కృతం దృష్టం త్వయా సర్వం జ్ఞాతం యాహ్యానివర్తకమ్
అదృష్టమకృతంచేతి శ్రుత్వా దృష్టమనా మునిః. 8

భా: అనంతుడు నేను ఏమి చేయవలెను? ఎక్కడకు వెళ్ళవలెను? ఆజ్ఞాపించుడని పలుక కల్కి మందహాసముతో నేను చేసినదంతయునీవు చూసితివి. అంతయు తెలిసినవాడవు. భాగ్యము కర్మాయత్తము. భాగ్యము అనివర్తకమనిపలికెను. ఈమాటలు విని అనంతుడం మిక్కిలి సంతోషించెను.

**గమనాయోద్యతం తంతు దృష్ట్వా నృపగణాస్తతః**
**కల్కిం కమలపత్రాక్షం ప్రోచుర్విస్మితచేతసః. 9**

**రాజాన ఊచుః.......**

**కిమనేనాపి కథితం త్వయా వా కిము తాన్ ప్రతి**
**సర్వం తచ్ఛ్రోతుమిచ్ఛామః కథోపకథనం ద్వయోః. 10**

భా: అనంతరము మహర్షి వెడలుటకుసిద్ధముకాగా రాజులు అతనిని చూచి విస్మయమునొందినవారై కమలపత్రాక్షి యగు కల్కితో మహర్షి ఏమని పలికెను? మీరు ఏమి సమాధానమిచ్చిరి? మీయిద్దరిమధ్య జరిగిన వార్తాలాపమును వినదలచితిమని పలికిరి.

**నృపాణాం తద్వచః శ్రుత్వా తానాహ మధుసూదనః**
**పృచ్ఛతాముం మునిం శాంతం కథోపకథనాదృతాః. 11**
**ఇతి కల్కేర్వచోభూయః శ్రుత్వా తే నృపసత్తమాః**
**అనంతమాహుః ప్రణతాః ప్రశ్న పారతితీర్షవః. 12**

భా: రాజుల వచనములను వినిన మధుసూదనుడు మా కథోపకథనము వినవలయునన్న శాంతహృదయుడగు మునిని అడుగుమని చెప్పెను. కల్కిమాటలు వినిన రాజులు తమప్రశ్నకుసమాధానము కొఱకు అనంతుని నమస్కరించి అడిగిరి.

**రాజాన ఊచుః.......**

మునే ! కిమత్రకథనం కల్కినా ధర్మవర్మణా
దుర్బోధం కేన వా జాతం తత్త్వం వర్ణయ నః ప్రభో! 13

మునిరువాచ....

పురికాయాం పురి పురా పితా మే వేదపారగః
విద్రుమోనామ ధర్మజ్ఞః ఖ్యాతః పరహితేరతః. 14

భా: రాజులు పలికిరి. ఓమహర్షి ! ధర్మస్వరూపుడగు కల్కిచే చెప్పబడినది తెలుసుకోలేకపోవుటకు కారణమేమి? నిగూఢతత్త్వమును వివరించి చెప్పుడు. అపుడు ముని యిట్లు చెప్పెను. పూర్వకాలమున పురిక అను గ్రామమున వేదపారంగతుడు, ధర్మజ్ఞుడు, పరహితమందు ఆసక్తికలవాడు, ప్రసిద్ధుడగు విద్రుముడనుపేరుగల నాతండ్రి నివసించెడి వాడు.

సోమా మమ విభో మాతా పతిధర్మపరాయణా
తయోర్వయః పరిణతౌ కాలే షండాకృతిస్త్వహమ్. 15
సంజాతఃశోకదః పిత్రోర్లోకానాం నిందితాకృతిః
మామాలోక్య పితా క్లీబం దుఃఖశోక భయాకులః. 16

భా: సోమ యను నాతల్లి పతిధర్మపరాయణురాలు. వారి వార్ధక్యమున నేను జన్మించితిని. కాని నపుంసకుడనైతిని. ఈకారణముచే తల్లిదండ్రులు మిక్కిలి దుఃఖించిరి. నా ఆకారమును చూచి నన్ను అందరు నిందించసాగిరి. నపుంసకుడనైన నన్ను చూచి నా తండ్రి భయ, శోక, దుఃఖములచే వ్యాకులత చెందెను.

త్యక్త్వా గృహం శివవనం గత్వా తుష్టావ శంకరమ్
సంపూజ్యేశం విధానేన ధూపదీపానులేపనైః. 17

విద్రుమ ఉవాచ....

శివం శాంతం సర్వలోకైకనాథం భూతావాసం వాసుకీ కంఠభూషమ్
జటాజూటబద్ధగంగాతరంగం వందే సాంద్రానంద సందోహదక్షమ్. 18

భా: పిమ్మట ఇంటిని విడిచి శివవనమునకు వెడలి ధూప దీప చందనాదులతో విధిపూర్వకముగ శివుని పూజించి స్తుతించెను. విద్రుముడు పలికెను. సర్వలోకైకనాథుడు, మంగళస్వరూపుడు, శాంతుడు, సమస్తప్రాణులకాశ్రయుడు, వాసుకి కంఠా భరణముగ కలవాడు, గంగాతరంగములను జటాజూటములయందు బంధించిన వాడు, నిరతిశయానందప్రదాత యగు మహాదేవుని నమస్కరించుచున్నాను.

ఇత్యాది బహుభిః స్తోత్రైః స్తుతః సశివదః శివః
వృషారూఢః ప్రసన్నాత్మా పితరం ప్రాహ మేవృణు. 19

విద్రుమో మే పితా ప్రాహ మత్పుంస్త్వం తాప తాపితః
హసన్ శివో దదౌ పుంస్త్వం పార్వత్యా ప్రతిమోదితః. 20

భా: ఈవిధముగ బహువిధస్తోత్రములచే స్తుతింపబడిన సర్వమంగళప్రదాతయగు శివుడు వృషారూఢుడై ప్రసన్నుడై నాతండ్రిని వరముకోరుకొనుమని పలికెను. నాతండ్రియగు విద్రుముడు మాపుత్రుడు నపుంసకుడగుటచే మేము దుఃఖించుచున్నామని పలికెను. పార్వతిచే అనుమోదితుడైన శివుడు నాకు పుంస్త్వమును వరముగ నిచ్చెను.

మమ పుంస్త్వం వరం లబ్ధ్వా పితా యాతః పునః గృహమ్
పురుషం మాం సమాలోక్య సహర్షః ప్రియయా సహ. 21
తతః ప్రవయసౌ తౌతు పితరౌ ద్వాదశాబ్దకే
వివాహం మే కారయిత్వా బంధుం భిర్ముదమాపతుః. 22

భా: నాకు పురుషత్వరూప వరమును పొంది నాతండ్రి గృహమున కేతెంచెను. నన్ను పురుషునిగ చూచి నాతల్లిదండ్రులు మిక్కిలి సంతోషించిరి. పండ్రెండవయేట నాకు వివాహము జరిపి బంధుమిత్రులతో కూడ నాతల్లిదండ్రులు సంతోషమునొందిరి.

యజ్ఞరాతసుతాం పత్నీం మానినీం రూపశాలినీమ్
ప్రాప్యాహం పరితుష్టాత్మా గృహస్థః స్త్రీవశోఽభవమ్. 23
తతః కతిపయేకాలే పితరౌ మే మృతౌ నృపాః
పారలౌకికకార్యాణి సుహృద్భి ర్బ్రాహ్మణై ర్వృతః. 24

భా: మానవతి రూపశీల గుణసంపన్నురాలగు యజ్ఞరా పుత్రికను భార్యగ పొంది ప్రసన్నుడనై గృహస్థాశ్రమమున ప్రవేశించి స్త్రీవశుడనైతిని. పిమ్మటకొంతకాలమునకు నా తల్లిదండ్రులు మరణించగ వారికి బంధుమిత్రులతోకూడి పారలౌకిక్రియలు నిర్వర్తించితిని.

తయోః కృత్వా విధానేన భోజయిత్వా ద్విజాన్ బహూన్
పిత్రోర్వియోగతప్తోఽహం విష్ణుసేవాపరోఽభవమ్. 25
తుష్టో హర్మే భగవాన్ జపపూజాది కర్మభిః
స్వప్నే మామాహ మాయేయం స్నేహ మోహవినిర్మితా. 26

భా: నేను శాస్త్రోక్తముగ మాతాపితరుల అంత్యక్రియలను నిర్వర్తించి బ్రాహ్మణులకు భోజనము పెట్టితిని. పితృవియోగ సంతప్తుడనై విష్ణుసేవా తత్పరుడనైతిని. నాజప పూజాది క్రియలచే సంతుష్టుడై శ్రీహరి స్వప్నమున 'మమతలు మాయావశముచే సంక్రమించినవని'

తెలిపెను.

అయం పితేయం మాతేతి మమతాకులచేతసామ్
శోకదుఃఖ భయోద్వేగ జరామృత్యు విధాయికా. 27
శ్రుత్వేతి వచనం విష్ణోః ప్రతివాదార్థముద్యతమ్
మామాలక్ష్యాంతర్హితః సవినిద్రోఽహం తతోఽభవమ్. 28

భా: ఇతడు నా తండ్రి, ఈమె నాతల్లి అను మమకారముచే వ్యాకులమనస్కులు మాయావశముచే శోక, దుఃఖ, భయ, ఉద్వేగ, జరా, మృత్యువుల నొందుదురు. విష్ణువు మాటలువిని ప్రతి వచనమునకు సిద్ధపడుచుండగ వారు అంతర్ధానమైరి. కల చెదిరినది

సవిస్మయః సభార్యోఽహం త్యక్త్వా తాం పురికాం పురీమ్
పురుషోత్తమాఖ్యం శ్రీవిష్ణోరాలయం చాగమం నృపాః. 29
తత్రైవ దక్షిణే పార్శ్వే నిర్మాయాశ్రమముత్తమమ్
సభార్యః సానుగామాత్యః కరోమి హరిసేవనమ్. 30

భా: ఓ రాజులార ! ఆశ్చర్యచకితుడనైన నేను భార్యతో గూడి పురికాపురమును విడిచి శ్రీవిష్ణువు నకాలయమైన పురుషోత్తమదేశమునకు వచ్చితిని. అచ్చటనే దక్షిణభాగమున ఉత్తమ ఆశ్రమమును నిర్మించి భార్యతో, అనుచరులతోగూడి హరిసేవ చేయుచుంటిని.

మాయాసందర్శనాకాంక్షీ హరిసద్మని సంస్థితః
గాయన్ నృత్యన్ జపన్నామ చింతయన్ శమనాపహమ్. 31
ఏవం వృత్తే ద్వాదశాబ్దే ద్వాదశ్యాం పారణాదినే
స్నాతుకామః సముద్రేఽహం బంధుభిః సహితో గతః. 32

భా: మాయనుచూడవలెనని కోరికగలవాడనై విష్ణువాస స్థానము నివసించి నృత్యగాన జపములచే దురితనాశకుడగు శ్రీహరిని ధ్యానము చేయుచుంటిని. ఈవిధముగ 12 సంవత్సరములు గడచినవి. ద్వాదశిపారణదివసమున సముద్రస్నానము చేయదలచి బంధువులతో గూడి వెడలితిని.

తత్ర మగ్నం జలనిధౌ లహరీలోల సంకులే
సముత్థాతుమశక్తం మాం ప్రతుదంతి జలేచరాః. 33
నిమజ్జనోన్మజ్జనేన వ్యాకులీకృతచేతసమ్
జలహిల్లోలమిలనదలితాంగ మచేతనమ్. 34

భా: కెరటములతో సంక్షుభితమయిన సముద్రమున మునిగి బయటకు వచ్చుటకు అసమర్థుడనైతిని. అప్పుడు జలచరములు నన్ను బాధించసాగినవి. మునుగుట తేలుటచే కలతచెందిన నేను జలతరంగములచే అస్వాధీనమయిన అవయవములు కలవాడనై అచేతనుడనైతిని.

జలధేర్దక్షిణే కూలే పతితం పవనేరితమ్
మాం తత్ర పతితం దృష్ట్వా వృద్ధశర్మా ద్విజోత్తమః. **35**
సవృద్ధశర్మా ధర్మాత్మా పుత్రదారధనాన్వితః
కృత్వారుగ్ణంతు మాం తత్ర పుత్రవత్ పర్యపాలయత్. **36**

భా: పిమ్మట నేను వాయువేగముచే సముద్ర దక్షిణతీరమున పడితిని. అచేతనముగ అచ్చట పడియున్న నన్ను వృద్ధ శర్మయను బ్రాహ్మణశ్రేష్ఠుడు చూచి కారుణ్యము కలవాడై సంధ్యోపాసన పిమ్మట తన యింటకి తీసుకువెళ్ళెను. పుత్రదార ధనాన్వితుడగు వృద్ధశర్మ నన్ను రోగరహితునిజేసి పుత్రుని వలె పాలించెను.

అహంతు తత్రదీనాత్మా దిగ్దేశాభిజ్ఞ ఏవ న
దంపతీ తౌ స్వపితరౌ మత్వా తత్రావసం నృపాః. **37**
స మాం విజ్ఞాయ బహుధా వేదధర్మేష్వనుష్ఠితమ్
ప్రదదౌ స్వాం దుహితరం వివాహే వినయాన్వితః. **38**

భా: ఓ రాజులార! అచ్చట నేను దిగ్దేశ జ్ఞానము కూడా లేని వాడనై దీనుడనైతిని. వారనే తల్లిదండ్రులుగదలచి అచ్చట నివసించుచుంటిని. వేదోక్త కర్మలను బాగుగ ఆచరించు వానిగ నన్ను తెలుసుకొని వారి పుత్రికతతో నాకు వివాహము జరిపించిరి.

లబ్ధ్వా చామీకరాకారాం రూపశీలగుణాన్వితామ్
నామ్నా చారుమతీం తత్ర మానినీం విస్మితోఽభవమ్. **39**
తయాహం పరితుష్టాత్మా నానాభోగసుఖాన్వితః
జనయిత్వా పంచ పుత్రాన్ సంమదేనావృతోఽభవమ్. **40**

భా: చారుమతి అను పేరు కల్గిన రూపశీలగుణవతి, మానవతి,సౌందర్యవతి యగు యోగ్య స్త్రీని పొంది మిక్కిలి ఆశ్చర్యపడితిని. చారుమతి వలన సంతృప్తినిచెంది వివిధ భోగ సుఖముల ననుభవించితిని. సమయానుసారము ఐదుగురు పుత్రులనుపొంది ఆనందసాగరమున మునిగితిని.

జయశ్చ విజయశ్చైవ కమలో విమలస్తథా
బుధ ఇత్యాదయః పంచ విదితాస్తనయా మమ. 41
స్వజనైర్బంధుభిః పుత్రైః ధనైర్నానావిధైరహమ్
విదితః పూజితో లోకే దేవైరింద్రో యథాదివి. 42

భా: జయు, విజయు, కమల, విమల, బుధులను ఐదుగురు పుత్రులు కల్గిరి. ఆత్మీయులు, బంధువులు, పుత్రులు మొదలగు సంపదలతో శ్యములచే ప్రసిద్ధినొందిన నేను స్వర్గమున దేవతలచే ఇంద్రునివలె లోకమున పూజింపబడితిని.

బుధస్యజ్యేష్ఠపుత్రస్య వివాహార్థంసముద్యతమ్
ద్వష్ట్వా ద్విజవరస్తుష్టో ధర్మసారో నిజాం సుతామ్. 43
దిత్సుః కర్మాణి వేదజ్ఞశ్చకారాభ్యుదయాన్యపి
వాద్యై ర్గీతైశ్చ నృత్యైశ్చ స్త్రీగణైః స్వర్ణభూషితైః. 44

భా: నాజ్యేష్ఠ పుత్రుడగు బుధుని వివాహ ప్రయత్నమారంభింపగా ధర్మసారుడను వేదజ్ఞుడగు బ్రాహ్మణుడు నాప్రయత్నము తెలుసుకొనిసంతుష్టుడై తన కన్యనిచ్చుటకు నిశ్చయించి స్వర్ణాభరణ భూషితలగు స్త్రీలు వాద్యగీత నృత్యములు చేయ ఆభ్యుదయిక కర్మనాచరించెను.

అహం చ పుత్రాభ్యుదయే పితృదేవర్షి తర్పణమ్
కర్తుం సము ద్రవేలాయాం ప్రవిష్టః పరమాదరాత్. 45
వేలాలోలాయిత తనుర్జలాదుత్థాయ సత్వరః
తీరే సఖీన్ స్నానసంధ్యాపరాన్ వీక్ష్యాహమున్మనాః. 46

భా: నేను కూడ పుత్రాభ్యుదయముకొఱకు పితృ తర్పణము, దేవతర్పణము, ఋషి తర్పణము చేయుటకు సముద్రతీరమునకు వచ్చితిని. స్నాన తర్పణములాచరించిసముద్రజలము నుండి బయటకు రాగా తీరమందు నా మిత్రవర్గము ( బంధు ) స్నానసంధ్యలనాచరించుట చూచి ఉద్విగ్నుడనైతిని.

సద్యః సమభవం భూపాః ద్వాదశ్యాంక పారణాదృతాన్
పురుషోత్తమసంవాసాన్ విష్ణుసేవార్థముద్యతాన్. 47
తేఽపి మామగ్రతః కృత్వా తద్రూపవయసాం నిధిమ్
విస్మయావిష్టమనసం దృష్ట్వా మామబ్రువన్జనాః. 48

భా: ఓరాజులార ! పురుషోత్తమ ప్రదేశ వాసులగు బ్రాహ్మణులు విష్ణుసేవకు,

ద్వాదశియందు పారణక్రియకు ఉద్యుక్తులగుట చూచి ఆశ్చర్యపడితిని. విస్మయముతో కూడిన నన్ను చూచి వారు ఇట్లు అడిగితిరి.

అనంత ! విష్ణుభక్తోఽసి జలేదృష్టవానిహ
స్థలే వా వ్యగ్రమనసం లక్షయామః కథం తవ. 49
పారణం కురు తద్ బ్రూహి త్యక్త్వా విస్మయయాత్మనః
తానబ్రువమహం నైవ కించిద్ దృష్టం శ్రుతం జనాః. 50

భా: ఓ అనంత ! ఏకారణముచే నీవు కలత చెందుచున్నావు. నీవు విష్ణు భక్తుడవు. జలమందుగాని భూమిమీదగాని ఏమైన చూచితివా ? ఆశ్చర్యమునకు కారణమను చెప్పుము. లేక ఆశ్చర్యము విడిచి పారణముచేయుము. అప్పుడు నేను ఏమియు చూడలేదు, వినలేదని పలికితిని.

కామాత్మా తత్కృపణధీ ర్మాయాసందర్శనాదృతః
తయా హరేర్మాయయాహం మూఢో వ్యాకులితేంద్రియః. 51
నశర్మ వేద్మికుత్రాపి స్నేహమోహవశం గతః
ఆత్మనో విస్మృతిరియం కోవేద విదితాం తు తామ్. 52

భా: నేను కామమోహితుడను. బుద్ధిచే దుర్బలుడను. మాయను చూడవలెనని కోరిక గలవాడనై హరియొక్క మాయచే కర్తవ్యవిమూఢుడనై వ్యాకులపడుచున్నాను. స్నేహ మోహవశుడనై సంతోషము లేనివాడనైతిని. నన్ను నేను మరచితిని. మాయను తెలుసుకోలేకపోతిని.

ఇతి భార్యాధనాగార పుత్రో ద్వాహానురక్తధీః
అనంతోఽహం దీనమనా న జానే స్వాప సమ్మితమ్. 53
మాం వీక్ష్య మానినీ భార్యా వివశం మూఢవత్ స్థితమ్
క్రందంతీ కిమహోఽకస్మాదాలపంతీ మమాంతకే. 54

భా: భార్య, ధనాగారము, పుత్రవివాహములయందు అనురక్తుడనై మిక్కిలి దుఃఖపడుచున్నాను. నాకు ఏమియు తెలియుటలేదు. ఇంతయు స్వప్నము వలెనున్నది. ఇంతలో వివశుడు, మూఢుడనగు నన్నుచూచి మానినియగు నాభార్య ఇంతలో నీకేమైనదని ఆక్రోశించుచునావద్దకు వచ్చినది.

ఇహ తాం వీక్ష్య తాంస్తత్ర స్మృత్వా కాతర మానసమ్
హంసోఽప్యేకో బోధయితు మాగతో మాం సదుక్తిభిః
ధీరో విదితసర్వార్థః పూర్ణః పరమధర్మవిత్. 55

సూర్యాకారం సత్త్వసారం ప్రశాంతం
దాంతం శుద్ధం లోకశోకక్షయిష్ణుమ్
మమాగ్రే తం పూజయిత్వా మదంగాః
పప్రచ్ఛుస్తే మచ్ఛుభధ్యానకామాః. **56**

భా: పురుషోత్తమక్షేత్రమున భార్యను చూచి స్త్రీపుత్రులను తలచి కాతర హృదయుడనై ఖిన్నుడనైతిని. అప్పుడు సద్వచనములతో నన్నుసముదాయించుటకు హంసుడు వచ్చెను. పరమహంస ధీరుడు, సర్వజ్ఞుడు, పూర్ణుడు, పరమధార్మికుడు, సుర్యసదృశ ప్రకాశము కలవాడు, సత్త్వగుణ సంపన్నుడు, శాంతుడు శుద్ధుడు, అందరి దుఃఖములను దూరము చేయువాడు, నాశుభమును కోరు కుటుంబీకులు నాక్షేమమును గూర్చి హంసుని అడిగిరి.

ఇతి శ్రీ కల్కిపురాణేఽను భాగవతే
భవిష్యే ద్వితీయాంశే
అనంత - మాయా దర్శనం నామ
చతుర్థోధ్యాయః

ఇది భాగవతానుబంధము, భవిష్యమునగు శ్రీ కల్కిపురాణమున
ద్వితీయాంశమున అనంత – మాయా దర్శనము
చతుర్థాధ్యాయము.



# కల్కి పురాణము

## ద్వితీయాంశము - పంచమాధ్యాయము

సూత ఉవాచ......

ఉపవిష్టే తదా హంసే భిక్షాం కృత్వా యథోచితామ్
తతః ప్రాహురనంతస్య శరీరారోగ్యకామ్యయా. 1
హంస స్తేషాం మతం జ్ఞాత్వా ప్రాహ మాం పురతఃస్థితమ్
తవ చారుమతీ భార్యా పుత్రాః పంచ బుధాదయః. 2

భా: సూతుడు పలికెను. యథోచితముగ భిక్షనాచరించి కూర్చుంగ అనంతుడు ఎట్లు ఆరోగ్యవంతుడగునని బ్రాహ్మణులు ప్రశ్నించిరి. వారి అభిప్రాయయమును తెలుసుకొనిన హంసుడు ఎదురుగనున్న నన్ను ఉద్దేశించి చారుమతి నీభార్య, బుధాదులు ఐదుగురు నీపుత్రులు.

ధనరత్నాన్వితం సద్మ సంబాధం సౌధసంకులమ్
త్యక్త్వా కదా గతోఽసీహ పుత్రోద్వాహదినే నతు ? 3
సముద్రతీరసంచారః పురాద్ధర్మ జనాదృతః
నిమంత్ర్య మామిహాయాతః శోకసంవిగ్నమానసః. 4

భా: ధనధాన్యములను, గృహసముదాయమును విడిచి ఇక్కడకు ఎప్పుడు వచ్చితివి ? నేడు నీపుత్రుని పెండ్లిరోజు. సముద్రతీరమున సంచరించు నిన్ను మేము చూచితిమి. నీవు పురమందలి ధార్మికులచే ఆదరింపబడువాడవు. మమ్ములను వివాహమునకాహ్వానించి శోకసంతప్త హృదయుడవై నీవు ఇచ్చటకు వచ్చితివి.

త్వం చసప్తతి వర్షీయస్తత్ర దృష్టోమయా ప్రభో!
త్రింశద్వర్షీయ వత్ కస్మాదితి మే సంభ్రమో మహాన్. 5
ఇయం భార్యా సహాయా తే న తత్రాలోకితా క్వచిత్
అహం వా క్వ కుతస్తస్మాత్ కథంవా కేన కాశితః. 6

భా: ఓ ప్రభు ! నిన్ను అచ్చట డెబ్బది వత్సరములు కల వృద్ధునిగ చూచితిని. ఇప్పుడు నీవు ముప్పది యేండ్లయువకునిగ కన్పించుచున్నావు. దీనికి కారణమేమి ? నాకు ఆశ్చర్యము

కలుగుచున్నది . ఈమెను నీభార్యగ ముందెన్నడు చూడలేదు. నేనుకూడ ఎక్కడినుండి ఎందులకు ఎక్కడికి ఎవరిచే ఎట్లు తీసుకురాబడితిని.

స ఏవ వా న వాపి త్వం నాహం వా భిక్షురేవ సః
ఆవయోరిహ సంయోగశ్చేంద్రజాల ఇవాభవత్. 7
త్వం గృహస్థః స్వధర్మజ్ఞో భిక్షుకోఽహం పరాత్మకః
ఆవయోరిహ సంవాదో బాలకోన్మత్తయో రివ. 8

భా: నీవు అనంతుడవేనా? లేక మరియొకడివా? నేనుకూడ ఆభిక్షుకుడనా? కానా? ఇచ్చట మనయిద్దరి కలయిక ఇంద్రజాలము వలె అనిపించుచునంది. నీవు స్వధర్మరతుడవగు గృహస్థువు. పరమార్థచింతా తత్పరుడగు భిక్షుకుడను నేను. ఉన్మత్త - బాలకుల సంవాదమువలె అసంబద్ధముగ నున్నది.

తస్మాదీశస్య మాయేయం త్రిజగన్మోహకారిణీ
జ్ఞానా ప్రాప్యాద్వైతలభ్యా మన్యేహమితి భో ద్విజ. 9
ఇతి భిక్షుః సమాశ్రావ్య యదన్యత్ ప్రాహ విస్మితః
మార్కండేయ ! మహాభాగ ! భవిష్యం కథయామి తే. 10

భా: ఓ బ్రాహ్మణ! ముల్లోకములను సమ్మోహపరచు జగదీశ్వరుని మాయయే కారణమని తలచెదను. సాధారణ జ్ఞానముచే ఇది తెలియబడదు. అద్వైత భావనవలననే మాయ అంతయు (వినిపించి) చెప్పి పిమ్మట మార్కండేయునితో మార్కండేయ! మహాభాగ! నీయొక్క భవిష్యత్తు గూర్చి చెప్పెదను వినుము.

ప్రలయే యా త్వయా దృష్టా పురుషస్యోదరాంభసి
సా మాయా మోహజనికా పంథానం గణికా యథా. 11
తమోహ్యానంత సంతాపా నోదనోద్యతమక్షరీ
యయేదమఖిలం లోకమావృత్యావస్థయాస్థితమ్. 12

భా: ప్రళయకాలమున పరమపురుషుని ఉదరజలమునచే చూడబడిన మాయ మార్గమున వేశ్యవలె అందరిని సమ్మోహపరచును. తమోరూపమగు మాయ లోకమంతట వ్యాపించి సంతాపకారకమగుచున్నది. ఇది నశింపశక్యముకానిది.

లయే లీనే త్రిజగతి బ్రహ్మతన్మాత్రతాంగతః
నిరుపాధౌ నిరాలోకే సిసృక్షురభవత్ పరః. 13

బ్రహ్మణ్యాపి ద్విధాభూతే పురుషప్రకృతీ స్వయా
భాసా సంజనయామాస మహాంతం కాలయోగతః. 14

భా: ప్రళయకాలమున ముల్లోకములు లయమును పొంద ప్రకాశము లేకపోవుటచే అంతట అంధకారము వ్యాపించును. అప్పుడు పరబ్రహ్మ సృజించవలెనని కోరికగలవాడై తన్మాత్రరూపమున వ్యక్తమగును. బ్రహ్మ మొదట తన మాహాత్మ్యముచే పురుషప్రకృతులుగ విభక్తమగును. పిమ్మట కాలవశముచే పురుషప్రకృతులసమాగమము వలన మహత్తత్త్వము ఉత్పన్నమగును. (( సాంఖ్య సిద్ధాంతముననుసరించి )

కాలస్వభావకర్మాత్మా సోఽహంకారస్తతోఽభవత్
త్రివృద్విష్ణు శివ బ్రహ్మమయః సంసారకారణమ్. 15
తన్మాత్రాణి తతః పంచ జజ్ఞిరే గుణవంతి చ
మహాభూతాన్యపి తతః ప్రకృతౌ బ్రహ్మసంశ్రయాత్. 16

భా: కాలసహకారముచే ప్రకృతివలన పుట్టిన మహత్తత్త్వము నుండి అహంకార తత్త్వము పుట్టును. అహంకారతత్త్వము గుణత్రయభేదముచే విభక్తమై సంసారకారణములగు బ్రహ్మవిష్ణు మహేశ్వర రూపములొందినది. అహంకారతత్త్వము వలన త్రిగుణయుక్తము లగు పంచతన్మాత్రలు పుట్టును. పంచతన్మాత్రలవలన పంచమహా భూతములు ఉత్పన్నమగును. ప్రకృతి పురుష సంగమము వలన సృష్టి ఏర్పడినది.

జాతాదేవాసురనరా యేచాన్యే జీవజాతయః
బ్రహ్మాండ భాండ సంభార జన్మనాశ క్రియాత్మికాః. 17
మాయయా మాయయాజీవపురుషః పరమాత్మనః
సంసారశరణ వ్యగ్రో నవేదాత్మగతిం క్వచిత్. 18

భా: దేవతలు, అసురులు, నరులు, బ్రహ్మాండమున పుట్టిరి. జన్మనాశ వ్యాపారముగల అనంత ప్రాణి కోటి ఉద్భవించినది. పరమాత్మ యొక్క మాయచే సర్వము ఆచ్ఛాదితము కాగా సమస్తజీవులు సంసారబంధమున వ్యగ్రులై తమ ఉద్ధారమును తెలుసుకొనలేరు. ఇది యంతయు మాయా ప్రభావము.

అహో బలవతీ మాయా బ్రహ్మాద్యా యద్వశే స్థితాః
[illegible] నసి ప్రోతా గుణబద్ధాః ఖగా ఇవ. 19
[illegible] మునీశ్వరాః
[illegible] 20

భా: మాయ బలవత్తరమైనది. ఆశ్చర్యము. బ్రహ్మాది దేవతలుకూడ ముకుత్రాడుచే బంధింపబడినగోవుల వలె ( ఎడ్లు ) వలలో చిక్కిన పక్షులవలె మాయావశులగుచున్నారు. విషయ వాసన లనెడు నక్రములతో నిండిన, మహా ప్రవాహముతో గూడిన మాయాసాగరమును మునీశ్వరులు దాటుట కభిలషింతురు. వారే నిజమైన తత్త్వవేత్తలు.

శౌనక ఉవాచ .......

మార్కండేయో వశిష్ఠశ్చ వామదేవాదయోఽపరే
శ్రుత్వా గురువచో భూయః కిమాహుః శ్రవణాదృతాః. 21
రాజానోఽనంతవచనమితి శ్రుత్వా సుధోపమ
కిం వా ప్రాహురహో సూత ! భవిష్యమిహ వర్ణయ. 22

భా: శౌనకుడు పలికెను. మార్కండేయుడు,వశిష్ఠుడు, వామదేవుడు మున్నగు మహర్షుల గంభీర వచనములను విని రాజులు ఏమంటిరి. ఓ సూత ! భవిష్య ద్వృత్తాంతమును వర్ణింపుడు.

ఇతి తద్వచ ఆశ్రుత్య సూతః సత్కృత్య తం పునః
కథయామాస కార్త్స్న్యేన శోక మోహవిఘాతకమ్. 23

సూత ఉవాచ........

తత్రానంతో భూపగణైః పృష్టః ప్రాహ కృతాదరః
తపసా మోహనిధన మింద్రియాణాంచ నిగ్రహమ్. 24

భా: అతని మాటలు వినిసూతుడు ప్రశంసించి శోకమోహనాశకమగు సమస్త తత్త్వజ్ఞానమును పరిపూర్ణముగ చెప్పెను. సూతుడు పలికెను. పిమ్మట రాజు లాదరపూర్వకముగ అనంతుని ప్రశ్నించగ అతడు తపస్సువలన మాయనుండి దూరమగుట మరియు ఇంద్రియ నిగ్రహము గూర్చి చెప్పెను.

అనంత ఉవాచ......

అతోఽహం వనమాసాద్య తపః కృత్వా విధానతః
సేంద్రియాణాం న మనసో నిగ్రహోఽభూత్ కదాచన. 25
వనే బ్రహ్మ ధ్యాయతో మే భార్యాపుత్రధనాదికమ్
విషయంచాంతరా శశ్వత్ సంస్మారయతి మే మనః. 26

భా: అనంతుడు పలికెను. కనుకనేను అడవులకెళ్ళి విధిపూర్వకముగ తప మాచరించినను ఎన్నటికి మనస్సు ఇంద్రియములు వశము కాలేదు. అరణ్యమున పరబ్రహ్మమును ధ్యానము చేయు

సమయమున నిరంతరము భార్యా పుత్రధనాదికము, సాంసారికవిషయములు స్మరణకు వచ్చినవి.

తేషాం స్మరణమాత్రేణ దుఃఖశోకభయాదయః
ప్రతుదంతి మమ ప్రాణాన్ ధారణా- ధ్యాననాశకాః. 27
తతోఽహం నిశ్చితమతిరింద్రియాణాం చ ఘాతనే
మనసో నిగ్రహస్తేన భవిష్యతి న సంశయః. 28

భా: భార్యాపుత్రాదులను స్మరించుట వలన ధారణ, ధ్యాననాశకవములగు దుఃఖశోకభయాదులు కల్గినవి. అవినాప్రాణములను హింసించుచున్నవి. ఇంద్రియములను నాశము చేయుట వలన తప్పక మనస్సు స్వాధీనమగునని నిశ్చయమునకు వచ్చితిని.

అతో మామింద్రియాణాఞ్చ నిగ్రహవ్యగ్రచేతసమ్
తదధిష్ఠాతృదేవాశ్చ దృష్ట్వా మామీయురంజసా. 29
రూపిణో మామథోచుస్తే భోఽనంత ! ఇతి తే దశ
దిగ్వాతార్క ప్రచేతోఽశ్వి వహ్నీంద్రోపేంద్ర మిత్రకాః. 30

భా: ఇంద్రియములను నిగ్రహించుటకు వ్యగ్రమనస్కుడైన నన్నుచూచి ఇంద్రియముల అధిష్ఠాతృదేవతలు తమ తమరూపములను ధరించి ఓఅనంత! మేము దిక్, వాత, అర్క, ప్రచేతస్, అశ్వి ( ఇద్దరు), వహ్ని, ఇంద్ర, ఉపేంద్ర మిత్రులము.

ఇంద్రియాణాం వయం దేవాస్తవ దేహే ప్రతిష్ఠితాః
నఖాగ్రకాండ సంభిన్నాన్నాస్మాన్ కర్తుమిహార్హసి. 31
నశ్రేయోహి తవానంత మనోనిగ్రహకర్మణి
ఛేదనే భేదనేఽస్మాకం భిన్నమర్మా మరిష్యసి. 32

భా: మేము పదిమంది పది ఇంద్రియములకధిష్ఠాతృదేవతలము. శరీరమందు ప్రతిష్ఠింపబడితిమి. మమ్ములను నఖాగ్రహముకొఱకు ఇంద్రియములను బాధించుట వలన నీకు శ్రేయస్సుగలుగదు. వాటిని ఛిన్నాభిన్నము చేయుటవలన మృతి చెందెదవు.

అంధానాం బధిరాణాఞ్చ వికలేంద్రియజీవినామ్
వనేఽపి విషయవ్యగ్రం మానసం లక్షయామహే. 33
జీవస్యాపి గృహస్థస్య దేవోగేహం మనోఽనుగః
బుద్ధిర్భార్యా తదనుగా వయమిత్యవధారయ. 34

భా: అంధులు, బధిరులు, వికలేంద్రియులగు మనుష్యులు వనమందు నివసించినను వా

మనస్సు విషయవ్యగ్రమై కనిపించుచున్నది. జీవాత్మ గృహస్థు శరీరము గృహ స్వరూపము. బుద్ధి గృహిణి. మనస్సు పరిచారకులు, మమ్ములను బుద్ధిరూపభార్యకు అనుచరులుగ తెలుసుకొనుము.

**కర్మాయత్తస్య జీవస్య మనో బంధవిముక్తికృత్**
**సంసారయతి లుబ్ధస్య బ్రహ్మణో యస్యమాయయా. 35**
**తస్మాన్మనో నిగ్రహార్థం విష్ణుభక్తిం సమాచర**
**సుఖమోక్షప్రదా నిత్యం దాహికా సర్వకర్మణామ్. 36**

భా: కర్మాధీనుడగు జీవుని మోక్ష(సంసార)బంధములకు మనస్సు కారణము. పరమేశ్వరుని మాయా శక్తివలన మనస్సు లోభియగు పురుషునిసంసార బంధమున పడవేయును. కనుక నీవు మనస్సును నిగ్రహించుటకు విష్ణుభక్తి నాచరింపుము. విష్ణుభక్తి సర్వకర్మలను నాశము చేసి మోక్షము నిచ్చును.

**ద్వైతాద్వైత ప్రదానందసందోహా హరి భక్తికా**
**హరిభక్త్యా జీవకోశ వినాశాంతే మహామతే. 37**
**పరం ప్రాప్స్యసి నిర్వాణం కల్కేరాలోకనాత్ త్వయా**
**ఇత్యహం బోధితస్తేన భక్త్యా సంపూజ్య కేశవమ్. 38**

భా: హరి భక్తి వలన ద్వైత అద్వైత జ్ఞానము కలుగును. ఆనందసందోహము నిచ్చును. ఓమహామతి ! హరిభక్తివలన జీవకోశము = లింగశరీరము ధ్వస్తమగును. ( మృత్యుకాలమున స్థూల శరీరము నష్టమయినను సూక్ష్మ శరీరము పాపపుణ్య కర్మ ఫలములననుభవించును. మోక్షసమయమున సూక్ష్మశరీరముకూడ నష్టమగును. ) కల్కి భగవానుని దర్శనమువలన మోక్షమును పొందెదవని నేను హంసునిచే ఉపదేశింపబడి భక్తితో కేశవుని పూజించి ......

**కల్కిం దిదృక్షురాయాతః కృష్ణం కలికులాంతకమ్**
**దృష్టం రూపమరూపస్య స్పృష్ట స్తత్పదపల్లవః**
**అపదస్య శ్రుతం వాక్యమవాచ్యస్య పరాత్మనః. 39**
**ఇత్యనంతః ప్రముదితః పద్మానాథం నిజేశ్వరమ్**
**కల్కిం కమలపత్రాక్షం నమస్కృత్య యయౌ మునిః. 40**

భా: కలి కులలాంతకుడగు కల్కిని చూచుటకు ఇచ్చటకు వచ్చితిని. ఇచ్చట రూపహీనుడగు ఈశ్వరుని రూపము దర్శించితిని. పదహీనుని పాదపల్లవములను స్పృశించితిని. అవాచ్యుడగు పరమాత్ముని గూర్చి వింటిని అని చెప్పి అనంత మహర్షి ప్రమోదమునొందినవాడై

పద్మానాథుడు, కమలదళలోచనుడగు శ్రీహరిని నమస్కరించి వెడలెను.

రాజానో మునివాక్యేననిర్వాణపదవీం గతాః
కల్కిమభ్యర్చ్య పద్మాఞ్చ నమస్కృత్య మునివ్రతాః. 41

శుక ఉవాచ......

అనంతస్య కథామేతా మజ్ఞానధ్వాంత నాశినీమ్
మాయానియంత్రీం ప్రపఠన్ శృణ్వన్ బంధాద్విముచ్యతే. 42
సంసారాబ్ధి విలాసలాలసమతిః శ్రీవిష్ణుసేవాదరో
భక్త్యాఖ్యానమిదంస్వభేదరహితం నిర్మాయ ధర్మాత్మనా
జ్ఞానోల్లాస నిశాతఖడ్గముదితః సద్భక్తి దుర్గాశ్రయః
షడ్వర్గం జయతాదశేష జగతామాత్మస్థితం వైష్ణవః. 43

భా: మునివచనమునననుసరించి రాజులందరు కల్కిని, పద్మావతిని పూజించి ముక్తిమార్గమును పొందిరి. శుకము పలికెను. అనంతుని కథను వినిన చదివినవారికి మాయ నియంత్రితమై అజ్ఞానాంధకారము దూరమగును. సంసారబంధము నుండి ముక్తి పొందెదరు. విష్ణుసేవాతత్పరుడై ధర్మపరాయణుడైనప్పటికి సంసారసాగరమున విహరించవలెనని కోరిక కలవాడుకూడ భక్తితో ఈ ఆఖ్యానము చేసి జ్ఞానమనెడు తీక్ష్ణమైన ఖడ్గమును ధరించి సద్భక్తియను దుర్గను ఆశ్రయించి కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను ఆరు అంతశ్శత్రువులను జయించును.

ఇతి శ్రీ కల్కి పురాణేఽను భాగవతే
భవిష్యే ద్వితీయాంశే
అనంతమాయా విరసనం నామ
పంచమోఽధ్యాయః

ఇది భాగవతాను బంధము భవిష్యనగు
శ్రీకల్కిపురాణమున ద్వితీయాంశమున
అనంతమాయా నిరసన మను
పంచమాధ్యాయము.



# కల్కి పురాణము

## ద్వితీయాంశము షష్ఠాధ్యాయము

సూత ఉవాచ....

గతే నృపగణే కల్కిః పద్మయా సహ సింహళాత్
శంభల గ్రామగమనే మతిం చక్రే స్వసేనయా. 1
తతః కల్కేరభిప్రాయం విదిత్వా వాసవస్త్వరన్
విశ్వకర్మాణమాహూయ వచనం చేదమబ్రవీత్. 2

భా: సూతుడు పలికెను. రాజులు వెడలిన పిమ్మట కల్కి పద్మతోకూడ సేనాసహితుడై శంభలగ్రామమునకు వెళ్ళదలచెను. అప్పుడు కల్కి అభిప్రాయము తెలిసిన ఇంద్రుడు విశ్వకర్మను పిలిచి ఇట్లు చెప్పెను.

ఇంద్ర ఉవాచ.....

విశ్వకర్మన్ శంభలే త్వం గృహోద్యానాట్ట ఘట్టితమ్
ప్రాసాద హర్మ్య సంబాధం రచయ స్వర్ణ సంచయైః. 3
రత్నస్ఫటిక వైదూర్య నానామణి వినిర్మితైః
తత్రైవ శిల్పనైపుణ్యం తవ యచ్చాస్తి తత్కురు. 4

భా: ఇంద్రుడు పలికెను. ఓ విశ్వకర్మ ! శంభల గ్రామమున నీవు స్వర్ణమయములగు గృహములు, రాజులు క్రీడించు ఉద్యానవనములు, అట్టములు (మేడలయొక్క వెనుక ప్రక్క గట్టిన యిండ్లు ) ప్రాసాదములు, హర్మ్యములను నిర్మింపుము. రత్న, స్ఫటిక, వైడూర్యాది మణులతో అనేక నిర్మాణములు చేయుచు నీ శిల్పనైపుణ్యమును చూపుము.

శ్రుత్వా హరేర్వచో విశ్వకర్మా శర్మ నిజం స్మరన్
శంభలే కమలేశస్య స్వస్త్యాది ప్రముఖాన్ గృహాన్. 5
హంససింహ సుపర్ణాది ముఖాంశ్చక్రే స విశ్వకృత్
ఉపర్యుపరి తాపఘ్నవాతాయన మనోహరాన్. 6

భా: ఇంద్రుని మాటలు వినిన విశ్వకర్మ ఇది యంతయుతన మంగళము కొఱకేనని తలచి శంభల గ్రామమున స్వస్త్యాది బహువిధ గృహములను నిర్మించెను. హంస, సింహ, గరుడాది ముఖములు కల్గిన, గ్రీష్మనివారణ కొఱకు చాలా కిటికీలతో మనోహరమగునట్లు ఒకదానిపై మరియొకటి నిర్మించెను.

**నానావనలతోద్యానసరోవాపీ సుశోభితః**
**శంభలశ్చాభవత్ కల్కేర్యథేంద్రస్యామరావతీ. 7**
**కల్కిస్తు సింహళాద్ద్వీపాద్బహిః సేనాగణై ర్వృతః**
**త్యక్త్వా కారుమతీం కూలే పాథోధేరకరోత్ స్థితిమ్. 8**

భా: అనేక ప్రకారములగు వనములు, లతలు, ఉద్యాన వనములు, సరస్సులు, దిగుడు బావులతో శోభించు శంభలగ్రామము ఇంద్రునిఅమరావతి వలె చూడముచ్చటగనుండెను. కల్కి సింహళద్వీపమున సేనతోగూడి కారుమతి నగరమును విడిచి బయటకు వచ్చి సముద్రతటమును చేరెను.

**బృహద్రథస్తు కౌముద్యా సహితః స్నేహకాతరః**
**పద్మయా సహితాయాస్మై పద్మానాథాయ విష్ణవే. 9**
**దదౌ గజానామయుతం లక్షం ముఖ్యంచ వాజినామ్**
**రథానాం చ ద్విసాహస్రం దాసీనాం ద్వే శతే ముదా. 10**

భా: పుత్రికా వాత్సల్యముచే బృహద్రథుడు రాణియగు కౌముదితోగూడి సముద్ర నీరమునకు వచ్చి కల్కికి పద్మతోగూడ దశసహస్ర గజములను, లక్ష ఉత్తమాశ్వములను రెండు వందలపరచారికలనిచ్చెను.

**దత్వా వాసాంసి రత్నాని భక్తి స్నేహా శ్రులోచనః**
**తయోర్ముఖాలోకనేన నాశకత్ కించిదీరితుమ్. 11**
**మహావిష్ణుదంపతీ తౌ ప్రస్థాప్య పునరాగతః**
**పూజితః కల్కిపద్మాభ్యాం నిజ కారుమతీం పురీమ్. 12**

భా: అమూల్యములగు వస్త్రములను, రత్నములనిచ్చి భక్తిస్నేహపూరిత నేత్రములు గలవాడై బృహద్రథుడు దంపతులిద్దరిని చూచుచు ఏమియు మాట్లాడలేకుండెను. కల్కిచేతను, పద్మచేతను పూజింపబడి వారిని సాగనంపి బృహద్రథ దంపతులు కారుమతీ నగరమునకు తిరిగి వచ్చిరి.

కల్కిస్తు జలధేరంభో విగాహ్య పృతనాగణైః
పారం జిగమిషుం దృష్ట్వాజంబుకం స్తంభితోఽభవత్. 13
జలస్తంభమథాలోక్య కల్కిః సబలవాహనః
ప్రయయౌ పయసాం రాశేరుపరి శ్రీనికేతనః. 14

భా: పిమ్మట సేనాసహితుడైన కల్కి సముద్రస్నానమాచరించి, సముద్రమును దాటుటకభిలషించు నక్కనుచూచి జలమును స్తంభింపజేసెను. జలస్తంభనము తరువాత కల్కి ససైన్యుడై సముద్ర జలముపై నడిచి వెళ్ళెను.

గత్వా పారం శుకం ప్రాహ యాహి మే శంభలాలయమ్
విశ్వకర్మకృతం యత్ర దేవరాజాయాజ్ఞబహు
సద్మ సంబాధమమలం మత్ప్రియార్థం సుశోభనమ్. 15
తత్రాపి పిత్రోః జ్ఞాతీనాం స్వస్తిబ్రూయాద్యథోచితమ్
యదత్రాంగ ! వివాహాది సర్వం వక్తుం త్వమర్హసి. 16

భా: సముద్రము దాటిన పిమ్మట కల్కి శుకునితో ''నీవు శంభల గ్రామమునకు వెడలు''మని చెప్పెను . అచ్చట విశ్వకర్మ దేవరాజు ఆదేశముచే మాసంతోషము కొఱకు శోభనములగు గృహములను నిర్మించెను. అచ్చట మాతల్లిదండ్రులు, బంధువుల వద్ద మాక్షేమమును, వివాహాది వృత్తాంతమును తెలుపుము.

పశ్చాద్యామి వృతస్త్వైతై స్త్వమాదౌ యాహి శంభలమ్
కల్కేర్వచనమాకర్ణ్య కీరో ధీరస్తతో యయౌ
ఆకాశగామీ సర్వజ్ఞః శంభలం సురపూజితమ్. 17
సప్తయోజనవిస్తీర్ణం చాతుర్వర్ణ్యజనాకులమ్
సూర్యరశ్మి ప్రతీకాశం ప్రాసాద శతశోభితమ్. 18

భా: నీవుముందు శంభల గ్రామమునకు వెళ్ళుము. నేను పిదప సైన్యముతో వచ్చెదనని కల్కి పలుకగ బుద్ధిమంతుడగు శుకము వెంటనే బయులు దేరెను. ఆకాశమార్గమున సురపూజితమగుశంభల గ్రామము చేరెను. శంభల గ్రామము ఏడుయోజనముల విస్తీర్ణము గలది. నాలుగువర్ణములవారు అచ్చట గలరు. సూర్య రశ్మివలె ప్రకాశించెడి ప్రాసాద శతముచే గ్రామము శోభిల్లుచున్నది.

సర్వర్తు సుఖదం రమ్యం శంభలం విహ్వాలోఽవిశత్
గృహాద్గృహాంతరం దృష్ట్వా ప్రాసాదా దపి చాంబరమ్. 19
వనాద్వనాంతరం తత్ర వృక్షాద్వృక్షాంతరం వ్రజన్
శుకః సవిష్ణుయశసః సదనం ముదితోఽవ్రజత్. 20
తం గత్వా రుచిరాలాపైః కథయిత్వా ప్రియాః కథాః
కల్కే రాగమనం ప్రాహ సింహలాత్ పద్మయా సహ. 21

భా: అన్ని ఋతువుల యందు మనోహరమై సుఖమునిచ్చు శంభలగ్రామమును శుకము ప్రవేశించెను. ఒకయింటినుండి మరియొక యింటికి, భవనము నుండి ఆకాశమునకు, వనమునుండి వనాంతరమునకు, వృక్షము నుండి వృక్షాంతరమునకు ఎగురుచు హర్షాతిరేకముతో శుకముక విష్ణుయశస్సు ఇంటికి వెడలెను. అచ్చట హృద్యములగు మాటలను చెప్పి సింహళద్వీపము నుండి పద్మతో గూడి కల్కి వచ్చుచున్న వార్తను నివేదించెను.

తతస్త్వరన్ విష్ణుయశాఃసమానార్య ప్రజా జనాన్
విశాఖయూపభూపాలం కథయామాస హర్షితః. 22
స రాజా కారయామాస పురగ్రామాది మండితమ్
స్వర్ణకుంభైః సదంభోభిః పూరితైశ్చందనోక్షితైః. 23

భా: పిమ్మట విష్ణుయశస్సు సంతుష్టుడై శీఘ్రముగ విశాఖయూప భూపాలునికి ప్రజలకు ఈవృత్తాంతము చెప్పెను. కల్కి రాకను తెలుసుకొని విశాఖయూపుడు జలపూర్ణసువర్ణ కుంభములతో చందనాదులతో గ్రామ, నగరములను అలంకరింపచేసెను.

కాలాగురుసుగంధాఢ్యైః దీపలాజాంకురాక్షతైః
కుసుమైః సుకుమారైశ్చ రంభాపూగఫలాన్వితైః
శుశుభే శంభలగ్రామో విబుధానాం మనోహరః. 24

భా: శంభల గ్రామము, అగరు ధూపములతో, దీపములతో, లాజలతో, అక్షతలతో, సుకుమార పుష్పములతోడను, అరటిపండ్లు పోకఫలములతోడను దేవతలకు సయితము చూడముచ్చటగా నుండెను.

తం కల్కిః ప్రావిశ ద్భీమ సేనాగణ విలక్షణః
కామినీ నయనానందమందిరాంగః కృపానిధిః. 25

పద్మయా ...తః పిత్రోః పదయోః ప్రణతోऽపతత్
సుమతిర్ముదితా పుత్రం స్నుషాం శక్రం శచీమివ
దదృశే త్వమరావత్యాం పూర్ణకామా దితిః సతీ. 26

భా: కామినీ నేత్రానందకారకుడు, కృపానిధి అయిన కల్కి ససైన్యుడై నగరమును ప్రవేశించెను. పద్మతోగూడి కల్కి తల్లి దండ్రులకు పాదాభివందనము చేసెను. దేవలోకమున దితి ఇంద్రశచీదేవులను చూచి ఆనందించినట్లు సుమతి తన పుత్రుడగు కల్కిని, కోడలు పద్మావతిని చూచి తన మనోరథము సిద్ధించినదని సంతోషించెను.

శంభలగ్రామనగరీ పతాకాధ్వజ శాలినీ
అవరోధ సుజఘనా ప్రాసాద విపులస్తనీ
మయూరచూచకా హంససంఘహారమనోహరా. 27
పటవాసోద్యోత ధూమవసనా కోకిల స్వనా
సహాసగోపురముఖీ వామనేత్రా యథాఙ్గనా
కల్కిం పతిం గుణవతీ ప్రాప్య రేజే తమీశ్వరమ్. 28

భా: పతాకాధ్వజములతో నొప్పు శంభల గ్రామనగరి యను కాంత కల్కి భగవానుని పతిగ పొందినట్లు ప్రకాశించుచున్నది. అంతఃపురము ఆమె యొక్క జఘన ప్రదేశము, ప్రాసాదములు పీనస్తనములు, మయూరములే చూచుకములు. హంస మాలలు ముక్తాహారములు. సుగంధద్రవ్యముల నుండి వెలువడిన ధూమమే ఆమెకు వస్త్రములు. కోకిలనాదమే మాటలు. గోపురమే మందహాసముతో గూడిన ముఖము. ఈవిధముగ శంభలనగరి సుందరనేత్రములతో గూడిన గుణవతియగు స్త్రీవలె శోభిల్లుచున్నది.

స రేమే పద్మయా తత్ర వర్షపూగానజాశ్రయః
శంభలే విహ్వాలాకారః కల్కిః కల్క వినాశనః. 29
కవేః పత్నీ కామకలా సుషువే పరమేష్ఠినౌ
బృహత్కీర్తి బృహద్బాహూ మహాబలపరాక్రమౌ. 30

భా: పాపనాశకుడగు కల్కి పద్మావతితో గూడ అనేకసంవత్సరములు శంభల గ్రామమున సంతోషముతో గడిపెను. కవి పత్నియగు కామకలకు మహాబల పరాక్రమసంపన్నులగు బృహత్కీర్తి, బృహద్బాహువు అను ధార్మికులగు ఇద్దరు పుత్రులు కలిగిరి.

ప్రాజ్ఞస్య సన్నతిర్భార్యా తస్యాం పుత్రౌ బభూవతుః
యజ్ఞవిజ్ఞౌ సర్వలోకపూజితౌ విజితేంద్రియౌ. 31
సుమంత్రకస్తు మాలిన్యాం జనయామాస శాసనమ్
వేగవంతం చ సాధూనాం ద్వావేతావుపకారకౌ. 32

భా: ప్రాజ్ఞుని భార్య సన్నతికి యజ్ఞ, విజ్ఞులను సర్వలోకపూజితులు, జితేంద్రియులగునిద్దరు పుత్రులు జన్మించిరి. సుమంత్రకుని భార్య మాలినికి సాధుపురుషులకుపకారము చేసెడి స్వభావము గల శాసనుడు, వేగవంతుడని ఇద్దరు పుత్రులు కలిగిరి.

తతః కల్కేశ్చ పద్మాయాం జయో విజయ ఏవ చ
ద్వౌపుత్రౌ జనయామాస లోకఖ్యాతౌ మహాబలౌ. 33
ఏతైః పరివృతోఽమాత్యైః సర్వసంపత్ సమన్వితౌ
వాజిమేధవిధానార్థముద్యతం పితరం ప్రభుః. 34

భా: కల్కి వలన పద్మావతికి జయ, విజయులను ఇద్దరు పుత్రులు జన్మించిరి. వారు లోకవిఖ్యాతులు, మహా బలసంపన్నులు. నిజపరివారముతో, సర్వ సంపదలతో కూడిన తన తండ్రిచే అశ్వమేధయాగము చేయించుటకు సిద్ధపడిరి.

సమీక్ష్య కల్కిః ప్రోవాచ పితామహమివేశ్వరః
దిశాంపాలాన్ విజిత్యాహం ధనాన్యాహృత్య ఇత్యుత. 35
కారయిష్యామ్యశ్వమేధం యామి దిగ్విజయాయ భోః
ఇతి ప్రణమ్య తం ప్రీత్యా కల్కిః పరపురంజయః
సేనాగణైః పరివృతః ప్రయయౌ కీకటం పురమ్. 36

భా: ఈశ్వరుడు పితామహునివలె, నేను దిక్పాలురను జయించి ఐశ్వర్యము తీసుకువచ్చి మీచేత అశ్వమేధము చేయించెదను. కనుక నేను దిగ్విజయయాత్రకు బయలుదేరెదనని చెప్పి శత్రు పురంజయుడగు కల్కి ప్రీతితో తండ్రికి నమస్కరించి ససైన్యుడై కీకట పురమును జయించుటకు వెడలెను.

బుద్ధాలయం సువిపులం వేదధర్మ బహిష్కృతమ్
పితృదేవార్చనాహీనం పరలోకవిలోపకమ్. 37
దేహాత్మవాద బహుళం కులజాతివివర్జితమ్
ధనైః స్త్రీభిర్భక్ష్యభోజ్యైఃస్వపరాభేదదర్శినమ్. 38

భా: అత్యంతము విస్తృతమగు కీకటపురము బుద్ధుని ప్రధానస్థావరము. ఇచ్చట వైదికధర్మములు బహిష్కరింపబడినవి. పితృదేవపూజలు జరుగుటలేదు. పరలోక భీతిలేదు. శరీరమే ఆత్మయను వాదము బహుళముగ నున్నది. కుల, జాతి విభాగము లేదు. స్త్రీ, ధన, భక్ష్య, భోజ్యముల విషయమై స్వపరభేదములేదు. వాటిని గ్రహించుటలో అందరిని సమానముగ తలతురు.

**నానాజనైః పరివృతం పానభోజన తత్పరైః**
**శ్రుత్వా జినో నిజగణైః కల్కేరాగమనం క్రుధా**
**అక్షౌహిణీభ్యాం సహితః సంబభూవ పురాద్బహిః. 39**
**గజరథ తురగైః సముచితా భూః కనకవిభూషణ భూషితైర్వరాంగైః**
**శతశతరథిభిః ధృతాస్త్రశస్త్రైర్ధ్వజ పటరాజి నివారితాతపైర్బభౌ సా. 40**

భా: కల్కి తన సైన్యముతో యుద్ధమునకు వచ్చుచున్నట్లు తెలుసుకొని జినుడు రెండు అక్షౌహిణులసేనను తీసుకొని యుద్ధమునకు నగరము బయటకు వెడలెను. సువర్ణమయాలంకారములతో అలంకృతమైన గజరథ తురగములతో, శతశత రథికులతో, అస్త్రశస్త్రములు ధరించిన వారితో యుద్ధరంగము ప్రకాశించెను. సైనికుల ధ్వజపటసముదాయముచే ఆతపము నివారింపబడెను.

ఇతి శ్రీ కల్కి పురాణేఽను భాగవతే
భవిష్యే ద్వితీయాంశే
కీకట పురగమనం నామ
షష్ఠోఽధ్యాయః.

ఇది భాగవతానుబంధము, భవిష్యము నగు
శ్రీ కల్కిపురాణమున ద్వితీయాంశమున
కీకట పురగమన మను
షష్ఠాధ్యాయము.



# కల్కిపురాణము
## ద్వితీయాంశము - సప్తమాధ్యాయము

సూత ఉవాచ....

తతో విష్ణుః సర్వజిష్ణుః కల్కిః కల్కవినాశనః
కాలయామాస తాంసేనాం కరిణీమివ కేసరీ. 1
సేనాంగానాం తాం రతిసంగరక్షతీం
రక్తాక్తవస్త్రం వివృతోరుమధ్యామ్
పలాయతీం చారువికీర్ణకేశాం
వికూజతీం ప్రాహ స కల్కినాయకః. 2

భా: సూతుడు పలికెను. పాపనాశకుడు, జిష్ణువు, విష్ణువగు కల్కి సింహము ఏనుగునువలె బౌద్ధసేనను చెండాడెను. కల్కియను నాయకుడు, రతియనెడి యుద్ధమున గాయపడి రక్తముచే ఆర్ద్రమగు వస్త్రము గల్గి విప్పారిన ఊరుమధ్యదేశము కల్గి, విప్రకీర్ణములగు కేశములు కల్గి, రొదచేయుచు పారిపోవు సేనయనెడి నాయికతో ఇట్లు పలికెను.

రే బౌద్ధాః ! మాపలాయధ్వం నివర్తధ్వం రణాఙ్గణే
యుధ్యధ్వం పౌరుషం సాధు దర్శయధ్వం పునర్మమ. 3
జినో హీనబలః కోపాత్ కల్కేరాకర్ణ్య తద్వచః
ప్రతియోద్ధుం వృషారూఢః ఖడ్గచర్మధరో యయౌ. 4

భా: ఓబౌద్ధులార ! యుద్ధభూమినుండి పారిపోకుడు. మరలుడు. యుద్ధము చేసి మీసామర్థ్యము ప్రదర్శింపుడు. బలహీనుడైన జినుడు కల్కి యొక్క మాటలను విని క్రుద్ధుడై ఖడ్గము, కవచము ( తోలుచేకప్పబడినది ) లను ధరించి వృషభమునెక్కి యుద్ధము చేయుటకు వెడలెను.

నానాప్రహరణోపేతో నానాయుధవిశారదః
కల్కినా యుయుధే ధీరో దేవానాం విస్మయావహః. 5

శూలేన తురగం విద్ధ్వా కల్కిం బాణేన మోహయన్
క్రోడీకృత్య ద్రుతం భూమేర్నాశకత్తోలనాద్ధృతః. 6

భా: బహువిధములగు ఆయుధములను ప్రయోగించుటయందునేర్పరి, అనేక ఆయుధములతో కూడిన ధీరుడగు జినుడు దేవతలకు విస్మయము కల్గించునట్లు కల్కితో యుద్ధము చేసెను. శూలముతో తురగమును గాయపరచి, బాణముచే కల్కిని అచేతనుని చేసెను. పిమ్మట అతనిని శీఘ్రముగ చేతులనడుమ ఎత్తుటకు ప్రయత్నము చేసి విఫలుడయ్యెను.

జినో విశ్వంభరం జ్ఞాత్వా క్రోధాకులితలోచనః
చిచ్ఛేదాస్య తనుత్రాణం కల్కేః శస్త్రాణ్చ దాసవత్. 7
విశాఖయూపోఽపి తథా నిహత్య గదయా జినమ్
మూర్ఛితం కల్కిమాదాయ లీలయా రథమారుహత్. 8

భా: జినుడు కల్కిని విశ్వంభరునిగ తెలుసుకొని మిక్కిలి క్రుద్ధుడై అతని శరీరరక్షకమగు కవచమును, శస్త్రములను ఛిన్నాభిన్నము చేసెను. విశాఖయూపుడు గదతో జినుని గాయపరచి మూర్ఛపోయిన కల్కిని సులభముగ రథములోనికెక్కించెను.

లబ్ధసంజ్ఞస్తథా కల్కిః సేవకోత్సాహదాయకః
సముత్పత్య రథాత్తస్య నృపస్య జినమాయయౌ. 9
శూలవ్యథాం విహాయాజౌ మహాసత్వస్తురంగమః
రింగణైర్భ్రమణైః పాదవిక్షేపహననైర్ముహుః. 10

భా: తెలివివచ్చిన కల్కి సేవకుల కుత్సాహము నిచ్చువాడై రథమునుండి క్రిందికి దూకి జినుని కెదురేగెను. మహా బలశాలియగు అశ్వముకూడ శూలమువలన కల్గినబాధను విడిచి రణరంగమున చలించుచు, భ్రమించుచు,పాదఘాతములు చేయుచు.......

దండాఘాతైః సటాక్షేపైర్బౌద్ధసేనాగణాంతరే
నిజఘాన రిపూన్ కోపాచ్ఛతశోఽథ సహస్రశః. 11
నిశ్వాసవాతైరుద్ధీయ కేచిద్ ద్వీపాంతరేఽపతన్
హస్త్యశ్వరథసంబాధాః పతితా రణమూర్ధని. 12

భా: బౌద్ధసేననడుమ కోపముతో దండాఘాతములు,కేశాక్షేపములచే వందలు,వేలకొలది శత్రువు[redacted]చంపెను. గుఱ్ఱము యొక్క నిఃశ్వాస వాయువులచే కొందరు ఎగిరి ద్వీపాంతరమందు పడిరి. మరికొందరు ఏనుగులు, అశ్వములు, రథములతో ఢీకొని రణభూమియందు పడిరి.

గర్గా జఘ్నుః షష్టిశతం గర్గఃకోటిశతాయుతమ్
విశాలస్తు సహస్రాణాం పంచవింశం రణే త్వరన్. 13
అయుతే ద్వేజఘానాజౌ పుత్రాభ్యాం సహితః కవిః
దశలక్షం తథాప్రాజ్ఞః పంచలక్షం సుమంత్రకః. 14

భా: గర్గులు యుద్ధరంగమున 60 వేలమంది బౌద్ధసేనను, గర్గుడు ఒకకోటి పదివేలమందిని, విశాలుడు 25 వేలమందిని సంహరించిరి. తనపుత్రులతో కలసి కవి 20 వేలమంది శత్రుసైన్యమును సంహరించెను. అట్లే ప్రాజ్ఞుడు పదిలక్షలమందిని , సుమంత్రకుడు 5 లక్షలమందిని చంపెను.

జినం ప్రాహ హసన్ కల్కిస్తిష్ఠాగ్రే మమ దుర్మతే
దైవం మాం విద్ధి సర్వత్ర శుభాశు భఫలప్రదమ్. 15
మద్బాణజాలభిన్నాంగో నిస్సంగోయాస్యసి క్షయమ్
న యావత్ పశ్య తావత్త్వం బంధూనాం లలితం ముఖమ్. 16

భా: పిమ్మట కల్కి చిరునవ్వుతో ' ఓదుర్మతి ! ఎదురుగ నిలబడుము. శుభాశుభఫలముల నిచ్చు దైవముగ నన్ను తెలుసుకొనుము. నాబాణములచే భిన్నమైన అవయవములు గలవాడవై తప్పక నాశము పొందెదవు. కనుక ఇంతలో బంధువులసుందర ముఖములను వీక్షింపుము ' అని జినునితో పలికెను.

కల్కేరితీరితం శ్రుత్వా జినః ప్రాహ హసన్ బలీ
దైవం త్వదృశ్యం శాస్త్రే తే వధోఽయమురరీకృతః
ప్రత్యక్షవాదినో బౌద్ధా వయం యూయం వృథాశ్రమాః. 17
యది వా దైవరూపస్త్వం తథాప్యగ్రే స్థితా వయమ్
యది భేత్తాసి బాణౌఘైస్తదా బౌద్ధైః కిమత్ర తే. 18

భా: కల్కి మాటలు వినిన జినుడు మందహాసము చేసి దైవము ప్రత్యక్షముగాదు. ప్రత్యక్షవాదులగు మేము ప్రత్యక్షము కానిదాని నంగీకరించము. నీవధ తథ్యము. నీశ్రమయంతయు వ్యర్థమే. నీవు దైవస్వరూపమే అయినచో మా ఎదురుగ నిలబడుము. నీవు బాణములతో మమ్ములను ఛేదించదలచిన బౌద్ధగణము నిన్ను క్షమించునని పలికెను.

సోపాలంభం త్వయాఖ్యాతం త్వయ్యేవాస్తు స్థిరో భవ
ఇతి క్రోధాద్బాణజాలైః కల్కిం ఘోరైః సమావృణోత్. 19

సతు బాణమయం వర్షం క్షయం నిన్యేఽర్కవద్ధిమమ్
బ్రాహ్మం వాయవ్యమాగ్నేయం పార్జన్యం చాన్యదాయుధమ్
కల్కేర్దర్శనమాత్రేణ నిష్ఫలాన్యభవన్ క్షణాత్. 20

భా: తిరస్కార పూర్వకముగ పలికిన నిందావాక్యములు నీవద్దనే ఉండనిమ్ము. స్థిరముగనుండుమని చెప్పి బౌద్ధసైన్యము కల్కిని తీక్ష్ణములగు బాణములతో నాక్రమించెను. సూర్యకిరణములు మంచును నాశముచేయునట్లు కల్కి జినుని బాణవర్షమును నాశముగావించెను. బ్రహ్మాస్త్రము, వాయవ్యాస్త్రము, ఆగ్నేయాస్త్రము, మేఘాస్త్రము, ఇతర అస్త్రములన్నియు కల్కి దర్శనము చేతనే నిష్ఫలమైనవి.

యథోషరే బీజముప్తం దానమశ్రోత్రియే యథా
యథా విష్ణౌ సతాం ద్వేషాద్భక్తిర్యేన కృతాప్యహో. 21
కల్కిస్తు తం వృషారూఢమవప్లుత్య కచేఽగ్రహీత్
తతస్తౌ పేతతుర్భూమౌ తామ్రచూడావివ క్రుధా. 22

భా: ఊషరక్షేత్రమందునాటినబీజమువలె, వేదము చదవని అపాత్రునికిచ్చిన దానము వలె సత్పురుషద్వేషము వలన విష్ణుభక్తికూడా నిష్ఫలమేయగును. కనుక అస్త్రశస్త్రములన్నియు నిష్ఫలమైనవి. పిమ్మట కల్కి ఎగిరిగంతేసి వృషభారూఢడైన జినుని కేశములను పట్టుకొనెను. ఇద్దరు కోపముతో కోడిపుంజులవలె భూమి మీద పడిరి.

పతిత్వా స కల్కికచం జగ్రాహ తత్కరం కరే
తతః సముత్థితౌ వ్యగ్రౌ యథా చాణూరకేశవౌ 23
ధృతహస్తౌ ధృతకచౌ ఋక్షావివ మహాబలౌ
యుయుధాతే మహావీరౌ జినకల్కీ నిరాయుధౌ. 24

భా: భూమిమీద జినుడు ఒకచేతితో కల్కికేశములను, మరియొకచేతితో అతని చేతులను పట్టుకొనెను. భూమిమీద పడిన ఇద్దరు పైకిలేచి చాణూరకేశవులవలె ఒకరినొకరు హస్తకేశములను పట్టుకొని మహావీరులు, మహాబలసంపన్నులు, నిరాయుధులగు జినకల్కులు ఋక్షములవలె పరస్పరము తలపడిరి.

తతః కల్కి మహాయోగీ పదాఘతేన తత్కటిమ్
విభజ్య పాతయామాస తాలం మత్తగజో యథా. 25

జినం నిపతితం దృష్ట్వా బౌద్ధా హాహేతి చుక్రుశుః
కల్కేః సేనాగణా విప్రా జిహ్రుషుర్నిహతారయః. 26

భా: మదపుటేనుగు తాలవృక్షమును పికలించినట్లుకల్కి పాదాఘాతములతో జినుని కటిప్రదేశమును చీల్చి క్రింద పడవేసెను. నిహతుడైన జినుని చూచి బౌద్ధసైన్యము హాహాకారములు చేసిరి. కల్కిసేన ఆనందమున కవధులు లేవు.

జినే నిపతితే భ్రాతా తస్య శుద్ధోదనో బలీ
పాదచారీ గదాపాణిః కల్కిం హంతుః ద్రుతం యయౌ. 27
కలిస్తు తం బాణవర్షైః పరివార్య సమంతతః
జగర్జ పరవీరఘ్నో గజమావృత్య సింహవత్. 28

భా: జినుడు పడిపోగా అతనిసోదరుడు మహాబలశాలియగు శుద్ధోదనుడు గదను చేతబూని పాదచారియై కల్కిని సంహరింప దలచి శీఘ్రముగ పరుగెత్తెను. అప్పుడు శత్రుభయంకరుడగు కలి బాణవర్షముచే శుద్ధోదనుని అడ్డగించి గజమును చూచిన సింహమువలె గర్జించెను.

గదాహస్తం తమాలోక్య పతిం స ధర్మవిత్ కవిః
పదాతిగో గదాపాణిస్తస్థౌ శుద్ధోదనాగ్రతః. 29
స తు శుద్ధోదనస్తేన యుయుధే భీమ విక్రమః
గజః ప్రతిగజేనేవ దంతాభ్యాం సగదావుభౌ. 30
యుయుధాతే మహావీరౌ గదాయుద్ధవిశారదౌ
కృతప్రతికృతౌ మత్తౌ నదంతౌ భైరవాన్ రవాన్. 31

భా: శుద్ధోదనుని గదాహస్తునిగ చూచి ధర్మవేత్త అయిన కవి గజమునుండి క్రిందికిదిగి గదాధారియై అతనిని ఎదుర్కొనెను. భయంకరమగు పరాక్రమము కల్గిన శుద్ధోదనుడు కవితో తలపడెను. దాయుద్ధ ప్రవీణులగు గదాధారులిద్దరు భయంకరశబ్దము చేయుచు రణోన్మత్తులై గదాయుద్ధము చేసిరి.

కవిస్తు గదయా గుర్వ్యా శుద్ధోదనగదాం నదన్
కరాదపాస్యాశు తయా స్వయా వక్షస్యతా డయత్. 32
గదాఘాతేన నిహతో వీరః శుద్ధోదనో భువి
పతిత్వా సహసోత్థాయ తం జఘ్నే గదయా పునః. 33

భా: పిమ్మట కవినాదము చేయుచు గదాఘాతముచే శుద్ధోదనుని చేతినుండి గదను క్రిందికి పడవైచి వక్షఃస్థలమందు గదతో మోదెను. గదాఘాతముచే కొట్టబడి భూమిమీద పడిన శుద్ధోదనుడు వెంటనేలేచి గదతో కవిని కొట్టెను

**సంతాడితేన తేనాపి శిరసా స్తంభితః కవిః**
**న పపాత స్థితస్తత్ర స్థాణు వద్వ్యాహ్వాలేంద్రియః. 34**
**శుద్ధోదనస్తమాలోక్య మహాసారం రథాయుతైః**
**ప్రావృతం తరసా మాయా దేవీమానేతు మాయయా. 35**

భా: గదా ప్రహారముచే తలతిరిగిన వాడై కవినేలమీద పడక స్థాణువువలె అచేతనునిగనుండెను. మహాబల పరాక్రమ సంపన్నులగు వేలకొలది సైనికులు చుట్టువుట్టినట్లు గమనించి శుద్ధోదనుడువెంటనే మాయాదేవిని ఆహ్వానించుటకు వచ్చెను.

**యస్యా దర్శనమాత్రేణ దేవాసురనరాదయః**
**నిస్సారాః ప్రతిమాకారా భవంతి భువనాశ్రయాః. 36**
**బౌద్ధా శౌద్ధోదనాద్యగ్రే కృత్వా తామగ్రతః పునః**
**యోద్ధుం సమాగతా మ్లేచ్ఛకోటి లక్షశతైర్వృతాః. 37**

భా: మాయాదేవిని చూచుటవలననే దేవతలు, అసురులు, నరులు మున్నగు ముల్లోకములవారు తేజోరహితులై ప్రతిమలవలె అచేతనులగుదురు. బౌద్ధ గణము మాయను ముందుగనుంచుకొని అసంఖ్యాక సేనతో యుద్ధము చేయుటకు వచ్చిరి.

**సింహధ్వజోచ్ఛ్రిత రథాం ఫేరుకాక గణా వృతామ్**
**సర్వాస్త్రశస్త్రజననీం షడ్వర్గ పరిసేవితామ్. 38**
**నానారూపాం బలవతీం త్రిగుణవ్యక్తి లక్షితామ్**
**మాయాంనిరీక్ష్య పురతః కల్కిసేనా సమాపతత్. 39**

భా: సింహధ్వజముతోగూడిన రథముగలది, కాక, గృధ్రగణముతో వ్యాప్తమయినది, సమస్త శస్త్ర, అస్త్రములను పుట్టించునది, కామక్రోధాది షడ్వర్గమును సేవించునది, అనేక రూపములు ధరించునది, బలవతి, త్రిగుణ రూపము కల్గిన మాయను ఎదురుగ చూచి కల్కిసేన క్రింద పడెను.

**నిస్సారాః ప్రతిమాకారాఃసమస్తాః శస్త్రపాణయః**
**కల్కిస్తానాలోక్యనిజాన్ భ్రాతృజ్ఞాతి సుహృజ్జనాన్**
**మాయయా జాయయా జీర్ణాన్ విభురాసీత్తదగ్రతః. 40**

భా: శస్త్రములు కల్గిన సైనికులందరు ప్రతిమల వలె సారరహితులైతిరి. భార్యయగు మాయచే తనసోదరులు, బంధువులు, స్నేహితులు శైథిల్యమును పొందుటచూచి కల్కి ఆమె ముందు వెడలెను.

తామాలోక్య వరారోహాం శ్రీరూపాం హరిరీశ్వరః
సా ప్రియేవ తమాలోక్య ప్రవిష్టాతస్య విగ్రహే. **41**
తామనాలోక్య తే బౌద్ధా మాతరం కతిధా వరాః
రురుదుః సంఘశో దీనా హీనస్వబలపౌరుషాః. **42**

భా: మనోహర రూపము కల్గిన మాయను శ్రీహరి చూడగనే , మాయకూడ ప్రియురాలివలె ఆసక్తితో అతనిని చూచి శ్రీహరి శరీరమందు లీనమయ్యెను. తల్లియగు మాయను గానక బౌద్ధసేన పౌరుష హీనులై ఆర్తనాదము చేయసాగిరి.

విస్మయావిష్టమనసః క్వగతేయమథాబ్రువన్
కల్కిః సమాలోకనేన సముత్థాప్యనిజాన్ జనాన్. **43**
నిశాతమసిమాదాయ మ్లేచ్ఛాన్ హంతుం మనో దధౌ
సన్నద్ధం తురగారూఢం దృఢహస్తధృతత్సరుమ్. **44**

భా: ఆశ్చర్యచకితులయిన బౌద్ధగణము మనతల్లి మాయ ఏమైనదని ప్రశ్నించుకొనిరి. కల్కి తన సైన్యమును దృష్టిసారించి సిద్ధము చేసెను. వాడియైన కత్తితీసుకొని మ్లేచ్ఛులను చంపవలెనను కోరికతో గుఱ్ఱమునధిరోహించి ఖడ్గముధరించి బయలుదేరెను.

ధనుర్నిషంగమనిశం బాణజాల ప్రకాశితమ్
ధృతహస్తతనుత్రాణగోధాఙ్గులి విరాజితమ్. **45**
మేఘోపర్యుప్తతారాభం దంశనస్వర్ణ బిందుకమ్
కిరీటకోటి విన్యస్త మణిరాజ విరాజితమ్. **46**
కామినీ యనానంద పందోహరస మందిరమ్
విపక్షపక్ష విక్షేపాక్షిప్త రూక్ష కటాక్షకమ్. **47**

భా: బాణసముదాయముచే ధనుస్సు, అమ్ములపొది ప్రకాశించుచున్నవి. శరీర రక్షకమగు కవచముచే శరీరము, వింటినారి దెబ్బ తాకకుండుటకై చేతగట్టుకొను తోలుచే అంగుళులు భాసించుచున్నవి. నీలమేఘుని మీద నక్షత్రములవలె, కవచముపై స్వర్ణ బిందువులు శోభిల్లుచున్నవి. కిరీటముయొక్క అగ్రభాగమందు అనేకమణులు విరాజిల్లుచున్నవి. కల్కి వీక్షణములుకామినీ

నయనానందదాయకములు, శత్రుపక్షములను విక్షిప్తముచేయుటలో పరుషములైనవి.

నిజభక్తజనోల్లాస సంవాస చరణాంబుజమ్
నిరీక్ష్య కల్కిం తే బౌద్ధాస్త్రసుర్ధర్మనిందకాః
జహృషుః సురసంఘాః ఖే యాగాహుతిహుతాశనాః. 48

సుబలమిలనహర్షః శత్రునాశైకతర్షః
సమరవరవిలాసః సాధుసత్కారకాశః
స్వజనదురితహర్తా జీవజాతస్యభర్తా
రచయతు కుశలం వః కామపూరావతారః. 49

భా: నిజ భక్తజనమునకుల్లాసము కలుగజేయు పాదపద్మములు కల్గిన కల్కిని చూచి ధర్మనిందకులగు బౌద్ధులు వ్యాకులపడిరి. యజ్ఞయాగములను నిర్వహించుటవలన హోమద్రవ్యము లభించునని దేవతలు సంతసించిరి. శత్రునాశమును ప్రధానముగ కోరువాడు, మహాసంగ్రామమున విలాసపూర్వకముగ యుద్ధము చేయువాడు, సాధుసత్కారమున కవతరించినవాడు, స్వజన దుఃఖనాశకుడు,సాధుజనకామనలను పూరించుటకవతరించిన కల్కిభగవానుడు మీకు మంగళము చేయుగాక.

ఇతి శ్రీకల్కి పురాణేఽ భాగవతే భవిష్యే
ద్వితీయాంశే బౌద్ధ యుద్ధో నామ
సప్తమోఽధ్యాయః

ఇది భాగవతానుబంధము భవిష్యమునగు
శ్రీ కల్కి పురాణమున ద్వితీయాంశమున
బౌద్ధ యుద్ధమను సప్తమాధ్యాయము.





# కల్కి పురాణము

## ద్వితీయ భాగము

అనువక్త

ప్రొ॥ శ్రీపాద సత్యనారాయణ మూర్తి

సంపాదకురాలు

శ్రీమతి. ఎస్. వి. ఫణీశ్వరి

తిరుపతి

# కల్కి పురాణము-ద్వితీయ భాగము

# విషయసూచిక

## తృతీయాంశము

# కల్కి పురాణము

## తృతీయాంశము - ప్రథమాధ్యాయము

సూత ఉవాచ........

తతః కల్కి ర్మ్లేచ్ఛగణాన్ కరవాలేన కాలితాన్
బాణైః సంతాడితా నన్యా ననయ ద్యమసాదనమ్. 1
విశాఖయూపోఽపి తథా కవిప్రాజ్ఞసుమంత్రకాః
గార్గ్య భార్గ్య విశాలాద్యా మ్లేచ్ఛాన్ నిన్యు ర్యమక్షయమ్. 2

భా: సూతుడు పలికెను. పిమ్మట కల్కి మ్లేచ్ఛులలో కొందరిని కరవాలముతో ఖండించి, మరికొందరిని బాణములతో కొట్టి యమపురికి పంపెను. అట్లే విశాఖ యూప, కవి, ప్రాజ్ఞ, సుమంత్రక, గార్గ్య, భార్గ్య, విశాలాదులు మ్లేచ్ఛులను యమసదమునకు పంపిరి.

కపోతరోమా కాకాక్షః కాకకృష్ణాదయో ఽపరే
బౌద్ధాః శౌద్ధోదనా యాతా యుయుధుః కల్కిసైనికైః. 3
తేషాం యుద్ధ మభూద్ఘోరం భయదం సర్వదేహినామ్
భూతేశానందజనకం రుధిరారుణకర్దమమ్. 4

భా: కపోతరోమ, కాకాక్ష, కాకకృష్ణాదులు, శౌద్ధోదన గణము వచ్చి కల్కి సైనికులతో యుద్ధము చేసిరి. సర్వప్రాణులకు భయము గొల్పు రీతిలో భయంకరముగ యుద్ధము జరిగెను. రక్తప్రవాహముచే యుద్ధభూమి బురద ఆయెను. యుద్ధము భూత నాథున కానందదాయకమైనది.

గజాశ్వరథసంఘానాం పతతాం రుధిరస్రవైః
స్రవంతీ కేశశైవాలా వాజిగ్రాహా సుగాహికా. 5
ధనుస్తరఙ్గా దుష్పారా గజరోదః ప్రవాహిణీ
శిరఃకూర్మా రథతరిః పాణిమీనా సృగాపగా. 6

భా: రణరంగమున క్రిందపడుచున్న గజ, అశ్వ, రథికుల రక్తము ప్రవహించు చున్నది. అందు కేశములు శైవాలము (నాచు) వలె నున్నవి. అశ్వములనెడి జలజంతువులు రక్తప్రవాహమున మునిగిపోవు చున్నవి, ఇందు ధనుస్సులు తరంగములవలె, ఏనుగులు దాటుటకు కష్టమయిన

రక్తనది మీద నిర్మించిన వంతెన వలె, తెగిపడిన శిరస్సులు తాబేళ్ళవలె, చేతులు మీనముల వలె కన్పించు చున్నవి.

ప్రవృత్తా తత్ర బహుధా హర్షయంతో మనస్వినామ్
దుందుభేయరవా ఫేరు శకునానందదాయినీ. 7

గజైర్గజా నరై రశ్వాః ఖరైరుష్ట్రాః రథైః రథాః
నిపేతు ర్బాణభిన్నాంగా శ్ఛిన్నబాహ్వంఘ్రికంధరాః. 8

భా: దుందుభిసంబద్ధ ధ్వనులతో గూడిన రుధిర ప్రవాహము నక్కలు, గ్రద్దలకు ఆనందము నిచ్చు చున్నది. దీనిని చూచి సాధుగణము సంతోషించిరి. గజ, అశ్వ, ఖర, రథముల నధిరోహించిన వారు పరస్పరము తలపడగ బాణాఘాతములచే బాహువులు, చరణములు, శిరస్సులు తెగి క్రింద పడినవి.

భస్మనా గుంఠితముఖా రక్తవస్త్రా నివారితాః
వికీర్ణకేశాః పరితో యాంతి సన్యాసినో యథా. 9

వ్యగ్రాః కేఽపి పలాయన్తే యాచంత్యన్యే జలం పునః
కల్కిసేనాశుగక్షుణ్ణా మ్లేచ్ఛా నో శర్మ లేభిరే. 10

భా: మ్లేచ్ఛులు సన్యాసులవలె భస్మముచే ఆచ్ఛాదితముఖము గలవారై రక్తవస్త్రమును ధరించి, చింపిరి కేశములు గలవారై యుద్ధక్షేత్రము నుండి తప్పించుకోసాగిరి. వ్యగ్రులై కొందరు పారిపోగా మరికొందరు దాహార్తులై జలమును యాచించిరి. కల్కిసేన బాణప్రహారములకు మ్లేచ్ఛులు నిలబడలేకపోయిరి.

తేషాం స్త్రియో రథారూఢా గజారూఢా విహంగమాన్
సమారూఢా హయారూఢా ఖరోష్ట్రవృషవాహనాః. 11

యోద్ధుం సమాయయు స్త్యక్త్వా పత్యపత్యసుఖాశ్రయాన్
రూపవత్యో యువత్యో ఽతిబలవత్యః పతివ్రతాః. 12

భా: మ్లేచ్ఛ సైనికులు పరాజితులగుచుండిరి. వారి భార్యలు రథములు, గజములు, పక్షులు, గుఱ్ఱములు, గాడిదలు, ఒంటెలు, ఎద్దులు మొదలగు వానినెక్కి యుద్ధము చేయుటకు రణభూమికి వచ్చిరి. రూపవతులు, బలవతులు, పతివ్రతలగు స్త్రీలు పతి, సంతాన సుఖములను విడిచి యుద్ధమునకు సిద్ధపడిరి.

నానాభరణ భూషాఢ్యాః సన్నద్ధా విశదప్రభాః
ఖడ్గశక్తి ధనుర్బాణ వలయాక్తకరాంబుజాః. 13
స్వైరిణ్యోఽ వ్యతికామిన్యో పుంశ్చల్యశ్చ పతివ్రతాః
యయు ర్యోద్ధుం కల్కి సైన్యైః పతీనాం నిధనాతురాః. 14

భా: వివిధములయిన ఆభరణములచే అలంకరింపబడి ఖడ్గము, భల్లము, ధనస్సు, బాణములకు తోడు గాజుల చేతులతో సిద్ధమైరి. అత్యంత రమణీయమగు రూపము కల్గిన స్త్రీలలో కొందరు స్వేచ్ఛగ తిరుగువారు, మరికొందరు పతివ్రతలు. భర్తల మరణముచే పీడితులయిన స్త్రీలు కల్కి సైన్యముతో తలపడుటకు వచ్చిరి.

మృద్భస్మకాష్ఠచిత్రాణాం ప్రభుతామ్నాయశాసనాత్
సాక్షాత్ పతీనాం నిధనం కిం యువత్యోఽపి సేహిరే. 15
తాః స్త్రియః స్వపతీన్ బాణభిన్నాన్ వ్యాకులితేంద్రియాన్
కృత్వా పశ్చా ద్యుయుధిరే కల్కి సైన్యై ర్ధృతాయుధాః. 16

భా: అచేతనములగు వస్తువుల నాశమును కూడా సహించని యువతులు సాక్షాత్తు భర్తల మరణమును ఎట్లు సహించగలరు? బాణములచే విగతజీవులగు తమ భర్తలను చూచి మ్లేచ్ఛ స్త్రీలు ఆయుధములు చేతబూని కల్కి సైన్యముతో యుద్ధము చేసిరి.

తాః స్త్రీ రుద్వీక్ష్య తే సర్వే విస్మయస్మితమానసాః
కల్కి మాగత్య తే యోధాః కథయామాసు రాదరాత్. 17
స్త్రీణా మేవ యుయుత్సూనాం కథాః శ్రుత్వా మహామతిః
కల్కిః సముదితః ప్రాయాత్ స్వసైన్యైః సానుగో రథైః. 18

భా: మ్లేచ్ఛస్త్రీలు యుద్ధము చేయుటను చూచి ఆశ్చర్యచకితులయిన కల్కి సైనికులు కల్కిని సమీపించి వృత్తాంత మంతయు నివేదించిరి. యుద్ధము చేయు స్త్రీలను గూర్చి వినిన కల్కి రథము నెక్కి అనుచరులతో యుద్ధభూమికి వెడలెను.

తాః సమాలోక్య పద్మేశః సర్వశస్త్రాస్త్రధారిణీః
నానావాహనసంరూఢాః కృతవ్యూహో ఉవాచ సః. 19

కల్కి రువాచ.......

రే స్త్రియః శృణుతాస్మాకం వచనం పథ్య ముత్తమమ్
స్త్రియా యుద్ధేన కిం పుంసాం వ్యవహారోఽత్ర విద్యతే. 20

భా: అనేక విధములగు అస్త్రశస్త్రములను ధరించి, అనేక వాహనముల నధిరోహించి, వ్యూహరచన చేయుట యందు సమర్థులయిన మ్లేచ్ఛస్త్రీలను చూచి కల్కి ఇట్లు పలికెను. ఓయువతులార! మీకు హితకరములగు మాటలను చెప్పెదను వినుడు. స్త్రీలతో పురుషులు యుద్ధము చేయుట ఉచితము గాదు.

**ముఖేషు చంద్రబింబేషు రాజితాలక పంక్తిషు**
**ప్రహరిష్యంతి కే తత్ర నయనానందదాయిషు 21**
**విభ్రాంతతారభ్రమరం నవకోకనదప్రభమ్**
**దీర్ఘాపాంగేక్షణం యత్ర తత్ర కః ప్రహరిష్యతి. 22**

భా: ముంగురులతో ప్రకాశించెడి చంద్రబింబము వంటి నేత్రానందదాయకములగు ముఖములపై ఎవడు ప్రహారము చేయగలడు? (ఆయుధములతో గాయము చేయగలడు) వికసించిన పద్మముల వంటి నేత్రములలో నల్లగ్రుడ్లు అనెడు భ్రమరములు విహరించు చున్నవి. అట్టి నేత్రములతో గూడిన ముఖముపై ఎవడు కొట్టగలడు?

**వక్షోజశంభూ సత్తార హారవ్యాల విభూషితౌ**
**కందర్పదర్పదలనౌ తత్ర కః ప్రహరిష్యతి? 23**
**లోలలీలాలకవ్రాత చకోరాక్రాంత చంద్రికమ్**
**ముఖచంద్రం చిహ్నాహీనం కస్తం హంతు మిహార్హతి?. 24**

భా: మీ హృదయమున వక్షోజరూప పరమేశ్వరుడు శోభిల్లు చున్నాడు. సుందరహారమనెడి సర్పముతో కుచములు శోభిల్లు చున్నవి. మదనుని దర్పమును హరించు వక్షఃస్థలముపై ఎవడు కొట్టగలడు?

**స్తనభారభరాక్రాంత నితాంతక్షీణమధ్యమమ్**
**తనులోమలతాబంధం కః పుమాన్ ప్రహరిష్యతి? 25**
**నేత్రానందేన నేత్రేణ సమావృత మనిందితమ్**
**జఘనం సుఘనం రమ్యం బాణైః కః ప్రహరిష్యతి? 26**

భా: సూక్ష్మ రోమరాజితో కూడి, స్తనభారముచే వంగిన, కృశించిన నడుమును ఏ పురుషుడు బాధించ గలడు? నేత్రానందదాయకమగు పట్టుచీరతో కప్పబడిన అనింద్యము, మనోహరమునగు ఘన జఘనమును ఎవడు బాణములతో కొట్టగలడు?

ఇతి కల్కే ర్వచః శ్రుత్వా ప్రాహస్య ప్రాహు రాదృతాః
అస్మాకం తం పతీన్ హంసి తేన నష్టా వయం విభో
హంతుం గతానా మస్త్రాణి కరాణ్యే వాగతా న్యుత. 27
ఖడ్గశక్తిధనుర్బాణ శూలతోమరయష్టయః
తాః ప్రాహుః పురతోమూర్తాః కార్తస్వరవిభూషణాః. 28

భా: కల్కి మాటలు వినిన మ్లేచ్ఛస్త్రీలు మందహాసము చేసి ఓదేవ! మాభర్తలను నీవు చంపుట వలన మేము సర్వము కోల్పోయితిమని పలికి కల్కిపై దాడి చేసిరి. వారు ప్రయోగించిన అస్త్రములు తిరిగి వాళ్ళ చేతులలోనికే వచ్చినవి. ఖడ్గము, భల్లము, ధనుస్సు, బాణము, శూలము తోమరము, యష్టి మున్నగు ఆయుధములు రూపమును ధరించినవై మ్లేచ్ఛస్త్రీలతో ఇట్లు పలికినవి.

శస్త్రాణ్యూచుః......

య మాసాద్య వయం నార్యో హింసయామః స్వతేజసా
త మాత్మానం సర్వమయం జానీత కృతనిశ్చయాః. 29
త మీశ మాత్మనా నార్యః చరామో య దనుజ్ఞయా
యత్కృతా నామరూపాది భేదేన విదితా వయమ్. 30

భా: శస్త్రములు పలికినవి. ఓ యువతులార! మేము ఎవరి వలన తేజమును పొంది, దానిచే ప్రాణులను హింసించు చున్నామో అతనినే సర్వేశ్వరునిగ నిశ్చయముగ తెలుసుకొనుడు. పరమేశ్వరుని ఆదేశానుసారమే మేము వ్యవహరించు చున్నాము. వాని వలననే నామరూపాది భేదము నొంది ప్రసిద్ధి కెక్కితిమి.

రూపగంధరసస్పర్శ శబ్దాద్యా భూతపంచకాః
చరంతి యదధిష్ఠానాత్ సోఽయం కల్కిః పరాత్మకః. 31
కాలస్వభావసంస్కార నామాద్యా ప్రకృతిః పరా
యస్యేచ్ఛయా సృజ త్యండం మహాహంకారకాదికాన్. 32

భా: పృధివి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశములనెడి పంచమహాభూతముల నాశ్రయించి రూపరస గంధస్పర్శ శబ్ద గుణము లున్నవి. కల్కిపరమాత్మనాశ్రయించి భూతపంచకము తన కార్యములను నిర్వర్తించు చున్నది. కాలము స్వభావము సంస్కారము నామము ఆదిగా గల పరాప్రకృతి పరమేశ్వరుని ఇచ్ఛామాత్రముచే మహత్తత్త్వ, అహంకార తత్త్వాది సమస్త బహ్మాండమును సృజించు చున్నది.

యన్మాయయా జగద్యాత్రా సర్గస్థిత్యంతసంజ్ఞితా
య ఏవాద్యః స ఏవాంతే తస్యాయః సోఽయ మీశ్వరః. **33**
అసౌ పతిర్మే భార్యాఽహ మస్య పుత్రాప్తబాంధవాః
స్వప్నోపమాస్తు తన్నిష్ఠా వివిధా శ్చేంద్రజాలవత్. **34**

భా: పరమేశ్వరుని మాయవలననే సృష్టి స్థితి లయరూపమగు యాత్ర జరుగుచున్నది. సృష్టి ఆద్యంతములకు మూలభూతుడు పరమేశ్వరుడే. నాభర్త, నాభార్య, నాపుత్రుడు, నా ఆప్తబంధువులు మున్నగు మమకారములు స్వప్నతుల్యములు. ఇంద్రజాలము వలె ఇవన్నియు పరమేశ్వరుని లీలలే.

స్నేహమోహనిబంధానాం యాతాయాతదృశాం మతమ్
న కల్కిసేవినాం రాగద్వేషవిద్వేషకారిణామ్ **35**
కుతః కాలః కుతో మృత్యుః క్వ యమః క్వాస్తి దేవతాః
స ఏవ కల్కి ర్భగవాన్ మాయయా బహులీకృతః. **36**

భా: స్నేహమోహముల అధీనములు యాతాయాతము లను దృష్టి కల్గి , రాగద్వేషములను విద్వేషించు కల్కిసేవకులకు అసత్యములగు విషయములు దృష్టికి రావు. కాలము, మృత్యువు, యముడు, అహంకారము, దేవతలు ఎక్కడి వారు? అన్నియు కల్కిభగవానుని మాయాధీనములే.

న శస్త్రాణి వయం నార్యః సంప్రహార్యా న చ క్వచిత్
శస్త్రప్రహర్తృభేదోఽయ మవివేకః పరాత్మనః. **37**
కల్కిదాసస్యాపి వయం హంతుం నార్హాః కథోద్భుతమ్
హనిష్యామో దైత్యపతేః ప్రహ్లాదస్య యథా హరిమ్. **38**

భా: ఓవనితలార! మేము శస్త్రములము కాదు. ప్రహారము చేయుశక్తి మాకు లేదు( సంప్రహార్యులు ఎవరూలేరు). శస్త్రములు, శస్త్రములను ప్రయోగించువాడు అనుభేదము పరమాత్మ యొక్క మాయా కల్పితము. అంతయు పరమాత్మయే. భక్తుడగు ప్రహ్లాదుని ప్రార్థన నాలకించి హిరణ్యకశిపుని సంహరించుటకు నృసింహావతారమెత్తిన శ్రీహరిని శస్త్రములయిన మేము ఏమియు చేయలేకపోయినట్లు కల్కిభక్తులను కూడ చంపుటకు మేము అసమర్థులము.

ఇత్యస్త్రాణాం వచః శ్రుత్వా స్త్రియో విస్మితమానసాః
స్నేహమోహవినిర్ముక్తా స్తం కల్కిం శరణం యయుః **39**

తాః సమాలోక్య పద్మేశః ప్రణతా జ్ఞాననిష్ఠయా
ప్రోవాచ ప్రహసన్ భక్తియోగం కల్మషనాశనమ్. 40

భా: అస్త్రముల వచనములను వినిన స్త్రీలు ఆశ్చర్యచకితలై స్నేహమోహములను విడిచి కల్కిని శరణుపొందిరి. భక్తిశ్రద్ధలతో నమస్కరించిన మ్లేచ్ఛస్త్రీలను చూచి పద్మేశుడు మందహాసము చేసి పాపనాశకమగు భక్తియోగమును వివరించెను.

కర్మయోగం చాత్మనిష్ఠం జ్ఞానయోగం ఖిదాశ్రయమ్
నైష్కర్మ్యలక్షణం తాసాం కథయామాస మాధవః. 41
తాః స్త్రియః కల్కిగదిత జ్ఞానేన విజితేంద్రియాః
భక్త్యా పర మవాపు స్తద్యోగినాం దుర్లభం పదమ్. 42

భా: కల్కి కర్మయోగ, జ్ఞానయోగములను వివరించగ, మ్లేచ్ఛస్త్రీలు జ్ఞానసంపన్నలై ఇంద్రియములను జయించి దుర్లభమగు మోక్షమును పొందిరి.

దత్వా మోక్షం మ్లేచ్ఛబౌద్ధప్రియాణాం
కృత్వా యుద్ధం భైరవం భీమకర్మా
హత్వా బౌద్ధాన్ మ్లేచ్ఛాసంఘాంశ్చ కల్కి
స్తేషాం జ్యోతిః స్థాన మాపూర్య రేజే. 43
యే శృణ్వంతి వదంతి బౌద్ధనిధనం మ్లేచ్ఛక్షయం సాదరా
ల్లోకాః శోకహరం సదా శుభకరం భక్తిప్రదం మాధవే
తేషా మేవ పున ర్న జన్మమరణం సర్వార్థసంపత్కరం
మాయామోహవినాశనం ప్రతిదినం సంసారతాపచ్ఛిదమ్. 44

భా: కల్కి మ్లేచ్ఛులతో భయంకరముగ యుద్ధము చేసి వారిని సంహరించెను. పిమ్మట మ్లేచ్ఛస్త్రీలకు మోక్షమొసగి వారిని, మ్లేచ్ఛగణమును జ్యోతిర్మయ స్థానములకు పంపి శోభిల్లెను. మ్లేచ్ఛులనాశ వృత్తాంతమును భక్తిశ్రద్ధలతో చెప్పినను వినినను సమస్త పాపములు దూరమగును. వారు ఎల్లప్పుడు శుభములను పొందుదురు. మాధవుని యెడ భక్తి కల్గును. వారికి జననమరణము లుండవు. సమస్త ఐశ్వర్యములు లభించును. మాయ అనెడి మోహము తొలగి సంసార తాపములు దూరమగును.

ఇతిశ్రీ కల్కి పురాణేఽను భాగవతే భవిష్యే
తృతీయాంశే
మ్లేచ్ఛ నిధనం నామ ప్రథమోఽధ్యాయః

ఇది శ్రీభాగవతానుబంధము భవిష్యమునగు
శ్రీ కల్కి పురాణమున తృతీయాంశమున
మ్లేచ్ఛ నిధన మను ప్రథమాధ్యాయము.



# కల్కి పురాణము

## తృతీయాంశము- ద్వితీయాధ్యాయము

తతో మ్లేచ్ఛాన్ బౌద్ధగణాన్ విజిత్య సహసైనికైః
ధనాన్యాదాయ రత్నాని కీకటాత్ పున రావ్రజత్. 1
కల్కిః పరమతేజస్వీ ధర్మాణాం పరిరక్షకః
చక్రతీర్థం సమాగత్య స్నానం విధివ దాచరత్. 2

భా: బౌద్ధులను మ్లేచ్ఛగణమును జయించి కల్కి ధన రత్నములను గ్రహించి ససైన్యుడై కీకటపురము నుండి తిరిగి వచ్చెను. పిమ్మట పరమతేజస్వి, ధర్మరక్షకుడగు కల్కి చక్రతీర్థమునకు వచ్చి విధిపూర్వకముగ స్నానమాచరించెను. ( లక్నోసమీపమందలి నైమిశారణ్యము( నీమ్‌ఖార్ అని ఇప్పుడు వ్యవహారము ) దగ్గర చక్రతీర్థమనునది ఒక సరోవరము)

భ్రాతృభి ర్లోకపాలాభై ర్బహుభిః స్వజనైర్వృతః
సమాయాతాన్ మునీం స్తత్ర దదృశే దీనమానసాన్. 3
సముద్విగ్నాయాగతాం స్తత్ర పరిపాహి జగత్పతే
ఇత్యుక్తవంతో బహుధా యే తా నాహ హరిః పరః. 4

భా: లోకపాల సదృశులగు తన సోదరులతో, ఆత్మీయులతో చక్రతీర్థదేశమున ఉండగ కల్కి దీనమనస్కులగు కొందరి మునులను చూచెను. భీతితో వచ్చిన మునులు ఓ జగత్పతీ! మమ్ములను కాపాడు మని వేడుకొనగ శ్రీహరి వారితో ఇట్లు పలికెను.

వాలఖిల్యాదికా నల్పకాయాన్ చీరజటాధరాన్
వినయావనతః కల్కి స్తానాహ కృపణాన్ భయాత్. 5
కస్మా ద్యూయం సమాయాతాః కేన వా భీషితా బత
తమహం నిహనిష్యామి యది వా స్యాత్ పురందరః 6

భా: అల్పపరిమాణము గల దేహముతో గూడి, నారబట్టలు గట్టిన జటాధారులగు వాలఖిల్యాది మునులు భయభీతులు కాగా కల్కి వినయావనతుడై వారితో ఇట్లు పలికెను. మీరు

ఎక్కడి నుండి వచ్చిరి? ఎవరు మిమ్ము భయపెట్టిరి? చెప్పుడు. దేవరాజైనను సరే అతనిని నాశము చేయగలను.

ఇత్యాశ్రుత్య కల్కివాక్యం తేనోల్లాసితమానసాః
జగదుః పుండరీకాక్షం నికుంభదుహితుః కథాః 7

మునయ ఊచుః.....

శృణు విష్ణుయశః పుత్ర! కుంభకర్ణాత్మజాత్మజా
కుథోదరీతి విఖ్యాతా గగనార్ధసముత్థితా. 8

భా: కల్కి వచనములను విని ఉల్లాసభరితులై మునులు రాక్షసియగు నికుంభపుత్రిక వృత్తాంతమును పుండరీకాక్షునకు నివేదించిరి. విష్ణుయశోనందన! కుంభకర్ణుని పుత్రుడగు నికుంభుని పుత్రిక కుథోదరి. ఆమె బృహదాకారము గలది.

కాకంజస్య మహిషీ వికంజజననీ చ సా
హిమాలయే చ శిరఃకృత్వా పాదౌ చ నిషధాచలే
శేతే స్తనం పాయయంతీ వికంజం ప్రస్రుతస్తనీ. 9
తస్యా నిఃశ్వాసవాతేన వివశా వయ మాగతాః
దైవేనైవ సమానీతాః సంప్రాప్తా స్త్వత్పదాస్పదమ్
మునయో రక్షణీయాస్తే రక్షస్సు చ విపత్సు చ. 10

భా: కాకంజుని భార్య, వికంజుని తల్లియగు రాక్షసి కుథోదరి హిమాలయమున శిరస్సు, నిషధాచలమున పాదములుంచి తన పుత్రునికి పాలిచ్చుచు పరుండినది. ఆమె యొక్క నిఃశ్వాసములచే వివశులమై ఇక్కడకు వచ్చితిమి. ఇక్కడకు మా రాక దైవికముగ జరిగినది. నీ పాదపద్మములు లభించినవి. ఆపదలనుండి రాక్షసులబారి నుండి మునులను నీవు రక్షింతువు గదా!

ఇతి తేషాం వచః శ్రుత్వా కల్కిః పరపురంజయః
సేనాగణైః పరివృతో జగామ హిమవద్గిరిమ్. 11
ఉపత్యకాం సమాసాద్య నిశా మేకాం నినాయ సః
ప్రాతర్జిగమిషుః సైన్యై ర్దదృశే క్షీరనిమ్నగామ్. 12

భా: శత్రుపురములను జయించెడి కల్కి మునుల మాటలు విని సైన్యముతో హిమాలయమునకు వెడలెను. పర్వతమునకు క్రిందనున్న సమీపభూమికి వెళ్ళి అక్కడ ఒక రాత్రి

గడిపెను. ప్రాతఃకాలమున సైన్యముతో ప్రయాణము చేయవలెననుకొను చుండ క్షీరనదిని చూచెను.

శంఖేందుధవళాకారాం ఫేనిలాం బృహతీం ద్రుతమ్
చలంతీం వీక్ష్యతే సర్వే స్తంభితా విస్మయాన్వితాః. 13
సేనాగణగజాశ్వాది రథయోధైః సమావృతః
కల్కిస్తు భగవాం స్తత్ర జ్ఞాతార్థోఽపి మునీశ్వరాన్. 14

భా: శంఖమువలె చంద్రునివలె తెల్లనిది, నురుగుతో కూడినది, బృహదాకారము కల్గినదై వేగముగ ప్రవహించు క్షీరనదిని చూచి కల్కి సేవకులు ఆశ్చర్యచకితులై నిశ్చేష్టులయిరి. పిమ్మట గజ, అశ్వ, రథాది విభిన్న యోద్ధలతో గూడిన కల్కి సర్వజ్ఞుడైనను క్షీరప్రవాహము గూర్చి మునుల నడిగెను.

పప్రచ్ఛ కా నదీ చేయం కథం దుగ్ధవహాభవత్
తే కల్కేస్తు వచః శ్రుత్వా మునయః ప్రాహు రాదరాత్. 15
శృణు కల్కే పయస్వత్యాః ప్రభవం హిమవద్గిరౌ
సమాయాతా కుథోదర్యాః స్తనప్రస్రవణా దిహ. 16

భా: ఈనది పేరేమి? ఇందు దుగ్ధమేల ప్రవహించు చున్న? దని కల్కి ప్రశ్నించగా మునులు ఆదరముతో ఇట్లు పలికిరి. ఓకల్కి! కుథోదరియను రాక్షసి యొక్క స్తనము నుండి స్రవించు క్షీరము హిమాలయ పర్వతముల నుండి ప్రవహించుచు నదిగ మారినది.

ఘటికాసప్తకై శ్చాన్యా పయో యాస్యతి వేగితమ్
హీనసారా తటాకారా భవిష్యతి మహామతే. 17
ఇతి శ్రుత్వా మునీనాం తు వచనం సైనికైః సహ
అహో కిమస్యా రాక్షస్యాః స్తనా దేకా త్వియం నదీ. 18

భా: ఏడుఘడియల తరువాత మరియొకనది వేగముగ ప్రవహించ గలదు. (రెండవస్తనము నుండి) మొదటిది పయోహీనమై తటాకారము కాగలదు. మునుల వచనములు విని కల్కి ''ఒక్కస్తనము నుండియే ఇంతటి నది ప్రవహించుచున్నదా'' యని ఆశ్చర్యపడెను.

ఏకం స్తనం పాయయతి వికంజం పుత్ర మాదరాత్
న జానేఽస్యాః శరీరస్య ప్రమాణం కతిధా భవేత్. 19
బాలం వాఽస్యా నిశాచర్యా ఇత్యూచు ర్విస్మయాన్వితాః
కల్కిః పరాత్మా సన్నహ్య సేనాభిః సహసా యయౌ. 20

భా: ప్రేమతో ఒక్క స్తనము త్రాగించుట వలన పుత్రుడగు వికంజుడు ఎంత పరిమాణము కల్గియుండునో ఊహకందుట లేదు. రాక్షసి బలమెంతటిదో గదాయని అందరు ఆశ్చర్యపడిరి. పిమ్మట సైన్యముతో గూడి కల్కి తొందరగ రాక్షసి యున్న దేశమునకు బయలుదేరెను.

మునిదర్శితమార్గేణ యత్రాస్తే సా నిశాచరీ
పుత్రం స్తనం పాయయంతీ గిరిమూర్ధ్ని ఘనోపమా. 21
శ్వాసవాతాతివాతేన దూరక్షిప్తవనద్విపాః
యస్యాః కర్ణబిలావాసే ప్రసుప్తాః సింహసంకులాః. 22

భా: మునులు రాక్షసి నివసించు ప్రదేశము చూపగ అందరు అచ్చటకు వెళ్ళిరి. అచ్చట మేఘము వంటి ఆకారము కల్గిన రాక్షసి పర్వతశిఖరము మీద పుత్రునికి పాలు త్రాగించు చున్నది. నిఃశ్వాసలచే మదగజములు దూరముగ విసిరి వేయబడు చున్నవి. చెవుల రంధ్రములలో సింహగణము నిద్రించినవి.

పుత్రపౌత్రైః పరివృతా గిరిగహ్వారవిభ్రమాః
కేశమూల ముపాలమ్బ్య హరిణాః శేరతే బిలమ్. 23
యూకా ఇవ న చ వ్యగ్రా లుబ్ధజాతంకయా భృశమ్
తా మాలోక్య గిరే ర్మూర్ధ్ని గిరివత్ పరమాద్భుతామ్. 24
కల్కిః కమలపత్రాక్షః సర్వాం స్తా నాహ సైనికాన్
భయోద్విగ్నాన్ బుద్ధిహీనాం స్త్యక్తోద్యమ పవిచ్ఛదాన్. 25

భా: పుత్రపౌత్రులతో గూడిన లేళ్ళు కొండగుహ లను భ్రాంతితో కేశమూలముల నాశ్రయించి పరుండినవి. వేటగాండ్ర వలన భయము లేనివై లేళ్ళు యూకములవలె (పేను) కన్పించుచున్నవి. పర్వతము మీద మరియొక పర్వత మున్నట్లు ఆశ్చర్యముగ రాక్షసి గోచరించు చున్నది. భయముచే ఉద్విగ్నులు, బుద్ధిహీనులు, ఆయుధములను విడిచిన సైనికుల నుద్దేశించి కమలపత్రాక్షు డగు కల్కి ఇట్లు పలికెను.

కల్కి రువాచ.......

గిరిదుర్గే వహ్నిదుర్గం కృత్వా తిష్ఠంతు మామకాః
గజాశ్వరథయోధా యే సమాయాంతు మయా సహ. 26
అహం స్వల్పేన సైన్యేన యా మ్యస్యాః సంముఖం శనైః
ప్రహర్తుం బాణసందోహైః ఖడ్గశక్తిపరశ్వధైః. 27

భా: కల్కి పలికెను. ప్రవేశింపశక్యము గాని కొండలలో నిప్పుతో మార్గమేర్పాటు చేసుకొని మీరంతా ఇక్కడనే ఉండవలసినది. గజ, అశ్వ, రథ యోద్ధులు నాతో వచ్చెదరు. ఖడ్గ, శక్తి, పరశు, బాణములతో రాక్షసిని చంపుటకు స్వల్పసైన్యముతో నేను ఆమె ఎదుటకు మెల్లగ వెళ్ళెదను.

ఇత్యుక్త్వా స్థాప్య పశ్చా త్తాన్ బాణై స్తామహన ద్బలీ
సా క్రుధోత్థాయ సహసా ననర్ద పరమాద్భుతమ్. 28
తేన నాదేన మహతా విత్రస్తా శ్చాభవన్ జనాః
నిపేతుః సైనికాః సర్వే మూర్ఛితా ధరణీతలే. 29

భా: ఈ విధముగ పలికిన కల్కి సేనను వెంట బెట్టుకొని వెడలి రాక్షసిని బాణములతో కొట్టసాగెను. కోపముతో హఠాత్తుగ లేచిన రాక్షసి గంభీరముగ నాదము చేసెను. భయంకర శబ్దముచే అందరు భయపడిరి. సైనికులందరు తెలివితప్పి భూమి మీద పడిరి.

సా రథాంశ్చ గజాం శ్చాపి వివృతాస్యా భయానకా
జఘాస శ్వాసవాతైశ్చ సమానీయ కుథోదరీ. 30
సేనాగణా స్తదుదరం ప్రవిష్టాః కల్కినా సహ
యథర్క్షముఖవాతేన ప్రవిశంతి పిపీలికాః. 31

భా: భయంకరమగు కుథోదరి నోటిని పెద్దదిగచేసి శ్వాస వాయువుచే రథ గజాదులను లోపలికి లాగుకొని భోజనము చేసెను. ఎలుగుగొడ్డు ముఖవాయువుచే చీమలు లోనికి ప్రవేశించినట్లు కల్కితో కూడ సేనాగణము రాక్షసి ఉదరమును ప్రవేశించిరి.

తద్దృష్ట్వా దేవగంధర్వా హాహాకారం ప్రచక్రిరే
తత్రస్థా మునయః శేపు ర్జేపు శ్చాన్యే మహర్షయః. 32
నిపేతు రన్యే దుఃఖార్తా బ్రాహ్మణా బ్రహ్మవాదినః
రురుదుః శిష్టయోధా యే జహృషు స్త న్నిశాచరాః. 33

భా: ఇది చూచి దేవతలు గంధర్వులు హాహాకారము చేయసాగిరి. కొందరు మునులు ఆక్రోశించిరి. మరికొందరు కల్కి క్షేమమునకు జపము చేయసాగిరి. బ్రహ్మవేత్తలగు బ్రాహ్మణులు దుఃఖార్తులై క్రిందపడిరి. కల్కిసేన రోదించగ, రాక్షసులు ఆనందించిరి.

జగతాం కదనం దృష్ట్వా సస్మా రాత్మాన మాత్మనా
కల్కిః కమలపత్రాక్షః సురారాతినిషూదనః. 34

బాణాగ్నిం చైలచర్మభ్యాం కర్మణే యానదారుభిః
ప్రజ్వాల్యోదరమధ్యే తు కరవాలం సమాదదే. 35

భా: దేవతల శత్రువులను నాశము చేయు కమలపత్రాక్షుడగు కల్కి లోకములు దుఃఖించుట చూచి తనచే తాను స్మరించుకొనెను. అతడు ఉదరమధ్యమున బాణములచే అగ్నిని సృజించి వస్త్ర, చర్మ, రథ కాష్ఠములచే దానిని ప్రజ్వలింప జేసి ఖడ్గమును గ్రహించెను.

తేన ఖడ్గేన మహతా కుక్షిం నిర్భిద్య బంధుభిః
బలిభి ర్భ్రాతృభి ర్వాహై ర్వృతః శస్త్రాస్త్రపాణిభిః . 36
బహి ర్బభూవ సర్వేశః కల్కిః కల్కవినాశనః
సహస్రాక్షో యథా వృత్రకుక్షిం దంభోలి నేమినా. 37
యోనిరంధ్రా ద్గజరథా స్తురగా శ్చాభవన్ బహిః
నాసికాకర్ణవివరాత్ కేఽపి తస్యా వినిర్గతాః . 38

భా: దేవేంద్రుడు వజ్రాయుధముతో వృత్రాసురుని ఉదరమును చీల్చినట్లు, కల్కవినాశకుడు సర్వేశ్వరుడగు కల్కి రాక్షసి యొక్క బృహదాకారమగు ఉదరమును చీల్చగ శస్త్రాస్త్రధరులగు సోదరులు, సైనికులు, వాహనములతో గూడి కల్కి బయటకు వచ్చెను. యోనిరంధ్రము నుండి గజ, రథ, తురగములు, కర్ణరంధ్రము నుండి మరికొందరు వెలుపలకు వచ్చిరి.

తే నిర్గతా స్తత స్తస్యాః సైనికా రుధిరోక్షితాః
తాం వివ్యధు ర్నిక్షిపంతీం తరసా చరణౌ కరౌ. 39
మమార సా భిన్నదేహా భిన్నకుక్షిశిరోధరా
నాదయంతీ దిశో ద్యోఖం చూర్ణయంతీ చ పర్వతాన్. 40

భా: రాక్షసి ఉదరము నుండి బయటకు వచ్చిన రక్తముతో తడిసిన సైనికులు, కాళ్ళు చేతులు కొట్టుకొనుచున్న రాక్షసిని చూచి బాణములతో ఆమెను కొట్టిరి. ఆమె ఉదరము శిరస్సు, సమస్త అంగములు ఛిన్నాభిన్నములైనవి. అపుడు రాక్షసి దిక్కులు పిక్కటిల్లునట్లు ఆకాశము దద్దరిల్లునట్లు పెద్ద శబ్దము చేయుచు, పర్వతములను పిండి చేయుచు ప్రాణములు వదిలెను.

కరంజోఽపి తథా వీక్ష్య మాతరం కాతరోఽభవత్
స వికంజః క్రుధా ధావత్ సేనామధ్యే నిరాయుధః . 41

గజమాలాకులో వక్షో వాజిరాజివిభూషణః
మహాసర్పకృతోష్ణీషః కేసరీ ముద్రితాంగులిః . 42

భా: తల్లి అవస్థను చూచిన కరంజుడు దీనుడై కోపముతో ఆయుధములు లేకుండగనే సేనమధ్యభాగమున ప్రవేశించెను. వక్షఃస్థలమున గజమాలకలవాడై, అశ్వపంక్తిచే విభూషితుడై మహాసర్పములు తలపాగగలవాడై, సింహముద్రితమగు అంగుళులు కల్గిన కరంజుడు--------

**మమర్ద కల్కి సేనాం తాం మాతు ర్వ్యసనకర్శితః**
**స కల్కి స్తం బ్రాహ్మ మస్త్రం రామదత్తం జిఘాంసయా. 43**
**ధనుషా పంచవర్షీయం రాక్షసం శత్రు మాదదే**
**తేనాస్త్రేణ శిర స్తస్య చ్ఛిత్వా భూమా వపాతయత్. 44**

భా: మాతృవియోగమచే దుఃఖితుడై క్షల్కి సేనను పీడించసాగెను. కల్కి పరశురామదత్తమగు బ్రహ్మాస్త్రమును ప్రయోగించి బాలుని శిరస్సును ఛేదించి భూమి మీద పడవైచెను.

**రుధిరాక్తం ధాతుచిత్రం గిరిశృఙ్గ మివాద్భుతమ్**
**సుపుత్రాం రాక్షసీం హత్వా మునీనాం వచనా ద్విభుః . 45**
**గంగాతీరే హరిద్వారే నివాసం సమకల్పయత్**
**దేవానాం కుసుమాసారై ర్మునిస్తోత్రైః సుపూజితః . 46**

భా: ధాతురాగములచే చిత్రితమగు పర్వత శిఖరమువలె కన్పట్టు రక్తసిక్తమైన పుత్రునితో గూడిన రాక్షసిని ఇట్లు కల్కిచంపెను. దేవతలు పుష్పవర్షము కురిపించిరి. మునులచే పూజింపబడిన కల్కి హరిద్వారము గంగాతీరమున నివాస మేర్పరచుకొనెను.

నినాయ తాంనిశాం తత్ర కల్కిః పరిజనావృతః
ప్రాత ర్దదర్శ గఙ్గయాస్తీరే మునిగణాన్ బహూన్
తస్యాః స్నానవ్యాజ విష్ణో రాత్మనో దర్శనాకులాన్. 47
హరిద్వారే గంగాతట నికటపిండారకవనే
వసంతం శ్రీమంతం నిజగణవృతం తం మునిగణాః
స్తవైః స్తుత్వాస్తుత్వా విధివ దుదితై ర్జహ్నుతనయాం
ప్రపశ్యంతం కల్కిం మునిజనగణా ద్రష్టు మగమన్. 48

భా: పరిజనముతో గూడిన కల్కి ఆరాత్రంతయు అక్కడేగడిపెను. ప్రాతఃకాలమున

గంగా స్నానమను మిషతో తనను చూచుటకు కుతూహలముతో వచ్చిన మునిజనమును శ్రీహరి చూచెను. హరి ద్వారము గంగాతీరమున పరివారముతో నివసించుచు, జహ్నుతనయ యగు గంగను దర్శించు శ్రీహరిని చూచుటకు వచ్చిన మునిజనము వారిని పలుమార్లు స్తోత్రము చేసిరి.

**ఇతి శ్రీ కల్కి పురుణేఽను భాగవతే భవిష్యే**
**తృతీయాంశే కుథోదరీ వధానన్తరం**
**ముని దర్శనం నామ ద్వితీయోఽధ్యాయః**

ఇది భాగవతానుబంధము. భవిష్యమునగు
శ్రీకల్కి పురాణము తృతీయాంశమున
కుథోదరీ వధానంతరము ముని దర్శనమను
ద్వితీయాధ్యాయము.



# కల్కి పురాణము

## తృతీయాంశము - తృతీయాధ్యాయము

2-17

సూత ఉవాచ.......

సుస్వాగతాన్ మునీన్ దృష్ట్వా కల్కిః పరమధర్మవిత్
పూజయిత్వా చ విధివత్ సుఖాసీనా నువాచ తాన్. 1
కే యూయం సూర్యసంకాశా మమభాగ్యాదుపస్థితాః
తీర్థాటనోత్సుకా లోకత్రయాణా ముపకారకాః. 2
వయం లోకే పుణ్యవంతో భాగ్యవంతో యశస్వినః
యతః కృపాకటాక్షేణ యుష్మాభి రవలోకితాః. 3

భా: సూతుడు పలికెను. పరమధార్మికుడయిన కల్కి అచ్చటకు వచ్చిన మునులను విధిపూర్వకముగ పూజించెను. వారు సుఖాసీనులయిన పిమ్మట ఇట్లు పలికెను. సూర్యుని వలె ప్రకాశించుచు తీర్థాటన మొనరించుచు ముల్లోకములకు ఉపకారము చేయు మీరు ఎవరు? నాభాగ్యవశముచే మీరిక్కడి కేతెంచిరి. మేము ఎంతోపుణ్యాత్ములము, భాగ్యవంతులము, యశస్విలము. కనుకనే కృపాకటాక్షము వలన మీదర్శన భాగ్యము మాకు కల్గినది.

తత స్తే వామదేవోఽత్రి ర్వసిష్ఠో గాలవో భృగుః
పరాశరో నారదోఽశ్వత్థామా రామః కృపస్త్రితః. 4
దుర్వాసా దేవలః కణ్వో వేద ప్రమితి రంగిరాః
ఏతే చాన్యే చ బహవో మునయః శంసితవ్రతాః. 5
కృత్వాగ్రే మరుదేవాపీ చంద్రసూర్యకులోద్భవౌ
రాజానౌ తౌ మహావీర్యౌ తపస్యాభిరతౌ చిరమ్. 6
ఊచుః ప్రహృష్టమనసః కల్కిం కల్కవినాశనమ్
మహోదధే స్తీరగతం విష్ణుం సురగణా యథా. 7

భా: పిమ్మట వామదేవ, అత్రి, వసిష్ఠ, గాలవ, భృగు, పరాశర, నారద, అశ్వత్థామ పరశురామ, కృపాచార్య, త్రిత, దుర్వాసులు, దేవల, కణ్వ, వేదప్రమితి, అంగిరసులు మున్నగ

వ్రత సంపన్నులగు మహర్షులు తపోనిరతులగు మరు, దేవాపులను ముందుంచుకొని కలి నాశకుడగు కల్కితో సాగరతీరమున శ్రీమహావిష్ణువుతో దేవతలవలె సంతుష్టాంతరంగులై ఇట్లు పలికిరి.

**మునయ ఊచుః........**

జయాశేష జగన్నాథ విదితాఖిలమానస
సృష్టిస్థితిలయాధ్యక్ష! పరమాత్మన్ ప్రసీద నః. 8
కాలకర్మగుణావాస! ప్రసారితనిజక్రియ!
బ్రహ్మాదినుతపాదాబ్జ పద్మానాథ ప్రసీద నః. 9

భా: మునులు పలికిరి. జగన్నాథ సమస్తము జయించినవాడ సమస్త అంతఃకరణవృత్తులను తెలిసి పరమాత్మ సృష్టిస్థితి లయకారకుడవగు నీవు మమ్ముల ననుగ్రహింసుము. ఓపద్మానాథ! నీవు కాలస్వరూపుడవు. గుణకర్మలకు ఆధారభూతుడవు. బ్రహ్మాది దేవతలు కూడ నీపాదాబ్జములను స్తుతించెదరు. చల్లని చూపుతో దృష్టిని సారించి మమ్ముల ననుగ్రహింపుము.

ఇతి తేషాం వచః శ్రుత్వా కల్కిః ప్రాహ జగత్పతిః
కావే తౌ భవతా మగ్రే మహాసత్త్వౌ తపస్వినౌ. 10
కథ మత్రాగతౌ స్తుత్వా గం గాం ముదితమానసౌ
కా వా స్తుతిస్తు జాహ్నవ్యా యువయో ర్నామనీ చ కే. 11

భా: వారి మాటలు వినిన జగత్పతియగు కల్కి ఓ మహర్షులారా మీ ముందున్న మహాబలులు తపస్సంపన్నులగు వారిరువురు ఎవరు? వీరు గంగను ఎందులకు స్తుతించుచున్నారు. వారిటకు ఎందులకు వచ్చిరి? వారి పేరు లేమి యని యని యడిగెను.

తయోఽర్మరుః ప్రముదితః కృతాంజలిపుటః కృతీ
ఆదా వువాచ వినయీ నిజవంశాను కీర్తనం. 12
సర్వంవేత్సిపరమాత్మాప్యంతర్యామిన్ కృదిస్థితః.
తవాజ్ఞయా సర్వమేతత్ కథయామి శ్రుణు ప్రభో. 13

భా: వారితో మరువు సంతోషించినవాడై చేతులు జోడించి వినయముతో తమ వంశవృత్తాంతమును చెప్పెను. పరమాత్మ! మీరు సర్వజ్ఞులు. అయినను తమ ఆదేశానుసారము సమస్తము చెప్పెదను. వినుడు.

తవ నాభే రభూ ద్బ్రహ్మ మరీచి స్తత్సుతో ఽభవత్
తతో మను స్తత్సుతోఽ భూ దిక్ష్వాకుః సత్యవిక్రమః. 14

యువనాశ్వ ఇతి ఖ్యాతో మాంధాతా తత్సుతోఽభవత్
పురుకుత్స స్తత్సుతోఽభూ దనరణ్యో మహామతిః. 15
త్రస ద్దస్యుః పితా తస్మా ద్ధర్యశ్వ స్త్ర్యరుణస్తతః
త్రిశంకుస్తత్సుతో ధీమాన్ హరిశ్చంద్రః ప్రతాపవాన్. 16

భా: మీనాభినుండి బ్రహ్మ జన్మించెను. అతనిపుత్రుడు మరీచి. అతని వలన మనువు, మనువు వలన సత్యవిక్రమసంపన్నుడగు ఇక్ష్వాకువు జన్మించెను. ఇక్ష్వాకు పుత్రుడు యువనాశ్వుడు. అతని పుత్రుడు మాంధాత. ఇతని పుత్రుడు పురుకుత్సుడు. పురుకుత్సునివలన బుద్ధిమంతుడగు అనరణ్యుడు జన్మించెను. అనరణ్యుని పుత్రుడు త్రసద్దస్యువు. అతని వలన హర్యశ్వుడు జన్మించెను. హర్యశ్వుని పుత్రుడు అరుణుడు. (త్ర్యరుణుడు) అరుణుని పుత్రుడు త్రిశంకువు. అతనికి ధీమంతుడు, పరాక్రమవంతుడగు హరిశ్చంద్రుడు జన్మించెను.

హరిత స్తత్సుతస్తస్మా ద్భరుక స్తత్సుతో వృకః
తత్సుతః సగర స్తస్మా దసమంజా స్తతో ఽంశుమాన్. 17
తతో దిలీపస్తత్పుత్రో భగీరథ ఇతి స్మృతః
యేనానీతా జాహ్నవీయం ఖ్యాతా భాగీరథీ భువి
స్తుతా నుతా పూజితేయం తవ పాదసముద్భవా. 18

భా: హరిశ్చంద్రుని పుత్రుడు హరితుడు (రోహితుడు) అతని పుత్రుడు భరకుడు. భరుకుని పుత్రుడు వృకుడు. వృకపుత్రుడు అసమంజసుడు. అతని పుత్రుడు అంశుమంతుడు. అతనికి దిలీపుడు కలిగెను. దిలీప పుత్రుడు భగీరథుడు. ఇతని వలన గంగ భూమికితీసుకురాబడి భాగీరథియని ప్రసిద్ధిగాంచినది. తమపాదములనుండి పుట్టుట వలన గంగను అందరు స్తుతించెదరు, పూజించెదరు.

భగీరథాత్ సుత స్తస్మా న్నాభ స్తస్మా దభూ ద్బలీ
సింధుద్వీపసుత స్తస్మా దాయుతాయు స్తతో ఽభవత్. 19
ఋతుపర్ణ స్తత్సుతోఽభూత్ సుదాస స్తత్సుతోఽభవత్
సౌదాస స్తత్సుతో ధీమా నశ్మక స్తత్సుతో మతః. 20
మూలకాత్ స దశరథ స్తస్మా దేడబిడ స్తతః
రాజా విశ్వసహ స్తస్మాత్ ఖట్వాంగో దీర్ఘబాహుకః. 21

భా: భగీరథ పుత్రుడు నాభుడు. అతని పుత్రుడు సింధుద్వీపుడు. అయుతాయువు

సింధుద్వీపుని పుత్రుడు. అతని పుత్రుడు ఋతుపర్ణుడు. ఋతుపర్ణపుత్రుడు సుదాసుడు. సుదాసపుత్రుడు సౌదాసుడు. సౌదాసునకు బుద్ధిమంతుడగు అశ్మకుడు పుట్టెను. అశ్మకపుత్రుడు మూలకుడు. అతని పుత్రుడు దశరథుడు. అతని పుత్రుడు ఏడబిడుడు. అతని పుత్రుడు విశ్వసహుడు. విశ్వసహుని పుత్రుడు ఖట్వాంగుడు. అతడు ఆజానుబాహువు.

తతో రఘు రజ స్తస్మాత్ సుతో దశరథః కృతీ
తస్మా ద్రామో హరిః సాక్షా దావిర్భూతో జగత్పతిః. **22**
రామావతార మాకర్ణ్య కల్కిః పరమహర్షితః
మరుం ప్రాహ విస్తరేణ శ్రీరామచరితం వద. **23**

భా: పిమ్మట రఘుమహారాజు జన్మించెను. అతని వలన అజుడు పుట్టెను. అజపుత్రుడు దశరథుడు. జగన్నాథుడగు శ్రీహరి శ్రీరామునిగ దశరథునికి జన్మించెను. రామావతారమును విని మిక్కిలి సంతోషించిన కల్కి రామచరితమును విస్తరముగ చెప్పుమని మరుని అడిగెను.

సీతాపతేః కర్మ వక్తుం కః సమర్థోఽస్తి భూతలే
శేషః సహస్రవదనై రపి లాలాయితో భవేత్. **24**
తథాపి శేముషీ మేఽస్తి వర్ణయామి తవాజ్ఞయా
రామస్య చరితం పుణ్యం పాపతాపప్రమోచనమ్. **25**

భా: సీతాపతి యగు శ్రీరామచంద్రుని చరితమును సహస్రఫణియగు ఆదిశేషుడు కూడ వర్ణింపజాలడు. అయినను తమ ఆదేశానుసారము నాబుద్ధివైభవమనుసరించి పుణ్యప్రదము, పాపతాప నివారకము నగు శ్రీరాముని చరితమును వర్ణించెదను.

అజాదివిబుధార్థితోఽజని చతుర్భి రంశైః కులే
రవే రజసుతా దజో జగతి యాతుధానక్షయః. **25**
శిశుః కుశికజాధ్వరక్షయకరక్షయో యో బలా-
ద్బలీ లలితకంధరో జయతి జానకీవల్లభః. **26**

భా: బ్రహ్మాది దేవతలచే ప్రార్థింపబడిన శ్రీహరి రాక్షస నాశమునకై సూర్యవంశమున రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులుగ నాలుగు అంశలతో దశరథుని యింట అవతరించెను. జానకీ వల్లభుడగు శ్రీరామచంద్రుడు బాల్యమున విశ్వామిత్రుని యజ్ఞమును నాశము చేయు రాక్షసులను సంహరించెను.

మునే రనుసహానుజో నిఖిలశస్త్ర విద్యాతిగో
యయా వతివనప్రభో జనకరాజరాజత్సభామ్

విధాయ జనమోహనద్యుతి మతీవ కామద్రుహః
ప్రచండకర చండిమా భవన భంజనే జన్మనః. 27
తమ ప్రతిమతేజసం దశరథాత్మజం సానుజం
మునే రను యథా విధేః శశివ దాదిదేవం పరమ్
నిరీక్ష్య జనకో ముదా క్షితి సుతాపతిం సంమతం
నిజోచిత పణక్షమం మనసి భర్త్సయ న్నాయయౌ. 28

భా: భవబంధ భంజకుడు, తీక్ష్ణతేజస్సంపన్నుడు, నిఖిల శస్త్రవిద్యాపారంగతుడగు శ్రీరామచంద్రుడు జనమోహన రూపముతో ప్రకాశించుచు అనుజుడగు లక్ష్మణునితో కూడి విశ్వామిత్రుని వెంట జనక మహారాజు సభకు వెడలెను. బ్రహ్మ వెనుక చంద్రుని వలె పరమతేజస్వియగు శ్రీరాముడు విశ్వామిత్రుని వెనుక లక్ష్మణ సహితుడై వెడలెను. ఆదిదేవుడగు శ్రీరాముని చూచి జనకమహారాజు తనపుత్రికయగు సీతాదేవికి ఇతడు తగినవరుడని సంతోషించెను. తాను ఏర్పాటు చేసిన స్వయంవరపరీక్షకు సమర్థునిగ తలచి శ్రీరాముని సమీపించెను.

స భూపపరిపూజితో జనకజేక్షితై రర్చితః
కరాలకఠినం ధనుః కరసరోరుహే సంహితమ్
విభజ్య బలవద్దృఢం జయ రఘూద్వహే త్యుచ్చకై-
ర్ధ్వనిం త్రిజగతీగతం పరివిధాయ రామో బభౌ. 29

భా: జనకమహారాజుచే పూజింపబడి, సీతాదేవి చూపులచే సత్కరింపబడిన శ్రీరామచంద్రుడు మిక్కిలి కఠినమగు ధనస్సును చేతిలోనికి తీసుకొని రెండు ముక్కలు చేసెను. 'శ్రీరామునికి జయమగుగాక' అను జయజయ ధ్వనులు ముల్లోకముల వ్యాపించెను.

తతో జనకభూపతి ర్దశరథాత్మజేభ్యో దదౌ
చతస్ర ఉషతీ ర్ముదా వరచతుర్భ్య ఉద్వాహనే
స్వలంకృత నిజాత్మజాః పథి తతో బలం భార్గవ-
శ్చకార ఉరరీ నిజం రఘుపతౌ మహోగ్రం త్యజన్. 30

భా: పిమ్మట జనకమహారాజు దశరథపుత్రులగు రామలక్షణ భరత శత్రుఘ్నులకు తన నలుగురు పుత్రికలు సీత ఊర్మిళ మాండవి శ్రుతకీర్తులను ఇచ్చి వివాహము జరిపించెను. వీరందరు

అయోధ్యకు తిరిగి వచ్చు సమయమున మార్గమున పరశురాముడు రామచంద్రునిపై తన పరాక్రమమును ప్రదర్శించెను.

తతః స్వపుర మాగతో దశరథస్తు సీతాపతిం
నృపం సచివసంయుతో నిజవిచిత్ర సింహాసనే
విధాతు మమల ప్రభం పరిజనైః క్రియాకారిభిః
సముద్యతమతిం తదా ద్రుత మవారయత్ కేకయీ. 31

భా: తరువాత రాజు దశరథుడు మంత్రులతో సమావేశమై సీతాపతియగు శ్రీరాముని రాజ్యాభిషిక్తుని చేయుటకు నిర్ణయించెను. రాజ్యాభిషేకమునకు ప్రయత్నములు జరుగుచుండగ కైకేయి రాముని అభిషేకమును వారించెను.

తతో గురునిదేశతో జనకరాజకన్యాయుతః
ప్రయాణ మకరోత్ సుధీర్య దనుగః సుమిత్రాసుతః
వనం నిజగణం త్యజన్ గుహగృహే వస న్నాదరాత్
విసృజ్య నృపలాంఛనం రఘుతి ర్జటా చీరభృత్. 32

భా: పిమ్మట తండ్రి ఆదేశానుసారము సీతాలక్ష్మణులతో కూడి రాముడు అడవులకు పయనమాయెను. పరివారమును విడిచి గుహుని గృహమునకు వెడలి రాజచిహ్నములను విడిచి జటావల్కలములను ధరించెను.

ప్రియానుజయుత స్తతో మునిమతో వనే పూజితః
స పంచవటికాశ్రమే భరత మాతురం సంగతమ్
నివార్య మరణం పితుః సమవధార్య దుఃఖాతుర-
స్తపోవనగతో ఉవస ద్రఘుపతి స్తత స్తాః సమాః. 33

భా: సీతాలక్ష్మణులతో గూడిన శ్రీరాముడు మునివృత్తి నవలంబించి పంచవటి ఆశ్రమమున నివసించెను. దీనుడయిన భరతుడు అచ్చటకు వచ్చి తండ్రి మరణవార్తను చెప్పగ మిక్కిలి దుఃఖించిన రాముడు భరతుని వారించి మిగిలిన సంవత్సరము లక్కడనే గడిపెను.

దశాననసహోదరాం విషమబాణవేధాతురాం
సమీక్ష్య వరరూపిణీం ప్రహసతీం సతీం సుందరీమ్
నిజాశ్రయ మభీప్సతీం జనకజాపతి ర్లక్ష్మణాత్
కరాలకరవాలతః సమకరో ద్విరూపాం తతః. 34

భా: కామపీడితురాలు, సౌందర్యవతియగు రావణుని సోదరి శూర్పణఖ రాముని మోహించి వచ్చినది. రాముడు నవ్వుచు లక్ష్మణుని చూపెను. అతడు కరవాలముతో ముక్కు చెవులు కోసి కురూపిని చేసెను.

సమాప్య పథి దానవం ఖరశరైః శనైర్నాశయన్
చతుర్దశసహస్రకం సమహనత్ ఖరం సానుగమ్
దశాననవశానుగం కనకచారుచంచన్మృగం
ప్రియాప్రియకరో వనే సమవధీద్బలాద్రాక్షసమ్. **35**

భా: మార్గమున శ్రీరాముడు అనుచరులతో గూడిన ఖరదూషణులను రాక్షసులను సంహరించెను. పిమ్మట రావణుని ప్రేరణచే బంగారు మాయ లేడి రూపము ధరించి సీతాదేవి మనస్సు నాకర్షించిన రాక్షసుని (మారీచుని) వధించెను.

తతోదశముఖ స్త్వరంస్తమభివీక్ష్య రామం రుషా
వ్రజంతమనులక్ష్మణం జనకజా జహారాశ్రమే
తతో రఘుపతిః ప్రియాం దలకుటీర సంస్థాపితాం
న వీక్ష్య తు విమూర్ఛితో బహు విలప్య సీతేతి తామ్. **36**

భా: రామలక్ష్మణులు ఆశ్రమమున లేని సమయమున రావణుడు సీతనపహరించెను. ఆశ్రమమున సీతను కానరాక రాముడు మిక్కిలి విలపించుచు మూర్ఛనొందెను.

వనే నిజగణాశ్రమే నగతలే జలే పల్వలే
విచిత్య పతితం ఖగం పథి దదర్శ సౌమిత్రిణా
జటాయువచనాత్తతో దశముఖాహృతాం జానకీం
వివిచ్య కృతవాన్ మృతే పితరి వహ్నికృత్యం ప్రభుః. **37**

భా: పిమ్మట రాముడు లక్ష్మణునితో గూడి మహర్షుల, ఆశ్రమములు, పర్వతములు, నదులు, లోయలు మొదలగు ప్రదేశములలో సీతాదేవిని వెదకుచు మార్గమున పడియున్న జటాయువును చూచెను. దాని వలన రావణుడు సీతనపహరించిన విషయమును తెలిసికొనెను. జటాయువు మరణించగా పితృతుల్యమగు దానికి అంత్యక్రియలు నిర్వర్తించెను.

ప్రియావిరహకాతరోఽనుజపురస్సరో రాఘవో
ధనుర్ధరధురంధరో హరిబలం నవాలాపినమ్

షదదర్శ ఋషభాచలాద్రవిజవాలిరాజానుజ
ప్రియం పవననందనం పరిణతం హితం ప్రేషితమ్. 38

భా: ప్రియావిరహ సంతప్తుడగు రాముడు లక్ష్మణునితో గూడి తిరుగుచు వానరసైన్యమును చూచెను. పిమ్మట సూర్యపుత్రుడగు వాలి కనిష్ఠసోదరుడు సుగ్రీవుని, అతనికి ఇష్టుడగు పవన పుత్రుడు హనుమంతుని చూచెను.

తతస్తదుదితం మతం పవనపుత్రసుగ్రీవయో-
స్తృణాధిపతి భేదనం నిజనృపాసనస్థాపితమ్
వివిచ్య వ్యవసాయకైర్నిజ సఖాప్రియం వాలినం
నిహత్య హరిభూపతిం నిజసఖం స రామోఽకరోత్. 39

భా: పవనపుత్ర సుగ్రీవుల అభీష్టానుసారము శ్రీరాముడు సప్తతాలవృక్షములను భేదించెను. వాలిని సంహరించి తనస్నేహితుడగు సుగ్రీవుని పట్టాభిషిక్తుని చేసెను.

అథోత్తరమిమాం హరిర్జనకజాం సమన్వేషయన్
జటాయు సహజోదితైర్జలనిధిం తరన్ వాయుజః
దశాననపురం విశన్ జనకజాం సమానందయ-
న్నశోకవనికాశ్రమే రఘుపతిం పునః ప్రాయయౌ. 40

భా: పిమ్మట హనుమంతుడు సీతాదేవిని వెదకుచు జటాయువు చెప్పిన ప్రకారము సముద్రమును దాటి లంకను ప్రవేశించి అశోకవనమున సీతను ఆనందపరచి తిరిగి రామచంద్రుని వద్దకు వచ్చెను.

తతో హనుమతా బలాదమితరక్షసాం నాశనం
జ్వాలజ్జ్వలన సంకులజ్వలిత దగ్ధలంకా పురమ్
వివిచ్య రఘునాయకో జలనిధిం రుషా శోషయన్
బబంధ హరియూథపైః పరివృతో నగైరీశ్వరః
బభంజ పురపత్తనం వివిధ సర్గదుర్గక్షమం
నిశాచరపతేః క్రుధా రఘుపతిః కృతీ సద్గతిః. 41

భా: రామచంద్రుడు రాక్షసనాశమును లంకాపురదాహమును హనుమంతుని నుండి వినెను. తరువాత సముద్రుని శుష్కింపజేసి వారధి నిర్మించి వానర సైన్యముతో లంకాపురము ప్రవేశించి శత్రుపురము లను నాశముగావించెను.

తతోఽనుజయుతో యుధి ప్రబల చండకోదండభృత్

**శరైః ఖరతరైః క్రుధా గజరథాశ్వ హంసాకులే**
**కరాలకరవాలతః ప్రబలకాల జిహ్వాగ్రతో**
**నిహత్య వరరాక్షసాన్ నరపతిర్బభౌ సానుగః. 42**

భా: అనంతరము అనుజునితో గూడి శ్రీరాముడు ప్రచండమగు కోదండమును ధరించి తీక్ష్ణమగు బాణములతో గజరథాదులను చెల్లాచెదరు చేయుచు కరవాలముచే రాక్షసగణమును సంహరించి ప్రకాశించెను.

**తతోఽతిబలవానరైర్గిరి మహీరుహోద్యత్కరైః**
**కరాలతరతాడనైర్జనకజారుషా నాశితాన్**
**నిజఘ్నురమరార్దనానతిబలాన్ దశాస్యానుగాన్**
**నలాఙ్గదహరీశ్వరాశుగ సుతరక్ష రాజాదయః. 43**

భా: అనంతరము నలుడు, అంగదుడు, సుగ్రీవుడు, హనుమంతుడు, జాంబవంతుడు మున్నగు మహాబలవంతులగు వానరులు చెట్లు కొండలు మొదలగు వానితో రాక్షసులను కొట్టి చంపిరి. ఆరాక్షసులు పూర్వమే సీతాదేవి కోపముతోడనే సగము చచ్చియుండిరి. (అట్టి వారిని తేలికగ వానరులు చంపిరని భావము)

**తతోఽతిబల లక్ష్మణస్త్రిదశ నాథ శత్రుం రణే**
**జఘాన ఘనఘోషణానుగగణైరసృక్ ప్రాశనైః**
**ప్రహస్త వికటాదికానపి నిశాచరాన్ సంగతాన్**
**నికుంభమకరాక్షకాన్నిశిత ఖడ్గపాతైః క్రుధా. 44**

భా: అనంతరము రక్తపానము చేయు సేవకులతో వచ్చిన రావణపుత్రుడగు మేఘనాదుని లక్ష్మణుడు సంహరించెను. పిమ్మట క్రుద్ధుడైన లక్ష్మణుడే ప్రహస్త, నికుంభ, మకరాక్ష, వికటాది రాక్షసులను చంపెను.

**తతో దశముఖో రణే గజరథాశ్వపత్తీశ్వరై-**
**రలంఘ్య గణకోటిభిః పరివృతో యుయోధాయుధైః**
**కపీశ్వరచమూపతేః పతిమనంతదివ్యాయుధం**
**రఘూద్వహమనిందితం సపది సంగతో దుర్జయః. 45**

భా: పిమ్మట కోట్లకొలది గజరథ అశ్వ పదాతిదలముతో కూడి రావణాసురుడు సుగ్రీవుని ప్రభువు, దివ్యాయుధధారి దుర్జయుడునగు శ్రీరామచంద్రునితో యుద్ధము చేసెను.

**దశాననమరిం తతో విధివరస్మయావర్ధితం**

మహాబలపరాక్రమం గిరిమివాచలం సంయుగే
జఘాన రఘునాయకో నిశితసాయకైరుద్ధతం
నిశాచరచమూపతిం ప్రబలకుంభకర్ణం తతః. 46

భా: బ్రహ్మ యిచ్చిన వరముచే వృద్ధి పొందువాడు, మహాబలపరాక్రమ సంపన్నుడు, సంగ్రామమున పర్వతమువలె అచంచలుడు, రాక్షస సేనాపతి యగు కుంభకర్ణుని రఘునాయకుడయిన రాముడు వాడియైన బాణములతో బాధించెను.

తయోః ఖరతరైః శరైర్గగనమచ్ఛమాచ్ఛాదితం
బభౌ ఘనఘటాసమం ముఖరమత్తడిద్వహ్నిభిః
ధనుర్గుణ మహాశనిధ్వనిభిరావృతం భూతలం
భయంకర నిరంతరం రఘుపతేశ్చ రక్షఃపతే. 47

భా: రామరావణ యుద్ధమున ఆకాశమంతయు మేఘములవలె బాణములతో ఆచ్ఛాదితమాయెను. బాణముల పరస్పరఘర్షణచే నిప్పుకణములు పుట్టినవి. ధనుష్టంకారములు భూతలమంతయు వ్యాపించినవి. యుద్ధరంగము భయంకరముగ గోచరించెను.

తతో ధరణిజారుషా వివిధరామబాణౌజసా
పపాత భువి రావణస్త్రిదశనాథ విద్రావణః
తతోఽతికుతుకీ హరిర్జ్వలన రక్షితాం జానకీం
సమర్ప్య రఘుపుంగవే నిజపురీం యయౌ హర్షితః. 48

భా: పిమ్మట దేవేంద్రునికి సయితము భయకారకుడగు రావణుడు సీతాదేవి కోపాగ్ని, రామచంద్రుని బాణతేజస్సులచే నేల గూలెను. అనంతరము కపిశ్రేష్ఠుడగు హనుమంతుడు అగ్నిచే శుద్ధి చేయబడిన సీతాదేవిని శ్రీరామునికి సమర్పించి హర్షముతో నిజపురమునకు వెడలెను.

పురంధరకథాదరః సపది తత్ర రక్షః పతిమ్
విభీషణ మభీషణం సమకరోత్తతో రాఘవః. 49
హరీశ్వరగణావృతోఽవని సుతాయుతః సానుజో
రథే శివసఖేరితే సువిమలే లసత్ పుష్పకే
మునీశ్వరగణార్చితో రఘుపతిస్త్వయోధ్యాం యయౌ
వివిచ్య మునిలాంఛనం గుహగృహేఽతిసఖ్యం స్మరన్. 50

భా: దేవేంద్రుని వచనములపై ఆదరము కల్గిన శ్రీరాముడు శాంతస్వభావుడగు విభీషణుని

రాజ్యాభిషిక్తుని గావించెను. వానరరాజులతో, సీతాలక్ష్మణులతో గూడిన రఘురాముడు, శోభాయమానమగు పుష్పకవిమానము నెక్కి మునివేషమును, గుహుని స్నేహమును స్మరించుచు అయోధ్యకు వచ్చెను.

**తతో నిజగణావృతో భరతమాతురం సాంత్వయన్**
**స్వమాతృగణవాక్యతః పితృనిజాసనే భూపతిః**
**వసిష్ఠమునిపుఙ్గవైః కృతనిజాభిషేకో విభుః**
**సమస్తజనపాలకః సురపతిర్యథా సంబభౌ. 51**

భా: అనంతరము శ్రీరాముడు మనోవ్యథతో కలతపడు భరతుని ఓదార్చెను. మాత ఆదేశానుసారము పితృ సింహాసన మధిరోహించెను. వసిష్ఠాది మహర్షులు అతనిని అభిషిక్తుని చేసిరి. సమస్త జన రక్షకుడగు రాముడు దేవేంద్రుని వలె శోభిల్లెను.

**నరా బహుధనాకరా ద్విజవరాస్తపస్తత్పరాః**
**స్వధర్మకృతనిశ్చయాః స్వజనసంగతా నిర్భయాః**
**ఘనాః సుబహువర్షిణో వసుమతీ సదా హర్షితా**
**భవత్యతిబలే నృపే రఘుపతావభూత్ సజ్జగత్. 52**

భా: అతిబలుడగు శ్రీరాముడు మహారాజు కాగా లోకమంతయు సన్మార్గమున నడచినది. ప్రజలు ఐశ్వర్యవంతులయిరి. బ్రాహ్మణులు తపస్సంపన్నులయిరి. అందరు నిర్భయముగ తమతమ ధర్మములను పాలించిరి. సకాలమున మేఘుడు వర్షించుటచే భూమి సస్యశ్యామల మాయెను.

**గతాయుతసమాః ప్రియైర్నిజగుణైః ప్రజా రంజయన్**
**నిజాం రఘుపతిః ప్రియాం నిజమనోభవైర్మోహయన్**
**మునీంద్రగణసంయుతోఽప్యయజదాదిదేవాన్ మఖై-**
**ర్ఘనైర్విపులదక్షిణై రతులవాజిమేధైస్త్రిభిః. 53**

భా: శ్రీరాముడు పదివేల సంవత్సరములు తన గుణగణములచే ప్రజలను ఆనందపరచెను. మనోభీష్టములను తీర్చి జానకీదేవిని తృప్తిపరచెను. ముని గణముతో కూడి యజ్ఞయాగములను చేసి, విపుల దక్షిణల నిచ్చి దేవతల నానందపరచెను. రఘుపతి మూడు అశ్వమేధయాగములను కూడ చేసెను.

**తతః కిమపి కారణం మనసి భావయన్ భూపతి-**
**ర్జహౌ జనకజాం వనే రఘువరస్తదా నిర్ఘృణః**

తతో నిజమతం స్మరన్ సమనయత్ ప్రచేతస్సుతో
నిజాశ్రమముదారధీ రఘుపతేః ప్రియాం దుఃఖితామ్. 54

భా: ఏదో కారణమును మనస్సులో నుంచుకొని నిర్దయుడగు రాముడు సీతాదేవిని అడవులలో విడిచెను. పిమ్మట వాల్మీకి మహర్షి తనచే రచింపబడిన రామాయణగాథను స్మరించుచు దుఃఖితురాలయిన సీతాదేవిని తన ఆశ్రమమునకు తీసుకు వెళ్ళెను.

తతః కుశలవౌసుతౌ ప్రసుషువే ధరిత్రీసుతా
మహాబలపరాక్రమౌ రఘుపతేర్యశోగాయనౌ
స తామపి సుతాన్వితాం మునివరస్తు రామాంతికే
సమర్ప్యయ దనిందితాం సురవరైః సదావందితామ్. 55

భా: అనంతరము సీతాదేవికి కుశుడు లవుడను మహాబలపరాక్రమ సంపన్నులగు ఇద్దరు పుత్రులు కల్గిరి. వారు రామచరితమును గానము చేసెడివారు. వాల్మీకి ఇద్దరు పుత్రులతో గూడ దేవతలచే పూజ్యురాలగు సీతాదేవిని శ్రీరామునికి సమర్పించెను.

తతో రఘుపతిస్తు తాం సుతయుతాం రుదంతీం పురో
జగాద దహనే పునః ప్రవిశ శోధనాయాత్మనః
ఇతీరితమవేక్ష్య సా రఘుపతేః పదాబ్జే నతా
వివేశ జననీయుతా మణిగణోజ్జ్వలం భూతలమ్. 56

భా: ఏడ్చుచు ఎదురుగ వచ్చిన సీతాదేవిని శుద్ధి నిమిత్తము మరల అగ్నిపరీక్ష చేయుమని శ్రీరాముడు పలుకగ అతని పదాబ్జములను నమస్కరించి సీతాదేవి తన తల్లి భూదేవితో గూడి పాతాళమును ప్రవేశించెను.

నిరీక్ష్యరఘునాయకో జనకజాప్రయాణం స్మరన్
వసిష్ఠ గురుయోగతోఽనుజయుతోఽగమస్త్వం పదమ్
పురః స్థితజనైః స్వకైః పశుభిరీశ్వరః సంస్పృశన్
ముదా సరయుజీవనం రథవరైః పరీతో విభుః. 57

భా: సీతాదేవి పాతాళగమనమును స్మరించుచు శ్రీహరి గురువయిన వసిష్ఠుడు, తమ్ముళ్లు, పురజనులు మొ॥వారితో గూడి సరయూనదిలో చేరి స్పృశించి దివ్యవిమానమున వైకుంఠమునకు వెడలెను.

యేశృణ్వంతి రఘూద్వహస్య చరితం కర్ణామృతం సాదరాత్
సంసారార్ణవశోషణఞ్చ పఠతామామోదదం మోక్షదమ్
రోగాణామిహ శాంతయే ధనజన స్వర్గాది సంపత్తయే
వంశానామపి వృద్ధయే ప్రభవతి శ్రీశః పరేశః ప్రభుః. **58**

భా: కర్ణామృతమగు శ్రీరామచరితమును భక్తితో వినువారు సంసారసాగరమునుండి ముక్తి పొందుదురు. రోగము లుపశమించును. వంశము వృద్ధిపొందును. ధన, పుత్ర, స్వర్గసంపదలు లభించును. ఇది చదువు వారికి పరమ పురుషార్థమగు మోక్షము లభించును.

ఇతి శ్రీ కల్కి పురాణేఽనుభాగవతే
భవిష్యే తృతీయాంశే శ్రీరామ చరితం
నామ తృతీయోఽధ్యాయః.

ఇది శ్రీభాగవతానుబంధము భవిష్యము నగు
శ్రీ కల్కిపురాణమున తృతీయాంశమున
శ్రీరామచరితమను
తృతీయాధ్యాయము.

★★★

# కల్కి పురాణము

## తృతీయాంశము-చతుర్థాధ్యాయము

2-30

రామాత్ కుశోఽభూదతిథిస్తతోఽభూన్నిషధాన్నభః
తస్మాదభూత్ పుండరీకః క్షేమధన్వాఽభవత్తతః. 1
దేవానీకస్తతో హీనః పారిపాత్రోఽథ హీనతః
బలాహకస్తతోఽర్కశ్చ రజనాభస్తతోఽభవత్. 2
ఖగణాద్విధృతస్తస్మాద్ధిరణ్యానాభ సంజ్ఞితః
తతః పుష్పాద్ధ్రువస్తస్మాత్ స్యందనోఽథాగ్ని వర్ణకః. 3

భా: రాముని వలన కుశుడు జన్మించెను కుశునికి అతిథి పుట్టెను. అతని పుత్రుడు నిషధుడు. నిషధపుత్రుడు నభుడు. నభపుత్రుడు పుండరీకుడు. అతని పుత్రుడు క్షేమ ధన్వుడు. అతనికి దేవానీకుడు కలిగెను. దేవానీక పుత్రుడు క్షేమధన్వుడు. అతనికి దేవానీకుడు కలిగెను. దేవానీక పుత్రుడు హీనుడు. హీనునికి పారిపాత్రుడు, పారాపాత్రునికి బలాహకుడు, అతనికి అర్కుడు, అర్కునకు అజనాభుడు, అతనికి ఖగణుడు, ఖగణునకు విధృతుడు, విధృతునకు హిరణ్యానాభుడు, అతనికి పుష్పుడు, పుష్పునకు ధ్రువుడు, ధ్రువునకు స్యందనుడు, స్యందనునకు అగ్నివర్ణుడు జన్మిచిరి.

తస్మాచ్ఛీఘ్రోఽభవత్ పుత్రః పితామేఽతులవిక్రమః
తస్మాన్మరుం మాం కేఽపీహ బుధం చాపి సుమిత్రకమ్. 4
కలాపగ్రామమాసాద్య విద్ధి సత్తపసి స్థితమ్
తవావతారం విజ్ఞాయ వ్యాసాత్ సత్యవతీసుతాత్. 5

భా: అనుపమపరాక్రమ సంపన్నుడగు శీఘ్రుడు అగ్నిపుత్రుని కుమారుడు. మరువను పేరుగల నేను అతని పుత్రుడను. నన్ను బుధుడు, సుమిత్రుడని కూడా అందురు. కలాపగ్రామమున ఇంతవరకు తపమాచరించితిని. సత్యవతీపుత్రుడగు వ్యాసుని వలన తమ అవతార వృత్తాంతము తెలిసికొంటిని.

ప్రతీక్ష్య కాలం లక్షాబ్దం కలేః ప్రాప్తస్తవాంతికమ్
జన్మకోట్యంహసాం రాశేర్నాశనం ధర్మశాసనమ్
యశఃకీర్తికరం సర్వకామపూరం పరాత్మనః. 6

భా: కలి యొక్క లక్ష సంవత్సరముల కాలమును నిరీక్షించి నీ దగ్గరకు వచ్చితిని. పరమాత్మయగు మీ దర్శనము వలన కోటి జన్మల పాపము నశించును. ధర్మము వృద్ధిచెందును. యశస్సు కల్గును. అన్ని కోరికలు తీరును.

కల్కిరువాచ......

జ్ఞాతస్తవాన్వయస్త్వం చ సూర్యవంశసముద్భవః
ద్వితీయః కోఽపరః శ్రీమాన్ మహాపురుషలక్షణః. 7
ఇతి కల్కివచః శ్రుత్వా దేవాపిర్మధురాక్షరామ్
వాణీం వినయసంపన్నః ప్రవక్తుముపచక్రమే. 8

భా: కల్కి పలికెను. నీ వంశమును గూర్చి తెలిసినది. నీవు సూర్యవంశపురాజువు. మహాపురుష లక్షణములు కల్గిన రెండవవలరెవరు? అని అడిగెను. కల్కిమాటలు వినిన దేవాపి వినయముతో మధురముగ ఇట్లు పలికెను.

దేవాపిరువాచ......

ప్రలయాంతే నాభిపద్మాత్ తదాభూచ్చతురాననః
తదీయ తనయాదత్రే శ్చంద్రస్తస్మాత్తతో బుధః. 9
తస్మాత్ పురూరవా జజ్ఞే యయాతిర్నాహుషస్తతః
దేవయాన్యాం యయాతిస్తు యదుం తుర్వసుమేవ చ. 10
శర్మిష్ఠాయాం తథాద్రుహ్యుం చానుం పూరుంచ సత్పతే
జనయామాస భూతాదిర్భూతానీవ సిసృక్షయా. 11

భా: ప్రలయాంతమున తమ నాభి కమలము నుండి బ్రహ్మ జన్మించెను. బ్రహ్మపుత్రుడు అత్రి. అత్రిపుత్రుడు చంద్రుడు. చంద్రుని పుత్రుడు బుధుడు. బుధుని పుత్రుడు పురూరవుడు. పురూరవుని పుత్రుడు నహుషుడు. నహుషుని పుత్రుడు యయాతి. యయాతికి దేవయాని యందు యదు, తుర్వసులను ఇద్దరు పుత్రులు జన్మించిరి. అట్లే శర్మిష్ఠకు ద్రుహ్యుడు, అనుడు, పూరుడు అనెడి ముగ్గురు పుత్రులు కల్గిరి. సృష్టి సమయమున భూతాదులు అనగా తామస అహంకారము పంచభూతములను సృజించినట్లు, యయాతి అయిదుగురు పుత్రులను పొందెను.

**పూరోర్జనమేజయస్తస్మాత్ ప్రచిన్వానభవత్తతః**
**ప్రవీరస్తన్మనస్యుర్వై తస్మాచ్చాభయదోఽభవత్. 12**
**ఉరుక్షయాచ్చ త్ర్యరుణిస్తతోఽభూత్ పుష్కరారుణిః**
**బృహత్ క్షేత్రా దభూద్ధస్తీ యన్నామ్నా హస్తినాపురమ్. 13**

భా: పూరుపుత్రుడు జనమేజయుడు. జనమేజయ పుత్రుడు ప్రచిన్వంతుడు. ప్రచిన్వంతుని పుత్రుడు ప్రవీరుడు. ప్రవీరుని పుత్రుడు మనస్యువు. మనస్యుని పుత్రుడు అభయదుడు. అభయద పుత్రుడు ఉరుక్షయుడు. ఉరుక్షయ పుత్రుడు త్ర్యరుణి. త్ర్యరుణి పుత్రుడు పుష్కరారుణి. పుష్కరారుణి పుత్రుడు బృహత్క్షేత్రుడు. బృహత్క్షేత్రుని పుత్రుడు హస్తి. ఇతని పేరుతో హస్తినాపురమని నగరము ప్రసిద్ధి చెందినది.

**అజమీఢో ద్విమీఢశ్చ పురమీఢస్తు తత్సుతాః**
**అజమీఢా దభూ దృక్షస్తస్మాత్ సంవరణాత్ కురుః. 14**
**కురోః పరిక్షిత్ సుధనుర్జహ్నుర్నిషధ ఏవచ**
**సుహోత్రోఽభూత్ సుధనుషశ్చ్య వనాచ్చ తతః కృతీ. 15**

భా: అజమీఢుడు, ద్విమీఢుడు, పురుమీఢుడని హస్తికి ముగ్గురు పుత్రులు. అజమీఢ పుత్రుడు ఋక్షుడు. ఋక్ష పుత్రుడు సంవరణుడు. సంవరణ పుత్రుడు కురువు. కురుపుత్రుడు పరీక్షిత్తు. సుధను, జహ్ను, నిషేధులు పరీక్షిత్తు పుత్రులు. సుధను పుత్రుడు సుహోత్రుడు. సుహోత్రుని పుత్రుడు చ్యవనుడు.

**తతోబృహథస్తస్మాత్ కుశాగ్రా దృషభోఽభవత్**
**తతః సత్యజితః పుత్రః పుష్పవాన్నహుషస్తతః. 16**
**బృహద్రథాన్య భార్యాయాం జరాసంధః పరంతపః**
**సహదేవసుత స్తస్మాత్ సోమాపిర్శ్రుతశ్రవాః 17**

సురథాద్విదూరథ స్తస్మాత్ సార్వభౌమో౽భవత్తతః
జయసేనా(ద్రథానీకో౽ భూద్యుతాయుశ్చ కోపనః. 18
తస్మాద్దేవాతిథిస్తస్మాదృక్షస్తస్మాద్దిలీపకః
తస్మాత్ ప్రతీపక స్తస్య దేవాపిరహమీశ్వర. 19

భా: శ్రుతశ్రవసుని పుత్రుడు సురథుడు. సురథుని పుత్రుడు విదూరథుడు, విదూరథ పుత్రుడు సార్వభౌముడు. సార్వభౌమపుత్రుడు జయసేనుడు. జయసేన పుత్రుడు రథానీకుడు. రథానీకుని వలన కోపస్వభావము గల యుతాయువు జన్మించెను. యుతాయుపుత్రుడు దేవాతిథి. దేవాతిథి పుత్రుడు ఋక్షుడు. ఋక్షపుత్రుడు దిలీపుడు. దిలీప పుత్రుడు ప్రతీపకుడు. పరమేశ్వర! నేను ప్రతీపకుని పుత్రుడగు దేవాపిని.

రాజ్యం శాంతనవే దత్వా తపస్యేకధియా చిరమ్
కలాపగ్రామ మాసాద్య త్వాం దిదృక్షురిహాగతః. 20
మరుణానేన మునిభిరేభిః ప్రాప్య పదాంబుజమ్
తవ కాలకరాలాస్యాద్యాస్యామ్యాత్మవతాం పదమ్. 21

భా: రాజ్యమును శంతనునకు అప్పగించి తపస్సు పరమార్థముగ తలచి కలాపగ్రామమున నివసించుచు మిమ్ములను చూడవలెనని ఇక్కడకు వచ్చితిని. మరువుతో, మహర్షులతో కూడి నేను కాలమునకు ( యమునకు) కరాలము వంటి నీ పాదపద్మములను సేవించి ఆత్మజ్ఞానమును పొందగలను.

తయోరేవం వచః శ్రుత్వా కల్కిః కమలలోచనః
ప్రహస్య మరుదేవాపి సమాశ్వాస్య సమబ్రవీత్. 22

భా: వారి వచనములను విని కమలలోచను డయిన కల్కి చిరునవ్వు నవ్వి, మరుదేవాపులను ఓదార్చి యిట్లనెను.

కల్కిరువాచ.......

యువాం పరమధర్మజ్ఞౌ రాజానౌ విదితావుభౌ
మదాదేశకరౌ భూత్వా నిజరాజ్యం భరిష్యథః. 23
మరో త్వామభిషేక్ష్యామి నిజాయోధ్యా పురే౽ధునా
హత్వా మ్లేచ్ఛానధర్మిష్ఠాన్ ప్రజాభూత విహింసకాన్. 24

దేవాపే తవ రాజ్యే త్వాం హస్తినాపురపత్తనే
అభిషేక్ష్యామి రాజర్షే హత్వా పుక్కసకాన్ రణే. 25

భా: కల్కి పలికెను. పరమధార్మికులుగ ప్రసిద్ధి గాంచిన మీరిరువురు నా ఆదేశానుసారము మీ మీ రాజ్యములను పరిపాలింపుడు. మరూ! అధార్మికులు, ప్రజాహింసకులగు మ్లేచ్ఛులను సంహరించి నిన్ను అయోధ్యకు రాజుగ చేసెదను. దేవాపి! పుల్కసజాతివారిని (చండాలురు) చంపి నిన్ను హస్తినాపురమునకు రాజుగ చేసెదను.

మథురాయామహం స్థిత్వా హరిష్యామి తు వో భయమ్
శయ్యాకర్ణా నుష్ట్రముఖా నేక జంఘా న్వినోదరాన్. 26
హత్వా కృతం యుగం కృత్వా పాలయిష్యామ్యహం ప్రజాః
తపో దేశం వ్రతం త్యక్త్వా సమారుహ్యా రథోత్తమమ్. 27

భా: నేను మథురానగరమున నుండి మీ భయమును దూరము చేయగలను. శయ్యాకర్ణులు, ఉష్ట్రముఖులు, ఒక పిక్కగలవారు, ఉదరరహితులను చంపి కృతయుగమును చేసి ప్రజలను రక్షించెదను. తపోవేషమును, వ్రతమును విడిచి రథము నెక్కి మీరు వెడలుడు.

యువాం శస్త్రాస్త్రకుశలౌ సేనాగణపరిచ్ఛదౌ
భూత్వా మహారథౌ లోకే మయాసహ చరిష్యథః. 28
విశాఖయూపభూపాలస్తనయాం వినయాన్వితామ్
వివాహే రుచిరాపాంగీం సుందరీం త్వాం ప్రదాస్యతి. 29
సాధో భూపాల లోకానాం స్వస్తయే కురుమే వచః
రుచిరాశ్వసుతాం శాంతాం దేవాపే త్వం సముద్వహ. 30

భా: శస్త్రాస్త్రముల యందు కుశలురు, సేనాగణముతో కూడిన మహారథులగు మీరు మ్లేచ్ఛనాశము కొఱకు నాతో సంచరించవలసినది. విశాఖయూప భూపాలుడు వినయసంపన్నురాలు, సౌందర్యవతి యగు తన పుత్రికను మరురాజగు నీకిచ్చి వివాహము చేయును. లోకకళ్యాణము కొఱకు నామాటలను చక్కగ పాలింపుము. దేవాపి! రుచిరాశ్వుని పుత్రికయగు శాంతను నీవు వివాహమాడుము.

ఇత్యాశ్వాసకథాః కల్కేః శ్రుత్వా తౌ మునిభిః సహ
విస్మయావిష్టహృదయౌ మేనాతే హరిమీశ్వరమ్. 31

ఇతి బ్రువత్యభయదే ఆకాశాత్ సూర్యసన్నిభౌ
రథౌ నానామణి వ్రాతఘటితౌ కామగౌ పురః
సమాయాతౌ జ్వలద్దివ్య శస్త్రాస్త్రైః పరివారితౌ. 32

భా: కల్కియొక్క ఆశ్వాసముతో గూడిన మాటలను విని వారిద్దరు మునిగణముతో గూడ ఆశ్చర్య చకితులై కల్కిని శ్రీహరిగ తలచిరి. అభయవచనములు కల్కి పలుకుచుండగ ఆకాశమార్గము నుండి సూర్యుని వలె ప్రకాశించునవి, మణులచే అలంకరింపబడినవి, ప్రకాశించెడి దివ్య అస్త్రశస్త్రములతో నిండిన రెండు రథములు వచ్చినవి.

దదృశుస్తే సదోమధ్యే విశ్వకర్మ వినిర్మితౌ
భూపా మునిగణాః సభ్యాః సహర్షాః కిమితీరితాః. 33

కల్కి రువాచ.....

యువామాదిత్య సోమేంద్రయమవై శ్రవణాంగజౌ
రాజానౌ లోకరక్షార్థ మావిర్భూతౌ విదంత్యమీ. 34

భా: విశ్వకర్మచే నిర్మింపబడిన రథములను చూచి రాజులు, మునిగణము, ఇది యేమని ఆశ్చర్యపడిరి. కల్కి పలికెను. సూర్య, చంద్ర, ఇంద్ర, యమ, కుబేరుల అంశలగు మీరిద్దరు భూమిని పాలించుటకు రాజులుగ అవతరించిరి. ఈ విషయము వీరందరికి తెలియును.

కాలేనాచ్ఛాదితాకారౌ మమ సంగాదిహోదితౌ
యువాం రథావారుహతాం శక్రదత్తం మమాజ్ఞయా. 35
ఏవం వదతి విశ్వేశే పద్మనాభే సనాతనే
దేవా వవర్షుః కుసుమైః స్తుష్టువు ర్మునయోఽగ్రతః. 36

భా: ఇంతవరకు మీమీ ఆకారములు ( అవతారములు) కప్పుబడియున్నవి. నా సాంగత్యముచే ఇప్పుడు వ్యక్తమైనవి. నా ఆజ్ఞ ననుసరించి యింద్రదత్తమగురథము నధిరోహింపుడు. పద్మనాభుడు ఈ విధముగ పలుకుచుండగ దేవతలు పుష్పవర్షము కురుపించిరి. మునులు స్తోత్రము చేసిరి.

గంగావారి పరిక్లిన్న శిరోభూతి పరాగవాన్
శనైః పర్వతజా సజ్గ శివవత్ పవనో వవౌ. 37
తత్రాయాతః ప్రముదితతను స్తప్తచామీకరాభో
ధర్మావాసః సురుచిరజటాచీర భృద్దండ హస్తః

లోకాతీతో నిజతను మరున్నాశితాఽ ధర్మసంఘ -
స్తేజోరాశిః సనకసదృశో మస్కరీ పుష్కరాక్షః. 38

భా: గంగాజలముచే తడిసిన, శివుని శిరోవిభూతి రేణువులతో గూడిన, పార్వతీదేవిని స్పృశించుటచే మంగళప్రదమయిన వాయువు వీచు చున్నది. ఆ సమయమున సనకముని వంటి తేజోరాశి, దండధారియగు నొక బ్రహ్మచారి అచ్చటకు వచ్చెను. తప్తకాంచనము వలె అతని శరీరము నుండి కాంతులు ప్రసరించు చున్నవి. ధర్మమునకు నిలయమగు నతడు జటాధారియై మనోహరవస్త్రమును ధరించెను. లోకాతీతుడు, నిజశరీరస్పర్శ మాత్రముచే అధర్మసముదాయమును నాశము చేయువాడు; కమల దలముల వంటి నేత్రములు కలవాడై శోభిల్లెను.

ఇతి శ్రీ కల్కి పురాణేఽ నుభాగవతే భవిష్యే తృతీయాంశే
సూర్యచంద్ర వంశానుకీర్తనం నామ
చతుర్థోఽధ్యాయః

ఇది భాగవతానుబంధము భవిష్యమునగు
శ్రీకల్కి పురాణమున తృతీయాంశమున
సూర్య చంద్ర వంశానుకీర్తన మను
చతుర్థాధ్యాయము.

★★★

# కల్కి పురాణము

## తృతీయాంశము-పంచమాధ్యాయము

శుక ఉవాచ....

అథ కల్కిః సమాలోక్య సదసాంపతిభిః సహ

సముత్థాయ వవందే తం పాద్యార్ఘ్యాచమనాదిభిః. 1

వృద్ధం సంవేశ్య తం భిక్షుం సర్వాశ్రమనమస్కృతమ్

పప్రచ్ఛ కో భవానత్ర మమ భాగ్యాదిహాగతః. 2

భా: శుకుడు పలికెను. తేజః పుంజమువలె ప్రకాశించెడి బ్రహ్మచారిని చూచి సభాసదులతో కూడ లేచి నిలబడి కల్కి పాద్యము, అర్ఘ్యము, ఆచమనము మున్నగు వానితో అతనిని పూజించెను. అన్ని ఆశ్రమములవారిచే నమస్కరింపదగిన భిక్షుకుని కూర్చుండ బెట్టి కల్కి, నాభాగ్యముచే ఇక్కడకేతెంచిన తమరెవరని ప్రశ్నించెను.

ప్రాయశో మానవా లోకే లోకానాం పారణేచ్ఛయా

చరంతి సర్వసుహృదః పూర్ణా విగతకల్మషాః. 3

మస్కర్యువాచ........

అహం కృతయుగం శ్రీశ తవాదేశకరం పరమ్

తవావిర్భావ విభవ మీక్షణార్థ మిహాగతమ్. 4

భా: అందరి హితమును కోరు పాపరహితులగు మానవులు లోకములనుద్ధరించుటకు తిరిగెదరు. సన్యాసి పలికెను. ఓ శ్రీనాథ! మీ ఆదేశమును పాలించు కృతయుగమును నేను. తమ అవతారవైభవమును చూచుట కి చ్ఛుటకు వచ్చితిని.

నిరుపాధిర్భవాన్ కాలః సోపాధిత్వ ముపాగతః

క్షణదండలవాద్యం గైర్మాయయా రచితం స్వయా. 5

పక్షాహోరాత్ర మాసర్తు సంవత్సరయుగాదయః

తవేక్షయా చరంత్యేతే మనవశ్చ చతుర్దశ. 6

భా: ఉపాధిరహితమగు కాలస్వరూపుడవగునీవు క్షణ, దండ, లవాది ధర్మములచే ఉపాధి సహితుడవైతివి. స్వీయమగు మాయచే లోకముల సృష్టి జరిగినది. తమ కటాక్షములచే పక్ష అహోరాత్ర, మాస, ఋతు, సంవత్సర, యుగాదులు, ( పదునాల్గురు) మనువులు నియమితముగ పరిభ్రమించెదరు.

స్వాయంభువస్తు ప్రథమస్తతః స్వారోచిషో మనుః
తృతీయ ఉత్తమస్తస్మాచ్చతుర్థస్తామసః స్మృతః. 7
పంచమోరైవతః షష్ఠశ్చాక్షుషః పరికీర్తితః
వైవస్వతః సప్తమో వై తతః సావర్ణిరష్టమః. 8
నవమో దక్షసావర్ణి ర్బ్రహ్మసావర్ణిక స్తతః
దశమో ధర్మసావర్ణి రేకాదశః స ఉచ్యతే. 9
రుద్రసావర్ణికస్తత్ర మనుర్వైద్వాదశః స్మృతః
త్రయోదశమనుర్వేద సావర్ణి ర్లోకవిశ్రుతః. 10
చతుర్దశేంద్ర సావర్ణి రేతే తవ విభూతయః
యాంత్యాయాంతి ప్రకాశంతే నామరూపాదిభేదతః. 11

భా: ''స్వాయంభువ, స్వారోచిష, ఉత్తమ, తామస, రైవత, చాక్షుష, వైవస్వత, సావర్ణి, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణి, ధర్మసావర్ణి, రుద్రసావర్ణి, వేదసావర్ణి, ఇంద్రసావర్ణి'' అనువారు పదునాల్గురు మనువులు. వీరు తమ విభూతులు ( ఐశ్వర్యములు) నామ రూపముల మొదలగు భేదములచే వ్యక్తావ్యక్తము లగుచుందురు.

ద్వాదశాబ్దసహస్రేణ దేవానాంచ చతుర్యుగమ్
చత్వారి త్రీణిద్వే చైకం సహస్రగణితం మతమ్. 12
తావచ్ఛతాని చత్వారి త్రీణి ద్వే చైకమేవ హి
సంధ్యా క్రమేణ తేషాంతు సంధ్యాంశోఽపి తథావిధః. 13

భా: దేవతలకు పండ్రెండు వేల సంవత్సరముల పరిమాణము గలది యుగచతుష్టయము. అట్లే నాలుగు వేల సంవత్సరములు కృతయుగము. మూడువేల సంవత్సరములు త్రేతాయుగము. రెండువేల సంవత్సరములు ద్వాపరయుగము. వెయ్యిసంవత్సరముల పరిమాణము కలియుగము. నాలుగు యుగముల పూర్వసంధ్య క్రమముగ నాలుగు వందలు, మూడు వందలు, రెండువందలు, వంద సంవత్సరముల పరిమాణము. శేషసంధ్య పరిమాణము కూడా పైవిధముగనే చెప్పవలెను.

ఏకసప్తతికం తత్రయుగం భుక్త్వా మనుర్భువి
మనూనామపి సర్వేషామేవం పరిణతిర్భవేత్
దివా ప్రజాపతేస్తత్తు నిశా సా పరికీర్తితా. 14
అహోరాత్రం చ పక్షస్తే మాససంవత్సరర్తవః
సదుపాధికృతః కాలో బ్రహ్మణో జన్మమృత్యుకృత్. 15

భా: ఒక్కొక్క మనువు 71 యుగముల కాలము ననుభవించును. ఇట్లు పదునాల్గురు మనువులు అనుభవించు యుగ కాలము బ్రహ్మకు ఒక పగలు. అట్లే ఇంతటి కాలము ఒక రాత్రి. ఈ విధముగ పగలు, రాత్రి, పక్షము, మాసము, సంవత్సరము, ఋతువులనెడి ఉపాధులతో కూడిన కాలము బ్రహ్మకు జన్మమృత్యుకారకమగును.

శతసంవత్సరే బ్రహ్మా లయం ప్రాప్నోతి హి త్వయి
లయాంతే త్వన్నాభిమధ్యా దుత్థితః సృజతి ప్రభుః. 16
తత్ర కృతయుగాంతేఽహం కాలం సద్ధర్మపాలకమ్
కృతకృత్యాః ప్రజా యత్ర తన్నామ్నా మాం కృతం విదుః. 17

భా: బ్రహ్మ ఆయుర్దాయము నూరు సంవత్సరములు. అనంతరము మాయందే లయము పొందును. ప్రలయ కాలము తరువాత తిరిగి బ్రహ్మ మీ నాభి కమలము నుండి ఉద్భవించి జగత్తును సృష్టించును. నేను కాలము యొక్క అంశయగు కృతయుగమును సద్ధర్మములనురక్షించువాడను. నాకాలమున ప్రజలు ధర్మపాలనచేసి కృతకృత్యులగుటచే కృతయుగమను పేరుతో నేను ప్రసిద్ధుడను.

ఇతి తద్వచ ఆశ్రుత్య కల్కిర్నిజ జనావృతః
ప్రహర్షమతులం లబ్ధ్వాశ్రుత్వా తద్వచనామృతమ్. 18
అవహిత్థాముపాలక్ష్య యుగస్యాహ జనాన్ హితాన్
యోద్ధుకామః కలేః పుర్యాం హృష్టో విశసనే ప్రభుః. 19
గజరథతురగాన్ నరాంశ్చయోధాన్
కనకవిచిత్ర విభూషణాచితాంగాన్
ధృతవివిధవరాస్త్రశస్త్రపూర్ణాన్
యుధి నిపుణాన్ గణయధ్వమానయధ్వమ్. 20

భా: కృతయుగ వచనములు వినిన కల్కి తన అనుచరులతో గూడ అపారమగు ఆనందమును

పొందెను. కృతయుగము యొక్క మరుగుపరచు కొనిన రూపమును వీక్షించినకల్కి సంతుష్టుడై కలియొక్క విశసనపురమందు యుద్ధము చేయుదలచి తనతో నున్న జనులతో వివిధ అలంకారభూషితులగు గజరథతురగ పదాతి దళములను, వివిధములగు అస్త్రశస్త్రములను ధరించిన యుద్ధనిపుణులను లెక్కించి తీసుకు రావలసినదని చెప్పెను.

ఇతి శ్రీకల్కిపురాణేఽను భాగవతే
భవిష్యే తృతీయాంశే
కృతయుగాగమనం నామ
పంచమోఽధ్యాయః

ఇది భాగవతానుబంధము భవిష్యమునగు
శ్రీ కల్కి పురాణము తృతీయాంశమున
కృతయుగాగమనము అను
పంచమాధ్యాయము.



# కల్కి పురాణము

## తృతీయాంశము-షష్ఠాధ్యాయము

సూత ఉవాచ.....

ఇతి తౌ మరుదేవాపీ శ్రుత్వా కల్కేర్వచః పురః
కృతోద్వాహౌ రథారూఢౌ సమాయాతౌ మహాభుజౌ. 1
నానాయుధధరైః సైన్యైరావృతౌ శూరమానినౌ
బద్ధగోధాఙ్గుళిత్రాణౌ దంశితౌ బద్ధహస్తకౌ. 2

భా: సూతుడు పలికెను. కల్కి ఆదేశానుసారము మరుదేవాపులు వివాహముచేసికొని, రథము నారోహించి వచ్చిరి. సైన్యముతో గూడి పరాక్రమ వంతులమను అభిమానము కల్గిన వారిద్దరు అనేక విధములగు నాయుధములను ధరించిరి. శరీరమునకు కవచమును, ముంజేతికి వింటినారి దెబ్బ తగలకుండుటకై రక్షకమగు గోధను ధరించినవారై ఈడుజోడు కలవారైరి.

కార్ష్ణాయసశిరస్త్రాణౌ ధనుర్ధర ధురంధరౌ
అక్షౌహిణీభిః షడ్భిస్తు కంపయంతౌ భువం భరైః. 3
విశాఖయూపభూపస్తు గజలక్షైః సమావృతః
అశ్వైః సహస్రనియుతైః రథైః సప్తసహస్రకైః. 4

భా: ధనుర్ధరులలో శ్రేష్ఠులగు వారు నల్లని శిరస్త్రాణములను ధరించి ఆరు అక్షౌహిణుల సేనతో భూమిని కంపింపజేయుచు వచ్చుచున్నారు. విశాఖ యూప భూపాలుడు లక్షగజములు, కోటి అశ్వములు, ఏడువేల రథములు కలిగి యుండెను.

పదాతిభి ర్ద్విలక్షైశ్చ సన్నద్ధై ర్ధృతకార్ముకైః
వాతోద్ధూతోత్తరోష్ణీషైః సర్వతః పరివారితః. 5
రుధిరాశ్వ సహస్రాణాం పంచాశద్భిర్మహారథైః
గజైర్దశశతైర్మత్తై ర్నవ లక్షై ర్వృతో బభౌ. 6

భా: అతనితో రెండు లక్షల పదాతిదలము ధనుస్సులను ధరించి సన్నద్ధముగ నున్నది.

గాలిచే వారి తలపాగలు ఉత్తరీయములు కంపించు చున్నవి. ఇంకను ఏబది వేల ఎఱ్ఱని గుఱ్ఱములు పదివేల మదపుటేనుగులు, చాలా మంది మహారథులు, తొమ్మిది లక్షల పదాతిదలము గలదు.

అక్షౌహిణీభిర్దశభిః కల్కిః పరపురంజయః
సమావృత స్తథా దేవై రేవమింద్రో దివి స్వరాట్. 7
భ్రాతృపుత్ర సుహృద్భిశ్చ ముదితః సైనికైర్వృతః
యయౌ దిగ్విజయాకాంక్షీ జగతామీశ్వరః ప్రభుః. 8

భా: స్వర్గలోకమున దేవతలతో ఇంద్రునివలె శత్రుపురములను జయించెడి కల్కి పది అక్షౌహిణి సేనలతో విరాజిల్లెను. సోదరులు, పుత్రులు, స్నేహితులు, సైనికులతో కూడిన జగదీశ్వరుడగు కల్కి దిగ్విజయయాత్ర చేయవలెనని తలచెను.

కాలే తస్మిన్ ద్విజోభూత్వా ధర్మః పరిజనైః సహ
సమాజగామ కలినా బలినాపి నిరాకృతః. 9
ఋతం ప్రసాదమభయం సుఖం ముదమథ స్వయమ్
యోగమర్థం తతోఽదర్పం స్మృతిం క్షేమం ప్రతిశ్రయమ్. 10
నరనారాయణౌ చోభౌ హరేరంశౌ తపోవ్రతౌ
ధర్మస్త్వేతాన్ సమాదాయ పుత్రాన్ స్త్రీశ్చాగతస్త్వరన్. 11

భా: బలవంతుడగు కలిచే తిరస్కరింపబడిన ధర్మము బ్రాహ్మణ రూపము నొంది పరిజనముతో అక్కడకు వచ్చెను. ఋత, ప్రసాద, అభయ, సుఖ, ముద, యోగ, అర్థ, లదర్ప, స్మృతి క్షేమ, ప్రతిశ్రయులు కూడా వచ్చిరి. అట్లే తపోనిష్ఠులు, శ్రీహరి అంశలగు నరనారాయణులను, స్త్రీపుత్రులను వెంటబెట్టుకొని ధర్మము అక్కడకు వచ్చెను.

శ్రద్ధామైత్రీదయా శాంతిస్తుష్టిః పుష్టిః క్రియోన్నతిః
బుద్ధిర్మేధా తితిక్షాచ హ్రీర్మూర్తి ర్ధర్మపాలకాః. 12
ఏతాస్తేన సహాయాతా నిజబంధుగణైః సహ
కల్కి మాలోకితుం తత్ర నిజకార్యం నివేదితుమ్. 13

భా: శ్రద్ధ, మైత్రి, దయ, శాంతి, తుష్టి, క్రియ, ఉన్నతి, బుద్ధి, మేధ, తితిక్ష, ధర్మపాలక మూర్తులతో, తన బంధుగణముతో కూడి కల్కిని దర్శించుకొనుటకు నిజకార్యమును నివేదించుకొనుటకు వచ్చిరి.

కల్కి ర్ద్విజం సమాసాద్య పూజయిత్వా యథావిధి
ప్రోవాచ వినయాపన్నః కస్త్వం కస్మాదిహాగతః. 14
స్త్రీభిః పుత్రైశ్చ సహితః క్షీణపుణ్యో ఇవ గ్రహః
కస్య వా విషయాద్రాజ్ఞ స్త త్తత్త్వం వద తావతః. 15

భా: కల్కి బ్రాహ్మణుని సమీపించి యథోచితముగ పూజించి వినయముగ మీరెవరు? ఎక్కడి నుండి వచ్చినారు? క్షీణమయిన పుణ్యము గల మనుష్యులవలె స్త్రీపుత్ర సహితులై ఏ రాజు వద్దనుండి ఎందులకు వచ్చితిరో వివరముగ చెప్పుమని అడిగెను.

పుత్రాః స్త్రియశ్చ తే దీనా హీనస్వబల పౌరుషాః
వైష్ణవాః సాధవో యద్వత్ పాఖండైశ్చ తిరస్కృతాః. 16
కల్కే రితి వచః శ్రుత్వా ధర్మః శర్మ నిజం స్మరన్
ప్రోవాచ కమలానాథ మనాథస్త్వతికాతరః. 17

భా: పాఖండులచే తిరస్కరింపబడిన సత్పురుషులగు విష్ణుభక్తులవలె మీ పుత్రులు, స్త్రీలు పౌరుషహీనులై దీనముగ కనబడుచున్నారు. అనాథుడు, అతికాతరుడగు ధర్ముడు కమలాపతియగు కల్కి మాటలను విని తన అభ్యుదయము కొఱకు ఇట్లు పలికెను.

పుత్రైః స్త్రీభిర్నిజ జనైః కృతాంజలిపుటై ర్హరిమ్
స్తుత్వా నత్వా పూజయిత్వా ముదితం తం దయాపరమ్. 18

ధర్మ ఉవాచ.....

శ్రుణు కల్కే మమాఖ్యానం ధర్మోఽహం బ్రహ్మరూపిణః
తవ వక్షః స్థలాజ్జాతః కామదః సర్వదేహినామ్. 19

భా: పుత్ర, స్త్రీ, పరివారముతో కూడిన ధర్ముడు శ్రీహరికి చేతులు జోడించి నమస్కరించి స్తుతించి ఇట్లు పలికెను. కల్కి! నావృత్తాంతమును వినుము. బ్రహ్మరూపముగల నీవక్షఃస్థలము నుండి పుట్టిన, సమస్తప్రాణుల కోరికలను తీర్చు ధర్మముగ నన్ను తెలిసికొనుము.

దేవానామగ్రణీ ర్హవ్య కవ్యానాం కామధుగ్ విభుః
తవాజ్ఞయా చరామ్యేవ సాధుకీర్తి కృదన్వహమ్. 20
సోఽహం కాలేన బలినా కలినాపి నిరాకృతః
శక కాంబోజశబరైః సర్వైరావాస వాసినా. 21

భా: దేవతలలో ముందుగ పరిగణింప యోగ్యుడను, దేవయోగ్యము, పితృయోగ్యమునగు

అన్నము నిచ్చువారల కోరికలను తీర్చువాడను, తమ ఆదేశముచే సత్పురుషులకు కీర్తిని కలుగజేయువాడనగు నేను శకజకాంబోజ-శబర జాతుల ఆవాసమందు నివసించెడి బలవంతుడగు కలిచే నిరాకరింపబడితిని.

అధునా తేఽఖిలాధార! పాదమూలముపాగతాః
యథా సంసారకాలాగ్ని సంతప్తాః సాధవోఽర్దితాః. 22
ఇతి వాగ్భి రపూర్వాభి ర్ధర్మేణ పరితోషితః
కల్కిః కల్కహరః శ్రీమానాహ సంహర్షయన్ శనైః. 23

భా: సమస్తమునకు ఆధారభూతుడ! సంసారరూప కాలాగ్నిచే సంతప్తులై సాధువులు పీడింపబడు చున్నారు. ఈ కారణముచే నేను మీపాదముల నాశ్రయించితిని. ధర్ముని అపూర్వవచనములచే సంతుష్టుడయిన కల్కహరుడగు కల్కి సంతోషజనకముగ ఇట్లు పలికెను.

దర్మ! కృతయుగం పశ్య మరుం చండాంశు వంశజమ్
మాంజానాసి యథా జాతం ధాతృప్రార్థిత విగ్రహమ్. 24
కీటకై ర్బౌద్ధ దలన మితి మత్వా సుఖీ భవ
అవైష్ణవానామన్యేషాం తవోపద్రవకారిణామ్
జిఘాంసుర్యామి సేనాభిశ్చర గాం త్వం వినిర్భయః 25

భా: ధర్ముడా! కృతయుగము ప్రారంభమగుచున్నట్లు తెలిసికొనుము. ఇతడు సూర్యవంశపు రాజగు మరుడు. నేను బ్రహ్మ ప్రార్థన ననుసరించి కల్కిగ అవతరించుట నీకు తెలియును. కీటకదేశీయులగు బౌద్ధుల నణచితిని. నీవు సుఖముగ నుండుము. విష్ణుభక్తులు కానివారు, నీకు ఉపద్రవము కల్గించువారిని సంహరించుటకు సేనతో వెళ్ళెదను. నీవు నిర్భయముగ సంచరింపుము.

కా భీతి స్తే క్వ మోహోఽస్తి యజ్ఞదానతపోవ్రతైః
సహితైః సంచర విభో! మయి సత్యే వ్యవస్థితే. 26
అహం యామి త్వయా గచ్ఛ స్వపుత్రైర్బాంధవైః సహ
దిశాం జయార్థం త్వం శత్రునిగ్రహార్థం జగత్ప్రియ. 27

భా: నారాక, వలనను కృతయుగ ప్రారంభము వలన నీకేల భయము? మోహమునకు కారణమేమి? యజ్ఞదానతపోవ్రతములతో కూడి సంచరింపుము. లోకములకు హితము కల్గించెడి నీవు శత్రునిగ్రహముకొఱకు పుత్రబాంధవులతో దిగ్విజయమునకై బయలుదేరుము. నేను నీతో వచ్చెదను.

ఇతి కల్కేర్వచః శ్రుత్వా ధర్మః పరమహర్షితః
గంతుం కృతమతిస్తేన ఆధిపత్యమముం స్మరన్. 28
సిద్ధాశ్రమే నిజజనా నవస్థాప్య స్త్రియశ్చతాః. 29
సన్నద్ధః సాధుసత్కారై ర్వేద బ్రహ్మామహారథః
నానాశాస్త్రాన్వేషణేషు సంకల్పవరకార్ముకః 30

భా: కల్కి మాటలు వినిన ధర్ముడు మిక్కిలి సంతసించి తన ప్రభువును స్మరించి కల్కితో వెడలుటకు నిశ్చయించుకొని సిద్ధాశ్రమమున నిజస్త్రీపుత్రుల నుంచెను. యుద్ధరంగమున సాధుసత్కారములే అతనికి జోడు. వేదబ్రహ్మములే మహారథము. శాస్త్ర విషయముల నన్వేషించు సంకల్పమే శ్రేష్ఠ కార్ముకము. (ధనుస్సు)

సప్తస్వరాశ్వో భూదేవసారథిర్వహ్నిరాశ్రయః
క్రియాభేద బలోపేతః ప్రయయౌ ధర్మనాయకః. 31
యజ్ఞదాన తపః పాత్రైర్యమైశ్చ నియమైర్వృతః
ఖశ కాంబోజకాన్ సర్వాన్ శబరాన్ బర్బరానపి. 32
జేతుం కల్కిర్యయౌ యత్ర కలేరావాసమీప్సితమ్
భూతావాసబలోపేతం సారమేయవరాకులమ్. 33

భా: సప్తస్వరములు అశ్వములు, బ్రాహ్మణులు సారథులు, వహ్ని ఆసనముగ గలవాడై ధర్మనాయకుడు క్రియాభేదమను సేనతో గూడి బయలుదేరెను. యజ్ఞము, దానము, తపస్సు, యమనియమములతో వ్యాప్తుడయిన కల్కి భగవానుడు ఖశ, కాంబోజ, శబర, బర్బర మున్నగు మ్లేచ్ఛజాతులను జయించుటకు కలి నివసించు దేశమునకు వెడలెను. కలి నివాస స్థానము భూతముల నివాసముచే దృఢముగ నుండి శునకములచే వ్యాప్తమై యుండెను.

గోమాంసపూతిగంధాఢ్యం కాకోలూక శివావృతమ్
స్త్రీణాం దుర్ద్యూతకలహ వివాద వ్యసనాశ్రయమ్. 34
ఘోరం జగద్భయకరం కామినీ స్వామినం గృహమ్
కలిః శ్రుత్వోద్యమం కల్కేః పుత్రపౌత్రవృతః క్రుధా. 35

భా: కలి నివాస దేశమున గోమాంస దుర్గంధముతో నిండి యున్న కాకములు, గుడ్లగూబలు, నక్కలు తిరుగుచున్నవి. అది స్త్రీలు జూదము, కలహము, వివాదము, వ్యసనముల కాశ్రయము. ఘోరమగు రూపము గల కలిపురము లోకములను భయపెట్టు చున్నది. అచ్చట

స్త్రీల ఆదేశానుసారము ఇంటి వ్యవహారములు జరుగును. కల్కి యుద్ధయాత్రను వినిన కలి క్రుద్ధుడై పుత్రపౌత్రులతో గూడ (ముందు శ్లోకముతో అన్వయము)

పురాద్విశసనాత్ ప్రాయాత్ ప్రేచకాక్షరథోపరి
ధర్మః కలిం సమాలోక్య ఋషిభిః పరివారితః. 36
యయుధే తేన సహసా కల్కివాక్య ప్రచోదితః
ఋతేన దంభః సంగ్రామే ప్రసాదో లోభమాహ్వాయత్. 37
సమయాదభయం క్రోధో భయం సుఖముపాయయౌ
నిరయో ముదమాసాద్య యుయుధే వివిధాయుధైః. 38

భా: గుడ్లగూబ చిహ్నముగా కల్గిన ధ్వజముతో గూడిన రథము నధిరోహించి విశసన పురము నుండి వెడలెను. ధర్ముడు కలిని చూచి ఋషులతో కూడిన కల్కి మాటలచే ప్రేరేపింపబడి వారితో యుద్ధము చేసెను. ఋతునితో భీముడు యుద్ధము చేయ ప్రసాదుడు లోభము నాహ్వానించెను. అభయునితో క్రోధుడు, భయునితో సుఖుడు, నిరయుని(నరకము)తో ముదుడు వివిధ ఆయుధములతో తలపడిరి.

ఆధిర్యోగేన చ వ్యాధిః క్షేమేణ చ బలీయసా
ప్రశ్రయేణ తథా గ్లానిర్జరా స్మృతిముపాహ్వాయత్. 39
ఏవం వృత్తో మహాఘోరో యుద్ధః పరమదారుణః
తం ద్రష్టుమాగతా దేవా బ్రహ్మాద్యాః ఖే విభూతిభిః. 40
మరుః ఖశైశ్చ కాంబోజై ర్యుయుధే భీమవిక్రమైః
దేవాపిః సమరే చౌనై ర్బర్బరై స్తద్గణైరపి. 41

భా: ఆధి (మానసిక పీడ) యోగముతో, వ్యాధి బలీయమగు క్షేమునితో గ్లాని ప్రశ్రయముతో, జర (ముసలితనము) స్మృతితో యుద్ధము చేసిరి. ఈ విధముగ మహాఘోరము, పరమదారుణమునగు యుద్ధము జరుగుచుండగ బ్రహ్మాది దేవతలు తమ విభూతులతో సంగ్రామమును చూచుటకు ఆకాశమార్గమున వచ్చిరి. ఖశకాంబోజులతో మరువు యుద్ధము చేయుగా, చౌన, బర్బరులతోడను, వారి అనుచరులతోడను దేవాపి యుద్ధము చేసెను.

విశాఖ యూపభూపాలః పులిందైః శ్వపచైః సహ
యుయుధే వివిధైః శస్త్రై రస్త్రైర్దివ్యమహాప్రభైః. 42

కల్కిః కోకవికోకాభ్యాం వాహినీభిర్వరాయుధైః
తౌతు కోకవికోకౌ చ బ్రహ్మణో వరదర్పితౌ. 43

భా: రాజు విశాఖయూపుడు పులింద శ్వపచులతో తేజస్సంపన్నములగు దివ్య అస్త్రశస్త్రములతో తలపడెను. సేనతో కూడిన కల్కి ఉత్తమ ఆయుధములతో, బ్రహ్మ వలన వరము పొంది మిక్కిలి గర్వపడుచున్న కోకవికోక దానవులతో యుద్ధము చేసెను.

భ్రాతరౌ దానవశ్రేష్ఠౌ మత్తౌ యుద్ధ విశారదౌ
ఏకరూపౌ మహాసత్త్వౌ దేవానాం భయవర్ధనౌ. 44
పదాతికౌ గదాహస్తౌ వజ్రాంగౌ జయినౌ దిశామ్
శుంభైః పరివృతౌ మృత్యుజితావేకత్ర యోధనాత్. 45
తాభ్యాం స యుయుధే కల్కిః సేనాగణసమన్వితః
శుభానాం కల్కిసైన్యానాం సమరస్తుములోஉభవత్. 46

భా: కోక వికోక సోదరులు రాక్షసశ్రేష్ఠులు, వారు మదించిన వారు, యుద్ధమందు నేర్పరులు, ఒకే రూపము గలవారు, మిక్కిలి బలశాలురు, దేవతలకు కూడ భయమును కల్గించుచు, నేలమీద యుద్ధము చేయువారు. వజ్రము వలె దృఢమయిన శరీరము గలవారు, గద హస్తమందు కలవారు, సేనతో కూడి పోరాడుట వలన దిక్కులను జయించువారు, మృత్యువును కూడ జయించినవారు. అట్టి దానవసోదరులతో కల్కి యుద్ధము చేయ, కల్కి సైన్యము శత్రుసైన్యముతో తలపడెను. ఇరువురి మధ్య ఘోరయుద్ధము జరిగెను.

హ్రేషితైర్బృంహితైర్దంత శబ్దైష్టంకారనాదితైః
శూరోత్క్రుష్టైర్బాహువేగైః సంశబ్దస్తలతాడనైః. 47
సంపూరితా దిశః సర్వాలోకా నో శర్మ లేభిరే
దేవాశ్చ భయసంత్రస్తా దివి వ్యస్తపథా యయుః. 48
పాశైర్దండైః ఖడ్గశక్త్యృష్టిశూలై
ర్గదాఘాతైర్బాణ పాతైశ్చ ఘోరైః
యుద్ధే శూరాశ్ఛిన్న బాహ్వంఘ్రి మధ్యాః
పేతుః సంఖ్యే శతశః కోటిశశ్చ. 49

భా: గుఱ్ఱముల సకిలింపులు, ఏనుగుల ఘీంకారములు, దంతశబ్దములు, ఘుష్టంకారనాదములు, బాహువులను అప్పళించదలు, అరచేతి దెబ్బలచే పుట్టిన మహాశబ్దములు

దిక్కులన్ని వ్యాపించినవి. ప్రాణులకు సుఖము లేదు. దేవతలు భయకంపితులై మార్గము తప్పి సంచరించిరి. ఈ యుద్ధమున పాశము, ఖడ్గము, దండము, శక్తి, ఋష్టి, శూలము, గద మొ॥వాని ఆఘాతములచే, ఘోరములగు బాణప్రయోగములచే అసంఖ్యాకముగ వీరుల చేతులు, కాళ్ళు, మధ్యభాగములు చిన్నాభిన్నములై అంతట పడుచున్నవి.

ఇతి శ్రీ కల్కిపురాణేఽను భాగవతే
భవిష్యే తృతీయాంశే
కల్కి సేనా సంగ్రామో నామ
షష్ఠోఽధ్యాయః

ఇది భాగవతానుబంధము, భవిష్యమునగు
శ్రీ కల్కిపురాణము తృతీయాంశమున
కల్కి సేనా సంగ్రామ మను
షష్ఠాధ్యాయము.



# కల్కి పురాణము

## తృతీయాంశము-సప్తమాధ్యాయము

సూత ఉవాచ........

ఏవం ప్రవృత్తే సంగ్రామే ధర్మః పరమకోపనః
కృతేన సహితో ఘోరం యుయుధే కలినా సహ. 1
కలిర్ధమిత్ర బాణౌఘైర్ధ ర్మస్యాపి కృతస్య చ
పరాభూతః పురీం ప్రాయాత్ త్యక్త్వా గర్దభవాహనమ్. 2
విచ్ఛిన్నపేచక రథః స్రవద్రక్తాఙ్గ సంచయః
ఛఛుర్గంధః కరాలాస్యః స్త్రీస్వామిక మగాద్ గృహమ్. 3

భా: ఉగ్రశ్రవసుడు పలికెను. ఈ విధముగ మహాసంగ్రామము ఆరంభము కాగా మిక్కిలి క్రుద్ధుడయిన ధర్ముడు కృతయుగముతో కలిసి కలితో భయంకర యుద్ధము చేసెను. ధర్మకృతయుగముల భయంకర బాణసముదాయమునకు ఓడిన కలి గర్దభ వాహనమును విడిచి తన పురమునకు వెడలెను. ఉలూక ధ్వజము కల్గిన అతని రథము విచ్ఛిన్నమాయెను. శరీరము నుండి రక్తము స్రవించుచుండెను. దుర్గంధము వెడలుచుండెను. ముఖము భయంకర మాయెను. ఇట్టి దురవస్థను పొందిన కల్కి స్త్రీస్వామికమగు గృహమును ప్రవేశించెను.

దంభః సంభోగరహితోద్ధృత బాణగణాహతః
వ్యాకులః స్వకులాంగారో నిస్సారః ప్రావిశద్ గృహమ్. 4
లోభః ప్రసాదాభిహతో గదయా భిన్నమస్తకః
సారమేయరథం ఛ్ఛిన్నం త్యక్త్వాగాద్రుధిరం వమన్. 5

భా: తనకులమునకు అంగారము వంటి దంభము బాణములచే కొట్టబడి వ్యాకులత చెంది, నిస్సారమై ఇంటిలోనికి ప్రవేశించెను. ప్రసాదముచే లోభము కొట్టబడెను. గదాఘాతముచే అతని శిరస్సు ముక్కలాయెను. శునకరథము ఛిన్నము కాగా రక్తము కక్కుకొను [illegible] పారిపోయెను.

అభయేన జితః క్రోధః కషాయీకృతలోచనః
గంధాఖువాహం విచ్ఛిన్నం త్యక్త్వావిశసనం గతః. 6
భయం సుఖ తలాఘాతాద్గతాసుః న్యపతద్భువి
నిరయోముదముష్టిభ్యాం పీడితోయమమాయయా. 7

భా: అభయునిచే ఓడింపబడిన క్రోధుడు ఎఱ్ఱని నేత్రములతో ఎలుకలు వాహనముగ కల దుర్గంధయుక్త రథమును విడిచి విశసన పురమునకు వెడలెను. సుఖుని దెబ్బలకు భయుడు ప్రాణములు విడిచి భూమి మీద పడెను. ముదుని ముష్టిఘాతములచే నిరయుడు యమపురికి పోయెను.

ఆధివ్యాధ్యాదయః సర్వేత్యక్త్వా వాహముపాద్రవన్
నానాదేశాన్ భయోద్విగ్నాః కృతబాణప్రపీడితాః. 8
ధర్మః కృతేన సహితో గత్వా విశసనం కలేః
నగరం బాణదహనైర్దదాహ కలినా సహ. 9

భా: ఆధి, వ్యాధి మున్నగు వారు బాణములచే పీడింపబడి వాహనములను విడిచి భయునితో కలిసి ధర్ముడు కలి రాజధానియగు శసన నగరమును ప్రవేశించి బాణాగ్నితో కలితో కూడిన నగరమును దగ్ధము చేసెను.

కలిర్విప్లుష్ట సర్వాంగో మృతదారో మృతప్రజః
జగామైకో రుదన్ దీనో వర్షాంతరమలక్షితః. 10
మరుస్తు శకకాంబోజాన్ జఘ్ను దివ్యాస్త్రతేజసా
దేవాపిః శబరాంశ్చోలాన్ బర్బరాంస్తద్గణానపి. 11

భా: కలియొక్క సర్వావయవములు మండిపోయెను. భార్యాపుత్రులు మరణించిరి. అతడు ఒంటరివాడై దీనముగ ఏడ్చుచు కనబడకుండ దేశాంతరమునకు పారిపోయెను. దివ్యాస్త్రతేజస్సుతో మరువు శకకాంబోజులను, దేవాపి శబరచోల బర్బరులను సంహరించిరి.

దివ్యాస్త్రశస్త్ర సంపాతై రర్దయామాస వీర్యవాన్
విశాఖ యూపభూపాలః పులిందాన్ పుక్కసానపి. 12
జఘాన విమలప్రజ్ఞః ఖడ్గపాతేన భూరిణా
నానా స్త్రశస్త్ర వర్షైస్తై యోధా నేశు రనేకధా. 13

భా: పరాక్రమవంతుడగు విశాఖయూప భూపాలుడుదివ్య అస్త్రశస్త్రములతో పులింద

పుక్కస జాతివారిని బాధించెను. నిర్మలమగు ప్రజ్ఞకల విశాఖయూపుడు ఖడ్గప్రహారములచే, అస్త్రశస్త్రములతో శత్రుసైన్యమును చంపెను.

కల్కిః కోకవికోకాభ్యాం గదాపాణిర్యుధాం పతిః
యయుధే విన్యాసవిజ్ఞో లోకానాం జనయన్ భయమ్. 14
వృకాసురస్య పుత్రౌతౌ నప్తారౌ శకునేర్హరిః
తయోః కల్కిః స యుయుధే మధుకైటభయోర్యథా. 15

భా: గదాధారి, సేనాపతియగు కల్కి గదా విన్యాసమున చతురుడై లోకము భయంకరముగ కోక వికోకులతో యుద్ధము చేసెను. వారిద్దరు వృకాసురుని పుత్రులు, శకుని మనుమలు. మధుకైటభులతో శ్రీహరి యుద్ధము చేసినట్లు కల్కి వారితో సంగ్రామము చేసెను.

తయోర్గదా ప్రహారేణ చూర్ణితాఙ్గస్య తత్పతేః
కరాచ్చ్యుతోఽ పతద్భూమౌ దృష్ట్వోచురిత్యహో జనాః. 16
తతః పునః క్రుధా విష్ణుర్జగజ్జిష్ణు ర్మహాభుజః
భల్లకేన శిరస్తస్య దికోకస్యాచ్ఛినత్ ప్రభుః. 17

భా: వారిగదా ప్రహారముచే కల్కి శరీరావయవములు చూర్ణము లాయెను. చేతినుండి గద జారి క్రింద పడెను. ప్రజలందరు ఆశ్చర్యముతో తిలకించిరి. పిమ్మట ముల్లోకములను జయించెడి మహాబాహువగు కల్కి క్రోధముతో భల్లకమను అస్త్రమును ప్రయోగించి వికోకుని శిరమును ఖండించెను.

మృతో వికోకః కోకస్య దర్శనాదుత్థితో బలీ
తద్దృష్ట్వా విస్మితా దేవాః కల్కిశ్చ పరవీరహా. 18
ప్రతికర్తుర్గదాపాణేః కోకస్యాప్యచ్ఛినచ్ఛిరః
మృతః కోకో వికోకస్య దృష్టిపాతాత్ సముత్థితః. 19

భా: బలవంతుడగు వికోకుడు మరణించినను కోకదృష్టివలన తిరిగి బ్రతికెను. ఇది చూచి దేవతలు, శత్రుసంహారకుడగు కల్కియు ఆశ్చర్యపడిరి. కల్కిగదను ధరించి కోకుని శిరస్సు ఖండించెను. కాని వికోకుని దృష్టి వలన తిరిగి బ్రతికెను.

పునస్తౌ మిలితౌ తేన యుయుధాతే మహాబలౌ
కామరూపధరౌ వీరౌ కాలమృత్యూ ఇవాపరౌ. 20

ఖడ్గచర్మధరౌ కల్కిం ప్రహరంతౌ పునః పునః
కల్కిః క్రుధా తయోస్తద్వద్బాణేన శిరసీ హతే. 21

భా: యథేచ్ఛగ రూపుదాల్చిన పరాక్రమవంతులగు కోకవికోకులు కలసి కాలమృత్యువుల వలె కల్కితో యుద్ధము చేసిరి. ఖడ్గ చర్మములు ధరించిన వారిరువురు కల్కిని బాధించుచుండగ అతడు కోపముతో బాణముచే వారిరువురి శిరస్సులను ఖండించెను.

పునర్లగ్నే సమాలోక్య హరిశ్చిన్తాపరోఽ భవత్
విసత్త్వాత్వమథాలోక్య తురగస్తావతాడయత్. 22
కాలకల్పౌదురాధర్షౌ తురగేణార్దితౌ భృశమ్
కల్కేస్తం జఘ్నతుర్బాణై రమర్షాత్ తామ్రలోచనౌ. 23

భా: ఇద్దరి శిరస్సులు తిరిగి కలుసుకొనుటను చూచి హరి చింతామగ్నుడాయెను. కల్కి గుఱ్ఱము వారిరువురిని గట్టిగ తన్నెను. యముని వంటివారు, ఎదుర్కొనుటకు శక్యము కాని వారగు కోకవికోకులు అశ్వప్రహారముచే క్రోధారుణనయనులై బాణములతో కల్కిని హింసించిరి.

తయోర్భుజాంతరం సోఽశ్వః క్రుధా సమదశద్ భృశమ్
తౌతు ప్రభిన్నాస్థిభుజౌ విశస్తాఙ్గదకార్ముకౌ
పుచ్ఛం జగృహతుః సప్తేర్గోపుచ్ఛం బాలకావివ. 24
ధృతపుచ్ఛౌ మూర్ఛితౌ తౌ తత్క్షణాత్ పునరుత్థితౌ
పశ్చాత్ పద్భ్యాం దృఢం జఘ్నే తయోర్వక్షసి వజ్రవత్. 25

భా: ఆ గుఱ్ఱము కోపముతో వారిరువురి భుజముల మధ్యదేశమును కొఱకగా భుజముల ఎముకలు ముక్క ముక్కలాయెను. కేయూర, ధనుస్సులు విరిగెను. బాలుడు గోవు తోకను పట్టుకొనినట్లు వారు అశ్వము తోకను పట్టుకొనిరి. గుఱ్ఱము వెనుకకాళ్ళతో వజ్రాయుధము వలె వారి వక్షఃస్థలములను గట్టిగ తన్నెను.

త్యక్తపుచ్ఛౌ మూర్ఛితౌ తౌ తక్షణాత్ పునరుత్థితౌ
పురతః కల్కి మాలోక్య బభాషాతే స్ఫుటాక్షరౌ. 26
తతో బ్రహ్మా తమభ్యేత్య కృతాంజలిపుటః శనైః
ప్రోవాచ కల్కిం నైవామూ శస్త్రా స్త్రైర్వధమర్హత ః. 27

భా: తెలివితప్పిన వాడై తోకను విడిచి క్రిందపడి వెంటనే లేచి ఎదురుగ కల్కిని చూచి కోకవికోకులు అతనిని యుద్ధమునకు ప్రేరేపించిరి. అంతలో బ్రహ్మ అక్కడకు చేతులు జోడించి కల్కితో 'వీరు అస్త్రశస్త్రములతో చంపబడరని' మెల్లగ చెప్పెను.

కరాఘతాదేకకాలే ఉభయోర్నిర్మితో వధః
ఉభయోర్దర్శనాదేవ నోభయోర్మరణం క్వచిత్
విదిత్వేతి కురుష్వాత్మన్ యుగపచ్ఛానయోర్వధమ్. 28
ఇతి బ్రహ్మవచః శ్రుత్వా త్యక్త శస్త్రాస్త్రవాహనః
తయోః ప్రహరతోః స్వైరం కల్కిర్దానవయోః క్రుధా
ముష్టిభ్యాం వజ్రకల్పాభ్యాం బభంజ శిరసీ తయోః. 29

భా: ఓ పరమాత్మ! ''ఏకకాలమందు పిడికిలి దెబ్బలచే వారిద్దరి మరణము తథ్యము. ఇద్దరిలో ఒకరిని మరియొకరు చూచుట వలన ఇద్దరికి మరణము సంభవించదు. కనుక ఇది తెలుసుకొని ఏకకాలమందు ఇద్దరిని వధించవలెను''. బ్రహ్మవచనములను వినిన కల్కి అస్త్రశస్త్రములను, రథమునువిడిచి యుద్ధముచేసెడి వారిరువురి నడుమకు వెడలి వజ్రసమానములగు ముష్టిఘాతములతో వారి శిరస్సులనుముక్కలు చేసెను.

తౌ తత్ర భగ్నమస్తిష్కౌ భగ్నశృంగావగావివ
పేతతుర్దివి దేవానాం భయదౌ భువి బాధకౌ. 30
తద్దృష్ట్వా మహదాశ్చర్యం గంధర్వాప్సరసాం గణాః
ననృతుర్జగుస్తుష్టువుశ్చ మునయః సిద్ధచారణాః
దేవాశ్చ కుసుమాసారైర్వవరుర్హర్షమానసాః. 31

భా: దేవతలకు సయితము భీతి గొల్పుచు ప్రాణులను హింసించెడి కోకవికోకులు తలలు పగిలి శిఖరములు విరిగిన కొండలవలె క్రిందపడిరి. ఆ అద్భుత కార్యమును చూచి గంధర్వులు గానముచేసిరి, అప్సరసలు నాట్యము చేసిరి. మునులు స్తుతించిరి. దేవతలు పుష్పవర్షము కురిపించిరి.

దివి దుందుభయో నేదుః ప్రసన్నాశ్చాభవన్ దిశః
తయోర్వధ ప్రముదితః కవిర్దశ సహస్రకాన్
సాశ్వాన్ మహారథాన్ సాక్షాదహనద్ధివ్యసాయకైః. 32
ప్రాజ్ఞః శతసహస్రాణాం యోధానాం రణమూర్ధని
క్షయం నిన్యే సుమంత్రస్తు రథినాం పంచవింశతిః. 33

భా:- కోక వికోకుల మరణ వార్తవిని అందరు సంతోషించిరి. స్వర్గమున దుందుభులు

సంహరించెను. ప్రాజ్ఞుడు లక్ష యోధులను, సుమంత్రుడు ఇరువది అయిదు రథికులను సంహరించిరి.

ఏవమన్యే గార్గ్య భర్గ విశాలాద్యా మహారథాన్
నిజఘ్నుః సమరే క్రుద్ధా నిషాదాన్ మ్లేచ్ఛబర్బరాన్. 34
ఏవం విజిత్య తాన్ సర్వాన్ కల్కిర్భూపగణైః సహ
శయ్యాకర్ణైశ్చ భల్లాటనగరం జేతుమాయయౌ. 35
నానావాద్యైర్లోకసంఘైర్వరాస్త్రైర్భూషణై ర్భూషితాంగైః
నానావాహైశ్చామరైర్వీజ్యమానైర్యాతో యోద్ధుం కల్కి రత్యుగ్రసేనః. 36

భా: ఈ విధముగ గార్గ్య భర్గ విశాలాదులు క్రుద్ధులై సమరమున మహారథులగు మ్లేచ్ఛ, బర్బరనిషాదులను సంహరించిరి. అందరిని జయించిన పిమ్మట కల్కి ససైన్యుడై భల్లాటనగరమును జయించుటకు వచ్చెను. అనేక విధములగు వాద్యములతోకూడి వివిధ అస్త్రభూషణములతో అలంకరింపబడిన భూపగణము, వివిధ వాహనములతో కూడా రాగా, సేవకులు వింజామరలు వీచుచుండ యుద్ధము చేయుటకు కల్కి వెడలెను.

ఇతి శ్రీ కల్కి పురాణేऽను భాగవతే
భవిష్యే తృతీయాంశే
కోక వికోకాదీనాం వధో నామ
సప్తమోऽధ్యాయః

ఇది భాగవతానుబంధము, భవిష్యమునగు
శ్రీ కల్కి పురాణమున తృతీయాంశమున
కోకవికోకాదుల వధయను
సప్తమాధ్యాయము.



# కల్కి పురాణము

## తృతీయాంశము-అష్టమాధ్యాయము

సూత ఉవాచ......

సేనాగణైః పరివృతః కల్కిర్నారాయణః ప్రభుః
భల్లాటనగరం ప్రాయాత్ ఖడ్గధృక్ సప్తివాహనః. 1
స భల్లాటేశ్వరో యోగీ జ్ఞాత్వా విష్ణుం జగత్పతిమ్
నిజసేనాగణైః పూర్ణో యోద్ధుకామో హరిం యయౌ. 2

భా: సూతుడు పలికెను. సేనాగణముతో కూడిన కల్కి ఖడ్గమును ధరించి అశ్వముపై భల్లాట నగరమునకు వెళ్ళెను. పరమయోద్ధయగు భల్లాట దేశప్రభువు కల్కిని విష్ణుమూర్తి అవతారముగ తెలుసుకొని యుద్ధము చేయుటకై ససైన్యుడై వచ్చెను.

స హర్షోత్పులకః శ్రీమాన్ దీర్ఘాంగః కృష్ణభావనః
శశిధ్వజో మహాతేజా గజాయుతబలః సుధీః 3
తస్య పత్నీ మహాదేవీ విష్ణువ్రత పరాయణా
సుశాంతా స్వామినం ప్రాహ కల్కినా యోద్ధుముద్యతమ్. 4

భా: భల్లాటప్రభువగు శశిధ్వజుడు కల్కిని చూచి హర్షముచే పులకించి కృష్ణధ్యానము చేసెను. అతడు బుద్ధిమంతుడు. తేజస్సంపన్నుడు, బలపరాక్రమవంతుడు, శశిధ్వజుని భార్య సుశాంత విష్ణువ్రతపరాయణ. కల్కితో యుద్ధము చేయుటకు సన్నద్ధుడగు తన భర్తతో ఆమె ఇట్లు పలికెను.

నాథ! కాంతం జగన్నాథం సర్వాంతర్యామినం ప్రభుమ్
కల్కిం నారాయణం సాక్షాత్ కథం త్వం ప్రహరిష్యసి . 5

శశిధ్వజ ఉవాచ......

సుశాంతే పరమో ధర్మః ప్రజాపతివినిర్మితః
యుద్ధే ప్రహారః సర్వత్ర గురౌ శిష్యే హరేరివ. 6

భా: ఓనాథ! జగన్నాథుడు, సర్వాంతర్యామి, సాక్షాత్ విష్ణుమూర్తి అవతారమగు కల్కి దేవునితో ఎట్లు యుద్ధము చేయగలవు? (తగదని తాత్పర్యము)

శశిధ్వజుడు పలికెను. ఓసుశాంత! యుద్ధమందు అందరు సమానమే. ఇదియే ప్రజాపతిచే చేయబడిన పరమ ధర్మము. గురువయినను శిష్యుడయినను హరి నయినను ప్రహరింప వలసినదే.

**జీవతోరాజభోగః స్యాన్మృతః స్వర్గే ప్రమోదతే**
**యుద్ధే జయోవా మృత్యుర్వా క్షత్రియాణాం సుఖావహాః.** 7

సుశాంతోవాచ.......

**దేవత్వం భూపతిత్వం వా విషయావిష్టకామినామ్**
**ఉన్మదానాం భవేదేవ న హరేః పాదసేవినామ్.** 8

భా: ప్రాణములతో యుద్ధరంగము నుండి తిరిగి వచ్చిన రాజ భోగములు కలుగును. యుద్ధమున మరణించిన స్వర్గసుఖములు లభించును. కనుక క్షత్రియులకు యుద్ధమందు జయము మరణము రెండును ఆనందదాయకములే .

సుశాంత పలికెను. ఉన్మత్తులు కాముకులగు మనుష్యులకు దేవత్వము కాని భూపతిత్వము కాని సమానమే. అవి వారికి ఆనందదాయకములు కావచ్చును. కాని హరి పాదసేవాతత్పరులకు ఇవన్నియు లెక్కింపబడునవి గావు. హరిపాదసేవయే వారి ముఖ్యలక్ష్యము.

త్వంసేవకః చాపీశస్త్వం నిష్కామః స చాప్రదః
యువయోర్యుద్ధమిలనం కథం మోహాద్భవిష్యతి. 9

శశిధ్వజ ఉవాచ.......

**ద్వంద్వాతీతే యది ద్వంద్వమీశ్వరే సేవకే తథా**
**దేహావేశాల్లీలయైవ సా సేవా స్యాత్తథా మమ.** 10

భా: మీరు సేవకులు. పైగా ప్రభువులు. మీరు నిష్కాములు. వారు ఫలమిచ్చువారు కాదు. ఇట్టి అవస్థలో మోహకార్యమయిన మీ ఇరువురి యుద్ధము ఎట్లు సంభవమగును?

శశిధ్వజుడు పలికెను. ద్వంద్వాతీతుడయిన పరమేశ్వరుని యెడల దేహవశముచే-ఈశ్వరుడు సేవకుడు అనుద్వంద్వభావము కల్గినను అట్టి సేవలీలా మాత్రముచే కల్గినదే.

దేహవశాదీశ్వరస్య కామాద్యా దైహికా గుణాః
మాయాంగా యది జాయంతే విషయాశ్చ న కిం తథా. 11

బ్రహ్మతో బ్రహ్మతేశస్య శరీరిత్వే శరీరితా
సేవకస్యాభేద దృశస్త్వేవం జన్మలయోదయాః. 12

**సేవ్యసేవకతా విష్ణోర్మాయా సేవేతి కీర్తితా**

**ద్వైతాద్వైతస్య చేష్టైషా త్రివర్గజనికా సతామ్. 13**

భా: భగవంతుడు దేహము ధరించిన మాయావశముచే దైహికములగు కామాది గుణములు అతని శరీరమం దారోపింప బడును. అట్లే కామాది విషయము లెందుకు ఆరోపించబడవు? పరమేశ్వరుని బ్రహ్మభావముచే బ్రహ్మగా చెప్పచున్నాము. శరీరమును ధరించిన శరీరిగా వ్యవహరించు చున్నాము. సేవకునకు అభేదజ్ఞానము కల్గినపుడు జన్మలయ ఉదయములు అట్టివే యగును. విష్ణుసంబంధమయిన మాయ వలన కలుగు సేవ్యసేవకభావమే సేవయనబడును. సత్పురుషుల ద్వైతాద్వైత చేష్టయే త్రివర్గోత్పత్తికి కారణము.

**అతోఽహం కల్కినా యోద్ధుం యామి కాంతే స్వసేనయా**

**త్వం తం పూజయ కాంతేఽద్య కమలాపతిమీశ్వరమ్. 14**

సుశాంతోవాచ......

**కృతార్థాఽహం త్వయా విష్ణుసేవా సంమిలితాత్మనా**

**స్వామిన్ ఇహ పరత్రాపి వైష్ణవీ ప్రథితాగతిః. 15**

భా: కాంత! ఈ కారణముచే నేను కల్కితో యుద్ధముచేయుటకు సైన్యముతో వెళ్ళుచున్నాను. కమలాపతియగు శ్రీహరిని నీవు పూజింపుము.

సుశాంత పలికెను. ఓస్వామి! మీరు విష్ణుసేవ నాచరించి విష్ణువుతో ఐక్యము నొందిరి. అందుచే నేను కృతార్థురాలను. ఇహ పరలోకములలో విష్ణుపూజను విడిచి మరియొక మార్గము లేదు.

**ఇతి తస్యా వల్గువాగ్భిః ప్రణతాయాః శశిధ్వజః**

**ఆత్మానం వైష్ణవం మేనే సాశ్రునేత్రో హరిం స్మరన్. 16**

**తామాలింగ్య ప్రముదితః శూరైర్బహుభిరావృతః**

**వదన్నామ స్మరన్ రూపం వైష్ణవైర్యోద్ధు మాయయౌ. 17**

భా: సుశాంతయొక్క మనోహరములగు వచనములను విన్న శశిధ్వజుడు ఆనందబాష్పములతో హరిని స్మరించుచు తనను వైష్ణవునిగ తలచెను. సంతోషముతో ఆమె నాలింగనము చేసుకొని శశిధ్వజుడు సైన్యముతో కూడినవాడై హరినామస్మరణ చేయుచు వైష్ణవులతో యుద్ధము చేయుటకు వెడలెను.

గత్వాతు కల్కి సేనాయాం విద్రావ్య మహతీం చమూమ్
శయ్యాకర్ణగణైర్వీరైః సన్నద్ధైరుద్యతాయుధైః. 18
శశిధ్వజసుతః శ్రీమాన్ సూర్యకేతుర్మహాబలః
మరుభూపేన యుయుధే వైష్ణవో ధన్వినాం వరః. 19

భా: శశిధ్వజుడు కల్కిసేన మధ్యకు ప్రవేశించి గొప్పసేనను చెల్లాచెదరు చేసెడి వీరులు ఆయుధధారులగు శయ్యాకర్ణ గణముతో తలపడెను. శశిధ్వజుని పుత్రుడు, మహాపరాక్రమ సంపన్నుడు సూర్యకేతువు ధనుర్ధారులలో శ్రేష్ఠుడగు మరునితో యుద్ధము చేసెను.

తస్యానుజో బృహత్కేతుః కాంతః కోకిలనిస్వనః
దేవాపినా స యుయుధే గదాయుద్ధవిశారదః. 20
విశాఖయూపభూపస్తు శశిధ్వజనృపేణ చ
యుయుధే వివిధైః శస్త్రై కరిభిః పరివారితః. 21

భా: సూర్యకేతువు కనిష్ఠసోదరుడు కమనీయరూపము గలవాడు, మధురమయిన కంఠధ్వని కలవాడు, గదాయుద్ధ విశారదుడగు బృహత్కేతువు దేవాపితో యుద్ధము చేసెను. విశాఖయూప భూపాలుడు అస్త్రశస్త్రములతో ఏనుగులతో కూడిన శశిధ్వజునితోపోరుసలిపెను.

రుధిరాశ్వో ధనుర్ధారీ లఘుహస్తః ప్రతాపవాన్
రజస్యసేన యయుధే భర్గః శాంతేన ధన్వినా. 22
శూలైః ప్రాసైర్గదాఘాతైర్బాణశక్త్యృష్టితోమరైః
భల్లైః ఖడ్గైర్భుశుండీభిః కుంతైః సమభవద్రణః. 23

భా: ఎరుపు రంగు గుఱ్ఱము కలవాడు, ధనుర్ధారి, చిన్న చేతులు గలవాడు, ప్రతాపవంతుడగు భర్గుడు యుద్ధరంగమున వ్యాపించిన ధూళిమధ్య శాంతునితో పోరాడెను. శూలము, ప్రాసము, గద అను ఆయుధముల దెబ్బలతోడను, బాణ, శక్తి, ఋష్టి తోమర, భల్ల, ఖడ్గ, భుశుండి, కుంతములనెడి ఆయుధములతోడను యుద్ధము సాగెను.

పతాకాభిర్ధ్వజైశ్ఛిహ్నైస్తోమరైశ్ఛత్ర చామరైః
ప్రోద్ధూత ధూలిపటలై రంధకారో మహానభూత్. 24
గగనేఽనుఘనా దేవాః కే వా వాసం న చక్రిరే
గంధర్వైః సాధుసందర్భైర్గాయనై రమ్మృతాయనైః. 25

భా: పతాక, ఛత్ర, చామరాదులచే ఎగరగొట్టబడిన ధూళిచే రణభూమి, అంతయు

చీకటిగానయ్యెను. ఆకాశమున మేఘములపై నుండి, మధుర గానములతో దేవతలు గంధర్వులు యుద్ధమును తిలకించిరి.

ద్రష్టుం సమాగతాః సర్వేలోకాః సమరమద్భుతమ్
శంఖదుందుభి సన్నాదై రాస్ఫోటైర్బృంహితైరపి. 26
హ్రేషితైర్యోధనోత్క్రుష్టైర్లోకా మూకా ఇవాభవన్
రథినో రథిభిః సాకం పదాతిశ్చ పదాతిభిః. 27
హయా హయైరిభాశ్చేభైః సమరోఽమరదానవైః
యథాఽభవత్స తు ఘనో యమరాష్ట్ర వివర్ధనః. 28

భా: అద్భుతమగు సమరమును చూచుటకు లోకులందరు వచ్చిరి. శంఖ దుందుభి ధ్వనులచే, వీరుల పరస్పర హస్తాఘాతములచే, గజ, అశ్వముల శబ్దములచే, అస్త్రముల పరస్పరాఘాతములచే లోకములన్నియు మూగవోయెను. రథికులు, పదాతులు (కాలిబాటసైన్యము), గజతురగములు వాహనములుగ కలవారు పరస్పరము పోరాడిరి. దేవాసుర సంగ్రామము వంటి ప్రకృత యుద్ధమున మరణించువారి సంఖ్యతో యమపురి వృద్ధిపొందసాగెను.

శశిధ్వజచమూనాథైః కల్కి సేనాధిపైః సహ
నిపేతుః సైనికాభూమౌ ఛ్ఛిన్నబాహ్వంఘ్రి కంధరాః. 29
ధావంతోఽతిబ్రువంతశ్చ వికుర్వంతోఽసృగుక్షితాః
ఉపర్యుపరి సంఛన్నా గజాశ్వ రథమర్దితాః. 30
నిపేతుః ప్రధనే వీరాః కోటికోటి సహస్రశః
భూతే సానంద సందోహాః స్రవంతో రుధిరోదకమ్. 31

భా: శశిధ్వజ సైన్యము, కల్కిసైన్యము చేతులు, కాళ్ళు తలలు తెగి భూమి మీద పడిరి. యుద్ధరంగమున గాయపడి కొందరు పారిపోయిరి. కొందరు బాధతో అరచిరి. కొందరి శరీరములు రక్తముతో తడిసినవి. కొందరు ఒకరిపై మరియొకరు పడిరి. మరికొందరు గజ, అశ్వ, రథముల క్రిందపడి మరణించిరి. కోటి కోటి వీరులు రణరంగమున నేలకొరిగిరి. రక్త ప్రవాహము పిశాచాదుల కానంద దాయక మాయెను.

ఉష్ణీషహంసాః సంఛిన్న గజరోధోరథప్లవాః
కరోరుమీనాభరణమసికాంచన వాలుకాః. 32
ఏవం ప్రవృత్తా సంగ్రామే నద్యః సద్యోఽతిదారుణాః
సూర్యకేతుస్తు మరుణా సహితో యుయుధే బలీ. 33

**కాలకల్పో దురాధర్షో మరుం బాణైరతాడయత్**
**మరుస్తు తత్ర దశభిర్మార్గణై రార్దయ ద్భృశమ్.** **34**

భా: రక్త ప్రవాహంవున వీరుల తలపాగలు హంసలవలె కన్పించు చున్నవి. గజములువంతెనవలె, రథములు నావలవలె, తెగిన చేతులు చేపలవలె, కత్తులు బంగారు ఇసుకతిన్నెలవలె నున్నవి. ఇట్లు యుద్ధమున రక్తము నదులవలె ప్రవహించెను. బలవంతుడగు సూర్యకేతువు మరునితో పోరాడెను. యమ సదృశుడగు సూర్యకేతువు బాణములతో మరుని కొట్టగ, అతడు సూర్యకేతుని పది బాణములతో హింసించెను.

**మరుబాణాహతో వీరః సూర్యకేతురమర్షితః**
**జఘాన తురగాన్ కోపాత్ పాదోద్ఘాతేన తద్రథమ్.** **35**
**చూర్ణయిత్వాఽథ తేనాపి తస్య వక్షస్యతాడయత్**
**గదాఘాతేన తేనాపి మరుర్మూర్ఛామవాప హ.** **36**

భా: మరుబాణములచే గాయపడిన సూర్యకేతువు కోపించి అతని గుఱ్ఱములను సంహరించి, రథమును ఒక్క తన్నుతో భగ్నము చేసెను. పిమ్మట వక్షఃస్థలముపై గదతో కొట్టెను దానితో మరువు మూర్ఛపోయెను.

**సారథిస్తమపోవాహ రథే నాన్యేన ధర్మవిత్**
**బృహత్కేతుశ్చ దేవాపిం బాణైః ప్రాచ్ఛాదయద్బలీ.** **37**
**ధనుర్వికృష్య తరసా నీహారేణ యథా రవిమ్**
**సతు బాణమయం వర్షం పరివార్య నిజాయుధైః.** **38**

భా: యుద్ధధర్మమెరిగిన సారథి తమ ప్రభువును అక్కడ నుండి మరొక రథముపై తీసుకుపోయెను. బృహత్కేతువు దేవాపిని బాణములచే చుట్టుముట్టగా దేవాపి ధనుస్సును చేతబూని బాణవర్షముతో శత్రుబాణము లను నివారించెను.

**బృహత్కేతుం దృఢం జఘ్నే కఙ్క పత్రైః శిలాశితైః**
**భిన్నం శూలమథాలోక్య ధనుర్గృహ్యా పతత్రిభిః.** **39**
**శితధారైః స్వర్ణపుంఖైర్గార్ధ పత్రై రయోముఖైః**
**దేవాపిమాశుగైర్జఘ్నే బృహత్కేతుః ససైనికమ్.** **40**

భా: వాడియైన బాణములతో శూలము భగ్నమగుటను చూచి దేవాపి ధనుస్సు చేత బూని బృహత్కేతుని బాణములతో ఎదుర్కొనెను. బృహత్కేతువు కూడా దేవాపిని లోహముఖము కల్గిన, గృధ్రపత్రములతో (ఈకలు) కూడిన తీక్ష్ణములగు బాణములతో హింసించెను.

దేవాపిస్తద్ధనుర్దివ్యం చిచ్ఛేద నిశితైః శరైః
ఛిన్నధన్వా బృహత్కేతుః ఖడ్గపాణిర్జిఘాంసయా. 41
దేవాపేః సారథిం సాశ్వం జఘ్నే శూరో మహామృధే
స దేవాపిర్ధనుస్త్యక్త్వా తలేనాహత్య తం రిపుమ్. 42

భా: దేవాపి వాడియైన బాణములతో దివ్యమగు ధనస్సును ముక్కలు చేయగ బృహత్కేతువు అతనిని చంపుటకు ఖడ్గము చేతబూని దేవాపిగుఱ్ఱములను, సారథిని చంపెను. అప్పుడు దేవాపి ధనుస్సు విడిచి చేతులతో అతనిని మోదెను.

భుజయోరంతరానీయ నిష్పిపేష స నిర్దయః
తం ద్వ్యష్టవర్షం నిశ్చ్రాంతం మూర్ఛితం శత్రుణార్దితమ్. 43
అనుజం వీక్ష్య దేవాపి మూర్ధ్ని సూర్యధ్వజోఽవధీత్
ముష్టినా వజ్రపాతేన సోఽపతన్ మూర్ఛితో భువి
మూర్ఛితస్య రిపుః క్రోధాత్ సేనాగణమతాడయత్. 44

భా: దేవాపి బృహత్కేతువును భుజముల మధ్య భాగమున నుంచి నిర్దయుడై పిండి చేసెను. పదహారు సంవత్సరముల బృహత్కేతువు శత్రువుచే పీడింపబడి అచేతను డాయెను. తన తమ్ముని అవస్థను చూచిన రాజు సూర్యకేతువు దేవాపి శిరస్సుపై వజ్రఘాతము వలె కొట్టగా అతడు మూర్ఛబోయి నేల మీద పడెను. దేవాపి మూర్ఛపోవుటను చూచి అతని సైన్యము శత్రుసైన్యముపై దాడి చేసెను.

శశిధ్వజః సర్వజగన్నివాసం
కల్కిం పురస్తాదభి సూర్యవర్చసమ్
శ్యామం పిశంగాంబరమంబుజేక్షణం
బృహద్భుజం చారుకిరీట భూషణమ్. 45
నానామణివ్రాతచితాఙ్గశోభయా
నిరస్తలోకేక్షణ హృత్తమోమయమ్
విశాఖయూపాదిభిరావృతం ప్రభుం
దదర్శ ధర్మేణ కృతేన పూజితమ్. 46

భా: సర్వజగత్తులకాధారభూతుడు, సూర్యునివలె ప్రకాశించువాడు, పద్మదళనేత్రుడు, పీతాంబరధారి, శ్యామవర్ణుడు, దీర్ఘబాహువు, సుందరకిరీటము అలంకారముగ కలవాడు,

వివిధమణుల అవయవశోభచే సమస్తప్రాణుల నేత్రహృదయముల అంధకారమును పోగొట్టువాడు, సత్య, ధర్మములచే పూజింపబడువాడగుకల్కిని విశాఖయూపాదులు చుట్టుకొనియుండగ శశిధ్వజుడు చూచెను.

**ఇతిశ్రీ కల్కి పురాణేఽనుభాగవతే**
**భవిష్యే తృతీయాంశే**
**శశిధ్వజ కల్కి సేనయో ర్యుద్ధం నామ**
**అష్టమోఽధ్యాయః**

ఇది భాగవతానుబంధము, భవిష్యమునగు
శ్రీ కల్కి పురాణమున తృతీయాంశమున
శశిధ్వజ కల్కి సేనల యుద్ధమను
అష్టమాధ్యాయము.



# కల్కి పురాణము

## తృతీయాంశము- నవమాధ్యాయము

సూత ఉవాచ........

హృది ధ్యానాస్పదం రూపం కల్కేర్దృష్ట్వా శశిధ్వజః
పూర్ణం ఖడ్గధరం చారుతురగారూఢమబ్రవీత్. 1
ధనుర్బాణధరం చారు విభూషణవరాఙ్గకమ్
పాపతాపవినాశార్థముద్యతం జగతాం పరమ్. 2
ప్రాహ తం పరమాత్మానం హృష్టరోమా శశిధ్వజః
ఏహ్యేహి పుండరీకాక్ష! ప్రహారం కురుమే హృది. 3

భా: సూతుడు పలికెను. హృదయమందు ధ్యానము చేయుటకు యోగ్యుడు, ఖడ్గధరుడు, మనోహరమగు అశ్వము నధిరోహించినవాడు, పూర్ణస్వరూపుడు, ధనుర్బాణములను ధరించినవాడు, అలంకారములచే శోభిల్లువాడు, పాప తాప వినాశకుడు జగత్పతియగు కల్కిని చూచి హర్షపులకితుడై శశిధ్వజుడు ఓ పరమాత్మ! పుండరీకాక్ష! రమ్మురమ్ము. నా హృదయమందు ప్రహారము చేయుమని పలికెను.

అథవాత్మన్ బాణభియా తమోఽన్ధే హృది మే విశ
నిర్గుణస్య గుణజ్ఞత్వమద్వైతస్యాస్త్రతాడనమ్. 4
నిష్కామస్య జయోద్యోగసహాయం యస్యసైనికమ్
లోకాః పశ్యంతు యుద్ధే మే ద్వైరథే పరమాత్మనః. 5
పరబుద్ధిర్యది దృఢం ప్రహర్తా విభవే త్వయి
శివవిష్ణ్వోర్భేదకృతే లోకం యాస్యామి సంయుగే. 6

భా: ఓపరమాత్మ! మేము వేయు బాణములు తగులునను భయముతో అజ్ఞానాంధకారముచే వ్యాపృతమయిన మాహృదయములను ప్రవేశింపుము. నిర్గుణుడవైనను గుణములనెరిగినవాడవు. అద్వైతివైనను అస్త్రప్రహారములకు సంసిద్ధుడవు. నిష్కాముడవైనను

జయము కొఱకు యుద్ధము చేయుచున్నారో అట్టి పరమాత్మతో లోకము లన్నియు చూచుచుండ యుద్ధము చేసెదను. విభువగు మిమ్ములను పరబుద్ధితో ( మీరు పరమేశ్వరులను భావనను విడిచి మరియొకరను బుద్ధితో) ప్రహారముచేయు నాకు శివవిష్ణువులకు భేదమంగీకరించెడి వారికి కలుగు లోకములు ప్రాప్తించును.

ఇతిరాజ్ఞో వచః శ్రుత్వా అక్రోధః బక్రుద్ధవద్విభుః
బాణైరతాడయత్ సంఖ్యే ధృతాయుధమరిందమమ్. 7
శశిధ్వజస్తత్ప్రహారమగణయ్య వరాయుధైః
తం జఘ్నే బాణవర్షేణ ధారాభిరివ పర్వతమ్. 8
తద్బాణ వర్షభిన్నాంతః కల్కిః పరమకోపనః
దివ్యైః శస్త్రాస్త్ర సంఘాతైస్త యోర్యుద్ధమవర్తత. 9

భా: శశిధ్వజుని మాటలు వినిన కల్కి క్రోధము లేని వాడైనను క్రుద్ధుని వలె కనబడెను. పిమ్మట యుద్ధమున శత్రునాశకుడు, ఆయుధ ధారియగు రాజుపై బాణప్రహారము చేసెను. శశిధ్వజుడు బాణ ప్రహారములను లెక్కింపక శ్రేష్ఠములగు ఆయుధములను బాణములను పర్వతము మీద వర్షమువలె కల్కిపై కురిపించెను. బాణవర్షముచే గాయపడిన కల్కి మిక్కిలి క్రుద్ధుడాయెను. దివ్యములగు అస్త్రశస్త్రములతో వారిరువురి నడుమ యుద్ధము జరిగెను.

బ్రహ్మాస్త్రస్య చ బ్రహ్మాస్త్రైర్వాయవ్యస్య చ పార్వతైః
ఆగ్నేయస్య చ పార్జన్యైః పన్నగస్య చ గారుడైః. 10
ఏవం నానావిధైరస్త్రై రన్యోన్యమభిజఘ్నతుః
లోకాః సపాలాః సంత్రస్తా యుగాంతమివ మేనిరే. 11

భా: బ్రహ్మాస్త్రమును బ్రహ్మాస్త్రముతోను, వాయవ్యాస్త్రమును పర్వతాస్త్రముతోను ఆగ్నేయాస్త్రమును పర్జన్యాస్త్రముతోను, పన్నగాస్త్రమును గరుడాస్త్రముతోను ఎదుర్కొనుచు అస్త్రములతో పరస్పరము పోరాడిరి. లోకములన్నియు ప్రళయకాలముగ తలచి భయభ్రాంతులైరి.

దేవా బాణాగ్నిసంత్రస్తా అగమన్ ఖగమాః కిల
తతోఽతివితథోద్యోగా వాసుదేవ శశిధ్వజౌ. 12
నిరస్త్రౌ బాహుయుద్ధేన యుయుధాతే పరస్పరమ్
పదాఘాతైస్తలా ఘాతై ర్ముష్టిప్రహరణైస్తథా. 13

నియుద్ధకుశలౌ వీరౌ ముముదాతే పరస్పరమ్
వరాహోద్ధృత శబ్దేన తం తలేనాహనద్ధరిః. 14

భా: బాణాగ్నికి భయపడి ఆకాశమార్గమున సంచరించు దేవతలు వెడలిరి. అస్త్రశస్త్ర ప్రయోగవైఫల్యమును గమనించిన వాసుదేవ శశిధ్వజులు అస్త్రములను విడిచి బాహుయుద్ధమునకు సిద్ధపడిరి. యుద్ధకుశలులగు వారిద్దరు పదాఘాతములు, తలాఘాతములు, పిడికిలి గుద్దులతో పరస్పరము పోరాడుచు సంతోషించిరి. సృష్టి ఆరంభమున వరాహావతారమున భూమిని ఉద్ధరించునపుడు కల్గిన శబ్దము వంటి శబ్దముతో శ్రీహరి అరచేతితో అతనిని మోదెను.

సమూర్ఛితోన్నృపః కోపాత్ సముత్థాయ చ తక్షణాత్
ముష్టిభ్యాం వజ్రకల్పాభ్యామవధీత్ కల్కిమోజసా
స కల్కిస్తత్ప్రహారేణ పపాత భువి మూర్ఛితః. 15
ధర్మః కృతం చ తం దృష్ట్వా మూర్ఛితం జగదీశ్వరమ్
సమాగతౌ తమానేతుం కక్షే తౌ జగృహే నృపః. 16

భా: మూర్ఛపోయిన శశిధ్వజుడు కోపముతో తిరిగి లేచి వజ్రసదృశములగు ముష్టిఘాతములతో కల్కిని కొట్టెను. ఆదెబ్బలకు కల్కి మూర్ఛపోయినేలమీద పడెను. మూర్ఛపోయిన జగదీశ్వరుని చూచి ధర్మకృతయుగములు అతనిని తీసుకువెళ్ళుటకు వచ్చిరి. శశిధ్వజుడు వారిరువురుని చంకలోనికి తీసుకొనెను.

కల్కిం వక్షస్యుపాదాయ లబ్ధార్థః ప్రయయౌ గృహమ్
యుద్ధే నృపాణామన్యేషాం పుత్రౌ దృష్ట్వా సుదుర్జయౌ. 17
కల్కిం సురాధిపపతిం ప్రధనే విజిత్య
ధర్మం కృతఞ్చ నిజకక్షయుగే నిధాయ
హర్షోల్లసద్ధృదయ! ఉత్పులకః ప్రమాథీ
గత్వా గృహం హరిగృహే దదృశే సుశాంతామ్. 18

భా: కల్కిని హృదయమున నుంచుకొని కృతకృత్యుడై శశిధ్వజుడు తన యింటికి వెడలెను. నాపుత్రులను యుద్ధమున ఎవ్వరు జయించలేరని తలచెను. సురాధిపపతియగు కల్కిని సంగ్రామమున జయించి, కృతధర్మములను నిజకక్షయందుంచుకొని గృహమునకేతెంచి శశిధ్వజుడ రాణియగు సుశాంతను హరిగృహమున చూచెను.

దృష్ట్వా తస్యాః సులలితముఖం వైష్ణవీనాం చ మధ్యే
గాయ తీనాం హరిగుణ కథాస్తామథ ప్రాహ రాజా
దేవాదీనాం వినయవచసా శంభలే జన్మనా వా
విద్యాలాభం పరిణయవిధిమ్లేచ్ఛపాషండనాశమ్. 19
కల్కిః స్వయం హృది సమాయమిహాగతోఽద్ధా
మూర్ఛాచ్ఛలేన తవ సేవనమీక్షణార్థమ్
ధర్మం కృతఞ్చ మమ కక్షయుగే సుశాంతే!
కాంతే విలోకయ సమర్చయ సంవిధేహి. 20
ఇతినృపవచసా వినోదపూర్ణా
హరికృతధర్మయుతం ప్రణమ్య నాథమ్
సహ నిజసఖిభి ర్ననర్త రామా
హరిగుణకీర్తన-వర్తనావిలజ్జా. 21

భా: విష్ణుభక్తుల నడుమ హరిగుణములను కీర్తించు సుశాంత వదనకమలమును చూచి రాజు ఆమెతో ఓ సుశాంత! దేవతల ప్రార్థన నాలకించి శంభలగ్రామమున జన్మించి, విద్యాలాభమునొంది, పరిణయమాడి, మ్లేచ్ఛపాషండులను నాశము చేసిన కల్కి భగవానుడు నీ సేవలను వీక్షించుటకు మాయతో కూడి మూర్ఛయను మిషతో స్వయముగ ఇక్కడకు విచ్చేసినాడు. రెండు చంకలలోను కృతధర్ములు కలరు. వారిని పూజింపుము. అని పలికెను. రాజుమాటలు విని సుశాంత మిక్కిలి ప్రసన్నురాలై హరి, కృత, ధర్ములను నమస్కరించి హరిగుణములను కీర్తించుచు లజ్జను విడిచి సఖురాండ్రతో నృత్యము చేసెను.

ఇతిశ్రీ కల్కి పురాణేఽనుభాగవతే భవిష్యే తృతీయాంశే
ధర్మ కల్కి కృతానా మానయనం నామ
నవమోఽధ్యాయః.

ఇది భాగవతానుబంధము భవిష్యమునగు శ్రీ కల్కి పురాణమున తృతీయాంశమున
ధర్మకల్కి కృతుల ఆనయనమను
నవమాధ్యాయము.



# కల్కి పురాణము

## తృతీయాంశము- దశమాధ్యాయము

సుశాంతోవాచ.........

జయహరే! అమరాధీశసేవితం
తవ పదాంబుజం భూరి భూషణమ్
కురు మమాగ్రతః సాధుసత్కృతం
త్యజ మహామతే! మోహమాత్మనః. 1
తవ వపుర్జగద్రూపసంపదా విరచితం సతాంమానసే స్థితమ్
రతిపతేర్మనో మోహదాయకం కురు విచేష్టిత కామలంపటమ్. 2

భా: సుశాంత పలికెను. హరి! జయమగుగాక. మోహమును విడిచిపెట్టుడు. అమరాధీశుడగు ఇంద్రునిచే, సత్పురుషులచే సేవింపబడు, అలంకార భూషితములగు పాదపద్మములను నా సమ్ముఖమున నిలుపుము. నీ శరీరము జగత్తులో నున్న సురూపమనెడి సంపదచే చేయబడినది. సత్పురుషుల హృదయములలో విహరించునది, కతిపతికి సయితము మోహము కల్గించు నీ రూపము మాకోర్కెలను తీర్చుగాక.

తవ యశో జగచ్ఛోకనాశనం మృదుకథామృత ప్రీతిదాయకమ్
స్మిత సుధోక్షితం చంద్రవన్ముఖం తవ కరోత్పలం లోకమఙ్గలమ్. 3
మమ పతిస్త్వయం సర్వదుర్జయో యది తవాప్రియం కర్మణాచరేత్
జహి తదాత్మనః శత్రుముద్యతం కురు కృపాం న చేదీదృగీశ్వరః. 4

భా: మీ యశోగానము, శ్రవణము సర్వజగత్తుల శోకమును నాశము చేయును. అమృతతుల్యములగు నీ కథలు అందరికి సంతోషమును కల్గించును. చంద్రసదృశమగు నీ ముఖము చిరునవ్వు అనెడి అమృతమును కురిపించును. నీ ముఖకమలము లోకములకు మంగళము కలిగించుగాక. నాభర్త సర్వథా అజేయుడు. అతనిని ఇంతవరకు ఎవ్వరు ఓడించలేదు. మీకు అప్రసన్నమగు కార్యమునాచరించిన నాభర్త యెడల శత్రుభావమును విడిచిపెట్టుడు. కృపచూపుడు. అట్లు కానియెడల మిమ్ములను కృపాసాగరుడని ఏల యందురు.

మహదహంయుతం పంచమాత్రయా ప్రకృతిజాయయా నిర్మితం వపుః
తవ నిరీక్షణాల్లీలయా జగత్ స్థితిలయోదయం బ్రహ్మకల్పితమ్. 5
భూవియన్మరుద్వారి తేజసాం రాశిభిః శరీరేంద్రియాశ్రితైః
త్రిగుణయా స్వయా మాయయా విభో కృరు కృపాం భవత్సేవనార్థినామ్. 6

భా: మహత్తత్త్వము, అహంకారతత్త్వము, పంచతన్మాత్రలు, నీ భార్యయగు ప్రకృతి అనువానిచే శరీరము సృజింపబడినది. (సృష్టి జరిగినది) విలాసములతో కూడిన నీ చూపులవలన బ్రహ్మ కల్పిత సంసారమున సృష్టి, స్థితి, ప్రలయములగుచున్నవి. ఓ పరమేశ్వర! నీవు శరీర, ఇంద్రియవముల నాశ్రయించిన పృథివి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశమనెడు భూతపంచకముతో, సత్త్వ రజస్తమోరూపమగు స్వీయమాయతో నిన్ను సేవించెడి భక్తులపై దయచూపుము.

తవ గుణాలయం నామ పావనం
కలిమలాపహం కీర్తయంతి యే
భవభయక్షయం తాపపితా
ముహురహో జనాః సంసరంతి నో. 7
తవ జన్మ సతాం మానవర్ధనం
నిజకులక్షయం దేవపాలకమ్
కృతయుగార్పకం ధర్మపూరకం
కలికులాంతకం శం తనోతు మే. 8

భా: ఓ పరమేశ్వర! కలిదోషములను పోగొట్టు పవిత్రమగు నీ గుణసముదాయమున సంసారతాపముచే తపింపబడు భక్తులు స్మరించిన వారికి సంసార భీతి యుడదు. మీ అవతారమ సత్పురుషుల మానము వృద్ధిపరచును. కలి వంశమును నాశము చేయును. యజ్ఞయాగాదుల సక్రమముగ జరుగుటవలన దేవతలకు రక్షణ కలుగును. కృతయుగము ఆరంభమగును. ధర్మమునకు రక్షణ కలుగును. అట్టి నీ అవతారము మాకు మంగళము చేయుగాక.

మమగృహం పతిపుత్రనప్తృకం గజరథై ర్ధ్వజై- శ్చామరై ర్ధనైః
మణివరాసనం సత్కృతిం వినా తవ పదాబ్జయోః శోభయంతి కిమ్. 9
తవ జగద్వపుః సుందరస్మితం ముఖమనిందితం సుందరారవమ్
యది న మే ప్రియం వల్గుచేష్టితే పరికరో త్యహో మృత్యు రస్త్విహ. 10

భా: పతి, పుత్ర, పౌత్రులతో కూడి గజ, రథ, ధ్వజ, చామర, ఐశ్వర్య, మణిమయ ఆసనాదులు కల్గిన దైనను నాగృహము నీ పాదపద్మముల పూజ లేకుండగ ఎట్లు శోభిల్లును. మందహాసముతో శోభిల్లునది, సర్వాంగసుందరము, మనోహరములగు మాటలతో విభూషితము, రమణీయములగు భావములతో కూడిన అనింద్యమగు నీముఖము మాకు ప్రియమును కల్గించనియెడల మృత్యువే శరణ్యము.

హయచర భయహర కరహర శరణ ఖరతరవరశరద శబలమదన
జయ హతపర భర భవ వరనశన శశధర శత సమ ర-స భర వదన. 11
ఇతి తస్యాః సుశాంతాయా గీతేన పరితోషితః
ఉత్తస్థౌ రణశయ్యాయాః కల్కిర్యుద్ధస్థవీరవత్. 12

భా: ఓదేవ! నీవు అశ్వముపై తిరుగుచు సంసారతాపమును, భయమును పోగొట్టువాడవు. రక్షకుడవు. తీక్ష్ణములగు బాణములతో శత్రువులను చెండాడువాడవు. శతచంద్రకాంతితో నీ ముఖము విరాజిల్లుచున్నది. నీవు నిస్సందేహముగ భవబంధములను నాశము చేయ సమర్థుడవు.

సుశాంతయొక్క గీతముచే సంతుష్టుడయిన కల్కి రణరంగమున వీరునివలె రణశయ్య నుండి లేచెను.

సుశాంతాం పురతో దృష్ట్వాకృతం వామే తు దక్షిణే
ధర్మం శశిధ్వజం పశ్చాత్ ప్రాహేతి వ్రీడితాననః. 13
కా త్వం పద్మపలాశాక్షి! మమ సేవార్థ ముద్యతా
కాంతే శశిధ్వజః శూరో మమ పశ్చా దుపస్థితః. 14

భా: ఎదురుగ సుశాంతను, దక్షిణభాగమున ధర్మమును, ఎడమ భాగమున కృతయుగమును, వెనుక శశిధ్వజుని చూచి సిగ్గుతో తలవంచి ఇట్లనియె. పద్మనేత్రాక్షి! నీవు ఎవరు? ఎందువలన నన్ను సేవించుటకు సిద్ధమైతివి? శూరుడగు శశిధ్వజుడు ఎందువలన నావెనుక నుండెను?

హేధర్మ! హేకృతయుగ! కథ మత్రాగతా వయమ్
రణాఙ్గణం విహాయాస్యాః శత్రో రంతః పురే వద. 15
శత్రుపత్న్యః కథం సాధు సేవంతే మా మరిం ముదా
శశిధ్వజః శూరమానీ మూర్ఛితం హంతి నో కథమ్. 16

భా: ఓ ధర్మమ! కృతయుగమ! యుద్ధరంగమును విడిచి శత్రువుల అంతఃపురమునకు మనమెట్లు వచ్చితిమి? శత్రుస్త్రీలు ప్రసన్నహృదయలై శత్రువగు నన్ను ఏల సేవించు చున్నారు? మూర్ఛపోయిన నన్ను, శూరునిగ తలచు శశిధ్వజుడు ఏలనాశము చేయలేదు?

సుశాంతోవాచ.....

పాతాలే దివి భూమౌ వా నరనాగ సురాసురాః
నారాయణస్య తే కల్కే కే వా సేవాం న కుర్వతే. 17
యత్సేవకానాం జగతాం మిత్రాణాం దర్శనాదపి
నివర్తంతే శత్రుభావ స్తస్య సాక్షాత్ కుతో రిపుః. 18

భా: సుశాంత చెప్పెను. ఓ కల్కి! పాతాళమందు కాని స్వర్గమందు, కాని పృథివియందు గాని నరులు, నాగజాతివారు, దేవతలు, రాక్షసులు వీరిలో నారాయణుని సేవించని వారెవరు? సర్వలోకములు నారాయణునికి సేవకులు, మిత్రులు, ఎవరిని చూచుట వలన శత్రు భావము భావము దూరమగునో అట్టి పరమేశ్వరునకు శత్రువు లెవరు?

త్వయాసార్థం మమ పతిః శత్రుభావేన సంయుగే
యది యోగ్యస్తదానేతుం కిం సమర్థో నిజాలయమ్. 19
తవ దాసో మమ స్వామీ అహం దాసీ నిజా తవ
ఆవయోః సంప్రసాదాయ ఆగతోఽసి మహాభుజ. 20

భా: నాభర్త మీతో శత్రుభావముతో యుద్ధము చేసిన మిమ్ములను తమ నివాసమున కెట్లు తీసుకువాగలరు? నాభర్త మీ దాసులు. నేను మీ దాసిని. మిమ్ములను అనుగ్రహించుటకు మీరు ఇక్కడకు వచ్చితిరి.

ధర్మ ఉవాచ.....

అహం త్వైతయోర్భక్త్యా నామరూపానుకీర్తనాత్
కృతార్థోఽస్మి కృతార్థోఽస్మి కృతార్థోస్మి కలిక్షయ. 21

కృతయుగ ఉవాచ.....

అధునాహం కృతయుగం తవ దాసస్య దర్శనాత్
త్వమీశ్వరో జగత్పూజ్యా, సేవకస్యాస్య తేజసా. 22

శశిధ్వజ ఉవాచ.......

దండ్యం మాం దండయ విభో యోద్ధృత్వా దుద్యతా-యుధమ్
యేన కామాది రాగేణ త్వయ్యాత్మన్యపి వైరితా. 23

భా: ధర్ముడు పలికెను. ఓ కలినాశక! వీరు భక్తితో మీ నామరూపములను కీర్తించుట వలన నేను నిశ్చయముగ కృతార్థుడనయితిని. కృతయుగము పలికెను. మీదాసుని చూచుట వలన

కృతయుగమగు నేను సఫలుడనయితిని. జగత్పూజ్యుడగు ఓ పరమేశ్వర! సేవకుని తేజస్సంపన్నునిగ చేయుట వలన మీరు ఈశ్వరులైతిరి. శశిధ్వజుడు పలికెను. ఓ పరమేశ్వర! కామక్రోధాది వశుడై మీతో శత్రుత్వమాచరించి యుద్ధము చేసి అపరాధము చేసితిని. దండనార్హుడనగు నన్ను దండింపుడు.

ఇతి కల్కి ర్వచ స్తేషాం నిశమ్య హసితాననః
త్వయాజితోఽస్మీతి నృపం పునః పునరువాచ హ. 24
తతః శశిధ్వజో రాజా యుద్ధాదాహూయ పుత్రకాన్
సుశాంతాయా మతిం బుద్ధ్వా రమాం ప్రాదాత్ సకల్కయే. 25

భా: వారి మాటలను వినిన కల్కి మందహాసముతో నీచే నేను జయింపబడితినని పలుమార్లు రాజుతో పలికెను. పిమ్మట శశిధ్వజుడు తన పుత్రులను యుద్ధరంగము నుండి వెనుకకు పిలిచి సుశాంత అభిప్రాయము నెరిగి తన పుత్రిక రమను కల్కికి దానము చేసెను.

తద్దైత్య మరుదేవాపీ శశిధ్వజ సమాహ్వాతౌ
విశాఖయూపభూపశ్చ రుధిరాశ్వశ్చ సంయుగాత్. 26
శయ్యాకర్ణనృపేణాపి భల్లాటం పురమాయయుః
సేనాగణైరసంఖ్యాతైః సాపురీ మర్దితాఽభవత్. 27

భా: శశిధ్వజునిచే వెనుకకు పిలువబడి యుద్ధరంగము నుండి మరుదేవాపులు, విశాఖయూపుడు, రుధిరాశ్వము శయ్యాకర్ణునితో కూడి భల్లాట నగరమునకు తిరిగి వచ్చిరి. అసంఖ్యాకమగు సేనా సముదాయముచే ఆ పురము కోలాహలముగ నుండెను.

గజాశ్వరథసంబాధైః పత్తిచ్ఛత్ర రథ ధ్వజైః
కల్కినాపి రమాయాశ్చ వివాహోత్సవ సంపదామ్. 28
ద్రష్టుం సమీయుస్త్వరితా హర్షాత్ సబలవాహనాః
శంఖభేరీ మృదంగానాం వాదిత్రాణాంచ నిస్స్వనైః. 29
నృత్యగీతవిధానైశ్చ పురస్త్రీకృతమఙ్గలైః
వివాహో రమయా కల్కేరభూదతిసుఖావహః. 30

భా: గజ, అశ్వ, రథముల ప్రతిబంధకములతో, పదాతిదల, ఛత్ర, రథ, ధ్వజములతో నగరమంతయు నిండియుండెను. కల్కిరమల వివాహోత్సవమును తిలకించుటకు సంతోషముతో సపరివారముగ అందరు వచ్చిరి. శంఖము, భేరి, మృదంగము మున్నగు వాద్యముల ధ్వనులతో,

నృత్యగీతములతో, పురస్త్రీల మంగళాచరణములతో మిక్కిలి సుఖప్రదమై రమాకల్కుల వివాహము జరిగెను.

నృపా నానావిధై ర్భోజ్యైః పూజితా వివిశుః సభామ్
బ్రాహ్మణా క్షత్రియా వైశ్యాః శూద్రాశ్చావర జాతయః. 31
విచిత్ర భోగావరణాః కల్కిం ద్రష్టు ముపావిశన్
తస్యాం సభాయాం శుశుభే కల్కిః కమలలోచనః. 32

భా: నానావిధములగు భోజ్యపదార్థములతో సత్కరింపబడిన రాజులు సభను ప్రవేశించిరి. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు చిత్రములగు భోగ్యవస్తువులను పొంది కల్కిని చూచుటకు సభలో కూర్చుండిరి అట్టి సభలో కమలనేత్రుడగు కల్కి-------

నక్షత్రగణమధ్యస్థః పూర్ణః శశధరో యథా
రేజే రాజగణాధీశో లోకాన్ సర్వా న్విమోహయన్. 33
రమాపతిం కల్కి మవేక్ష్య భూపః
సభాగతం పద్మదలాయతేక్షణమ్
జామాతరం భక్తియుతేన కర్మణా
విబుధ్య మధ్యే నిషసాద తత్ర హ. 34

భా: నక్షత్రముల మధ్యలో పూర్ణచంద్రుని వలె సమస్తలోకములను మోహపరచుచు శోభిల్లెను. పద్మదళములవలె విశాలమయిన నేత్రములు కల్గిన, సభయందున్న కల్కిని తన యల్లునిగ భక్తిభావముతో తెలుసుకొనుచు శశిధ్వజుడు సభామధ్య దేశమును ప్రవేశించెను.

ఇతి శ్రీకల్కిపురాణేఽనుభాగవతే భవిష్యే తృతీయాంశే
కల్కినా రమావివాహోనామ
దశమోఽధ్యాయః
ఇది భాగవతానుబంధము, భవిష్యమునగు
శ్రీ కల్కి పురాణమున తృతీయాంశమున
కల్కితో రమా వివాహమను
దశమాధ్యాయము.



# కల్కి పురాణము

## తృతీయాంశము- ఏకాదశాధ్యాయము

సూత ఉవాచ.....

తత్రాహు స్తే సభామధ్యే వైష్ణవం తం శశిధ్వజమ్
మునిభిః కథితాశేష భక్తివ్యాసక్త విగ్రహమ్.
సుంశాంతాం చ కృతేనాపి ధర్మేణ విధివ ద్యుతామ్. 1

భా: సూతుడు పలికెను. మహర్షులచే వర్ణింపబడిన పరమభక్తి పూర్ణుడు విష్ణుభక్తుడునగు శశిధ్వజుని కృతయుగ ధర్మములతో కూడిన సుశాంతను, చూచి రాజులు, బ్రాహ్మణులు ఇట్లు పలికిరి.

రాజాన ఊచుః........

యువాం నారాయణ స్యాస్య కల్కేః శ్వశురతాంగతౌ
వయం నృపా ఇమే లోకా ఋషయో బ్రాహ్మణాశ్చ యే. 2
ప్రేక్ష్య భక్తివితానం వాం హరౌ విస్మితమానసాః
పృచ్ఛామ స్త్వా మియం భక్తిః క్వ లబ్ధా పరమాత్మనః. 3

భా: రాజులు పలికిరి. సాక్షాత్తు విష్ణుమూర్తి అవతారమగు కల్కి భగవానుని కి మీరిద్దరు అత్తమామలైతిరి. రాజులగు మేము, ఋషులు, బ్రాహ్మణక్షత్రియాదులు అందరు హరియందు మీకు కల్గిన భక్తికి ఆశ్చర్యపడుచున్నాము. పరమాత్మ యెడల మీకు ఇంతటి భక్తి ఎట్లు కల్గినదో తెలిసికొనదలచితిమి.

కస్య వా శిక్షితా రాజన్! కిం వా నైసర్గికీ తవ
శ్రోతు మిచ్ఛామహే రాజన్! త్రిజగజ్జనపావనీమ్
కథాం భాగవతీం త్వత్తః సంసారాశ్రమనాశినీమ్. 4

భా: ఓరాజ! భగవంతునియెడల యింత భక్తి మీరెవరి నుండి నేర్చితిరి? లేక స్వాభావికమా? ముల్లోకములను పావనము చేయునదియు, సంసారాశ్రమమును నశింపజేయునదియునగు భగవద్భక్తిని గూర్చి వినదలచితిమి.

శశి ధ్వజ ఉవాచ......

స్త్రీపుంసో రావయో స్త త్త చ్ఛృణుతామోఘ విక్రమాః
వృత్తం యజ్జన్మకర్మాది స్మృతిం తద్భక్తి-లక్షణామ్. 5

భా: శశిధ్వజుడు పలికెను. అమోఘపరాక్రమము కల్గిన రాజులార! మా ఇరువురి స్త్రీ పురుష జన్మను గూర్చి, మీస్మృతికి వచ్చే భక్తి యొక్క లక్షణమును గూర్చి చెప్పెదను వినుడు.

పురా యుగసహస్రాంతే గృధ్రోఽహం పూతిమాంస భుక్
గృధ్రీయం మే ప్రియారణ్యే కృతనీడో వనస్పతౌ. 6
చచార కామం సర్వత్ర వనోపవనసంకులే
మృతానాం పూతిమాంసౌఘైః ప్రాణినాం వృత్తికల్పకౌ. 7

భా: పూర్వము వేయి యుగముల చివరి కాలమున నేను దుర్గంధముతో కూడిన మాంసమును భక్షించు గృధ్రమను. నాప్రియురాలగు ఈమె గృధ్రియై ( ఆడగ్రద్ద) పెద్ద వృక్షము మీద గూడుకట్టుకొని నివసించుచు వన, ఉపవనములతో కూడిన ప్రదేశమున యథేచ్ఛగ తిరిగెడివారము. మరణించిన ప్రాణుల దుర్గంధ యుక్త మాంసమునుతినుచు జీవయాత్ర సాగించెడి వారము.

ఏకదా లుబ్ధకః క్రూరో లులోభ పిశితాశినౌ
ఆవాం వీక్ష్య గృహే పుష్టం గృధ్రం తత్రా ప్యయోజయత్. 8
తం వీక్ష్య జాతవిశ్రంభౌ క్షుధయా పరిపీడితౌ
స్త్రీపుంసౌ పతితౌ తత్ర మాంసలోభితచేతసౌ. 9

భా: ఒకసారి క్రూరుడయిన కిరాతుడు మాంసభక్షణమునుకోరు మమ్ములను చూచి పట్టుకొనవలయునను భావనతో తన పెంపుడు గ్రద్దను నియోగించెను. ఆకలిగొన్న మేము దానిని చూచి విశ్వాసముతో మాంసలోభముతో అచ్చట వ్రాలితిమి. (వలలో చిక్కితిమి)

బద్ధా వావాం వీక్ష్య తదా హర్షా దాగత్య లుబ్ధకః
జగ్రాహ కంఠే తరసా చంచ్వగ్రా ఘాత పీడితః. 10
ఆవాం గృహీత్వా గండక్యాః శిలాయాం సలిలాంతికే
మస్తిష్కం చూర్ణయామాస లుబ్ధకః పిశితాశనః. 11

భా: బంధింపబడిన మమ్ము చూచి వ్యాధుడు సంతోషముతో అక్కడకు వచ్చి మాకంఠములను పట్టుకొనెను. మేము కూడ ప్రాణభీతితో ముక్కు కొనతో పొడిచి బాధించితిమి.

మాయిద్దరిని పట్టుకొని వ్యాధుడు మాంసభక్షణాశతో గంగానది సమీపమున గండకీశిలపై మోది మాతలలు బ్రద్దలు చేసెను.

చక్రాంకితశిలా గంగా మరణా దపి తక్షణాత్
జ్యోతిర్మయవిమానేన సద్యో భూత్వా చతుర్భుజౌ. 12
ప్రాప్తౌ వైకుంఠనిలయం సర్వలోకనమస్కృతమ్
తత్ర స్థిత్వా యుగశతం బ్రహ్మణో లోకమాగతౌ. 13

భా: గంగాతీరమున చక్రాకారమగు (సాలగ్రామ శిలపై) మృత్యువు నొందుటవలన వెంటనే నాలుగు భుజములు గల రూపము నొంది ప్రకాశవంతమగు విమానములో లోకవంద్యమగు వైకుంఠమున కేతెంచితిమి. అచ్చట వందయుగములు నివసించి బ్రహ్మలోకమునకు వచ్చితిమి.

బ్రహ్మలోకే పంచశతం యుగానా ముపభుజ్య వై
దేవలోకే కాలవశా ద్గతం యుగచతుశ్శతమ్. 14
తతో భువి నృపా స్తావ ద్బుద్ధసూను రహం స్మరన్
హరే రనుగ్రహం లోకే శాలగ్రామ శిలాశ్రమమ్. 15

భా: బ్రహ్మలోకమున అయిదు వందల యుగము లనుభవించి పిమ్మట కాలవశమున నాలుగు వందల యుగములు స్వర్గలోకమున సుఖముగ నుంటిమి. పిమ్మట భూలోకమున జన్మించితిమి. శాలగ్రామ శిలాశ్రమము, హరి అనుగ్రహము స్మృతిపథమున వచ్చుచున్నవి.

జాతిస్మరత్వం గండక్యాః కిం తస్యాః కథయా మ్యహమ్
యజ్జల స్పర్శమాత్రేణ మాహాత్మ్యం మహ దద్భుతమ్. 16
చక్రాంకిత శిలాస్పర్శ మరణ స్యేదృశం ఫలమ్
న జానే వాసుదేవస్య సేవయా కిం భవిష్యతి. 17
ఇత్యావాం హరిపూజాసు హర్షవిహ్వల చేతసౌ
నృత్యంతా వనుగాయంతౌ విలుఠంతౌ స్థితా విహ. 18

భా: ఇంత శక్తికల్గిన ఈ గండకీశిలయొక్క మహాత్మ్యము ఏమని వర్ణించను? గంగాజల స్పర్శమాత్రముచే అద్భుతమగు మహాత్మ్యము కల్గును. చక్రాంకిత శిలాస్పర్శ వలన కలుగు మరణమునకే ఇంతటి ఫలము లభించిన వాసుదేవుని సేవ వలన ఎంతటి ఫలము కల్గునో గదా! అని యోచించి హర్ష విహ్వల చిత్తులమై నృత్యము చేయుచు, భగవంతుని గుణములను గానము చేయుచు, భక్తితో తన్మయులగుచు హరిసేవతో కాలము గడుపుచుంటిమి.

కల్కే ర్నారాయణాంశస్య అవతారః కలిక్షయః
పురా విదితవీర్యస్య పృష్టో బ్రహ్మముఖా చ్ఛ్రుతః. 19
ఇతి రాజసభాయాం స శ్రావయిత్వా నిజాః కథాః
దదౌ గజానా మయుత మశ్వానాం లక్ష మాదరాత్. 20

భా: మేము పూర్వము బ్రహ్మవలన కలినాశకుడగు కల్కి అవతరించగలడని వినియుంటిమి. అతని పరాక్రమము గూర్చి మాకు బాగా తెలుసునని రాజసభయందు తమ వృత్తాంతమును సంపూర్ణముగ వినిపించి శశిధ్వజుడు కల్కిదేవునకు భక్తితో పదివేల ఏనుగులు, లక్ష గుఱ్ఱములు ఇచ్చెను.

రథానాం షట్సహస్రం తు దదౌ పూర్ణస్య భక్తితః
దాసీనాం యువతీనాం చ రమానాథాయ షట్ శతమ్. 21
రత్నాని చ మహార్ఘాణి దత్వా రాజా శశిధ్వజః
మేనే కృతార్థ మాత్మానం స్వజనై ర్బాంధవై స్సహ. 22

భా: ఆరువేల రథములు, ఆరువందలు దాసీ యువతులును అమూల్యములగు రత్నములను ఇచ్చి స్వజన బంధువులతో గూడ తనను కృతార్థునిగ తలచెను.

సభాసద ఇతి శ్రుత్వా పూర్వజన్మోదితాః కథాః
విస్మయావిష్టమనసః పూర్ణం తం మేనిరే నృపమ్. 23
కల్కిం స్తువంతో ధ్యాయంతః ప్రశంసంతో జగజ్జనాః
పున స్తమాహూ రాజానం లక్షణం భక్తిభక్తయోః. 24

భా: ఈ విధముగ రాజు యొక్క పూర్వజన్మవృత్తాంతమును వినిన సభాసదులు ఆశ్చర్యచకితులై అతనిని పూర్ణపురుషునిగ తలచిరి. కల్కిని స్తుతించుచు, ధ్యానించుచు, ప్రశంసించుచు వారందరు తిరిగి శశిధ్వజుని భక్తి, భక్తుల లక్షణముల నడుగదలచిరి.

నృపా ఊచుః.......

భక్తికామ్యా ద్భగవతః కో వా భక్తో విధానవిత్
కిం కరోతి కి మశ్నాతి క్వ వా వసతి వక్తి కిమ్. 25
ఏతాన్ వర్ణయ రాజేంద్ర సర్వం త్వం వేత్సి సాదరాత్
జాతిస్మరత్వాత్ కృష్ణస్య జగతాం పావనేచ్ఛయా. 26

ఇతి తేషాం వచః శ్రుత్వా ప్రపుల్లవదనో నృపః
సాధువాదైః సమామంత్ర్య తా నాహ బ్రహ్మణోదితమ్. 27

భా: రాజులు పలికిరి. భగవద్భక్తి స్వరూపమేమి? దాని విధానమును తెలియు భక్తుడెవరు? భక్తుడు ఏమి చేయును? ఏమి భుజించును ఎక్కడ నివసించును? ఎట్లు మాట్లాడును? ఓరాజేంద్ర మీకు సర్వము తెలియును. కనుక విషయము లన్నియు వివరించి చెప్పుడని అడుగగ శశిధ్వజుడు ప్రపుల్లవదనుడై, కృష్ణనామస్మరణచే లోకములను పవిత్రము చేయదలచినవాడై బ్రహ్మ చెప్పిన ప్రకారము చెప్పుటకారంభించెను.

శశిధ్వజ ఉవాచ......

పురా బ్రహ్మసభామధ్యే మహర్షిగణసంకులే
సనకో నారదం ప్రాహ భవద్భి ర్యా స్త్విహోదితాః. 28
తేషా మనుగ్రహే ణాహం తత్రోషిత్వా శ్రుతాః కథాః
యాస్తాః సంకథయా మీహ శృణుధ్వం పాపనాశనాః. 29

భా: శశిధ్వజుడు పలికెను. పూర్వము బ్రహ్మలోకమున మహర్షి గణముతో కూడిన బ్రహ్మసభలో మీరడిగిన విషయమునే సనకుడు నారదుని అడిగెను. ఆసమయమున నేను అక్కడ ఉండుటచే వారి యనుగ్రహమువలన సర్వము వింటిని. వాటిని మీకు చెప్పెదను, వినుడు.

సనక ఉవాచ.....

కా భక్తిః సంసృతిహరా హరౌ లోకనమస్కృతా
తా మాదౌ వర్ణయ మునే నారదా వహితా వయమ్. 30

నారద ఉవాచ......

మనః షష్ఠా నీంద్రియాణి సంయమ్య పరయా ధియా
గురా వపి న్యసే ద్దేహం లోకతంత్ర విచక్షణః. 31

భా: ఓ నారద! ప్రశంసాయోగ్యమగు ఎట్టి హరి భక్తి జన్మ నపహరించునో వివరించి చెప్పుడు. సావధానముగ వినెదము. నారదుడు పలికెను. నేత్రములు, చెవులు, ముక్కు, నాలుక, చర్మము అను అయిదు ఇంద్రియములను మనస్సును నియంత్రించి ఏకాగ్రతతో గురుచరణములపై దేహమును అర్పించవలెను.

గురౌ ప్రసన్నే భగవాన్ ప్రసీదతి హరిః స్వయమ్
ప్రణవాగ్నిప్రియామధ్యే మవర్ణం తన్నిదేశతః. 32

స్మరే దనన్యయా బుద్ధ్యా దేశికః సుసమాహితః
పాద్యార్ఘ్యాచమనీయాద్యైః స్నానవాసో విభూషణైః. 33
పూజయిత్వా వాసుదేవ పాదపద్మం సమాహితః
సర్వాఙ్గసుందరం రమ్యం స్మరేద్ధృత్పద్మమధ్యగమ్. 34

భా: గురువు ప్రసన్నుడైనచో భగవంతుడు కూడ ప్రసన్నుడగును. గురువు ఆదేశానుసారము ఓంకార, (అగ్ని భార్యయగు) స్వాహా రెండిటినడుమ మవర్ణము కల్గిన 'నమః' అనునది యోజనచేసి 'ఓంనమః స్వాహా' అని అనన్యబుద్ధితో స్మరించవలెను. పిమ్మట సావధానమస్కుడై, పాద్య, అర్ఘ్య, ఆచమనీయాదులతో, స్నాన, వస్త్ర, అలంకారములతో వాసుదేవపాదపద్మములను పూజించవలెను. పిమ్మట హృదయాంతరాళమున సర్వాంగసుందరుడగు నారాయణుని స్మరించవలెను.

ఏవం ధ్యాత్వా వాక్యమనోబుద్ధీంద్రియగణైః సహ
ఆత్మాన మర్పయే ద్విద్వాన్ హరా వేకాంతభావవిత్. 35
అఙ్గాని దేవా స్తేషాం తు నామాని విదితా న్యత
విష్ణోః కల్కే రనంతస్య తాన్యే వాన్య న్న విద్యతే. 36

భా: ఈ విధముగ ఏకాగ్రచిత్తుడు భగవంతుని ధ్యానము చేసి మాట, మనస్సు, బుద్ధి, ఇంద్రియములతో కూడ ఆత్మను హరికి సమర్పించవలెను. దేవతామూర్తులన్నియు విష్ణువు యొక్క అంగములే. వారి నామములు ప్రసిద్ధములే. అవి కాకుండ మరియేమియు లేవు.

సేవ్యః కృష్ణః సేవకోఽహ మన్యే తస్యాత్మమూర్తయః
అవిద్యోపాధయో జ్ఞానా ద్వదంతి ప్రభవాదయః. 37
భక్తస్యాపి హరౌ ద్వైతం సేవ్యసేవకవ త్తదా
నాన్య ద్వినా త మిత్యేవ క్వచ కించన విద్యతే. 38

భా: కృష్ణుడు సేవింపదగినవాడు. నేను సేవకుడను. సర్వప్రాణులు కృష్ణుని ఆత్మరూపములు. ప్రాణుల ఉత్పత్తి మున్నగునవి అవిద్యావశముచే కల్గునని జ్ఞానులు చెప్పుచున్నారు. భక్తునికి కూడ హరియెడల సేవ్యసేవక రూపద్వైతభావము కల్గుచున్నది. నారాయణుని విడిచి మరియొకటి ఎక్కడా లేదు. అనగా అంతయు హరిమయమే.

భక్తః స్మరతి తం విష్ణుం తన్నామాని చ గాయతి
తత్కర్మాణి కరో త్యేవ తదానందసు ఖోదయః. 39
నృత్యత్యుద్ధతవ ద్రౌతి హసతి ప్రైతి తన్మనాః
విలుంఠ త్యాత్మవిస్మృత్యా న వేత్తి కియదంతరమ్. 40

భా: భక్తుడు నారాయణుని స్మరించును. హరి నమములను గానము చేయును. అతని కొలికే కర్మల నాచరించును. వానివలననే అతనికి ఆనందము, సుఖము లభించును. భక్తుడు ఉద్ధతునివలె నృత్యము చేయును. రోదించును, నవ్వును, తన్మయుడై వెడలును. తనను తాను మరచి తిరుగును. ఎక్కడను భేదమతనికి గోచరించదు.

ఏవం విధా భగవతో భక్తిరవ్యభిచారిణీ
పునాతి సహసా లోకాన్ సదేవాసురమానుషాన్. 41
భక్తిః సా ప్రకృతిర్నిత్యా బ్రహ్మసంపత్ప్రకాశితా
శివవిష్ణు బ్రహ్మరూపా వేదాద్యానాం వరాపి వా. 42

భా: ఈ విధముగ వైకల్యమున కవకాశము లేని భగవద్భక్తి దేవ, అసుర, మానవులను, లోకములను పవిత్రము చేయును. భక్తియనునది నిత్యమగు ప్రకృతి. అదియే బ్రహ్మసంపద, వేదాదులలో భక్తిశ్రేష్ఠమైనది. అది బ్రహ్మ విష్ణుశివ రూపము.

భక్తాః సత్త్వగుణాధ్యాసా ద్రజసేంద్రియలాలసాః
తమసా ఘోరసంకల్పా భజంతి ద్వైతదృగ్జనాః. 43
సత్త్వా న్నిరుగణతా మేతి రజసా విషయస్పృహామ్
తమసా నరకం యాంతి సంసారాద్వైత ధర్మిణః. 44

భా: ద్వైత భావము కల జనులు సత్త్వగుణాధ్యాస వలన భక్తి కల్గినవారు, రజోగుణముచే ఇంద్రియలాలసులు, తమోగుణముచే ఘోరకృత్యములు చేయువారగుదురు. సంసారమున ద్వైతజ్ఞాన సంపన్నులలో సత్త్వగుణాధిక్యముచే నిర్గుణ భావమేర్పడును. రజోగుణముచే విషయవాంఛలు కల్గును. తమోగుణాధిక్యముచే నరకమును పొందుదురు.

ఉచ్ఛిష్ట మవశిష్టం వా పథ్యం పూత మభీప్సితమ్
భక్తానాం భోజనం విష్ణో ర్నైవేద్యం సాత్త్వికం మతమ్. 45
ఇంద్రియ ప్రీతిజననం శుక్రశోణితవర్ధనమ్
భోజనం రాజసమ్ శుద్ధ మాయురారోగ్య వర్ధనమ్. 46

భా: విష్ణుమూర్తికి నివేదన చేయబడిన పథ్యము, పవిత్రమగు ఆహారము భక్తులకు సాత్త్విక ఆహారముగ చెప్పబడుచున్నది. ఇంద్రియములకు ప్రీతిని కల్గించునది, శుక్రశోణితములను వృద్ధి చేయునది, ఆయురారోగ్యవర్ధకము, శుద్ధమునగు ఆహారము రాజసభోజన మనబడును.

అతః పరం తామసానాం కట్వామ్లోష్ణవిదాహికమ్
పూతిపర్యుషితం జ్ఞేయం భోజనం తామసప్రియమ్. 47

**సాత్వికానాం వనే వాసో గ్రామే వాసస్తు రాజసః**
**తామసం ద్యూతమద్యాది సదనం పరికీర్తితమ్. 48**

భా: కారము, పులుపు, బాగా కాల్చబడినది, దుర్గంధయుక్తము అయిన ఆహారము తమోగుణసంపన్నులకు మిక్కిలి ఇష్టము. సత్త్వగుణ సంపన్నులు వనమున, రజోగుణసంపన్నులు గ్రామమున, తమోగుణముతో కూడినవారు జూదగృహమున, మద్యశాలలోను నివసించెదరు.

**న దాతా స హరిః కించిత్ సేవకస్తు న యాచకః**
**తథాపి పరమా ప్రీతి స్తయోః కిమితి శాశ్వతీ. 49**

**ఇత్యేత ద్భగవత ఈశ్వరస్య విష్ణో ర్గుణకథనం సనకో విబుధ్య భక్త్యా**
**సవినయవచనైః సురర్షివర్యం పరిణు త్వేంద్ర పురం జగామ శుద్ధః. 50**

భా: భగవంతుడు (హరి) దాతకాదు. సేవకుడు యాచకుడు కాదు. అయినను వారిద్దరి మధ్య పరస్పరప్రీతి ఆశ్చర్యమును గొలుపును. సనక మహర్షి పరమేశ్వరుడగు శ్రీహరి యొక్క గుణములను నారదుని వలన శ్రద్ధగ తెలుసుకొని సవినయముగ నారదుని స్తుతించి ఇంద్రపురమునకు వెళ్ళెను.

ఇతి శ్రీ కల్కిపురాణేఽనుభాగవతే భవిష్యే తృతీయాంశే
నృపగణ శశిధ్వజ సంవాదే జాతి స్మరత్వ కథనం నామ
ఏకాదశోధ్యాయః

ఇది భాగవతాను బంధము భవిష్యము నగు
శ్రీకల్కి పురాణమునతృతీయాంశమున
నృపగణ శశిధ్వజ సంవాదమున జాతిస్మరత్వ కథనమను
ఏకాదశాధ్యాయము.



# కల్కిపురాణము

## తృతీయాంశము- ద్వాదశాధ్యాయము

శశిధ్వజ ఉవాచ.....

ఏత ద్వః కథితం భూపాః కథనీయోరు కర్మణః
కథా భక్త స్య భక్తే శ్చ కి మన్యత్ కథయా మ్యహమ్. 1

భూపా ఊచుః.......

త్వం రాజన్ వైష్ణవశ్రేష్ఠః సర్వసత్త్వహితే రతః
తవావేశః కథం యుద్ధరఙ్గే హింసాదికర్మణి. 2
ప్రాయశః సాధవో లోకే జీవానాం హితకారిణః
ప్రాణబుద్ధిధనై ర్వాగ్భిః సర్వేషాం విషయాత్మనామ్. 3

భా: శశిధ్వజుడు పలికెను. ఓ భూపాలులార! భక్తిస్వరూపము, భక్తుని లక్షణములు మీకు వివరించి చెప్పితిని. ఇక మీకు నేనేమి చెప్పవలయును అపుడు రాజులు అడిగిరి. ఓరాజ! మీరు సర్వప్రాణులకు హితమును కల్గించెడి వైష్ణవ భక్తులు. కాని హింసాత్మకమగు యుద్ధమున ఏల ప్రవర్తించిరి? సామాన్యముగ సత్పురుషులు లోకమున ప్రాణ, బుద్ధి, ధన వాక్కులచే సమస్తజీవులకు హితమును కల్గించెదరని రాజులు శశిధ్వజునితో పలికిరి.

శశిధ్వజ ఉవాచ.....

ద్వైతప్రకాశినీ యా తు ప్రకృతిః కామరూపిణీ
సాసూతే త్రిజగత్ కృత్స్నం వేదాంశ్చ త్రిగుణాత్మికా. 4
తే వేదా స్త్రిజగద్ధర్మ శాసనాధర్మనాశనాః
భక్తి ప్రవర్తకా లోకే కామినాం విషయైషిణామ్. 5

భా: శశిధ్వజుడు పలికెను. ద్వైతప్రకాశకము, కామరూపిణి సత్వరజస్తమోరూప త్రిగుణాత్మకమగు ప్రకృతి ముల్లోకములను, వేదములను పుట్టించును. ముల్లోకములలో ధర్మమునుశాసించునవి, అధర్మమును నాశము చేయునవగు వేదములు విషయవాంఛ కల్గిన

కాముకులను భక్తిమార్గమందు ప్రవర్తింపజేయును.

వాత్స్యాయనాదిమునయో మనవో వేదపారగాః
వహంతి బలి మీశస్య వేదవాక్యానుశాసితాః. 6
వయం తదనుగాః కర్మధర్మనిష్ఠా రణప్రియాః
జిఘాంసం తం జిఘాంసామో వేదార్థకృతనిశ్చయాః. 7

భా: వేదపారంగతులగు వాత్స్యాయనాది మహర్షులు, మనువులు వేదోక్తమార్గమున నుసరించినవారై పరమేశ్వరునికి ఆత్మసమర్పణము గావించెదరు. వారి ననుసరించు మేము కర్మధర్మతత్పరులమై రణమందాసక్తి కలిగి వైదిక మార్గమందు దృఢ నిశ్చయము కలవారమై చంపువానిని చంపెదము.

అవధ్యస్య వధే యావాం స్తావాన్ వధ్యస్య రక్షణే
ఇత్యాహ భగవాన్ వ్యాసః సర్వవేదార్థ తత్పరః. 8
ప్రాయశ్చిత్తం న తత్రాస్తి తత్రాధర్మః ప్రవర్తతే
అతోఽత్ర వాహినీం హత్వా భవతాం యుధి దుర్జయామ్. 9
ధర్మం కృతఞ్చ కల్కిం తు సమానీయాగతా వయమ్
ఏషా భక్తి ర్మమ మతా తవాభిప్రేత మీరయ. 10

భా: చంపదగని వానిని చంపిన ఎట్టి పాపము కల్గునో, చంపదగినవానిని చంపకపోయిన అట్టిపాపము కల్గునని వేదార్థవిశారదుడగు వ్యాసమహర్షి చెప్పిరి. అట్టి అధర్మమునకు ప్రాయశ్చిత్తము లేదు. కనుక నేను యుద్ధరంగమున దుర్జయమగు సేనను సంహరించి ధర్మ, కృత, కల్కులను తీసుకొని వచ్చితిని. నా ఆలోచన ప్రకారము ఇదియే సరియైన భక్తి. మీ అభిప్రాయమున చెప్పుడు.

అహం తదను వక్ష్యామి వేదవాక్యానుసారతః
యది విష్ణుః స సర్వత్ర తదా కం హంతి కో హతః. 11
హంతావిష్ణు ర్భృతో విష్ణు ర్వధః కస్యాస్తి తత్ర చేత్
యుద్ధయజ్ఞాదిషు వధే న వధో వేదశాసనాత్. 12
ఇతి గాయంతి మునయో మనవశ్చ చతుర్దశ
ఇత్థం యుద్ధైశ్చ యజ్ఞైశ్చ భజామో విష్ణు మీశ్వరమ్. 13

భా: వేదవాక్యముల ననుసరించి అటుపిమ్మట మీకు సమాధానము చెప్పెదను. అంతా విష్ణుమయమైనచో చంపువాడెవరు? చచ్చు వలడెవరు? చంపువాడు విష్ణువు, హతుడు కూడా

విష్ణువే అయినచో ఎవరికి వధ జరుగును. వేదశాసనము వలన యుద్ధయజ్ఞములలో వధ వధగా పరిగణింపబడదు అని మహర్షులు పదునాల్గురు మనువులు గానముచేయుచున్నారు. ఇట్లు యుద్ధములు, యజ్ఞములతో పరమేశ్వరుడగు విష్ణువును సేవించు చున్నాము.

**అతో భాగవతీం మాయా మాశ్రిత్య విధినా యజన్**
**సేవ్య సేవకభావేన సుఖీ భవతి నాన్యథా. 14**

**భూపా ఊచుః**

**నిమేర్భూపస్య భూపాల! గురోః శాపా న్మృతస్య చ**
**తాదృశే భోగాయతనే విరాగః కథ ముచ్యతామ్. 15**

భా: ఈ విధముగ భగవత్సంబంధమయిన మాయ నాశ్రయించి విధిపూర్వకముగ సేవ్య సేవక భావముతో పూజించుచు సుఖమును పొందవలెను. మరియొక మార్గము లేదు. రాజులు పలికిరి. ఓరాజ! నిమిభూపాలుడు గురువ గు వశిష్ఠుని శాపమువలన మరణించి శరీరమును విడిచెను. కాని భోగసాధనమగు శరీరమందు నిమికి వైరాగ్యమేల కలిగెను? ( సూర్య వంశమున ఇక్ష్వాకు పుత్రుడు నిమి సహస్ర వర్షాకమగు యజ్ఞమును చేయదలచి వశిష్ఠమహర్షిని హోమము చేయించుటకు (హోత) కోరెను. ఇంద్రుడు ఆచరించు ఐదువందల సంవత్సరముల యజ్ఞమునకు హోతగ ముందుగ నిర్ణయమగుటచే కొంతకాలమాగుమని పిమ్మట ఋత్విక్కుగ వ్యవహరించెదనని వశిష్ఠుడు చెప్పెను. నిమిరాజు ఏమియు సమాధానము చెప్పక ఊరకుండెను. పిమ్మట నిమి గౌతముని చే యజ్ఞము చేయించ సాగెను. ఇంద్రుని యజ్ఞము సమాప్తమయిన వెంటనే వశిష్ఠుడు త్వరగ అచ్చటకు వచ్చి గౌతముడు యజ్ఞము చేయించుటను నిమి నిద్రపోవుటను గమనించి దేహహీనుడవు కమ్మని నిమికి శాపమిచ్చెను. నిద్ర నుండి మేల్కొనిన నిమి, నిద్రచే ఏమియు ఎరుగని నాకు శాపమిచ్చిన గురువునకు కూడ శరీరము పతనము కాగలదని శాపమిచ్చి శరీరము త్యజించెను - ( విష్ణుపురాణము 4 అంశము 5 అధ్యాయము) యజ్ఞము యొక్క అంతమున దేవతలు ప్రసన్నులై అతనిని బ్రతికించుటకు మృతశరీరములోనికి ప్రవే శించమని చెప్పినను ఏల ప్రవేశించలేదు?

**శిష్యశాపా ద్వశిష్ఠస్య దేహావా ర్మృతస్య చ**
**శ్రూయతే కిల ముక్తానాం జన్మ భక్తవిముక్తతా. 16**
**అతో భాగవతీ మాయా దుర్బోధ్యా విజితాత్మనామ్**
**విమోహయతి సంసారే నానాత్వా దింద్రజాలవత్. 17**

ఇతి తేషాం వచో భూయః శ్రుత్వా రాజా శశిధ్వజః
ప్రోవాచ వదతాం శ్రేష్ఠో భక్తి ప్రవణయా ధియా. 18

భా: శిష్యుని శాపమువలన వసిష్ఠుడు దేహమును విడిచి తిరిగి దేహాంతరమును ధరించెను. ముక్తి పొందిన వారికి తిరిగి జన్మ ఎట్లు కలుగును? భగవంతుని ఆశ్రయించిన మాయ జ్ఞానులకు కూడా దుర్బోధ్యమే. ఇంద్రజాలము వలె మాయలోకములను మోహపెట్టును. అని రాజులు పలుకగ వినిన శశిధ్వజుడు భక్తి భావముతో ఇట్లు పలికెను.

శశిధ్వజ ఉవాచ......

బహూనాం జన్మనా మంతే తీర్థక్షేత్రాదియోగతః
దైవా ద్భవేత్ సాధుసంగ స్తస్మా దీశ్వర దర్శనమ్. 19
తతః సాలోక్యతాం ప్రాప్య భజం త్యాదృత చేతసః
భుక్త్వా భోగా ననుపమాన్ భక్తో భవతి సంసృతౌ. 20

భా: శశిధ్వజుడు చెప్పెను. తీర్థక్షేత్రాది దర్శనము వలన అనేక జన్మల తరువాత దైవానుగ్రహము వలన సాధుసమాగమము కల్గును. సాధుసాంగత్యము వలన జీవునకు ఈశ్వరదర్శనము కలుగును. విష్ణుదర్శన భాగ్యమును పొంది పిమ్మట ఆదరింపబడిన మనస్సు కలవారై భగవంతుని సేవించెదరు. ఈ విధముగ జీవుడు సంసారమున నిరుపమానములగు భోగము లన నుభవించి భక్తుడగుచున్నాడు.

రజోజుషః కర్మపరాః హరిపూజాపరాః సదా
తన్నామాని ప్రగాయంతి తద్రూపస్మరణోత్సుకాః. 21
అవతారానుకరణ పర్వవ్రతమహోత్సవాః
భగవద్భక్తిపూజాఢ్యాః పరమానంద సంప్లుతాః. 22

భా: రజోగుణ సంపన్నులు ఎల్లప్పుడు కర్మలనాచరించుచు హరిపూజాతత్పరులై ఎల్లప్పుడు నారాయణుని నామములను గానము చేయుచు, వారి రూపమును స్మరించుచుందురు. వారు భగవంతుని అవతారమునునుకరించుచు పర్వదినములయందు వ్రతమహోత్సవముల నాచరించుచు, భగవంతుని యెడల భక్తి పూజలచే సంపన్నులై పరమానందసంభరితులగుదురు.

అతో మోక్షం న వాంఛంతి దృష్టముక్తి ఫలోదయాః
ముక్త్వా లభంతే జన్మాని హరిభావ ప్రకాశకాః. 23
హరిరూపాః క్షేత్రతీర్థపావనా ధర్మతత్పరాః
సారాసారవిదః సేవ్యసేవకా ద్వైతవిగ్రహాః. 24

భా: భక్తజనము ముక్తి ఫలమును ప్రత్యక్షముగ అనుభవించిన వారగుటచే మోక్షమును యాచించుట లేదు. వారు భోగముల ననుభవించి తిరిగి జన్మనొంది హరిభక్తిని ప్రకటించు చున్నారు. భక్తులు నారాయణుని రూపములు. క్షేత్రతీర్థములను పవిత్రము చేయువారు, ధర్మతత్పరులు, సార, అసారములను తెలిసినవారు, సేవ్యసేవక భావముచే ద్వైతభావము నొందినవారు.

**యథావతారః కృష్ణస్య తథా తత్సేవినా మిహ**
**ఏవం నిమే ర్నిమిషతా లీలా భక్తస్య లోచనే. 25**
**ముక్తస్యాపి వశిష్ఠస్య శరీరభజనాదరః**
**ఏతద్వః కథితం భూపా మాహాత్మ్యం భక్తి భక్తయోః. 26**

భా: కృష్ణుడు అవతరించినట్లు వారి సేవకులు కూడ అవతరించెదరు. ఈ కారణముచే నిమి భక్తుల నేత్రములపై నిమేష రూపముగ నివసించుట కూడా భగవంతుని లీలయే. ముక్తిని పొందిన వశిష్ఠుడు తిరిగి దేహమును ధరించుట కూడా ఇటువంటిదియే. ఓ రాజులార! భక్తి భక్తుల మాహాత్మ్యమును మీకు వివరించితిని. (నిమిచే శాపము పొందిన వశిష్ఠుని తేజస్సు మిత్రావరుణు తేజస్సు నందు ప్రవేశించెను. పిమ్మట అప్సరస యగు ఊర్వశి దర్శనము వలన స్ఖలిత్యము పొందిన వీర్యము వలన వశిష్ఠుడు మరియొక దేహమును ధరించెను - వి.పు. 4-5)

**సద్యః పాపహరం పుంసాం హరిభక్తి వివర్ధనమ్**
**సర్వేంద్రియస్థదేవానా మానందసుఖసంచయమ్**
**కామరాగాది దోషఘ్నం మాయామోహనివారణమ్. 27**
**నానాశాస్త్ర పురాణ వేద విమలవాఖ్యామృతాంభోనిధిం**
**సంమథ్యాతిచిరం త్రిలోకమునయో వ్యాసాదయో భావుకాః**
**కృష్ణే భావ మనన్య మేవ మమలం హైయఙ్గవీనం నవం**
**లబ్ధ్వా సంసృతినాశనం త్రిభువనే శ్రీకృష్ణ తుల్యాయతే. 28**

భా: దీనిని వినుటవలన మనుష్యుల పాపములు దూరమగును. ఇది హరిభక్తిని వృద్ధి చేయును. సర్వేంద్రియముల అధిష్ఠాతృ దేవతలకు సుఖానందములు కలుగజేయును. కామరాగాది దోషముల నపహరించును. మాయామోహమును నివారించును. ముల్లోకములో తిరిగెడి వ్యాసాది మహర్షులు నానా శాస్త్రములు, పురాణములు, వేదములు, వాటికి సారరూపములగు వ్యాఖ్యలనెడి సాగరమును బహుకాలము మథించి పరమపవిత్రము, అసాధారణము సంసారనాశకమగు కృష్ణభక్తి అనెడి నవనీతమును సంపాదించిరి. అపూర్వమగు ఫలమును సంపాదించి పెట్టిన వ్యాసాదిమునులను

భక్తులు శ్రీకృష్ణునితో పోల్చిరి.

ఇతి శ్రీ కల్కి పురాణేఽ నుభాగవతే భవిష్యే తృతీయాంశే
భక్తి భక్త మాహాత్మ్యం నామ ద్వాదశోఽధ్యాయః.

ఇది భాగవతానుబంధము భవిష్యమునగు
శ్రీకల్కి పురాణమున తృతీయాంశమున
భక్తి భక్త మాహాత్మ్యమను
ద్వాదశాధ్యాయము.



# కల్కిపురాణము

## తృతీయాంశము- త్రయోదశాధ్యాయము

సూత ఉవాచ....

ఇతి భూపః సభాయాం స కథయిత్వా నిజాః కథాః
శశిధ్వజః ప్రీతమనాః ప్రాహ కల్కిం కృతాంజలిః. 1

శశిధ్వజ ఉవాచ.....

త్వం హి నాథ త్రిలోకేశ ఏతే భూపాస్త్వదాశ్రయాః
మాం తథా విద్ధి రాజానం త్వన్నిదేశకరం హరే. 2

భా: సూతుడు పలికెను. శశిధ్వజుడు ప్రసన్నహృదయుడై తన వృత్తాంతమును రాజులకు చెప్పి పిమ్మట చేతులు జోడించి కల్కితో ఇట్లు పలికెను. ఓహరి! నీవు ముల్లోకములకు నాథుడవు, ఈ రాజు లందరు నిన్ను ఆశ్రయించినవారు. నీ ఆదేశమును పాలించువానిగ నన్ను తెలుసుకొనుము.

తపస్తప్తుం యామి కామం హరిద్వారం మునిప్రియమ్
ఏతే మత్పుత్రపౌత్రాశ్చ పాలనీయాస్త్వదాశ్రయాః. 3
మమాపి కామం జానాసి పురా జాంబవతో యథా
నిధనం ద్వివిదస్యాపి తదా సర్వం సురేశ్వర. 4
ఇత్యుక్త్వా గంతుముద్యుక్తం భార్యయా సహితం నృపమ్
లజ్జయాఽధోముఖం కల్కిం ప్రాహుర్భూపాః కిమిత్యుత. 5

భా: ఓనాథ! మునులకు ప్రియమగు హరిద్వారమునకు తపమాచరించుటకు నేను వెళ్ళుచున్నాను. నిన్ను ఆశ్రయించిన నా పుత్రపౌత్రాదులను నీవు రక్షించగలవు. ఓ సురేశ్వర! నా అభిప్రాయము మీకు తెలుసు. గతజన్మలో మీరు జాంబవంతుని, ద్వివిదుడను వానరుని నాశముచేయుట గుర్తుండియుండును. అని పలికి శశిధ్వజుడు భార్యతో కూడ బయలుదేరుటకు సిద్ధము కాగా సిగ్గుతో తలవంచుకొనిన కల్కిని రాజులందరు కారణమడిగిరి.

హేనాథ! కిమనేనోక్తం యచ్ఛ్రుత్వా త్వ మధోముఖః
కథం తద్ బ్రూహి కామం నః కిం వా నః శాధి సంశయాత్. 6

కల్కిరువాచ......

అముం పృచ్ఛత వో భూపా యుష్మాకం సంశయచ్ఛిదమ్
శశిధ్వజం మహాప్రాజ్ఞం మద్భక్తి కృత నిశ్చయమ్. 7
ఇతి కల్కేర్వచః శ్రుత్వా తే భూపాః ప్రోక్తకారిణః
రాజానం తం పునః ప్రాహుః సంశయాపన్నమానసాః. 8

భా: ఓ నాథ! శశిధ్వజుడు ఏమని పలికెను. ఏ కారణముచే మీరు అధోముఖులైతిరి. వివరముగ చెప్పి మాసంశయమును నివృత్తి చేయుడని రాజులు కల్కిని వేడిరి. వారి మాటలు వినిన కల్కి ఓ రాజులార! మీరు శశిధ్వజుని దీనికి కారణ మడుగుడు. అతడు మీ సంశయమును పోగొట్ట గలడు. శశిధ్వజుడు ఉత్తమజ్ఞాని. నాయందు దృఢమైన భక్తి కలవాడని చెప్పెను. సంశయగ్రస్తులయిన రాజులు కల్కి మాటలు విని పిమ్మట శశిధ్వజుని ఇట్లు అడిగిరి.

నృపా ఊచుః.......

కిం త్వయా కథితం రాజన్ శశిధ్వజ మహామతే
కథం కల్కిస్త్వద్వదిదం శ్రుత్వైవాభూదధోముఖః. 9

శశిధ్వజ ఉవాచ.......

పురా రామావతారేణ లక్ష్మణాదింద్రజిద్వధమ్
మోక్ష ంచాలక్ష్య ద్వివిదో రాక్షసత్వాత్ స దారుణాత్. 10

భా: రాజులు పలికిరి. ఓ రాజ! బుద్ధిమంతులగు మీరు ఏమి చెప్పిరి? మీ మాటలను విని ఏ కారణముచే కల్కి అధోముఖుడాయెను. శశిధ్వజుడు చెప్పెను. పూర్వము రామావతారమున లక్ష్మణునివలన ఇంద్రజిత్తునకు ముక్తి లభించెను.

అగ్న్యాగారే బ్రహ్మవీరవధేనైకాహికో జ్వరః
లక్ష్మణస్య శరీరేణ ప్రవిష్టో మోహకారకః. 11
తం వ్యాకుల మభిప్రేక్ష్య ద్వివిదో భిషజాం వరః
అశ్వివంశేన సంజాతః ఖ్యాపయామాస లక్ష్మణమ్. 12

బా: అగ్నిశాలలో బ్రాహ్మణుని వధించుట వలన ఐకాహికమగు ( ఒకరోజు) జ్వరము లక్ష్మణుని శరీరమందు ప్రవేశించి అతనికి మోహము కల్గించసాగెను. అశ్వినీకుమారుల వంశమందు పుట్టినవైద్యశ్రేష్ఠుడగు ద్వివిదుడు లక్ష్మణుని వ్యాకులపడుటను చూచి ఒకమంత్రమును వినిపించెను.

లిఖిత్వా రామభద్రస్య సంజ్ఞాపత్రీమతంద్రితః
లక్ష్మణం దర్శయామాస ఊర్ధ్వేతిష్ఠన్ మహాభుజః. 13
లక్ష్మణో వీక్ష్య తాం పత్రీం విజ్వరో బలవానభూత్
స తతో ద్వివిధం ప్రాహ వరం వరయ వానర. 14

భా: మంత్రమును పత్రముపై వ్రాసి రామచంద్రుని ఎదుట ఉన్నతస్థానమున నుండి లక్ష్మణునికి చూపెను. లక్ష్మణుడు పత్రమును చూచి జ్వరరహితుడై బలవంతుడాయెను. పిమ్మట అతడు ద్వివిదమను పేరుగల వానరమును వరమును కోరుకొనుమని పలికెను.

ద్వివిదస్తద్వచః శ్రుత్వా లక్ష్మణం ప్రాహ హృష్టవత్
త్వత్తో మే మరణం ప్రార్థ్యం వానరత్వాచ్చ మోచనమ్. 15
పునస్తం లక్ష్మణః ప్రాహ మమ జన్మాంతరే తవ
మోచనం భవితా కీశ బలరామశరీరిణః. 16

భా: ద్వివిదుడు లక్ష్మణుని మాటలు విని సంతుష్టుడై అతనితో మీ వలన మరణమును పొంది వానరజాతి నుండి విముక్తిని కోరుచున్నాను అనెను. అప్పుడు లక్ష్మణుడు అతనితో జన్మాంతరమందు నేను బలరామునిగ అవతరించెదను. అప్పుడు బలరాముని వలన నీకు విముక్తి కలుగ గలదని చెప్పెను.

సముద్రస్యోత్తరే తీరే ద్వివిదో నామ వానరః
ఐకాహికం జ్వరం హంతి లిఖితం యస్తు పశ్యతి. 17
ఇతి మంత్రాక్షరం ద్వారి లిఖిత్వా తాలపత్రకే
యస్తు పశ్యతి తస్యాపి నశ్యత్యైకాహికజ్వరః. 18
ఇతి తస్య వరం లబ్ధ్వా చిరాయుః సుస్థవానరః
బలరామాస్త్రభిన్నాత్మా మోక్షమాపాకుతోభయమ్. 19

భా: 'సముద్రము ఉత్తర తీరమున ద్వివిదుడను వానరుడు గలడు' అను మంత్రాక్షరములను వ్రాసినది చూచు వాని ఐకాహిక జ్వరము తొలగును. ఈ మత్రాక్షరములను ద్వారమందు గాని తాలపత్రమందుగాని వ్రాసి దర్శనము చేసినను జ్వరము దూరమగును. అని లక్ష్మణుని వలన వరము పొంది ద్వివిదుడు స్వస్థుడై చిరకాలము జీవించెను. పిమ్మట బలరాముని అస్త్రముల వలన మరణించి మోక్షము నొందెను.

తథా క్షేత్రే సూతపుత్రో నిహతో లోమహర్షణః

బలరామాస్త్రభిన్నాత్మా నైమిషేఽభూత్ స్వవాంఛయా. 20

జాంబవాంశ్చ పురాభూపా వామనత్వం గతే హరౌ

తస్యాప్యూర్ధ్వగతం పాదం తత్ర చక్రే ప్రదక్షిణమ్. 21

భా: అట్లే తనకోరిక ననుసరించి సూతపుత్రుడు లోమహర్షణుడు నైమిషారణ్యమున బలదేవుని అస్త్రముచే మృతి చెందెను. ఓ రాజులార! పూర్వకాలము వామనావతారమున శ్రీహరి మూడు పాదములతో సమస్త లోకములను విస్తరింప, ఊర్ధ్వలోకములకు విస్తరించిన అతని పాదమునకు జాంబవంతుడు ప్రదక్షిణ చేసెను.

మనోజవం తం నిరీక్ష్య వామనః ప్రాహ విస్మితః

మత్తో వృణు వరం కామమృక్షాధీశ మహాబల. 22

ఇతి తం హృష్టవదనో బ్రహ్మాంశో జాంబవాన్ ముదా

ప్రాహ భో చక్రదహనాన్మమ మృత్యుర్భవిష్యతి. 23

భా: మనస్సు వలె మిక్కిలి వేగముగల జాంబవంతుని చూచి ఆశ్చర్యపడిన వామనుడు ఓఋక్షపతి! మహా బలవంతుడగునీవు నావలన వరము కోరుకొనుమని చెప్పెను. వామనుని మాటలు వినిన జాంబవంతుడు సంతోషము నొందినవాడై 'మీచక్రము వలన నాకు మృత్యువు సంభవించునట్లు వరమీయ'మని అడిగెను.

ఇత్యుక్తే వామనః ప్రాహ కృష్ణజన్మని మే తవ

మోక్షశ్చక్రేణ సంభిన్నశిరసః సంభవిష్యతి. 24

మమ కృష్ణావతారేతు సూర్య భక్తస్య భూపతేః

సత్రాజితస్తు మణ్యర్థే దుర్వాదః సమజాయత. 25

భా: ఇది విని వామనుడు 'కృష్ణావతారమున మా చక్రమువలన శిరస్సు ఖండింపబడి ముక్తిని పొందెదవని చెప్పెను. కృష్ణావతారమున నాకు సత్రాజిత్తు శ్యమంతక మణి నిమిత్తము (కృష్ణునికి) అపవాదు కల్గినది.

ప్రసేనస్య మమ భ్రాతుర్వధస్తు మణిహేతుకః

సింహాత్తస్యాపి మణ్యర్థే వధో జాంబవతా కృతః. 26

దుర్వాదభయభీతస్య కృష్ణస్యామితతేజసః

మణ్యన్వేషణ చిత్తస్య ఋక్షేణాభూద్రణో బిలే. 27

భా: నా కనిష్ఠసోదరుడగు ప్రసేనుని మణి నిమిత్తమై సింహము చంపెను. మణికారణముచే సింహము జాంబవంతునిచే చంపబడినది. శ్యమంతకమణి కొఱకు ప్రసేనుని చంపెనను కళంకమునకు వెఱచిన శ్రీకృష్ణుడు మణిని వెదకుచు ఒక గుహలో జాంబవంతునితో యుద్ధము చేసెను.

**స నిజేశం పరిజ్ఞాయ తచ్చక్రగ్రస్తబంధనమ్**
**ముక్తో బభూవ సహసా కృష్ణం పశ్యన్ సలక్ష్మణమ్. 28**
**నవదూర్వాదలశ్యామం దృష్ట్వా ప్రాదాత్ నిజాత్మజామ్**
**తదా జాంబవతీం కన్యాం ప్రగృహ్యా మణినా సహ. 29**

భా: జాంబవంతుడు తన ప్రభువును తెలుసుకొనెను. కృష్ణుని చక్రము వలన అతని శిరస్సు ఖండింపబడగ లక్ష్మణునితో కూడిన శ్రీకృష్ణుని దర్శించుకొని జాంబవంతుడు ముక్తిని పొందెను. ఋక్షరాజు శ్యామవర్ణుడగు కృష్ణునికి తన పుత్రికయగు జాంబవతిని దానము చేసెను. కృష్ణుడు మణితో కూడ జాంబవతిని గ్రహించి---------

**ద్వారకాం పురమాగత్య సభాయాం మాముపాహ్వయత్**
**ఆహూయ మహ్యం ప్రదదౌ మణిం మునిగణార్చితమ్. 30**
**సోఽహం తాం లజ్జయాతేన మణినా కన్యకాం స్వకామ్**
**వివాహేన దదావస్మై లావణ్యాజ్జగృహే మణిమ్. 31**

భా: (పిమ్మట కృష్ణుడు) ద్వారకానగరమునకు వచ్చి నన్ను సభకు పిలిపించి మనిజన వంద్యమగు మణిని నాకిచ్చెను. (సత్రాజిత్తునకు) నేను సిగ్గుపడి మణితోకూడ నాపుత్రికయగు సత్యభామను అతనికర్పించితిని. శ్రీకృష్ణుడు లావణ్యము కారణముగ రెండిటిని గ్రహించెను.

**తాం సత్యభామామాదాయ మణిం మయ్యర్ప్య స ప్రభుః**
**ద్వారకామాగత్య పునర్గజాహ్వాయ మగాద్విభుః. 32**
**గతే కృష్ణే మాం నిహత్య శతధన్వా గ్రహీన్మణిమ్**
**అతోఽహమిహ జానామి పూర్వజన్మని యత్కృతమ్. 33**

భా: మణిని నాకర్పించి, సత్యభామను తీసుకొని శ్రీకృష్ణుడు హస్తినాపురమునకు వెడలెను. కృష్ణుడు వెళ్ళిన పిమ్మట శతధన్వుడను రాజు నన్ను చంపి మణిని తీసుకుపోయెను. ఈ కారణముగ పూర్వజన్మలో కర్మ చేసిన పనులను స్మరించు చున్నాను.

మిథ్యాభిశాపాత్ కృష్ణస్య నైవాభూన్మోచనం మమ
అతోఽహం కల్కిరూపాయ కృష్ణాయ పరమాత్మనే
దత్వాం రమాం సత్యభారూపిణీం యామి సద్గతిమ్. 34
సుదర్శనాస్త్రఘాతేన మరణం మమ కాంక్షితమ్
మరణేఽభూదితి జ్ఞాత్వా రణే వాంఛామి మోచనమ్. 35

భా: కృష్ణునిపై మిథ్యా కళంకము నాపాదించుటచే గతజన్మలో నాకు మోక్షము లభించలేదు. కనుక కల్కి అవతారమగు కృష్ణునికి రమగ అవతరించిన సత్యభామను సమర్పించి సద్గతిని పొందెదను. సుదర్శనాస్త్రప్రహారముచే మరణమును కోరి యుద్ధరంగమున మోక్షమును పొందుటకు యుద్ధమునకు ప్రవర్తించితిని.

ఇత్యసౌ జగతామీశః కల్కిః శ్వశురఘాతనమ్
శ్రుత్వైవాధోముఖస్తస్థౌ హ్రియా ధర్మభియా ప్రభుః. 36
అత్యాశ్చర్య మపూర్వముత్తమమిదం శ్రుత్వా నృపా విస్మితా
లోకాః సంసది హర్షితా మునిగణాః కల్కేర్గుణాకర్షితాః
ఆఖ్యానం పరమాదరేణ సుఖదం ధన్యం యశస్యం పరం
శ్రీమద్భూప శశిధ్వజేరితవచో మోక్షప్రదం చాభవన్. 37

భా: జగదీశ్వరుడగు కల్కి శ్వశురవధను స్మరించి సిగ్గుతో, ధర్మభీతితో తల వంచుకొనెను. ఆశ్చర్యమును గొలుపు అపూర్వ వృత్తాంతమును విని సభలోని వారందరు ఆశ్చర్యపడిరి. లోకములన్నియు హర్షమును పొందినవి. మహర్షులు కల్కిగుణముల కాకర్షింపబడితిరి. ఈ ఉపాఖ్యానమును వినినవారు సుఖమును, యశస్సును, మోక్షమును పొందెదరు.

ఇతి శ్రీకల్కి పురాణేఽను భాగవతే భవిష్యేతృతీయాంశే
శశిధ్వజేరిత చక్రమరణాఖ్యానం నామ
త్రయోదశోఽధ్యాయః

ఇది భాగవతానుబంధము. భవిష్యమునగు
శ్రీకల్కి పురాణమున తృతీయాంశమున
శశిధ్వజేరిత చక్రమరణాఖ్యానమను
త్రయోదశాధ్యాయము.



# కల్కిపురాణము

## తృతీయాంశము-చతుర్దశాధ్యాయము

సూత ఉవాచ.......

తతః కల్కిర్మహాతేజాః శ్వశురం తం శశిధ్వజమ్
సమామంత్ర్య వచశ్చిత్రైః సహ భూపైర్యయౌ హరిః. 1
శశిధ్వజో వరం లబ్ధ్వా యథాకామం మహేశ్వరీమ్
స్తుత్వా మాయాం త్యక్తమాయః సప్రియః ప్రయయౌ వనమ్. 2

భా: సూతుడు పలికెను. పిమ్మట మహాతేజస్వి అయిన కల్కి మామగారైన శశిధ్వజుని సంతోషపరచి వెడలెను. రాజు శశిధ్వజుడు వరమును పొందినవాడై మహేశ్వరి మాయను స్తోత్రము చేసి భవబంధముల నుండి ముక్తిని పొందుటకు భార్యతో కూడ అడవులకు వెళ్ళెను.

కల్కిః సేనాగణైః సార్థం ప్రయయౌ కాంచనీం పురీమ్
గిరిదుర్గావృతాం గుప్తాం భోగిభిర్విష వర్షిభిః. 3
విదార్య దుర్గం సగణః కల్కిః పరపురంజయః
ఛిత్వా విషాయుధాన్ బాణైస్తాం పురీం దదృశేఽచ్యుతః. 4

భా: కల్కి సేనతో కూడి కొండలు దుర్గములతో చుట్టుకొనబడి, విషసర్పములచే కక్షింపబడు కాంచనీపురమునకు వెళ్ళెను. ససైన్యుడై శత్రుపురనాశకుడగు కల్కి ప్రవేశించుటకు శక్యము కాని కోటలను ఛేదించి, విషసర్పములను సంహరించి పురమును ప్రవేశించెను.

మణికాంచన చిత్రాఢ్యాం నాగకన్యాగణావృతామ్
హరిచందన వృక్షాఢ్యాం మనుజైః పరివర్జితామ్. 5
విలోక్య కల్కిః ప్రహసన్ ప్రాహ భూపాన్ కిమిత్యహో
సర్పస్యేయం పురీ రమ్యా నరాణాం భయదాయినీ
నాగనారీగణాకీర్ణాం కిం యాస్యామో వదంత్విహ. 6

భా: ఆ నగరము మణిమయ కాంచన చిత్రములచే అలంకరింపబడినది. హరిచందన వృక్షములతో శోభిల్లు చున్నది. అచ్చట నాగకన్యలు మాత్రమే గలరు. మనుష్యుల జాడ లేదు.

నగరమును చూచి మందహాసముతో కల్కి ''ఎంత ఆశ్చర్యము! మనుష్యులకు మిక్కిలి భయము గొలుపు సర్పముల పురమిది. నాగకన్యలు మాత్రము నివసించు ఈ పురమును ప్రవేశించెదమా?'' అని రాజుల నడిగెను.

ఇతికర్తవ్యతావ్యగ్రం రమానాథం హరిం ప్రభుమ్
భూపాంస్తదను రూపాంశ్చ ఖే వాగాహ శరీరిణి. 7
విలోక్య సేమాం సేనాభిః ప్రవిష్టుం భో స్త్వమర్హసి
త్వాం వినాన్యే మరిష్యంతి విషకన్యాదృశాదపి. 8

భా: రమానాథుడగు కల్కి, రాజులు నాగపురమును ప్రవేశించు విషయమై ఏమియు తోచక వ్యగ్రు లగుచుండ 'సేనతో కూడ మీరు ఈ పురమున ప్రవేశించుట యుక్తముగాదు. మిమ్ములను విడిచి మిగిలిన వారందరు విషకన్యల చూపులచేతనే మరణించెదరు.' అని అశరీరవాణి వినపడెను.

ఆకాశవాణీమాకర్ణ్య కల్కిః శుకసహాయకృత్
యయావేకః ఖడ్గధరస్తురగేణ త్వరాన్వితః. 9
గత్వా తాం దదృశే వీరో ధీరాణాం ధైర్యనాశినీమ్
రూపేణాలక్ష్య లక్ష్మీశం ప్రాహ ప్రహసితాననా. 10

భా: ఆకాశవాణిని విని కల్కి శుకము సహాయముగ కలవాడై ఖడ్గము తీసుకొని ఒంటరిగ గుఱ్ఱముపై త్వరగ బయలుదేరెను. అచ్చటకు వెళ్ళిన పిమ్మట కల్కి, ధీరులకు కూడ ధైర్యమును పోగొట్టెడి అపూర్వ కన్యను చూచెను. ఆమె కల్కిని చూచి మందహాసముతో ఇట్లనియె.

విషకన్యోవాచ.....

సంసారేఽస్మిన్ మమ నయనయోర్వీక్షణ క్షీణదేహా
లోకా భూపాఃకతి కతి గతా మృత్యుమత్యుగ్రవీర్యాః
సాహం దీనాసుర సురనరప్రేక్షణ ప్రేమహీనా
తే నేత్రాబ్జద్వయరస సుధాప్లావితా త్వాం నమామి. 11
క్వాహం విషేక్షణా దీనా క్వామృతేక్షణ సంగమః
భవేఽస్మిన్ భాగ్యహీనాయాః కేనాహో తపసాకృతః. 12

భా: విషకన్య పలికెను. ఈ లోకమున నాచూపులకు ఎందరో మహావీరులగు రాజులు మృత్యువు పాలయిరి. ఈ కారణముచే నేను మిక్కిలి విచారముగ నుంటిని. దేవతలు, అసురులు

మనుష్యులెవ్వరి చూపులతో ప్రేమతో నుండెడి ఆశనాకు లేదు. కాని నీ పద్మముల వంటి నేత్రముల నుండి జారు అమృతము వంటి చూపులతో ఆప్లావితమయిన నేను నీకు నమస్కరించుచున్నాను. విషదృష్టి కల్గిన నేను ఎక్కడ? అమృత మయమమగు చూపులు కల్గిన మీరెక్కడ? మందభాగ్యురాల నగు నాకు ఏ తపస్సుచే మీతో సమాగమము కల్గినదో కదా!

**కల్కిరువాచ.....**

**కాసి కన్యాసి సుశ్రోణి కస్మాదేషా గతిస్తవ**
**బ్రూహి మాంకర్మణా కేన విషనేత్రం తవాభవత్. 13**

**విషకన్యోవాచ....**

**చిత్రగ్రీవస్య భార్యాహం గంధర్వస్య మహామతే**
**సులోచనేతి విఖ్యాతా పత్యురత్యంత కామదా. 14**

భా: కల్కి పలికెను. ఓ సుశ్రోణి! నీవు ఎవరి కన్యవు? ఈ అవస్థ నీకేల కల్గినది? నీవు చేసిన ఏపనివలన నీకు విషదృష్టి ప్రాప్తించినది? విషకన్య పలికెను. ఓమహామతి! నేను చిత్రగ్రీవుడను గంధర్వుని భార్యను. భర్తకు మిక్కిలి ఆనందము కల్గించు నేను సులోచనను.

**ఏకదాహం విమానేన పత్యాపీతేన సంగతా**
**గంధమాదనకుంజేషు రేమే కామకలాకులా. 15**
**తత్ర యక్షమునింద్రుష్ట్వా వికృతాకారమాతురమ్**
**రూపయౌవనగర్వేణ కటాక్షేణాహ సంమదాత్. 16**

భా: ఒకసారి భర్తతో గూడ నేను విమానమున పయనించి గంధమాదన పర్వతపాదరింఢ్లయందు కామక్రీడాసక్తురాలనై విహరించితిని. రూపయౌవన గర్వముతో మదించిన నేను వికృతాకారము కల్గిన యక్షమునిని చూచి పరిహసించితిని.

**సోపాలంభం మునిః శ్రుత్వా వచనం చ మమాప్రియమ్**
**శశాప మాం క్రుధా తత్ర తేనాహం విషదర్శనా. 17**
**నిక్షిప్తాహం సర్పపురే కాంచన్యాం నాగినీగణే**
**పతిహీనా దైవహీనా చరామి విషవర్షిణీ. 18**

భా:- నిరాదరణతో గూడిన వచనములను వినిన మహర్షి కోపముతో నన్ను విషదృష్టికల్గినదానిగ శపించెను. పిమ్మట నేను సర్పములతో నిండిన కాంచనీపురమున ఉంచబడితిని. భాగ్యహీనురాలగు నేను పతికి దూరమై విషమును వర్షించుచు తిరుగు చున్నాను.

న జానే కేన తపసా భవద్దృష్టిపథం గతా
త్యక్తశా పామృతాక్షాహం పతిలోకం వ్రజామ్యతః. 19
అహో తేషామస్తు శాపః ప్రసాదో మా సతామిహ
పత్యుః శాపాదృషేర్మోక్షాత్తవ పాదాబ్జ దర్శనమ్. 20

భా: ఏ తపస్సు వలన మీదృష్టి పథమున పడితినో నాకు తెలియదు. మీ దర్శనము వలన నాశాపము తొలగినది. అమృత దృష్టి కల్గిన నేను పతినివసించు లోకమునకు వెడలెదను. ఎంత ఆశ్చర్యము! సత్పురుషుల శాపములు మంచికే అగును. కనుకనే ఋషిశాపమువలన మోక్షసమయమున మీ పాదాబ్జదర్శనము కల్గినది.

ఇత్యుక్త్వా స యయౌ స్వర్గం విమానేనార్కవర్చసా
కల్కిస్తు తత్పురాధీశం నృపం చక్రే మహామతిమ్. 21
అమర్షస్తత్సుతో ధీమాన్ సహస్రో నామ తత్సుతః
సహస్రతః సుతశ్చాసీద్రాజా విశ్రుతవానసిః. 22

భా: ఇట్లు పలికి విషకన్య సూర్యుని వలె ప్రకాశించెడి విమానమధిరోహించి స్వర్గమునకు వెడలెను. కల్కి మహామతి అను రాజును ఆపురమునకు ప్రభువుగ చేసెను. మహామతి పుత్రుడు అమర్షుడు. అమర్ష పుత్రుడు ధీమంతుడగు సహస్రుడు. సహస్రుని వలన అసి అను విఖ్యాతుడగు రాజు జన్మించెను.

బృహన్నలానాం భూపానాం సంభూతాయస్య వంశజాః
తం మనుం భూపశార్దూలం నానామునిగుణైర్వృతః. 23
అయోధ్యాయాం చాభిషచ్య మధురామగమద్ధరిః
తస్యాం భూపం సూర్యకేతుమభిషిచ్య మహాప్రభమ్. 24

భా: వారి వంశమున బృహన్నలరాజులు జన్మించిరి. వారిలో శ్రేష్ఠుడగు మనువును అయోధ్యకు రాజుగ చేసి శ్రీహరి మధురా నగరమునకు వెళ్ళెను. అచ్చట వారు ప్రతిభా సంపన్నుడగు సూర్యకేతువును మధురకు రాజుగ చేసిరి.

భూపం చక్రే తతో గత్వా దేవాపిం వారణావతే
అవి స్థలం వృకస్థలం మాకందంచ గజాహ్వాయమ్. 25

పంచదేశేశ్వరం కృత్వా హరిః శంభలమాయయౌ
శౌంభం పౌండ్రం పులిందం చ సురాష్ట్రం మగధం స్తథా
కవి ప్రాజ్ఞసుమంతేభ్యః ప్రదదౌ భ్రాతృవత్సలః. 26

భా: పిమ్మట శ్రీహరి వారణావతము చేరి దేవాపిని అవిస్థల, వృకస్థల, మాకంద, హస్తినాపురములను ఐదుదేశములకు అధిపతిగ చేసి శంభలదేశమునకు వచ్చెను. సోదరప్రేమ కల్గిన నారాయణుడు కవి, ప్రాజ్ఞ, సుమంతులను శౌంభ, పౌండ్ర, పులింద, సురాష్ట్ర, మగధ దేశములను దానము చేసెను.

కీకటుం మధ్య కర్ణాటుమంధ్ర మోఢ్రం కలింగకమ్
అంగం వంగం స్వగోత్రేభ్యః ప్రదదౌ జగదీశ్వరః. 27
స్వయం శంభలమధ్యస్థః కజ్కకేన కలాపకాన్
దేశం విశాఖయూపాయ ప్రాదాత్ కల్కిః ప్రతాపవాన్. 28
చోలబర్బర కర్వాఖ్యాన్ ద్వారకాదేశమధ్యగాన్
పుత్రేభ్యః ప్రదదౌ కల్కిః కృతవర్మ పురస్కృతాన్. 29

భా: పిమ్మట జగదీశ్వరుడు తన వంశీయులకు కీకట, మధ్య కర్ణాట, ఆంధ్ర, ఓఢ్ర, అంగ, వంగ దేశముల నిచ్చెను. అటు తరువాత శంభలదేశమందుండి కల్కి విశాఖయూపునకు కజ్కక, కలాపక దేశముల నిచ్చెను. తరువాత కల్కి కృతవర్మ మున్నగు పుత్రులకు ద్వారకా దేశమందలి చోల, బర్బర, కర్బ్రప్ర దేశములను ఇచ్చెను.

పిత్రే ధనాని రత్నాని దదౌ పరమభక్తితః
ప్రజాః సమాశ్వాస్య హరిః శంభలగ్రామవాసినః. 30
పద్మయా రమయా కల్కిః గృహస్థో ముముదే భృశమ్
ధర్మశ్చతుష్పాదభవత్ కృతపూర్ణం జగత్త్రయమ్. 31

భా: శ్రీహరి పరమభక్తితో తన తండ్రికి ధనరత్నముల నిచ్చి శంభలగ్రామవాసులను ఊఱడించి రమాపద్మలతో గృహస్థాశ్రమమున సంతోషముగ నుండెను. ముల్లోకములలో ధర్మము నాలుగు పాదములతో నడుచుచు కృతయుగము పూర్ణస్థితి నొందెను.

దేవా యథోక్తఫలదాశ్చరంతి భువి సర్వతః
సర్వశస్యా వసుమతీ హృష్టపుష్ట జనావృతా
శాఠ్యచౌర్యానృతైర్హీనా ఆధివ్యాధి వివర్జితా. 32

విప్రావేదవిదః సుమఙ్గలయుతా నార్యస్తు చార్యావ్రతైః
పూజాహోమపరాః పతివ్రతధరాః యాగోద్యతాః క్షత్రియాః
వైశ్యా వస్తుషు ధర్మతో వినిమయైః శ్రీవిష్ణుపూజాపరాః
శూద్రాస్తు ద్విజసేవనాద్ధరికథాలాపాః సపర్యాపరాః. **33**

భా: దేవతలు యథోచిత ఫలముల నిచ్చుచు భూమండలమున తిరుగసాగిరి. భూమి సస్యశ్యామల మాయెను. అందరు ఆనందముగ నుండిరి. మోసము, దొంగతనము, అసత్యభాషణ మనునవి లేవు. జనులు ఆధివ్యాధులు తొలగినవారైరి. బ్రాహ్మణులు వేదవేత్తలైరి. స్త్రీలు సుమఙ్గలులై వ్రతాది పుణ్యకార్యముల నాచరించుచు, పూజాహోమతత్పరులై పతివ్రతలైరి. క్షత్రియులు యజ్ఞ ముల నాచరించిరి. వైశ్యులు విష్ణు సేవాతత్పరులై ధర్మమార్గమున క్రయవిక్రయములు చేయ సాగిరి. శూద్రులు బ్రాహ్మణులను సేవించుచు శ్రీమన్నారాయణుని గుణములను కీర్తించుచు జీవనము గడిపిరి.

ఇతి శ్రీ కల్కి పురాణేఽను భాగవతే భవిష్యే తృతీయాంశే
విషకన్యామోక్ష కృత ధర్మ ప్రవృత్తి కథనం నామ
చతుర్దశోఽధ్యాయః

ఇది భాగవతానుబంధము, భవిష్యమునగు
శ్రీ కల్కి పురాణమున తృతీయాంశమున
విషకన్యా మోక్షకృత ధర్మప్రవృత్తి కథన మను
చతుర్దశాధ్యాయము.



# కల్కిపురాణము

## తృతీయాంశము-పంచ దశాధ్యాయము

శౌనక ఉవాచ......

శశిధ్వజో మహారాజః స్తుత్వా మాయాం గతః కుతః
కావా మాయాస్తుతిః సూత వద తత్త్వవిదాం వర
యా త్వత్కథా విష్ణుకథా వక్తవ్యా సావిశుద్ధయే. 1

సూత ఉవాచ......

శృణుధ్వం మునయః సర్వే మార్కండేయాయ పృచ్ఛతే
శుకః ప్రాహ విశుద్ధాత్మా మాయాస్తవమనుత్తమమ్. 2

భా: శౌనకుడు పలికెను. ఓసూత! శశిధ్వజుడను మహారాజు మాయను స్తోత్రము చేసి ఎక్కడికి వెడలెను? మాయాస్తుతి ఎట్టిది? తత్త్వజ్ఞానము గలవారిలో శ్రేష్ఠుడవగు నీవు పాపవిముక్తి కొఱకు మాయాకథ, విష్ణుకథ చెప్పవలసినదని సూతిని అడిగెను. సూతుడు పలికెను. ఓమనులార! మహర్షి మార్కండేయుడు అడుగగ విశుద్ధాత్మయగు శుకము మాయాస్తవమును గూర్చి చెప్పెను. దానిని మీకు చెప్పెదను వినుడు.

తచ్ఛృణుష్వ ప్రవక్ష్యామి యథాధీతం యథాశ్రుతమ్
సర్వకామప్రదం నృణాం పాపతాపవినాశనమ్. 3

శుక ఉవాచ......

భల్లాటనగరం త్యక్త్వా విష్ణుభక్తః శశిధ్వజః
ఆత్మ సంసారమోక్షాయ మాయాస్తవమలం జగౌ. 4

భా: దేనిని వినుటవలన చదువుట వలన సర్వపాపతాపములు దూరమగునో సమస్త కోరికలు నెరవేరునో అట్టి మాయాస్తవమును చెప్పెదను. శుకము పలికెను. విష్ణు భక్తుడగు శశిధ్వజుడు భల్లాటనగరమును విడిచి సంసారబంధముల నుండి మోక్షము కొఱకు మాయను స్తోత్రము చేసెను.

శశిధ్వజ ఉవాచ.....

ఓం హ్రీంకారాం సత్త్వసారాం విశుద్ధాం
బ్రహ్మాదీనాంమాతరం వేదబోధ్యామ్
తన్వీం స్వాహాం భూతతన్మాత్రకక్షాం
వందే వంద్యాందేవగంధర్వసిద్ధైః 5
లోకాతీతాం ద్వైతభూతాం సమీడే
భూతైర్భవ్యాంవ్యాససామాసికాద్యైః
విద్వద్గీతాం కాలకల్లోల లోలాం
లీలాపాఙ్గ-క్షిప్త సంసార దుర్గామ్. 6

భా: శశిధ్వజుడు పలికెను. హ్రీంకార స్వరూపము, సత్త్వగుణసారము, విశుద్ధమగు రూపము గలది, బ్రహ్మ విష్ణుమహేశ్వరులకు జనని, వేదములచే తెలియబడునది, భూతములు, తన్మాత్రలు కక్షయందుగలది, దేవగంధర్వ సిద్ధులచే పూజింపబడునది, సూక్ష్మస్వాహారూపిణియగు మాయను నమస్కరించు చున్నాను. లోకములకతీతమైనది, ద్వైతస్వరూపము, వ్యాసాది మహర్షులచే నమస్కరింపబడునది, విద్వాంసులచే గానము చేయబడునది, కాలమనెడి సముద్రకెరటములలో విహరించునది, విలాసమయములగు చూపులచే సర్వ ప్రపంచమును సంసారబంధములో పడవేయునదగు మాయకు నమస్కారము.

పూర్ణాం ప్రాప్యాం ద్వైతలభ్యాం శరణ్యా
మాద్యేశేషే మధ్యతో యా విభాతి
నానారూపైర్దేవతిర్యఙ్ మనుష్యై
స్తామాధారాంబ్రహ్మరూపాం నమామి. 7
యస్యా భాసా త్రిగజద్భాతి భూతైర్న భాత్యే త్త దభావే విధాతుః
కాలోదైవం కర్మ చోపాధయో యే తస్యా భాసా తాం విశిష్టాం నమామి. 8

భా: ద్వైతభావముచే ఉపాసన చేసిన పొందదగినది, పూర్ణస్వరూపురాలు, సమస్త ప్రాణులనాశ్రయించినది, సృష్టి ఆది, మధ్య, అంతములలో విరాజిల్లునది, దేవ, మనుష్య, పశు పక్ష్యాదులుగ విభక్తమైనది, సమస్త ప్రపంచమున కాధారము, బ్రహ్మస్వరూపిణి యగు నీకు నమస్కారము. నీ ప్రకాశముచే ముల్లోకములు పంచమహాభూతములతో భాసిల్లుచున్నవి. నీ ప్రకాశము లేకుండగ విధాతయొక్క ఉపాధులైన కాలము దైవము కర్మ మున్నగు భావములు

ప్రకాశించవు. అట్టి తేజస్సంపన్నురాలగు నీకు నమస్కారము.

భూమౌ గంధో రసతాఽప్సు ప్రతిష్ఠా
రూపం తేజస్యేవ వాయౌ స్పృశత్వమ్
ఖే శబ్దో వా యచ్చిదాభాతి నానా
తామభ్యేతాం విశ్వరూపాం నమామి. 9

సావిత్రీత్వం బ్రహ్మరూపా భవానీ
భూతేశస్య శ్రీపతేః శ్రీస్వరూపా
శచీ శక్రస్యాపి నాకేశ్వరస్య పత్నీ
శ్రేష్ఠా భాసి మాయే జగత్సు. 10

భా: భూమి యందు గంధముగ, జలమందు రసముగ, తేజస్సు నందు రూపముగ, వాయువు నందు స్పర్శగ, ఆకాశ మందు శబ్దముగ ఇట్లు అనేక రూపములుగ భాసించుచు అంతట వ్యాపించిన విశ్వరూపిణియగు మాయకు నమస్కారము. ఓమాయ! నీవు బ్రహ్మరూపిణియగు సావిత్రివి, భూతనాథుని భవానివి; నారాయణుని లక్ష్మీదేవివి, స్వర్గాధిపతియగు దేవేంద్రుని భార్య శచీదేవివియై సమస్తలోకముల యందు సర్వోత్కృష్టముగ ప్రకాశించు చున్నావు.

బాల్యే బాలా యువతీ యౌవనేత్వం వార్ధక్యే యా స్థవిరా కాలకల్పా
నానాకారైర్యాగ యోగైరుపాస్యా జ్ఞానాతీతా కామరూపావిభాసి. 11

వరేణ్యా త్వం వరదా లోకసిద్ధ్యా సాధ్వీ ధన్యా లోకమాన్యా సుకన్యా
చండీ దుర్గా కాలికా కాలికాఖ్యా నానాదేశే రూపవేషైర్విభాసి. 12

భా: బాల్యావస్థలో బాలవు, యౌవనమున యువతివి, వార్ధక్యమున ముసలిదానివై కాలవశముచే నానారూపములతో భాసించెదవు. యాగాది క్రియలచే ఉపాసింపబడు దానివి. జ్ఞానమునకతీతమై, కామరూపిణివై భాసించు నీకు నమస్కారము. సర్వశ్రేష్ఠురాలగు నీవు ఉపాసకులకు వరములిచ్చుదానివి, సాధ్వివి, ధన్యురాలవు, లోకములచే సమ్మానింపబడుదానివి, సుకన్యవు, చండి, దుర్గ, కాలిక మున్నగు బహురూపములతో, బహువేషములతో అనేక దేశములయందు ప్రకాశించు చున్నావు.

తవ చరణసరోజం దేవి! దేవాదివంద్యం
యది హృదయసరోజే భావయంతీహ భక్త్యా
శ్రుతియుగకుహరే వా సంశ్రుతం ధర్మసంప
జ్జనయతి జగదాద్యే సర్వసిద్ధిఞ్చ తేషామ్. 13

మాయాస్తవమిదం పుణ్యం శుకదేవేన భాషితమ్
మార్కండేయాదవాప్యాపి సిద్ధిం లేభే శశిధ్వజః. 14
కోకాముఖే తపస్తప్త్వా హరిం ధ్యాత్వా వనాంతరే
సుదర్శనేన నిహతో వైకుంఠం శరణం యయౌ. 15

భా: జగత్తుల కాద్యురాలగు ఓదేవి! దేవాదులచే నమస్కరింపబడు నీ పాదపద్మములను హృదయకమలమందు భక్తితో భావన చేసిన లేక కర్ణకుహరమున నీ నామమును వినిన వారికి ధర్మసంపద, సర్వకార్య సిద్ధి కలుగును. శుకదేవునిచే చెప్పబడిన మాయాస్తోత్రమును మార్కండేయుని వలన పొంది శశిధ్వజుడు మోక్షమును పొందెను. కోకాముఖ స్థానమున తపమాచరించి, నారాయణుని ధ్యానించి సుదర్శన చక్రముచే నిహతుడై శశిధ్వజుడు వైకుంఠమును పొందెను.

ఇతి శ్రీ కల్కి పురాణేఽను భాగవతే భవిష్యే తృతీయాంశే
మాయాస్తవం నామ
పంచదశోఽధ్యాయః

ఇది భాగవతానుబంధము, భవిష్యమునగు
శ్రీ కల్కి పురాణమున తృతీయాంశమున
మాయాస్తవమను
పంచదశాధ్యాయము.



# కల్కిపురాణము

## తృతీయాంశము - షోడశాధ్యాయము

సూత ఉవాచ

ఏతద్వః కథితం విప్రాః శశిధ్వజ విమోక్షణమ్
కల్కేః కథామప్రతిమాం శృణ్వంతు విబుధర్షభాః. 1
వేదో ధర్మః కృతయుగం దేవా లోకాశ్చరాచరాః
హృష్టాః పుష్టాః సుసంతుష్టాః కల్కౌ రాజని చాభవన్. 2

భా: సూతుడు పలికెను. ఓ బ్రాహ్మణులార! నేను మీకు శశిధ్వజుని మోక్షవృత్తాంతమును చెప్పితిని. పండితశ్రేష్ఠులార! కల్కి యొక్క అద్భుత వృత్తాంతమును చెప్పెదను వినుడు. కల్కి రాజు కాగా వేదము, ధర్మము, కృతయుగము, దేవతలు, చరాచరములగు సమస్త లోకములు మిక్కిలి సంతోషించినవి.

నానాదేవాదిలింగేషు భూషణై ర్భూషితేషు చ
ఇంద్రజాలికవద్వృత్తి కల్పకాః పూజకా జనాః. 3
న సంతి మాయా మోహాఢ్యాః పాఖండాః సాధువంచకాః
తిలకాచితసర్వాంగాః కల్కౌ రాజని కుత్రచిత్. 4

భా: కల్కి రాజుకాగా అనేక ఆభరణములచే అలంకరింపబడిన వివిధ దేవతా మూర్తుల యెడల ఇంద్రజాలికుల వలె వ్యవహరించెడి పూజారులుగాని, సత్పురుషులను వంచించెడి సర్వావయవముల యందు తిలక ధారణ చేసిన, మాయామోహముతో సంపన్నులగు పాఖండులు గాని లేరు.

శంభలే వసత స్తస్య పద్మయా రమయా సహ
ప్రాహ విష్ణుయశాః పుత్రం దేవాన్ యష్టుం జగద్ధితాన్. 5
తచ్ఛ్రుత్వా ప్రాహ పితరం కల్కిః పరమహర్షితః
వినయావనతో భూత్వా ధర్మకామార్థసిద్ధయే. 6

భా: శంభల గ్రామమున పద్మ, రమలతో నివసించు కల్కితో లోకములకు హితమును

కల్గించు దేవతలకు యజ్ఞయాగాదులను నిర్వర్తించవలెనని విష్ణుయశస్సు పల్కెను. తండ్రి మాటలను వినిన కల్కి పరమానంద భరితుడై వినయముగ ఇట్లు పలికెను. 'ధర్మ, అర్థ, కామ సిద్ధి కొఱకు-----------

రాజసూయైర్వాజపేయై రశ్వమేధైర్మహామఖైః
నానాయాగైః కర్మతంత్రైరీజే క్రతుపతిం హరిమ్. 7
కృపరామ వశిష్ఠాద్యైర్వ్యాసధౌమ్యాకృతవ్రణైః
అశ్వత్థామ మధుచ్ఛందో మందపాలైర్మహాత్మనః. 8
గంగాయమున యోర్మధ్యే స్నాత్వావభృథ మాదరాత్
దక్షిణాభిః సమభ్యర్చ్య బ్రాహ్మణాన్ వేదపారగాన్. 9

భా: రాజసూయము, వాజపేయము, అశ్వమేధము మున్నగు వివిధములగు యజ్ఞములతో, యజ్ఞపతియగు హరిని పూజించెదను. పిమ్మట కల్కి యజ్ఞ కర్మలననుష్ఠించి కృపాచార్య, పరశురామ, వశిష్ఠ, వ్యాస, ధౌమ్య, అకృతవ్రణ, అశ్వత్థామ, మధుచ్ఛంద, మందపాలాది మహర్షులను, వేదపారంగతులగు బ్రాహ్మణులను పూజించి యజ్ఞదీక్ష యొక్క అంతమున గంగాయమునల నడుమ దీక్షాంత స్నానమాచరించి దక్షిణలతో సత్కరించెను.

చర్వ్యైశ్చోష్యైశ్చ పేయైశ్చ పూగశష్కులియావకైః
మధుమాంసై ర్మూల ఫలైరన్యైశ్చ వివిధైః ద్విజాన్. 10
భోజయామాస విధివత్ సర్వకర్మ సమృద్ధిభిః
యత్రవహ్నిర్వృతః పాకే వరుణో జలదో మరుత్. 11

భా: భక్ష్యము, చోష్యము, పేయము, పూగ, శష్కులియావకములు, మధు, మాంస, కందమూల ఫలములు మున్నగు పదార్థములతో బ్రాహ్మణులకు విధిపూర్వకముగ బోజనము పెట్టెను. యజ్ఞము యొక్క సర్వాంగములు సంపన్నము లాయెను. ఇందు వహ్ని పాకక్రియను నిర్వర్తించ వరుణుడు జలము నిచ్చెను.

పరివేష్టా ద్విజాన్ కామైః సదన్నాద్యైరతోషయత్
వాద్యైః నృత్యైశ్చ గీతైశ్చ పితృయజ్ఞమహోత్సవైః. 12
కల్కిః కమలపత్రాక్షః ప్రహర్షం ప్రదదో వసు
స్త్రీబాలస్థవిరాదిభ్యః సర్వేభ్యశ్చ యథోచితమ్. 13

భా: వాయువు వడ్డించువాడు. కల్కి మంచి ఆహారము, వాద్యనృత్యగీతములు, పితృయజ్ఞ

మహోత్సవములచే ద్విజులను సంతోషపరచెను. స్త్రీ, బాల, వృద్ధులందరికి యథోచితముగ సంతోషముతో ధనము నిచ్చెను.

రంభాతాలధరా నందీ హూహూర్గాయతి నృత్యతి
దత్వాదానాని పాత్రేభ్యో బ్రాహ్మణేభ్యః స ఈశ్వరః 14
ఉవాస తీరే గంగాయాః పితృవాక్యానుమోదితః
సభాయాం విష్ణుయశసః పూర్వరాజకథాః ప్రియాః. 15
కథయంతో హసంతశ్చ హర్షయంతో ద్విజా బుధాః
తత్రాగతస్తుంబురుణా నారదః సురపూజితః. 16

భా: రంభ నృత్యము చేయ, నంది తాళము వేయ, గంధర్వులు గానము చేసిరి. జగదీశ్వరుడగు కల్కి యోగ్యులగు బ్రాహ్మణులకు దానమిచ్చెను. పిమ్మట తండ్రి అనుమతి తీసుకొని గంగాతీరమున నివసించెను. విష్ణుయశస్సు సభలో ద్విజులు, పండితులు పూర్వరాజుల కథలను చెప్పుకొనుచు ఆనందముగ నుండు సమయమున తుంబురునితో కూడ దేవపూజితుడగు నారదుడు అచ్చటకు వచ్చెను.

తం పూజయామాస ముదా పిత్రా సహ యథావిధి
తౌ సంపూజ్య విష్ణుయశాః ప్రోవాచ వినయాన్వితః
నారదం వైష్ణవం ప్రీత్యా వీణాపాణిం మహామునిమ్. 17

విష్ణుయశా ఉవాచ.....

అహోభాగ్య మహో భాగ్యం మమ జన్మశతార్జితమ్
భవద్విధానాం పూర్ణానాం యన్మే మోక్షాయ దర్శనమ్. 18

భా: విష్ణుయశస్సు ప్రసన్నహృదయుడై ఇద్దరు మహర్షులను యథోచితముగ పూజించి వినయాన్వితుడై విష్ణుభక్తుడు, వీణాపాణి, మహామునియగు నారదునితో ఇట్లు పలికెను. నాభాగ్యము చెప్పనలవి కానిది. నూరుజన్మల పుణ్యముచే కలుగు మీ దర్శన భాగ్యము మోక్షమునకు దారి చూపును.

అద్యాగ్నయశ్చ సుహుతాస్తృప్తాశ్చ పితరః పరమ్
దేవాశ్చ పరిసంతుష్టాస్తవాపేక్షణ పూజనాత్. 19
యత్పూజాయాం భవేత్ పూజ్యో విష్ణుర్యన్మమ దర్శనమ్
పాపసంఘం స్పర్శనాచ్చ కిమహో సాధుసంగమః. 20

భా: మీ దర్శన భాగ్యము వలన, మిమ్ములను పూజించుట వలన అగ్నికార్యములు సఫలమైనవి. పితృదేవతలు తృప్తిపొందిరి. దేవతలు సంతోషించిరి. (అగ్నికి ఆహుతి ఇచ్చినవి సఫలమైనవి) ఎవరిని పూజించుట వలన విష్ణువును పూజించినట్లగునో, ఎవరి స్పర్శచే సకల పాపములు తొలగునో, ఎవరి దర్శనము మోక్షప్రదాయకమో అట్టి సాధు పురుషుల సమాగమము అత్యద్భుతము.

సాధూనాం హృదయం ధర్మో వాచోదేవాః సనాతనాః
కర్మక్షయాణి కర్మాణి యతః సాధుర్హరిః స్వయమ్. 21
మన్యే నభౌతికో దేహో వైష్ణవస్య జగత్త్రయే
యథావతారే కృష్ణస్య సతో దుష్టవినిగ్రహే. 22

భా: సత్పురుషుల హృదయము ధర్మము. వాక్కు సనాతన దేవతలు. వారి కర్మలు కర్మనాశకములు. కనుక సత్పురుషులు సాక్షాత్తు శ్రీహరి స్వరూపులు. దుష్ట శిక్షణ కొఱకు కృష్ణావతారమున అవతరించిన కృష్ణుని వంటి వైష్ణవ భౌతికశరీరము మరియొకటి ముల్లోకములలోనూ లేదు.

పృచ్ఛామి త్వామతో బ్రహ్మన్ మాయాసంసారవారిధౌ
నౌకాయాం విష్ణుభక్త్యాచ కర్ణధారోఽసి పారకృత్. 23
కానాహం యాతనాగారాన్నిర్వాణ పదముత్తమమ్
లప్స్యామీహ జగద్బంధో కర్మణా శర్మ తద్వద. 24

భా: ఓ బ్రహ్మర్షి! మాయచే ఆవరింపబడిన సంసారసాగరమును విష్ణు భక్తి యనెడి నౌకతో దాటెడి నావికులగు మిమ్ములను అడుగుచున్నాను. ఓ జగద్బంధు! నేను సంసారయాతనల నుండి తొలగి ఉత్తమమగు మోక్షమును పొందుటకు ఏ కర్మల నాచరించవలెను?

నారద ఉవాచ.....

అహో బలవతీ మాయా సర్వాశ్చర్యమయీ శుభా
పితరం మాతరం విష్ణు ర్నైవ ముంచతి కర్హిచిత్. 25
పూర్ణో నారాయణో యస్య సుతః కల్కి ర్జగత్పతిః
తం విహాయ విష్ణుయశా మత్తో ముక్తిమభీప్సతి. 26
వివిచ్యేత్థం బ్రహ్మసుతః ప్రాహ బ్రహ్మయశస్సుతమ్
వివిక్తే విష్ణుయశసం బ్రహ్మసంపద్వివర్ధనమ్. 27

భా: నారదుడు పలికెను. అందరిని ఆశ్చర్యపరచు మాయ ఎంత బలవత్తరమైనది! తల్లిని, తండ్రిని, చివరలకు విష్ణువును కూడ మాయ విడిచిపెట్టదు. జగత్పతియగు విష్ణుమూర్తి పుత్రునిగ కల విష్ణు యశస్సు తన పుత్రుని విడిచి నావలన ముక్తిని పొందవలెనని కోరుచున్నాడని ఆలోచించి బ్రహ్మసుతుడగు నారదుడు బ్రహ్మయశస్సు పుత్రుడగు విష్ణుయశసునితో నిర్జన ప్రదేశమున బ్రహ్మోపదేశమున్నకై ఇట్లు పలికెను.

నారద ఉవాచ.....

దేహావసానే జీవం సా దృష్ట్వా దేహావలంబనమ్
మాయాహ కర్తుమిచ్ఛంతం యస్మై తచ్ఛృణు మోక్షదమ్.
వింధ్యాద్రౌ రమణీ భూత్వా మాయోవాచ యథేచ్ఛయా 28

భా: నారదుడు పలికెను. దేహము ధ్వంసము కాగా తిరిగి దేహమును పొందవలెనని కోరు జీవునితో మాయ పలికిన మోక్ష ప్రదములగు మాటలను నీకు చెప్పెదను వినుము. వింధ్యపర్వతము మీద ఇచ్ఛానుసారము స్త్రీరూపమును ధరించి మాయ ఇట్లు పలికెను.

మాయోవాచ.....

అహం మాయా మయాత్యక్తః కథం జీవితుమిచ్ఛసి. 29

జీవ ఉవాచ....

నాహం జీవామ్యహం మాయే కాయేఽస్మిన్ జీవనాశ్రయే
అహమిత్యన్యథా బుద్ధిర్వినా దేహం కథం భవేత్. 30

మాయోవాచ.....

దేహబంధే యథాశ్లేషాస్తథా బుద్ధిః కథం తవ
మాయాధీనాం వినా చేష్టాం విశిష్టాం తే కుతో వద. 31

భా: మాయ పలికెను. నేను మాయను, నిన్ను నేను విడిచితిని. నాచే విడువబడిన నీవు ఎట్లు జీవించుటకు కోరుచున్నావు? జీవుడు పలికెను. ఓమాయ! నేను నీ వలన ( అహం పదార్థము) జీవించుటలేదు. జీవనమున కాశ్రయమగు శరీరమున నేనుంటిని. దేహము లేకుండగ ( అహం) 'నేను' అను భేదజ్ఞాన మెట్లు కలుగును? మాయ పలికెను. దేహ సంబంధమున్నప్పుడు కలుగు అహంకార బుద్ధి ( భేద జ్ఞానము) దేహనాశము తరువాత ఎట్లు కలుగును? మాయాధీనము చేష్ట. మాయాసంబంధము లేకుండగ చేష్టతో సంబంధమెట్లు కలుగును?

జీవ ఉవాచ.....

మాం వినా ప్రాజ్ఞతా మాయే ప్రకాశవిషయస్పృహా 32

మాయోవాచ.....

మాయయా జీవతి నరశ్చేష్టతే హతచేతనః

నిస్సారః సారవద్భాతి గజభుక్త కపిత్థవత్. 33

భా: జీవుడు పలికెను. ఓమాయ! నేను లేకుండగ నీ ప్రాజ్ఞత ( బుద్ధివైభవము) ప్రకాశించదు. విషయముల యందు ఆసక్తి కలుగదు. మాయ పలికెను. మాయ వలన నరుడు జీవించు చున్నాడు. మాయవలన ఆయా పనులను చేయుచున్నాడు. నిస్సారుడైనను ఏనుగుచే తినబడిన వెలగపండువలె సారవంతముగ కనిపించు చున్నాడు.

జీవ ఉవాచ.....

మమ సంసర్గ జాతా త్వం నానా నామస్వరూపిణీ

మాం వినిందసి కింమూఢే స్వైరిణీ స్వామినం యథా. 34

మమాభావే తవాభావ ప్రోద్యత్ సూర్యే తమోయథా

మామావర్య విభాసి త్వం రవిం నవఘనో యథా. 35

భా: జీవుడు పలికెను. మా సంబంధము వలన నీవు అనేక నామరూపములను ధరించితివి. స్వేచ్ఛగ తిరుగు స్త్రీ స్వామిని నిందించునట్లు నీవు ఏల నన్ను నిందించు చున్నావు? సూర్యుడు ఉదయించిన చీకటి లేనట్లు నేను లేనిచో నీ ఉనికి లేదు. నూతన మేఘములు సూర్యుని ఆచ్ఛాదించి నట్లు నీవు నన్ను ఆవరించి ప్రకాశించు చున్నావు.

లీలా బీజ కుశూలాసి మమ మాయే జగన్మయే

నాద్యంతే మధ్యతోభాసి నానాత్వాదింద్రజాలవత్. 36

ఏవం నిర్విషయం నిత్యం మనోవ్యాపారవర్జితమ్

అభౌతికమజీవఞ్చ శరీరం వీక్ష్య సాఒత్యజత్. 37

భా: జగద్రూపయగు ఓ మాయ! నీవు విలాసములనెడి బీజమునకు కుశూలమవు. ( బాధించుదానవు) సృష్టి ఆది, మధ్య, అంతములలో నానా రూపములుగ ఇంద్రజాలమువలె భాసించెదవు. విషయవ్యాపార రహితము, మానసిక వ్యాపార వర్జితము, అభౌతికము, జీవరహితమగు శరీరమును చూచి మాయ దానిని విడిచెను.

త్యక్త్వా మాం సాద దౌ శాపమితి లోకే తవాప్రియ
న స్థితిర్భవితా కాష్ఠకుడ్యోపమ కథఞ్చన. 38
సా మాయా తవ పుత్రస్య కల్కేర్విశ్వాత్మనః ప్రభోః
తాం విజ్ఞాయ యథాకామం చర గాం హరిభావనః. 39

భా: మాయ నన్ను (జీవుని) విడిచి ఓ అప్రియమ! కాష్ఠకుడ్యము వలె చేతనహీనుడవైన నీకు ఈ లోకమున తిండి ఉనికి లేదని శపించెను. నారదుడు విష్ణుయశశునితో ఓదేవ! నీ పుత్రుడగు కల్కి వలన మాయ పుట్టినది. మాయాతత్త్వమును తెలుసుకొని నారాయణుని ధ్యానించుచు భూమియందు తిరుగుము అని పలికెను.

నిరాశో నిర్మమః శాంతః సర్వభోగేషు నిస్పృహః
విష్ణౌజగదిదం జ్ఞాత్వా విష్ణుర్జగతి వాసకృత్
ఆత్మనాత్మానమావేశ్య సర్వతో విరతో భవ. 40

భా: ఆశ, మమకారములు లేనివాడవై, శాంతుడవై, సమస్త విషయవాసనలను విడిచి సరజగత్తు విష్ణువు యందు కలదు, జగత్తున విష్ణువు నివసించు చున్నాడని తెలుసుకొని జీవాత్మను పరమాత్మతో ఐక్యము చేసి సమస్త కోరికల నుండి విరక్తుడవు కమ్ము.

ఏవం తం విష్ణుయశసమామంత్ర్య చ మునీశ్వరౌ
కల్కిం ప్రదక్షిణీకృత్య జగ్మతుః కపిలాశ్రమమ్. 41
నారదేరితమాకర్ణ్య కల్కిం సుతమనుత్తమమ్
నారాయణం జగన్నాథం వనం విష్ణుయశా యయౌ. 42

భా: విష్ణుయశశుని దగ్గర శలవు తీసుకొని మునీశ్వరులు కల్కికి ప్రదక్షిణ గావించి కపిల మహర్షి ఆశ్రమమునకు వెళ్ళిరి. తన పుత్రుడు కల్కి జగన్నాథుడగు నారాయణుడని నారదుని వలన తెలుసుకొని విష్ణుయశశుడు వనమునకు వెడలెను.

గత్వా బదరి కారణ్యం తపస్తప్త్వా సుదారుణమ్
జీవం బృహతి సంయోజ్య సూర్ణస్తత్యాజ భౌతికమ్. 43
మృతం స్వామినమాలిఙ్గ్య సుమతిః స్నేహ విక్లబా
వివేశ దహనం సాధ్వీ సుపేశైర్దివి సంస్తుతా. 44

భా: విష్ణుయశశుడు బదరి కారణ్యమునకు వెళ్ళి ఘోరముగ తపమాచరించి ఆత్మను పరమాత్మలో ఐక్యము జేసి భౌతిక శరీరమును విడిచెను. మరణించిన స్వామిని ఆలింగనము

చేసుకొని సుమతి ప్రేమచే విహ్వాలురాలై అగ్ని ప్రవేశము చేసెను. దేవలోకమున దేవతలు ఆమెను స్తుతించిరి.

కల్కిః శ్రుత్వా మునిముఖాత్ పిత్రోర్నిర్యాణమీశ్వరః
సబాష్పనయనం స్నేహాత్తయోః సమకరోత్ క్రియామ్. 45
పద్మయా రమయా కల్కిః శంభలే సురవాంఛితే
చకార రాజ్యం ధర్మాత్మా లోకవేదపురస్కృతః. 46

భా: తల్లి దండ్రుల మరణమును మహర్షుల వలన తెలుసు కొనిన కల్కి అశ్రునేత్రుడై ఉత్తర క్రియలను నిర్వర్తించెను. లోకవేదములచే పూజింపబడు ధర్మస్వరూపుడగు కల్కి దేవతలచే కోరబడు శంభలగ్రామమున రమాపద్మలతో కూడి రాజ్యమును పాలించెను.

మహేంద్ర శిఖరాద్రామస్తీర్థపర్యటనాదృతః
ప్రాయాత్ కల్కేర్దర్శనార్థం శంభలం తీర్థతీర్థకృత్. 47
తం దృష్ట్వా సహసోత్థాయ పద్మయా రమయా సహ
కల్కిః ప్రహృష్టో విధివత్ పూజాఞ్చక్రే విధానవిత్. 48

భా: తీర్థములను కూడ పవిత్రము చేయు పరశురాముడు తీర్థ పర్యటన చేయుచు మహేంద్ర శిఖరము నుండి కల్కి దర్శనముకొఱకు శంభల గ్రామమునకు వచ్చెను. పరశురాముని చూచి సంతోషించిన కల్కి వెంటనే లేచి పద్మ రమలతో కూడి విధిపూర్వకముగ పూజించెను.

నానారసైర్గుణమయైర్భోజయిత్వా విచిత్రితే
పర్యంకేఽర్ఘ వస్త్రాఢ్యే శాయయిత్వా ముదం యయౌ. 49
తం భుక్తవంతం విశ్రాంతం పాద సంవాహనైర్గురుమ్
సంతోష్య వినయాపన్నః కల్కిర్మధురమబ్రవీత్. 50

భా: షడ్రసోపేతముగ భోజనము పెట్టి పిమ్మట అమూల్యమగు వస్త్రములతో కూడి పర్యంకమున పరశురాముని పరుండబెట్టెను. భోజనము చేసి విశ్రాంతి తీసుకొను పరశురాముని పాదము లొత్తుచు సంతోషపరచి కల్కి సవినయముగ పలికెను.

తవ పసాదాత్ సిద్ధం మే గురో త్రైవర్గికం చ యత్
శశిధ్వజసుతాయాస్తు శృణు రామనివేదితమ్. 51

ఇతి పతివచనం నిశమ్య రామా
నిజహృదయేప్సిత-పుత్రలాభమిష్టమ్
వ్రతజపనియమైర్యమైశ్చ కైర్వా
మమ భవతీహ ముదాహ జామదగ్న్యమ్. **52**

భా: ఓ ఆచార్య! తమ అనుగ్రహము వలన ధర్మార్థకామములు సిద్ధించినవి. ఓ పరశురామ! శశిధ్వజుని పుత్రికయగు రమ యొక్క విన్నపమును వినుడు. పతివచనములను విన్న రమ సంతుష్టురాలై పరశురామునితో ఏ వ్రత, జప, యమ, నియమములచే హృదయేప్సితుడగు పుత్రుని పొందగలనని అడిగెను.

ఇతి శ్రీ కల్కిపురాణేఽను భాగవతే భవిష్యే తృతీయాంశే
విష్ణుయశసః మోక్షః రామ దర్శనో నామ
షోడశోఽధ్యాయః.

ఇది భాగవతానుబంధము, భవిష్యమునగు
శ్రీ కల్కి పురాణమున తృతీయాంశమున
విష్ణుయశస్సు మోక్షము, రామదర్శనమను
షోడశాధ్యాయము .



# కల్కిపురాణము

## తృతీయాంశము-సప్తదశాధ్యాయము

సూత ఉవాచ.......

జామదగ్న్యః సమాకర్ణ్య రమాం తాం పుత్రగర్ధినీమ్
కల్కేరభిమతం బుద్ధ్వాకార యద్రుక్మిణీవ్రతమ్. 1
వ్రతేన తేన చ రమా పుత్రాఢ్యా సుభగా సతీ
సర్వభోగేన సంయుక్తా బభూవ స్థిరయౌవనా. 2

భా: సూతుడు పలికెను. రమ పుత్రుని కోరుటను మరియు కల్కి అభిమతమును తెలుసుకొని పరశురాముడు ఆమెచే రుక్మిణీ వ్రతమును చేయించెను. వ్రతమాచరించుటచే రమ పుత్రసంపదను పొంది సౌభాగ్యవతియై సర్వభోగములతో కూడి స్థిరయౌవనవతి ఆయెను.

శౌనక ఉవాచ....

విధానం బ్రూహి మే సూత వ్రతస్యాస్య చ యత్ఫలమ్
పురా కేన కృతం ధర్మ్యం రుక్మిణీ వ్రతముత్తమమ్. 3

సూత ఉవాచ......

శృణు బ్రహ్మన్! రాజపుత్రీ శర్మిష్ఠా వార్షపర్వణీ
అవగాహ్య సరోనీరం సోమం హరమపశ్యత. 4

భా: శౌనకుడు పలికెను. ఓ సూత! రుక్మిణీ వ్రత విధానమును తెలుపుడు. వ్రతఫలమేమి? ఈ వ్రతమును పూర్వము ఎవరు ఆచరించిరి? సూతుడు పలికెను. '' నేను సర్వము చెప్పెదను వినుము. ఒకప్పుడు వృషపర్వుని పుత్రికయగు శర్మిష్ఠ సరోవరమున జలక్రీడలాడుచు పార్వతీ పరమేశ్వరులనుచూచెను.

సాసఖీభిః పరివృతా దేవయాన్యా చ సంగతా
శంభుభీత్యా సముత్థాయ పర్యధాద్వసనం ద్రుతమ్. 5

తత్ర శుక్రస్య కన్యాయా వస్త్రవ్యత్యయమాత్మనః
సంలక్ష్య కుపితా ప్రాహ వసనం త్యజ భిక్షుకి. 6

భా: సఖురాంద్రతో, దేవయానితో కూడిన శర్మిష్ఠ పరమేశ్వరభీతితో సరస్సు నుండి బయటకు వచ్చి శీఘ్రముగ బట్ట కట్టుకొనెను. అప్పుడు శుక్రాచార్యుని కూతురగు దేవయాని తనదనుకొని శర్మిష్ఠ వస్త్రమును కట్టుకొనెను. అది చూచి కోపగించిన శర్మిష్ఠ ఓ భిక్షుకి! నా వస్త్రమును విడువుమని గద్దించెను.

ఇతి దానవకన్యా సాదాసీభిః పరివారితా
తాం తస్యా వాససా బద్ధ్వా కూపే క్షిప్త్వా గతాగృహమ్. 7
తాం మగ్నాం రుదంతీం కూపే జలార్థీ నహుషాత్మజః
కరే స్పృశ్య సముద్ధృత్య ప్రాహ కాత్వం వరాననే. 8

భా: దానవకన్యయగు శర్మిష్ఠ దాసీల సహాయముతో దేవయానిని ఆమె వస్త్రముతోనే బంధించి నూతిలోపడవైచి ఇంటికి వెడలిరి. నూతిలో పడవేయబడిన దేవయాని ఏడ్చుచుండగ నీటికొఱకు అటువైపు వచ్చిన నహుషపుత్రుడు యయాతి చేయిపట్టుకొని పైకి తీసి నీవెవరివని ప్రశ్నించెను.

సా శుక్రపుత్రీ వసనం పరిధాయ హ్రియా భియా
శర్మిష్ఠయా కృతం సర్వం ప్రాహరా రాజానమీక్షతీ. 9
యయాతిస్తదభిప్రాయం జ్ఞాత్వాను వ్రజ్య శోభనమ్
ఆశ్వాస్య తాం యయౌ గేహం తస్యాః పరిణయాదృతః. 10

భా: శుక్ర పుత్రి యగు దేవయాని బట్టకట్టుకొని సిగ్గుతో భయముతో రాజును చూచుచు శర్మిష్ఠ చేసినదంతయు చెప్పెను. ఆమె అభిప్రాయమును తెలుసుకొనిన యయాతి దేవయానిని వివాహమాడదలచి, ఆమెకు విశ్వాసము కలుగజేసి తన రాజ్యమునకు తిరిగి వెళ్ళెను.

సా గత్వా భవనం శుక్రం ప్రాహ శర్మిష్ఠయా కృతమ్
తచ్ఛ్రుత్వా కుపితం విప్రం వృషపర్వాహ సాంత్వయన్. 11
దండ్యం మాం దండయ విభో కోపో యద్యస్తి తే మయి
శర్మిష్ఠాం వాప్యపకృతాం కురు యన్మనసేప్సితమ్. 12

భా: దేవయాని ఇంటికి వెళ్ళి తన తండ్రి శుక్రాచార్యునితో శర్మిష్ఠచేసిన దుర్వ్యవహారమును చెప్పెను. అది విని కోపగించిన శుక్రుని వృషపర్వుడు సమాధానపరచుచు ఓమహానుభావ! నామీద

కోపమున్నను, నేను శిక్షార్హుడనైనను నన్ను శిక్షింపుము. అపకారము చేసిన శర్మిష్ఠను ఇచ్ఛానుసారము చేయుమని వేడెను.

రాజానం ప్రణతం పాదే పితుర్దృష్ట్వా రుషాఽబ్రవీత్
దేవయానీ త్వియం కన్యా మమ దాసీ భవత్వితి. 13
సమానీయ తదా రాజా దాస్యే తాం వినియుజ్య సః
యయౌ నిజగృహం జ్ఞానీ దైవం పరమకం స్మరన్. 14

భా: తన తండ్రి శుక్రాచార్యుని పాదములపై పడిన రాజును చూచి దేవయాని కోపముతో మీపుత్రిక శర్మిష్ఠ నాకు దాసి కావలెనని పలెకెను. జ్ఞానియగు రాజు దైవము బలీయమని తలచి తన కూతురును దాసిగ నియోగించి తన యింటికి వెడలెను.

తతః శుక్రస్తమానీయ యయాతిం ప్రతిలోమకమ్
తస్మై దదౌ తాం విధివద్దేవయానీం తయా సహ. 15
దత్త్వా ప్రాహ నృపం విప్రోఽప్యేనాం రాజసుతాం యది
శయనే హ్వాయసే సద్యో జరా త్వా ముపభోక్ష్యతి. 16

భా: పిమ్మట శుక్రాచార్యుడు రాజు యయాతిని రప్పించి ప్రతిలోమ వివాహము ప్రకారము విధిపూర్వకముగ దేవయానిని దాసి శర్మిష్ఠతో కూడ దానము చేసెను. శర్మిష్ఠను దాసిగ ఇచ్చుసమయమున శుక్రాచార్యుడు యయాతితో నీవు శర్మిష్ఠను శయనమందిరమునకు ఆహ్వానించిన తక్షణమే ముసలితనమును పొందెదవని చెప్పెను.

శుక్రస్యైతద్వచః శ్రుత్వా రాజా తం వరవర్ణినీమ్
అదృశ్యాం స్థాపయామాస దేవయాన్యనుగాం భియా. 17
సా శర్మిష్ఠా రాజపుత్రీ దుఃఖశోకభయాకులా
నిత్యం దాసీశతాకీర్ణా దేవయానీం తు సేవతే. 18

భా: శుక్రాచార్యుని వచనములను వినిన యయాతి భయముతో దేవయాని సేవకురాలగు సౌందర్యవతి శర్మిష్ఠను తనకు కనబడనట్లు తగు ఏర్పాటు చేసెను. దుఃఖ, శోక, భయముతో వ్యగ్రురాలగు శర్మిష్ఠ నూరుదాసీలతో కూడి ప్రతి దినము యయాతిని సేవించు చుండెను.

ఏకదా సా వనగతా రుదతీ జాహ్నవీ తటే
విశ్వామిత్రం మునిం సా తం దదృశే స్త్రీభిరావృతమ్. 19
వ్రతినం పుణ్యగంధాభిః సురూపాభిః సువాసితమ్
కారయంతం వ్రతం మాల్యధూపదీపోపహారకైః. 20

భా: ఒకసారి శర్మిష్ఠ గంగా తీరమున తన దుఃస్థితికి ఏడ్చుచు, అంతలో స్త్రీలతో కూడిన విశ్వామిత్ర మహర్షిని చూచెను. వ్రతదీక్ష కల్గిన మహర్షి సుగంధపదార్థములతో నలంకరింపబడిన, రూపవతులగు స్త్రీలచే ధూపదీపమాల్యాదులచే ప్రసిద్ధమగు వ్రతమును చేయించసాగెను.

నిర్మాయాష్టదళం పద్మం వేదికాయాం సుచిహ్నితమ్
రంభాపోతైశ్చతుర్భిస్తు చతుష్కోణం విరాజితమ్. 21
వాససా నిర్మితగృహే స్వర్ణపట్టైర్విచిత్రితే
నిర్మితం శ్రీవాసుదేవం నానారత్నవిఘట్టితమ్. 22

భా: విశ్వామిత్రుడు వేదికపై అష్టదళపద్మమును నిర్మించెను. నాలుగు కోణములు నాలుగు అరటిచెట్లతో శోభిల్లుచుండెను. స్వర్ణమయములగు పట్టుబట్టలతో అలంకరింపబడిన వస్త్ర నిర్మితగృహమున నానారత్నములతో పొదగబడిన శ్రీవాసుదేవ మూర్తిని (నిల్పి పూజించుచుండెను.)

పౌరుషేణ చ సూక్తేన నానాగంధోదకైః శుభైః
పంచామృతైః పంచగవ్యైర్యథామంత్రైర్ద్విజేరితైః. 23
స్నాపయిత్వా భద్రపీఠే కర్ణికాయాం ప్రపూజయేత్
పంచభిర్దశభిర్వాపి షోడశైరుపచారకైః. 24

భా: (పూజా విధానము) పురుషసూక్త విధానము ననుసరించి శుభములగు వివిధ గంధోదకములతో, పంచామృతములతో (ఆవుపాలు, పెరుగు, నెయ్యి, చక్కెర, తేనె) పంచగవ్యములతో (గోవుల వలన కలుగు పాలు, పెరుగు, నేయి, పంచితము, పేడ) బ్రాహ్మణులు మంత్రములుచ్చరించ చుండ భద్రపీఠమున కర్ణికమీద (పద్మబీజకోశము) వాసుదేవమూర్తిని స్నానము చేయించి పంచోపచారములు (స్నానము, పూజ, నైవేద్యము, ప్రదక్షిణము, నమస్కారము) లేదా షోడశోపచారములు (ఆవాహనము, ఆసనము, పాద్యము, అర్ఘ్యము, ఆచమనీయము, అభిషేకము, వస్త్రము, యజ్ఞోపవీతము, గంధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము, ప్రదక్షిణము, నమస్కారము) లేక దశోపచారములతో పూజించవలెను.

పాద్యమధ్వశ్రమహరం శీతలం సుమనోహరమ్
పరమానందజనకం గృహాణ పరమేశ్వర. 25
దూర్వాచందన గంధాఢ్య మర్ఘ్యం యుక్తం ప్రయత్నతః
గృహాణ రుక్మిణీనాథ ప్రసన్నస్త్వ మమ ప్రభో. 26

భా: ఓపరమేశ్వర! మార్గశ్రమను పోగొట్టు శీతలము, సుమనోహరము, ఆనందజనకమగు పాద్యము (పాదముల కొఱకైన జలము) స్వీకరింపుము. ఓ రుక్మిణీనాథ! మాచే సమర్పింపబడు దూర్వా (గఱికగడ్డి) చందన గంధములతో సంపన్నమగు అర్ఘ్యమును ( పూజకొఱకైన జలము) స్వీకరించి మమ్మ అనుగ్రహింపుము.

నానాతీర్థోద్భవం వారి సుగంధి సుమనోహరమ్

గృహాణాచమనీయం త్వం శ్రీనివాస శ్రియా సహ. 27

నానాకుసుమగంధాఢ్యం సూత్రగ్రథితముత్తమమ్

వక్షః శోభాకరం చారు మాల్యం నయ సురేశ్వర. 28

భా: ఓ శ్రీనివాస! నానా తీర్థముల నుండి సంగ్రహింపబడిన సుగంధయుక్తము, సుమనోహరము, ఆచమన్నార్థమగు జలమును సమర్పించు చున్నాను. లక్ష్మీదేవితో కూడి స్వీకరించ వలసినది. ఓ సురేశ్వర! సూత్రమందు గ్రుచ్చబడిన వివిధసుగంధ పుష్పములతో మనోహరమగు, వక్షస్థలమునకు శోభను కల్గించెడి మాలను స్వీకరింపుము.

తంతుసంతాన సంధానరచితం బంధనం హరే

గృహాణావరణం శుద్ధం నిరావరణ సప్రియ. 29

యజ్ఞసూత్రమిదం దేవ! ప్రజాపతి వినిర్మితమ్

గృహాణ వాసుదేవ త్వం రుక్మిణ్యా రమయాసహ. 30

భా: ఓ హరి! చుట్టుకొనుటకశక్యమైనను తంతు సముదాయముచే రచింపబడిన శుద్ధమగు ఆవరణ వస్త్రమును లక్ష్మీసహితుడవై గ్రహింపుము. ఓ వాసుదేవ! రుక్మిణీ రమలతో గూడిన వాడవై ప్రజాపతిచే చేయబడిన యజ్ఞోపవీతమును గ్రహింపుము.

నానారత్నసమాయుక్తం స్వర్ణముక్తా విఘట్టితమ్

ప్రియయా సహ దేవేశ గృహాణాభరణం మమ. 31

దధిక్షీరగుడాన్నాది పూపలడ్డుక ఖండకాన్

గృహాణ రుక్మిణీనాథ సనాథంకురు మాం ప్రభో. 32

భా: ఓ దేవేశ! నానారత్నములతో కూడినవి, ముత్యములతో కూర్చబడిన స్వర్ణమయములగు ఆభరణములను భార్యతో కూడి స్వీకరింపుము. ఓ రుక్మిణీనాథ! పెరుగు, పాలు, బెల్లము, అన్నము, అపూపము, లడ్డు, ఖండకములు స్వీకరించి నన్ను సనాథుని చేయుము.

కర్పూరాగురుగంధాఢ్యం పరమానందదాయకమ్

ధూపం గృహాణ వరద వైదర్భ్యా ప్రియయా సహ. 33

భక్తానాం గేహశక్తానాం సంసారధ్వాంతనాశనమ్
దీపమాలోకయ విభో! జగదాలోకనాదర. 34

శ్యామసుందర! పద్మాక్ష! పీతాంబర! చతుర్భుజ!
ప్రపన్నం పాహి దేవేశ! రుక్మిణ్యా సహితాచ్యుత. 35

భా: ఓ పరప్రదాత! కర్పూర, అగురు, గంధములతో సుభగమైన, పరమానందదాయకమగు ధూపమును రుక్మిణీ సనాథుడవై స్వీకరింపుము. ఓ పరమేశ్వర! లోకములకు వెలుగునిచ్చువాడ! సంసారమందు ఆసక్తులయిన భక్తులయొక్క సంసారమనెడి చీకటిని నాశముచేయు దీపమును చూపు చున్నాము నీ కటాక్షములను ప్రసరింపజేయుము. ఓ శ్యామ సుందర!, పద్మాక్ష!, పీతాంబర!, చతుర్భుజ!, దేవేశ! రుక్మిణీ సహితుడవై మమ్ములను కాపాడుము.

ఇతి తాసాం వ్రతం దృష్ట్వా మునిం నత్వా సుదుఃఖితా
శర్మిష్ఠా మిష్టవచనా కృతాంజలిరువాచ తాః. 36

శర్మిష్ఠోవాచ....

రాజపుత్రీం దుర్భగాం మాం స్వామినా పరివర్జితామ్
త్రాతుమర్హథ హే దేవ్యో వ్రతేనానేన కర్మణా. 37

భా: మిక్కిలి దుఃఖించిన శర్మిష్ఠ స్త్రీలు ఆచరించెడి వ్రతమును చూచి మునికి నమస్కరించి చేతులు జోడించి పలికెను. ఓ వనితలారా! దౌర్భాగ్యముచే స్వామిచేవిడువబడిన రాజపుత్రిని నేను. ఈ వ్రతమెట్లు చేయవలెనో ఉపదేశించి నన్ను రక్షింపుడు అని శర్మిష్ఠ పలికెను.

శ్రుత్వాతు తా వచస్తస్యాః కారుణ్యాచ్చ కియత్ కియత్
పూజోపకరణం దత్వా కారయామాసురాదరాత్. 38

వ్రతం కృత్వా తుశర్మిష్ఠా లబ్ధ్వా స్వామినమీశ్వరమ్
సూత్వా పుత్రాన్ సుసంతుష్టా సమభూత్ స్థిరయౌవనా. 39

భా: శర్మిష్ఠ మాటలు వినిన స్త్రీలు దయతో పూజాసామగ్రి ఇచ్చి వ్రతమును చేయించిరి. వ్రతమాచరించిన శర్మిష్ఠ పతిని పొంది, పుత్రులను బడసి స్థిరయౌవనము కలది ఆయెను.

సీతా చాశోకవనికామధ్యే సరమయా సహ
వ్రతం కృత్వా పతిం లేభే రామం రాక్షసనాశనమ్. 40

బృహదశ్వ ప్రసాదేన కృత్వేమం ద్రౌపదీ వ్రతమ్
పతియుక్తా దుఃఖముక్తా బభూవ స్థిరయౌవనా. 41

భా: సీతయు విభీషణపత్నియగు సరమ అశోకవనమున రుక్మిణీ వ్రతమాచరించిరి. పిమ్మట సీతరాక్షసనాశకుడగు శ్రీరామచంద్రుని పొందెను. బృహదశ్వుని అనుగ్రహముచే ఈ వ్రతమాచరించి ద్రౌపది దుఃఖములు తొలగి పతిని పొంది స్థిరయౌవనవతి ఆయెను.

తథా రమా సితే పక్షే వైశాఖే ద్వాదశీదినే
జామదగ్న్యాద్వ్రతం చక్రే పూర్ణం వర్ష చతుష్టయమ్. 42
పట్టసూత్రం కరే బద్ధ్వా భోజయిత్వాద్విజాన్ బహూన్
భుక్త్వా హవిష్యం క్షీరాక్తం సుమృష్టం స్వామినా సహ. 43

భా: రమ వైశాఖమాసము శుక్లపక్షము ద్వాదశినాడు పరశురాముని ద్వారా నాలుగు సంవత్సరములు పూర్ణముగ వ్రతమాచరించెను. వ్రతము సమాప్తమయిన పిమ్మట పట్టుదారము చేతికి ధరించి బ్రాహ్మణులకు భోజనము పెట్టి, పిమ్మట బాగుగ శోధింపబడిన క్షీరమిశ్రితమగు హవిష్యమును పతితో కూడ భుజించి------------

బుభుజే పృథివీం సర్వామపూర్వాం స్వజనైర్వృతా
సా పుత్రౌసుషువే సాధ్వీ మేఘమాల బలాహకౌ. 44
దేవానాముపకర్తారౌ యజ్ఞదానతపోవ్రతైః
మహోత్సాహౌ మహావీర్యౌ సుభగౌ కల్కిసమ్మతౌ. 45
వ్రతవరమితి కృత్వా సర్వసంపత్ సమృద్ధ్యా భవతి
విదితతత్త్వా పూజితా పూర్ణకామా
హరిచరణసరోజ ద్వంద్వ భక్త్యైకతానా
వ్రజతి గతి- మపూర్వాం బ్రహ్మవిజ్ఞైరగమ్యామ్. 46

భా: స్వజనముతో కూడి, పతితో అఖండ భూమి ననుభవించెను. మేఘమాల, బలాహకుడను ఇద్దరు పుత్రులు రమకు కల్గిరి. కల్కికి ప్రీతి పాత్రులగు ఇద్దరు పుత్రులు సౌభాగ్యవంతులు, ఉత్సాహ, పరాక్రమ సంపన్నులై యజ్ఞదాన, తపో, వ్రతములచే దేవతలకుపకరించెడి వారైరి. శ్రేష్ఠమగు వ్రతమాచరించుటవలన సమృద్ధిగ సర్వసంపదలను పొందెదరు. వారి అభీష్టములు నెరవేరి, తత్త్వజ్ఞానము కలవారై లోకమున పూజింపబడుదురు. శ్రీహరి పాదపద్మములను సావధానముగ భక్తితో సేవించిన బ్రహ్మవేత్తలకు అగమ్యమగు శ్రేష్ఠగతిని పొందెదరు.

ఇతి శ్రీ కల్కి పురాణేऽను భాగవతే
భవిష్యే తృతీయాంశే రుక్మిణీవ్రతం నామ
సప్తదశోऽధ్యాయః

ఇది భాగవతానుబంధము భవిష్యము నగు
శ్రీ కల్కి పురాణమున తృతీయాంశమున
రుక్మిణీ వ్రతమను
సప్తదశాధ్యాయము.



# కల్కిపురాణము

## తృతీయాంశము-అష్టాదశాధ్యాయము

2-120

సూత ఉవాచ.....

ఏతద్వః కథితం విప్రా వ్రతం త్రైలోక్య విశ్రుతమ్

అతః పరం కల్కికృతం కర్మ యచ్ఛృణుత ద్విజాః. 1

శంభలే వసతస్తస్య సహస్రపరివత్సరాః

వ్యతీతా భ్రాతృ పుత్ర స్వజ్ఞాతి సంబంధిభిః సహ. 2

శంభలే శుశుభే శ్రేణీ సభాపణక చత్వరైః

పతాకాధ్వజ చిత్రాఢ్యైర్య థేంద్ర స్యామరావతీ. 3

భా: సూతుడు పలికెను. ఓ బ్రాహ్మణులార! ముల్లోకములలో ప్రసిద్ధిగాంచిన రుక్మిణీవ్రతమును గూర్చి చెప్పితిని. పిమ్మట నేను కల్కి చేసిన కర్మలను చెప్పెదను వినుడు. కల్కి శంభలగ్రామమున సోదర, పుత్ర, బంధు, పరివారముతో నివసించుచు వేయి సంవత్సరములు గడిచెను. ధ్వజ, పతాకలతో అలంకృతమై, సభామంటపములు, క్రయ విక్రయ శాలలు, చత్వరములతో శంభలగ్రామము అమరావతి వలె శోభిల్లెను.

యత్రాష్ట షష్టి తీర్థానాం సంభవః శంభలేఽభవత్

మృత్యోర్మోక్షః క్షితౌ కల్కేరకల్కస్య పదాశ్రయాత్. 4

వనోపవన సంతాన నానాకుసుమ సంకులైః

శోభితం శంభలంగ్రామం మన్యే మోక్షపదం భువి. 5

తత్రకల్కిః పురస్త్రీణాం నయనానందవర్ధనః

పద్మయా రమయా కామం రరామ జగతీపతిః. 6

భా: శంభలగ్రామమున 68 తీర్థములు ( ఋషులచే సేవింపబడు జలాశయములు) కలవు. పాపరహితుడగు కల్కి యొక్క పదవిన్యాసముచే శంభలగ్రామమున మరణించిన వారు మోక్షమును పొందుచున్నారు. వన ఉపవనములతో వివిధ పుష్పములతో శోభిల్లు శంభల గ్రామము భూలోకమున మోక్షస్థానము [illegible]న్నది. పురస్త్రీలకు నేత్రానందము కల్గించు జగత్పతి యగు కల్కి

రమాపద్మలతో శంభలగ్రామమున స్వేచ్ఛగ క్రీడించెను.

సురాధిపప్రదత్తేన కామగేన రథేన వై
నదీపర్వత కుంజేషు ద్వీపేషు పరయా ముదా. 7
రమమాణో విశన్ పద్మారమాద్యాభీ రమాపతిః
దివానిశం నబుబుధే స్త్రైణశ్చ కామలంపటః. 8
పద్మాముఖామోద సరోజశీధువాసోపభోగీ సువిలాస వాసః
ప్రభూతనీలేంద్రమణి ప్రకాశే గుహావిశేషే ప్రవివేశ కల్కిః. 9

భా: స్వేచ్ఛగా పయనించెడి దేవేంద్రుడిచ్చినరథమునెక్కి మిక్కిలి ఆనందముతో నదులు, పర్వతములు, నికుంజములు, ద్వీపములలో రమాపద్మలతో విహరించుచు కామాసక్తుడగు కల్కికి దివారాత్రములు తెలియలేదు. పిమ్మట ఒకనాడు పద్మావతియొక్క ముఖామోదమనెడి పద్మగంధమును ఆస్వాదించుచు కల్కి ఇంద్రనీలమణులతో ప్రకాశించెడి గుహను ప్రవేశించెను.

పద్మాతు పద్మశతరూపరూపా రమాచ పీయూషకలావిలాసా
పతిం ప్రవిష్టం గిరిగహ్వరే తే నారీసహస్రాకులితే త్వగాతామ్. 10
పద్మా పతిం ప్రేక్ష్య గుహానివిష్టం రంతుం మనోజ్ఞా ప్రవివేశ పశ్చాత్
రమా, బలాయూథ సమన్వితా తత్పశ్చాద్గతా కల్కిమహోగ్ర కామా. 11

భా: నూరు పద్మముల రూపము వంటి రూపము గల పద్మలమృత కళవంటి విలాసలు గల రమ ఇద్దరు, వేయి స్త్రీలతో కూడి పతి ప్రవేశించినగుహను ప్రవేశించిరి. మనస్సును హరించెడి పద్మ తన భర్త గుహను ప్రవేశించుట చూచి విహరించవలెనను అభిలాషతో పతివెంట లోనికి వెళ్ళెను. కల్కితో రమించవలెనని ఉత్కటాభిలాష కల రమ కూడ స్త్రీలతో కలిసి వెనుకవెళ్ళెను.

తత్రేంద్రనీలోత్పల గహ్వరాంతే కాంతాభిరాత్మ ప్రతిమాభిరీశమ్
కల్కిం చ దృష్ట్వా నవనీరదాభం తతః స్థితం ప్రస్తరవన్మమోహ. 12
రమా సఖీభిః ప్రమదాభిరార్తా విలోకయంతీ దిశమాకులాక్షీ
పద్మాపి పద్మాశతశోభమానా విషణ్ణచిత్తా నబభౌ స్మచార్తా. 13

భా: ఇంద్రనీల మణి మయమగు గుహలోపల మేఘశ్యాముడగు కల్కి భగవానుడు తన రూపము వంటి రూపము గల స్త్రీలతో విహరించుట చూచి పద్మ మోహము చెంది రాయివలె అచేతన మాయెను. పరివారముతో గూడిన రమ వ్యగ్రురాలై దీనముగ నలుదిక్కులను చూచుచుండెను. పద్మసముదాయమువలె ప్రకాశించెడి పద్మ కాంతి హీనురాలై శోకతప్త హృదయము కలదాయెను.

భూమౌ లిఖంతీ నిజకజ్జలేన కల్కిం శుకం తం కుచకుంకుమేన
కస్తూరికాభిస్తు తదగ్రమగ్రే నిర్మాయ చాలిజ్య ననామ భావాత్. 14
రమా కలాలాపపరా స్తువంతీ కామార్దితా తం హృదయే నిధాయ
ధ్యాత్వా నిజాలఙ్కరణైః ప్రపూజ్య తస్థౌ విషణ్ణా కరుణావసన్నా. 15

భా: పద్మ తన కంటి కాటుకతో భూమిపై గీయుచు, తనకెదురుగ కుచకుంకుమ కస్తూరికలతో కల్కి శుకులను చిత్రించి ఆలింగనము చేసుకొని భావావేశముతో నమస్కరించెను. అవ్యక్తమధురముగ మాట్లాడెడి కామ పీడితురాలగు రమ హృదయమున కల్కిని నిలుపుకొని స్తోత్రము చేయుచు పూజించి విషణ్ణురాలై దుఃఖభారముతో క్రింద పడెను.

క్షణాత్ సముత్థాయ రురోదరామా కలాపినః కంఠనిభం స్వనాథమ్
హృదోపగూఢం నపునః ప్రలభ్య కామార్దితేత్యాహ హరే ప్రసీద. 16
పద్మాపి నిర్ముచ్య నిజాఙ్గభూషాశ్చకార ధూళిపటలే విలాసమ్
కంఠఞ్చ కస్తూరికయాపి నీలం కామం నిహంతుం శివతాముపేత్య. 17

భా: వెంటనే పైకి లేచి రమ నెమలి కంఠధ్వని వలె రోదనముచేసెను. తన హృదయస్వామిని పొందక మదన పీడితురాలై ఓహరి! అనుగ్రహింపుమని వేడెను. పద్మ శరీరాలంకారములను విడిచెను. శరీరము ధూళిచే మలినము కాగా, కంఠము కస్తూరిచే నీలముగ నుండుటచే మన్మథుని సంహరించుటకు శివరూపము ధరించినట్లుండెను.

కలావతీనాం కలయాకలయ్య క్షీణేక్షణానాం హరిరార్త బంధుః
కామప్రపూరాయ ససార మధ్యే కల్కిః ప్రియాణాం సురతోత్సవాయ. 18
తాః సాదరేణాత్మపతిం మనోజ్ఞాః కరేణవో యూథపతిం యథేయుః
సానందభావా విషదానువృత్తా వనేషు రామాః పరిపూర్ణ కామాః 19

భా: బెదిరిన చూపులు గల విలాసవతులగు ప్రియురాంద్ర కోరికలను తీర్చుటకు ఆర్తజనబంధువగు కల్కి సురతోత్సవమునకై వారి మధ్యకు వచ్చెను. ఆడ ఏనుగుల గజరాజును సమీపించినట్లు స్త్రీలందరు ప్రసన్నులై ఆనందముతో కల్కిని సమీపించిరి. విషాదము తొలగి వారి కోర్కెలు తీరెను.

వైభ్రాజికే చైత్రరథే సుపుష్పే సునందనే మందర కందరాంతే
రేమే స రామాభిరుదారతేజా రథేన భాస్వత్ ఖగమేన కల్కిః. 20

పద్మాముఖాబ్జామృత పానమత్తో రమాసమాలిఙ్గన వావాసితాంగః
వరాంగనానాం కుచకుంకుమాక్తో రతిప్రసంగే విపరీతయుక్తః
ముఖే విదష్టా రసనావశిష్టామోదః సకల్కిర్నహి వేద దేహమ్. 21

భా: ఉదార చరితుడు, తేజస్సంపన్నుడగు కల్కి ఆకాశగామియగు ప్రకాశించెడి రథమున రమాపద్మలతో కూడి ఉత్తమ పుష్పములతో శోభిల్లెడి నందనవనము, వైభ్రాజకము, చైత్రరథము మున్నగు ప్రాంతములలో విహరించెను. పద్మావతి ముఖపద్మము యొక్క అమృతమును త్రాగుటచే మత్తుడు, రమా సమాలింగనముచే సుగంధితమైన అవయవములు కలవాడు, శ్రేష్ఠయువతుల కుచకుంకుమ పూయబడిన వాడగు కల్కి రతిప్రసంగమున విపరీతాచరణము కలవాడాయెను. స్త్రీలచే అతని ముఖము కొఱకబడెను. అధరోష్ఠపానముచే మత్తుడైన కల్కికి శరీరము తన అధీనములో లేకుండెను.

రమాసమానాః పురుషోత్తమం తం వక్షోజమధ్యే వినిధాయ ధీరాః
పరస్పరాశ్లేషణ జాతహాసా రేముర్ముకుందం విలసచ్ఛరీరాః. 22
తతః సరోవరం త్వరా స్త్రియో యయుః క్లమజ్వరాః
ప్రియేణ తేన కల్కినా వనాంతరే విహారిణా. 23
సరః ప్రవిశ్య పద్మయా విమోహరూపయా తయా
జలం దదుర్వరాఙ్గనాః కరేణవో యథా గజమ్. 24

భా: రమతో సమానమగు రూపము కల్గిన స్త్రీలు పురుషోత్తముని వక్షోజమధ్యమున ధరించి క్రీడించిరి. పరస్పరాలింగనముచే సంతుష్టులై పులకరించిన శరీరము గలవారై ముకుందునితో రమించిరి. అలసిన స్త్రీలు వనాంతరమున విహరించు ప్రియుడగు కల్కితో సరోవరమునకు వెడలిరి. ఆడ ఏనుగులు గజరాజుపై నీరు చిమ్మినట్లు శ్రేష్ఠవనితలు మోహపెట్టు రూపముతో గల పద్మావతితో కలసి సరోవరమున జలక్రీడలాడుచు కల్కి శరీరముపై నీరు చిలికిరి.

ఇతి హ యువతి లీలా లోకనాథః సకల్కిః
ప్రియయువతి పరీతః పద్మయా రమయా సహ
నిజరమణవినోదైః శిక్షయన్ లోక వర్గాన్
జయతి విబుధ భర్తా శంభలే వాసుదేవః. 25
యే శృణ్వంతి వదంతి భావచతురా ధ్యాయంతి సంతః సదా
కల్కేః శ్రీపురుషోత్తమస్య చరితం కర్ణామృతం సాదరాః

తేషాం నో సుఖయత్యయం మురరిపోర్దాస్యాభిలాషం వినా
సంసారః పరిమోచనఞ్చ పరమానందామృతాం భోనిధేః. **26**

భా: శంభలగ్రామము రమాపద్మలతోను, ప్రియయువతుల తోడను విహరించుచు తన వినోదముతో లోకముల కుపదేశము చేయు జగన్నాథుడగు కల్కికి జయమగు గాక పురుషోత్తముడగు కల్కి భగవానుని కర్ణామృతమగు సాధుచరితమును ఎవరు భక్తితో వినెదరో, పలికెదరో, ధ్యానము చేయుదురో అట్టివారికి మురరిపువగు శ్రీహరిని సేవించుట కంటె మరియొక భావన హృదయములోనికిరాదు. పరమానందభరితమగు అమృత మయ సంసారసాగరము నుండి ముక్తి నిచ్చు భగవంతుని సేవ తప్ప ఏదియు వారికి సుఖము నీయదు.

ఇతి శ్రీ కల్కి పురాణేఽను భాగవతే
భవిష్యే తృతీయాంశే
కల్కి వర్ణనం నామ
అష్టాదశోఽధ్యాయః

ఇది భాగవతానుబంధము, భవిష్యమునగు
శ్రీ కల్కి పురాణమున తృతీయాంశమున
కల్కి వర్ణన మను
అష్టాదశాధ్యాయము.



# కల్కి పురాణము

## తృతీయాంశము- ఏకోన వింశత్యధ్యాయము

సూత ఉవాచ.....

తతో దేవగణాస్సర్వే బ్రహ్మణా సహితా రథైః
స్వైః స్వైర్గణైః పరివృతా కల్కిం ద్రష్టుముపాయయుః. 1
మహర్షయః సగంధర్వాః కిన్నరాశ్చాప్సరోగణాః
సమాజగ్ముః ప్రముదితాః శంభలం సురపూజితమ్. 2

భా: సూతుడు పలికెను. పిమ్మట దేవగణమంతయు బ్రహ్మతో కలిసి తమతమ పరివారముతో రథములపై కల్కిని చూచుటకు వచ్చిరి. మహర్షులు, గంధర్వులు, కిన్నరులు, అప్సరసలు ఆనందములో దేవపూజితమగు శంభల గ్రామమునకు వచ్చిరి.

తత్ర గత్వా సభామధ్యే కల్కిం కమలలోచనమ్
తేజోనిధిం ప్రపన్నానాం జనానామభయ ప్రదమ్. 3
నీలజీమూతసంకాశం దీర్ఘపీవరబాహుకమ్
కిరీటేనార్కవర్ణేన స్థిరవిద్యున్నిభేన తమ్. 4

భా: శంభల గ్రామమునకు వెళ్ళి దేవతలు సభామంటపమున కమలనేత్రుడు, తేజోరాశి, శరణాగతులకు అభయమిచ్చువాడు, నీలమేఘసదృశుడు, దీర్ఘమై బలిసిన బాహువులు కలవాడు, సూర్యునివలె, మెఱుపులవలె ఎఱ్ఱని కాంతి వంతమైన కిరీటముతో శోభిల్లువాడు.

శోభమానం ద్యుమణినా కుండలేనాభిశోభినా
సహర్షాలాప వికసద్వదనం స్మితశోభితమ్. 5
కృపాకటాక్ష విక్షేప పరిక్షిప్త విపక్షకమ్
తారాహారోల్లసద్వక్షశ్చంద్రకాంతమణిశ్రియా. 6

భా: అతని ముఖము సూర్యునివలె మిక్కిలి ప్రకాశించెడి కుండలములతో శోభిల్లెను హర్షముతో కూడిన వార్తాలాపములతో వికసించెను. మందహాసముతో ప్రకాశించెను. అతని

క్రీగంటి కటాక్షవిక్షేపముచే శత్రువులు తొలగిరి. (శత్రువులు అనుగ్రహింపబడెను) వక్షస్థలమందు ప్రకాశించెడి హారమందలి చంద్రకాంతమణి శోభతో ప్రసన్నతను పొందెను.

కుముద్వతీమోదవహం స్ఫురచ్ఛక్రాయుధాంబరమ్
సర్వదానంద సందోహరసోల్లసిత విగ్రహమ్. 7
నానామణిగణోద్యోత దీపితం రూపమద్భుతమ్
దదృశుర్దేవగంధర్వా యే చాన్యే సముపాగతాః. 8
భక్త్యా పరమయాయుక్తాః పరమానందవిగ్రహమ్
కల్కిం కమలపత్రాక్షం తుష్టువుః పరమాదరాత్. 9

భా: ఇంద్రధనుస్సు వలె అతని వస్త్రములు ప్రకాశించు చున్నవి. హర్షాతిరేకముచే ఎల్లప్పుడు అతడు ఉల్లాసముగ నుండెను. రకరకముల మణుల కాంతులచే ప్రకాశించెడి అద్భుత రూపము గల కల్కిని అక్కడకు విచ్చేసిన దేవగంధర్వాదులు చూసి మిక్కిలి భక్తితో, ఆదరముతో పరమానంద విగ్రహధారి, కమల పత్రాక్షుడగు కల్కిని స్తుతించిరి.

దేవా ఊచుః......

జయాశేష సంక్లేశ కక్ష ప్రకీర్ణానలోద్దామ
సంకీర్ణహీ(?)శ దేవేశ విశ్వేశ భూతేశ భావః
తవానంత శాంతః స్థితోఽంగాప్తరత్న
ప్రభాభాత  పాదాజితానంత శక్తే. 10

భా: దేవతలు పలికిరి. ఓ దేవదేవ! విశ్వేశ! భూతనాథ! నీవు అనంతుడవు. నీయందు సమస్త భావములు విరాజిల్లు చున్నవి. సాంసారికక్లేశములనెడి ఎండుగడ్డిని భస్మము చేసెడి ప్రచండమైన అగ్ని వంటి వాడవు. శరీరాభరణము లందలి రత్నకాంతులచే ప్రకాశించెడి పాదములచే సర్పరాజు యొక్క అనంతశక్తిని అణచితివి. (కాళి యమర్దనము) ఓ దేవ! నీకు జయమగుగాక.

ప్రకాశీకృతాశేష లోకత్రయాత్ర వక్షఃస్థలే భాస్వత్ కౌస్తుభశ్యామ
మేఘౌఘరాజచ్ఛరీర ద్విజాధీశ పుంజానన త్రాహి
విష్ణో సదారా వయం త్వాం ప్రపన్నాః సశేషః. 11

భా: ఓ శ్రీహరి! ముల్లోకములను ప్రకాశవంతముగ చేయువాడ! వక్షస్థలమున కౌస్తుభమణి ప్రకాశించుచున్నది. నీలమేఘము వలె ప్రకాశించు శరీరము కలవాడా ! ఓదేవ! భార్యాసహితులమై మీ శరణుకోరి వచ్చితిమి. రక్షింపుడు.

యద్యస్త్యనుగ్రహో౽స్మాకం వ్రజ వైకుంఠమీశ్వర
త్యక్త్వా శాసితభూఖండం సత్యధర్మావిరోధతః. 12
కల్కిస్తేషామితి వచః శ్రుత్వా పరమహర్షితః
పాత్రమిత్రైః పరివృతశ్చకార గమనే మతిమ్. 13
పుత్రానాహూయ చతురో మహాబలపరాక్రమాన్
రాజ్యే నిక్షిప్య సహసా ధర్మిష్ఠాన్ ప్రకృతి ప్రియాన్. 14

భా: ఓ పరమేశ్వర! మామీద దయ యున్నచో సత్యధర్మములకు విరుద్ధముగ శాసించెడి భూమండలమును విడిచి వైకుంఠమునకు రావలసినది. దేవతల ప్రార్థనను ఆలకించిన కల్కి సంతుష్టుడై మిత్రులతో వైకుంఠమునకు వెళ్ళుట కభిలషించుచు పరమధార్మికులు, ప్రజలకు ఇష్టులు, బలపరాక్రమ సంపన్నులగు పుత్రులను పిలిచి రాజ్యాభిషిక్తులను చేసెను.

తతః ప్రజాః సమాహూయ కథయిత్వా నిజాః కథాః
ప్రాహ తాన్నిజ నిర్యాణం దేవానాముపరోధతః. 15
తచ్ఛ్రుత్వా తాః ప్రజాః సర్వా రురుదుర్విస్మయాన్వితాః
తం ప్రాహుః ప్రణతాః పుత్రాయథా పితరమీశ్వరమ్. 16

భా: పిమ్మట కల్కి ప్రజలను పిలిచి తన వృత్తాంతమును చెప్పి దేవతల ఆగ్రహముచే తన వైకుంఠ ప్రయాణమును తెలియజేసెను. అది విని విస్మయమునొందిన ప్రజలు ఏడ్వసాగిరి. ప్రజలు ఈశ్వరునికి నమస్కరించి పుత్రుడు తండ్రితో చెప్పుకొన్నట్లు ఇట్లు చెప్పికొనిరి.

ప్రజా ఊచుః.....

భో నాథ! సర్వధర్మజ్ఞ నాస్మాన్ త్యక్తు మిహార్హసి
యత్రత్వం తత్రతు వయం యామః ప్రణతవత్సల. 17
ప్రియా గృహా ధనాన్యత్ర పుత్రాః ప్రాణాస్తవానుగాః
పరత్రేహ విశోకాయ జ్ఞాత్వా త్వాం యజ్ఞపూరుషమ్. 18

భా: ప్రజలు పలికిరి. ఓనాథ! సర్వధర్మముల నెరిగిన మీరు మమ్ములను విడుచుట తగదు. మీరు ఎక్కడ ఉండిన మేము అక్కడకే వచ్చెదము. ఈ సంసారమున గృహ, ధన, పుత్రులు అందరికి ప్రియమైనవే. కాని ఇహపరలోకములలో దుఃఖరాహిత్యమునకై మాప్రాణములు యజ్ఞపురుషులగు మిమ్ములను అనుసరించుటక భిలషించు చున్నవి.

ఇతి తద్వచనం శ్రుత్వా సాంత్వయిత్వా సదుక్తిభిః
ప్రయయౌ క్లిన్నహృదయః పత్నీభ్యాం సహితో వనమ్. 19
హిమాలయం మునిగణైరాకీర్ణం జాహ్నవీజలైః
పరిపూర్ణం దేవగణైః సేవితం మనసః ప్రియమ్. 20
గత్వావిష్ణుః సురగణైర్వృత శ్చారు చతుర్భుజః
ఉషిత్వా జాహ్నవీతీరే సస్మారాత్మానమాత్మనా. 21

భా: ప్రజల మాటలను వినిన కల్కి వారిని సద్వచనములతో శాంతపరచి క్లిన్నమనస్కుడై తన ఇద్దరి భార్యలతో వనమునకు వెడలెను. పిమ్మట మునిగణముతో కూడినది గంగాజలముతో పరిపూర్ణమైనది, దేవతలచే సేవింపబడునది మనస్సున కానందము కల్గించునదగు హిమాలయ పర్వతమును చేరి గంగానదీ తీరమున దేవతలతో కూడి చతుర్భుజ విష్ణురూపమును ధరించి తనను తాను ధ్యానించెను.

పూర్ణజ్యోతిర్మయః సాక్షీ పరమాత్మా పురాతనః
బభౌ సూర్యసహస్రాణాం తేజోరాశి సమద్యుతిః. 22
శంఖ చక్రగదాపద్మ శార్ఙ్గద్యైః సమభిష్టుతః
నానాలఙ్కరణానాఞ్చ సమలఙ్కరణాకృతిః. 23

భా: పూర్ణజ్యోతిర్మయుడు, సాక్షిస్వరూపుడు, పురాతనుడగు పరమాత్మ సహస్ర సూర్యుల తేజః పుంజము వలె భాసించెను. శంఖ, చక్ర, గదా, పద్మ, శార్ఙ్గదులచే స్తోత్రము చేయబడిన కల్కి శరీరాకృతి అలంకారములకే అలంకారమాయెను.

వవృషుస్తం సురాః పుష్పైః కౌస్తుభాముక్తకంధరమ్
సుగంధి కుసుమాసా రైర్దేవ దుందుభి నిఃస్వనైః. 24
తుష్టువుర్ముముహుః సర్వే లోకాః సస్థాణు జంగమాః
ద్వష్ట్వా రూపమరూపస్య నిర్యాణే వైష్ణవం పదమ్. 25

భా: కౌస్తుభమణిచే ప్రకాశించెడి అతనిపై దేవతలు పుష్ప వర్షము కురింపించిరి. దుందుభులు మ్రోగుచుండ పలుమార్లు కల్కిని స్తుతించిరి. కల్కి వైష్ణవ పదమును ప్రవేశించగ నిరాకారుని రూపమును చూచి సమస్తలోకములు తమను తాము మైమఱచినవి.

తద్దృష్ట్వా మహదాశ్చర్యం పత్న్యః కల్కేర్మహాత్మనః
రమా పద్మా చ దహనం ప్రవిశ్య తమవాపతుః. 26

ధర్మః కృతయుగం కల్కే రాజ్ఞయా పృథివీతలే
నిస్సపత్నౌ సుసుఖినౌ భూలోకం చేరతుశ్చిరమ్. 27

భా: ఆశ్చర్యమును గొలుపు కల్కి భగవానుని రూపమును చూచి రమాపద్మలు అగ్నిని ప్రవేశించి అతనిని పొందిరి. కల్కి ఆదేశానుసారము భూమండలమున ధర్మ కృతయుగములు శత్రురహితమై చిరకాలము విహరించిరి.

దేవాపిశ్చ మరుః కామం కల్కేరాదేశకారిణౌ
ప్రజాః సంపాలయంతౌ తు భువం జుగుపతుః ప్రభూ. 28
విశాఖ యూపభూపాలః కల్కేర్నిర్యాణమీదృశమ్
శ్రుత్వా స్వపుత్రం విషయే నృపం కృత్వా గతో వనమ్. 29

భా: కల్కి ఆదేశానుసారము మరు దేవాపులు ప్రజలను పాలించుచు చిరకాలము భూమిని రక్షించిరి. విశాఖ యూప భూపాలుడు కల్కి నిర్యాణమును విని తన పుత్రునికి రాజ్య భార మప్పగించి అడవులకు వెడలెను.

అన్యే నృపతయో యే చ కల్కేర్విరహాకర్షితాః
తం ధ్యాయంతో జపంతశ్చ విరక్తాః స్యుః నృపాసనే. 30
ఇతి కల్కేరనంతస్య కథాం భువనపావనీమ్
కథయిత్వా శుకః ప్రాయాన్నర నారాయణాశ్రమమ్. 31

భా: మిగిలిన కొందరు రాజులు కల్కివిరహముచే ఖిన్నులై రాజసింహాసనము నుండి విరక్తులై కల్కి నామమును జపించుచు ధ్యానము చేసిరి. లోకములను పావనము చేయు కల్కి కథలను చెప్పి శుకదేవులు నరనారాయణాశ్రమమునకు వెడలిరి.

మార్కండేయాదయో యే చ మునయః ప్రశమాయనాః
శ్రుత్వానుభావం కల్కేస్తే తం ధ్యాయంతో జగుర్యశః. 32
యస్యాను శాసనాద్భూమౌ నాధర్మిష్ఠాః ప్రజాజనాః
నాల్పాయుషో దరిద్రాశ్చ నపాఖండా న హైతుకాః. 33
నాధయో వ్యాధయః క్లేశా దేవభూతాత్మసంభవాః
నిర్మత్సరాః సదానందా బభూవు ర్జీవజాతయః. 34

భా: శమగుణ సంపన్నులగు మార్కండేయాదిమునులు కల్కి మాహాత్మ్యమును వి అతనిని ధ్యానించుచు కీర్తించిరి. కల్కి శాసనకాలమున భూమండలమున ప్రజలలో అధార్మికుల

అల్పాయుష్కులు, దరిద్రులు, పాఖండులు, కపటులు లేరు. సమస్త జీవులు ఆధివ్యాధిరహితులై క్లేశమాత్సర్యములు లేనివారై నిత్యానంద భరితులైతిరి.

ఇత్యేతత్ కథితం కల్కేఽవతారం మహోదయమ్
ధన్యం యశస్య మాయుష్యం స్వర్గ్యం స్వస్త్యయనం పరమ్. 35
శోకసంతాప పాపఘ్నం కలి వ్యాకులనాశనమ్
సుఖదం మోక్షదం లోకే వాంఛితార్థ ఫలప్రదమ్. 36

భా: కల్కి అవతారకథను వినుటవలన ధనము, యశస్సు, ఆయువు పొంది శుభములు కలిగి చివరకుస్వర్గము లభించును. కల్కి వృత్తాంతమును వినుట వలన శోక, సంతాప, పాపములు తొలగి కలి ప్రభావము వలన కల్గిన ఉద్వేగము పోవును. అభీప్సితార్థ సిద్ధి కలిగి సుఖమోక్షములు ప్రాప్తించును.

తావచ్ఛాస్త్రప్రదీపానాం ప్రకాశో భువిరోచతే
భాతి భానుః పురాణాఖ్యో యావల్లోకేఽతి కామధుక్. 37
శ్రుత్వో తద్భృగు వంశజో మునిగణైః సాకం సహర్షావశీ
జ్ఞాత్వా సూతమమేయబోధవిదితం శ్రీలోమ హర్షాత్మజమ్
శ్రీకల్కేఽవతార వాక్యమమలం భక్తిప్రదం శ్రీహరేః
శుశ్రూషుః పునరాహ సాధువచసా గంగాస్తవం సత్కృతః. 38

భా: అభీప్సిత ఫలమునిచ్చెడి పురాణరూప సూర్యుడు ఉదయించనంతవరకు శాస్త్రములనెడి ప్రదీపములు ప్రకాశించును. భృగు వంశమున జన్మించిన జితేంద్రియుడగు శౌనకమహర్షి మహర్షులతో కూడి ప్రీతిదాయకము, భక్తిప్రదమగు కల్కి అవతారవృత్తాంతమును విని మిక్కిలి ప్రసన్నులైరి. శౌనక మహర్షి తిరిగి నారాయణుని వృత్తాంతమును వినదలచి లోమహర్షుని పుత్రుడగు సూతుని కల్కి చేసిన గంగాస్తుతిని గూర్చి అడిగెను.

ఇతి శ్రీ కల్కి పురాణేఽను భాగవతే భవిష్యే తృతీయాంశే కల్కినిర్యాణం నామ
ఏకోన వింశతి తమోఽధ్యాయః

ఇది భాగవతానుబంధము, భవిష్యము నగు శ్రీకల్కిపురాణమున తృతీయాంశమున
కల్కినిర్యాణమను ఏకోనవింశతితమాధ్యాయము సమాప్తము.



# కల్కిపురాణము

## తృతీయాంశము - వింశత్యధ్యాయము

శౌనక ఉవాచ.....

హేసూత! సర్వధర్మజ్ఞ యత్త్వయా కథితం పురా
గంగాం స్తుత్వా సమాయాతా మునయః కల్కిసన్నిధిమ్. 1
స్తవం తం వద గంగాయాః సర్వపాపప్రణాశనమ్
మోక్షదం శుభదం భక్త్యా శృణ్వతాం పఠతామిహ. 2

భా: శౌనకుడు పలికెను. ఓసూత! సర్వధర్మజ్ఞ! గంగను స్తుతించి మునులు కల్కిసన్నిధిని చేరితిరని నీవు ముందు చెప్పితివి. భక్తి పూర్వకముగ వినిన చదివిన వారి సర్వపాపములను హరించునది, మోక్షము నిచ్చునది, సమస్త మంగళములను కల్గించునదగు గంగా స్తోత్రమును చెప్పుము.

సూత ఉవాచ.......

శృణుధ్వమృషయః సర్వే గంగాస్తవ మనుత్తమమ్
శోకమోహహరం పుంసామ్ ఋషిభిః పరికీర్తితమ్. 3

ఋషయ ఊచుః......

ఇయం సురతరంగిణీ భవనవారిధేస్తారిణీ
స్తుతా హరిపదాంబుజాదుపగతా జగత్సంసదః
సుమేరుశిఖరామరప్రియజలా మలక్షాలనీ
ప్రసన్నవదనా శుభా భవభయస్య విద్రావిణీ. 4

భా: సూతుడు పలికెను. ఓఋషులార! శోకమోహములను నాశము చేసెడి, ఋషులచే కీర్తింపబడిన గంగాస్తవమును చెప్పెదను వినుడు. ఋషులు పలికిరి. దేవనది యగు గంగ జీవులను భవసాగరమునుండి ఉద్ధరించును. ఇది శ్రీహరి పాదాబ్జముల నుండి పుట్టి భూమి మీద ప్రవహించినది. ఇది సంసార భీతిని పోగొట్టి పాపములను కడిగి వేయును. సుమేరు శిఖరమందు ఉనికి కలదై దేవతలకు ప్రీతిని కలుగజేయును. ఇట్టి గంగను లోకమున సమస్తప్రాణులు స్తుతించెదరు

భగీరథపథానుగా సురకరీంద్ర దర్పాపహా
మహేశ ముకుటప్రభా గిరిశిరః పతాకా సితా
సురాసురనరోరగైరజ భవాచ్యుతైః సంస్తుతా
విముక్తి ఫలశాలినీ కలుషనాశినీ రాజతే. 5

భా: గంగ భగీరథుని వెంట భూమికి వచ్చెను. తెల్లని రూపముతో గంగానది ఐరావత దర్పము నణచెను. గంగ పరమేశ్వరుని కిరీటమందలి చంద్ర ప్రభవంటిది. హిమాలయ శిఖరముల వలె తెల్లని బ్రహ్మ విష్ణుపరమేశ్వరులు, దేవ దానవ మనుష్య సర్పాదులు గంగను స్తుతించిరి. పాపమును పోగొట్టి మోక్షఫలము నిచ్చుచు గంగ విరాజిల్లు చున్నది.

పితామహకమండలు ప్రభవముక్తిబీజాలతా
శ్రుతి స్మృతిగణస్తుతా ద్విజకులాలవాలావృతా
సుమేరు శిఖరాభిదా నిపతితా త్రిలోకావృతా
సుధర్మఫలశాలినీ సుఖపలాశినీ రాజతే. 6

భా: బ్రహ్మదేవుని కమండలము నుండి పుట్టిన గంగయనెడి లతకు ముక్తియనునది బీజము. బ్రాహ్మణగణము లతకు ఆలవాలము. (చెట్టుపాదు) సుధర్మమను ఫలములతో, సుఖమనెడి పత్రములతో ఒప్పెడి గంగాలత సుమేరు పర్వత శిఖరమును భేదించి పుట్టి ముల్లోకములలో వ్యాపించి శ్రుతిస్మృతులచే స్తుతింపబడుచున్నది.

చరద్విహగమాలినీ సగరవంశముక్తిప్రదా
మునీంద్రవరనందినీ దివి మతాచ మందాకినీ
సదా దురితనాశినీ విమలవారి సందర్శన
ప్రణామగుణకీర్తనాదిషు జగత్సు సంరాజతే. 7

భా: సంచరించెడి పక్షిసముదాయము గలది, సగర వంశమునకు ముక్తి నిచ్చినది, మునిశ్రేష్ఠులచే స్తుతింపబడునది, దేవలోకమున మందాకినిగ ప్రసిద్ధి గాంచినదగు గంగ తన స్వచ్ఛజల దర్శనముచే, నమస్కరించుటచే, గుణములను కీర్తించుటచే లోకముల అమంగళములను నాశము చేయుచు విరాజిల్లు చున్నది.

మహాభిష సుతాఙ్గనా హిమగిరీశకూటస్తనీ
సఫేన జలహాసినీ సితమరాల సంచారిణీ

**చరల్లహరిసత్కరా వరసరోజమాలాధరా**
**రసోల్లసితగామినీ జలధికామినీ రాజతే. 8**

భా: ప్రశస్తమైన అవయవములుగల శంతను భార్యయగు గంగ హిమాలయ శిఖరములు స్తనములుగ, నురుగుతో కూడిన జలమే మందహాసముగ, తెల్లని హంసల సంచారమే ఆమె నడకలుగ, చలించెడి తరంగములే హస్తములుగ కలిగి వికసించిన పద్మసముదాయమే మాలగ ధరించి సముద్రుని కోరుచు ఉల్లాసముతో కూడిన గమనము కలదై ప్రకాశించెను.

**క్వచిత్ కలకలస్వనా క్వచిదధీరయాదోగణా**
**క్వచిన్మునిగణైః స్తుతా క్వచిదనంతసంపూజితా**
**క్వచిద్రవికరోజ్జ్వలా క్వచిదుదగ్రపాతాకులా**
**క్వచిజ్జన విగాహితా జయతి భీష్మమాతా సతీ. 9**

భా: ఒకప్పుడు అవ్యక్తమధురముగ నాదము చేయుచు, ఒకచో భయంకరములగు జలజంతువులతో కూడినదై, మునిగణముచే స్తుతింపబడుచు, దేవతలచే పూజింపబడుచు, సూర్యకిరణములచే ఉజ్జ్వలముగ ప్రకాశించుచు, ఒకచో ఉగ్రజలప్రపాతములు కలదై, మరొకచో జనము స్నానమాచరింప భీష్మమాతయగు గంగ సర్వోత్కర్షగ నుండెను.

**స ఏవ కుశలో జనః ప్రణమతీహ భాగీరథీం**
**స ఏవ తపసాం నిధిర్జపతి జాహ్నవీమాదరాత్**
**స ఏవ పురుషోత్తమః స్మరతి సాధు మందాకినీం**
**స ఏవ విజయీ ప్రభుః సురతరంగిణీం సేవతే. 10**

భా: గంగాదేవికి నమస్కరించువాడే కుశలుడు. భక్తితో గంగను జపించువాడే తపస్వి. మందాకినిని స్మరించువాడే పురుషశ్రేష్ఠుడు. దేవనదిని సేవించువాడే విజయము లభించిన ప్రభువు.

**తవామల జలాచితం ఖగశృగాలమీనక్షతం**
**చలల్లహరిలోలితం రుచిరతీర జంబాలితమ్**
**కదా నిజవపుర్ముదా సురనరోరగైః సంస్తుతో౽**
**ప్యహం త్రిపథగామిని! ప్రియమతీవ పశ్యామ్యహో. 11**

భా: స్వర్గ మర్త్య పాతాళములు మూడిటియందు ప్రవహించు ఓ గంగ! నీ పవిత్రజలమందు లగ్నము చేయబడినది, చంచల తరంగములచే ఇటునటు కదల్చబడినది, మనోహరతీర అగు నా శరీరమును దేవమనుష్య సర్పగణముచే స్తుతింపబడు నేను ఎప్పుడు చూడగలను?

త్వత్తీరే వసతిం తవామలజలస్నానం తవ ప్రేక్షణం
త్వన్నామస్మరణం తవోదయకథా సంలాపనం పావనమ్
గంగే మే తవ సేవనైకనిపుణోఽప్యానందితశ్చాదృతః
స్తుత్వా త్వద్గతపాతకో భువి కదా శాంతశ్చరిష్యామ్యహమ్. 12

భా: ఓ గంగ! నీతీరమున నివసించుట పవిత్రజలస్నానమాచరించుట, చూచుట, నీనామమును స్మరించుట, పవిత్రములగు నీ ఉపాఖ్యానములను కీర్తించుట ఎప్పుడు చేయగలను? నిన్ను సేవించుట వలననే నా హృదయముప్పొంగును. అందరు నన్ను ఆదరింతురు. నిన్ను స్తుతించుటచే పాపములు తొలగి శాంతచిత్తుడనై భూమండలమున ఎప్పుడు విహరించగలను?

ఇత్యే తదృషిభిః ప్రోక్తం గంగాస్తవమనుత్తమమ్
స్వర్గ్యం యశస్య మాయుష్యం పఠనాచ్ఛ్రవణాదపి. 13
సర్వపాపహరం పుంసాం బలమాయుర్వివర్థనమ్
ప్రాతర్మధ్యాహ్నసాయాహ్నే గంగాసాన్నిధ్యతా భవేత్. 14
ఇత్యేతద్భార్గవాఖ్యానం శుకదేవాన్మయా శ్రుతమ్
పఠితం శ్రావితం చాత్ర పుణ్యం ధన్యం యశస్కరమ్. 15
అవతారం మహావిష్ణోః కల్కేః పరమమద్భుతమ్
పఠతాం శృణ్వతాం భక్త్యా సర్వాశుభ వినాశనమ్. 16

భా: ఇట్లు గంగా స్తోత్రము మునులచే చెప్పబడినది. దీనిని చదువుట వినుట వలన స్వర్గము, యశస్సు, ఆయుర్దాయము లభించును. ప్రాతః కాలము, మధ్యాహ్నము, సాయంకాలములలో స్తోత్రము చదివిన వారికి గంగా సామీప్యము లభించును. ఇది సర్వపాపములను హరించును. బలము, ఆయుర్దాయమును వృద్ధి పరచును. నేను శుక దేవుని వలన భార్గ శ్యాఖ్యానమును వింటిని. దీనిని చదివిన వినిన వారికి పుణ్యము, ధనము యశస్సు లభించును. మహావిష్ణువు యొక్క కల్కి అవతార ఘట్టము చదివిన వినిన సమస్త అమంగళములు తొలగి శుభము జరుగును.

ఇతి శ్రీ కల్కి పురాణేఽను భాగవతే భవిష్యే
తృతీయాంశే గంగాస్తవం నామ వింశతి తమోఽధ్యాయః.
ఇది భాగవతానుబంధము, భవిష్యమునగు శ్రీ కల్కిపురాణమున
తృతీయాంశమున గంగాస్తవమను ఇరువదవ అధ్యాయము.



# కల్కిపురాణము

## తృతీయాంశః - ఏకవింశోఽధ్యాయః

అత్రాపి శుక సంవాదో మార్కండేయేన ధీమతా
అధర్మవంశకథనం కలేర్వివరణం తతః. 1

భా : కల్కిపురాణమున బుద్ధిమంతుడగు మార్కండేయునితో శుకమహర్షి సంవాదము, అధర్మవంశ కథనము, కలివివరణము.

దేవానాం బ్రహ్మసదనప్రయాణం గోభువా సహ
బ్రహ్మణో వచనాద్విష్ణోర్జన్మ విష్ణుయశో గృహే. 2

భా : గోరూపమును ధరించిన భూదేవితో దేవతలు బ్రహ్మలోకమును చేరుట, బ్రహ్మవచనముల ననుసరించి విష్ణుయశునింట విష్ణు జననము.

సుమత్యాం స్వాంశకైర్భ్రాతృచతుర్భిః శంభలే పురే
పితుః పుత్రేణ సంవాదస్తథోపనయనం హరేః. 3

భా : శంభల గ్రామమున సుమతికి విష్ణువు అంశలుగ నల్గురు సోదరులు జన్మించుట, తండ్రికొడుకుల సంవాదము, కల్కి ఉపనయనము.

పుత్రేణ సహ సంవాసో వేదాధ్యయనముత్తమమ్
శస్త్రాస్త్రాణాం పరిజ్ఞానం శివసందర్శనం తతః. 4

భా : తండ్రికొడుకుల సహవాసము, కల్కి వేదాధ్యయనము, శస్త్రాస్త్రవిద్యలను నేర్చుట, శివదర్శనము.

కల్కేః స్తవం శివపురో వరలాభః శుకాపనమ్
శంభలాగమనం చక్రే జ్ఞాతిభ్యో వరకీర్తనమ్. 5

భా: కల్కి శివుని స్తుతించుట, శివుని వలన వరమును పొందుట, శుకమును పొందుట, తిరిగి కల్కి శంభల గ్రామమునకు తిరిగి వచ్చుట, తన బంధువర్గమునకు మహాదేవుడు వరము లిచ్చుటను చెప్పుట.

విశాఖయూపభూపేన నిజసర్గాత్మ వర్ణనమ్
మహాభాగ్యాద్బ్రాహ్మణానాం శుకస్యాగమనం తతః. 6

భా : విశాఖయూపునికి ప్రశ్నకు సమాధానముగ కల్కి విప్రలక్షణములను వారి మాహాత్మ్యమును వివరించుట, శివునిచే నీయబడిన శుకము అచ్చటకు వచ్చుట.

కల్కినా శుక సంవాదః సింహ లాఖ్యానముత్తమమ్
శివదత్తవరా పద్మా తస్యా భూపస్వయం వరే. 7

భా : శుకము కల్కికి సింహళ వృత్తాంతమును చెప్పుట, శివుని వరమువలన పద్మావతి స్వయంవర సభలో

దర్శనాద్భూప సంఘానాం స్త్రీభావ పరికీర్తనమ్
తస్యా విషాదః కల్కేస్తు వివాహార్థం సముద్యమః. 8

భా : ఆమెను చూచిన పురుషులు స్త్రీరూపమునొందుట, పద్మావతి విషాదము, కల్కి వివాహప్రయత్నము.

శుక ప్రస్థాపనం దౌత్యే తయా తస్యాపి దర్శనమ్
శుకపద్మాపరిచయః శ్రీవిష్ణోః పూజనాదికమ్. 9

భా : దౌత్యమునకు పంపుట, పద్మ శుకమును చూచుట, వారిరువురి పరిచయము, శ్రీవిష్ణుపూజ.

పాదాది దేహధ్యానం చ కేశాంతం పరివర్ణితమ్
శుక భూషణదానం చ పునః శుక సమాగమః. 10

భా : ఆ పాదమస్తకము విష్ణుస్తోత్రము, పద్మ శుకమును అలంకరించుట, కల్కి శుకముల సమాగమము.

కల్కేః పద్మావివాహార్థం గమనం దర్శనం తయోః
జలక్రీడా ప్రసంగేన వివాహస్తదనంతరమ్. 11

భా : పద్మను వివాహమాడుటకు కల్కి బయలుదేరుట, జలక్రీడ ప్రసంగమున వారిరువురి పరస్పర దర్శనము, వివాహము

పుంస్త్వ ప్రాప్తిశ్చ భూపానాం కల్కేర్దర్శనమాత్రతః
అనంతాగమనం రాజ్ఞా సంవాదస్తేన సంసది. 12

భా : కల్కి దర్శనము వలన స్త్రీరూపము నొందిన రాజులు పురుషులుగ మారుట,

అనంతుని ఆగమనము, అతని సంవాదము.

**షండ త్వాదాత్మనో జన్మ కర్మ చాత్ర శివస్తవః**
**మృతే పితరి తద్విష్ణోః క్షేత్రే మాయా ప్రదర్శనమ్. 13**

భా : అనంతుడు తన జన్మవృత్తాంతమును చెప్పుట, శివస్తోత్రము, తండ్రిమరణానంతరము అనంతునికి విష్ణుక్షేత్రమున మాయాదర్శనము.

**అత్రాఖ్యానమనంతస్య జ్ఞాన వైరాగ్య వైభవమ్**
**రాజ్ఞాం ప్రయాణం కల్కేశ్చ పద్మయా సహ శంభలే. 14**

భా : అనంతుని జ్ఞాన వైరాగ్య వైభవమును చెప్పుట రాజుల నిర్గమనము, కల్కి పద్మతో శంభల గ్రామమునకు వెళ్ళుట.

**విశ్వకర్మవిధానం చ వసతిః పద్మయా సహ**
**జ్ఞాతి భ్రాతృ సుహృత్ పుత్రైః సేనాభిర్బుద్ధ నిగ్రహః. 15**

భా : విశ్వకర్మ నిర్మించిన శంభల గ్రామమున పద్మతో బంధు వర్గముతో కల్కి నివసించుట, బౌద్ధులను అణగద్రొక్కుట.

**కథితం చాత్ర తేషాంచ స్త్రీణాం సంయోధనాశ్రయః**
**తతోఽత్ర వాలఖిల్యానాం మునీనాం స్వనివేదనమ్. 16**

భా : బౌద్ధుల స్త్రీలు యుద్ధము చేయుటకు వచ్చుట, వాలఖిల్యాది మునులు తమ వృత్తాంతమును చెప్పుట,

**సపుత్రాయాః కుథోదర్యా వధశ్చాత్ర ప్రకీర్తితః**
**హరిద్వారగతస్యాపి కల్కేర్ముని సమాగమః. 17**

భా : పుత్రునితో కూడ కుథోదరి యను రాక్షసి సంహారము, హరిద్వారమున కల్కి మునులను దర్శించుట

**సూర్యవంశస్య కథనం సోమస్య చ విధానతః**
**శ్రీరామ చరితం చారు సూర్యవంశానువర్ణనే. 18**

భా : సూర్యవంశ వర్ణనము, శ్రీరామచరితము, చంద్రవంశ వర్ణనము

**దేవాపేశ్చ మరోః సంగో యుద్ధాయాత్ర ప్రకీర్తితః**
**మహాఘోరవనే కోకవికోక వినిపాతనమ్. 19**

భల్లాటగమనం తత్ర శయ్యా కర్ణాదిభిః సహ
యుద్ధం శశిధ్వజేనాత్ర సుశాంతా భక్తి కీర్తనమ్. 20

భా : మరు, దేవాపులు యుద్ధక్షేత్రమునకు వచ్చుట, కోక వికోకవధ, కల్కి భల్లాట గ్రామమునకు వెడలుట, అచ్చట శయ్యాకర్ణ, శశిధ్వజాదులతో కల్కి యుద్ధమొనర్చుట, సుశాంత భక్తి కీర్తనము.

యుద్ధే కల్కేరానయనం ధర్మస్యచ కృతస్యచ
సుశాంతాయాః స్తవస్తత్ర రమోద్వాహస్తం కల్కినా. 21

భా : కల్కి ధర్మ, కృతయుగములు యుద్ధక్షేత్రమునకు వచ్చుట, సుశాంత కల్కిని స్తుతించుట, కల్కిరమల వివాహము

సభాయాం పూర్వకథనం నిజగృధ్రత్వ కారణమ్
మోక్షః శశిధ్వజస్యాత్ర భక్తిప్రార్థయితు ర్విభోః. 22

భా : శశిధ్వజుడు తాను గృధ్రముగ జన్మించిన వృత్తాంతము తెలుపుట, కల్కిని ప్రార్థించిన శశిధ్వజునికి మోక్షము,

విషకన్యామోచనం చ నృపాణా మభిషేచనమ్
మాయాస్తవః శంభలేషు నానాయజ్ఞాది సాధనమ్. 23

భా : విషకన్యనుద్ధరించుట, రాజుల నభిషిక్తుని గావించుట, మాయను స్తుతించుట, శంభల గ్రామమున యజ్ఞాది కర్మల ననుష్ఠించుట

నారదాద్విష్ణుయశసో మోక్షశ్చాత్ర ప్రకీర్తితః
కృతధర్మ ప్రవృత్తిశ్చ రుక్మిణీ వ్రతకీర్తనమ్. 24

భా : నారదుని వలన కీర్తింపబడిన విష్ణుయశుని మోక్ష వృత్తాంతము, కృత ధర్మ ప్రవృత్తి, రుక్మిణీ వ్రతము

తతో విహారః కల్కేశ్చ పుత్రపౌత్రాది సంభవః
కథితో దేవగంధర్వ గణాగమనమత్ర హి. 25

భా : కల్కి విహారము, అతనికి పుత్రపౌత్రాదులుకలుగుట, శంభల గ్రామమునకు దేవగంధర్వుల రాక

తతో వైకుంఠగమనం విష్ణోః కల్కేరిహోదితమ్
శుక ప్రస్థానముచితం కథయిత్వా కథాః శుభాః. 26

భా : విష్ణువు కల్కి అవతారమును చాలించి వైకుంఠమునకు వెడలుట, శుకప్రస్థానము

**గంగా స్తోత్రమిహ ప్రోక్తం ముని సంమతమ్**
**జగతామానందకరం పురాణం పంచలక్షణమ్. 27**

భా : ముని సమ్మతమగు గంగా స్తోత్రము వర్ణింపబడినవి. సర్గ, ప్రతిసర్గ, వంశ, మన్వంతర, వంశాను చరితమను ఐదు పురాణలక్షణములతో గూడిన కల్కి పురాణము సర్వజన రంజకము.

**సకల్కి సిద్ధిదం లోకైః షట్ సహస్రం శతాధికమ్**
**సర్వశాస్త్రార్థ తత్త్వానాం సారం శ్రుతిమనోహరమ్. 28**

భా : వినుటకింపైన, 6100 శ్లోకములతో గూడిన కల్కిపురాణము పాప పంకిలమగు లోకము నుద్ధరించును.

**చతుర్వర్గ ప్రదం కల్కిపురాణం పరికీర్తితమ్**
**ప్రలయాంతే హరిముఖాత్ నిః సృతం లోకవిస్తృతమ్. 29**

భా : ప్రళయాంతమున నారాయణుని ముఖము నుండి వెలువడి లోకవిస్తారము నొందిన కల్కి పురాణము ధర్మార్థ కామమోక్షములనెడి పురుషార్థముల నొసగును.

**అహో వ్యాసేన కథితం ద్విజరూపేణ భూతలే**
**విష్ణోః కల్కేర్భగవతః ప్రభావం పరమాద్భుతమ్. 30**

భా : కల్కి అవతారము నెత్తిన విష్ణుభగవానుని గాథలు వేదవ్యాసునిచే అద్భుతముగ చెప్పబడినవి.

**యే భక్త్యాత్ర పురాణసారమమలం శ్రీవిష్ణుభావాప్లుతం**
**శృణ్వంతీహ వదంతి సాధుసదసి క్షేత్రే సుతీర్థాశ్రమే**
**దత్వా గాం తురగం గజం గజవరం స్వర్ణం ద్విజాయాదరాత్**
**వస్త్రాలంకరణైః ప్రపూజ్య విధివన్ముక్తాస్తు ఏవోత్తమాః. 31**

భా: బ్రాహ్మణులను యథావిధి పూజించి గోవులు మున్నగు వాటిని దానము చేయుచు విష్ణు భావములతో నిండిన కల్కి పురాణసారమును ఏ భక్తజనము చదివెదరో, వినెదరో అట్టివారు మోక్షము నొందగలరు.

**శ్రుత్వా విధానం విధివద్బ్రాహ్మణో వేదపారగః**
**క్షత్రియో భూపతిర్వైశ్యో ధనీ శూద్రో మహాన్ భవేత్. 32**

భా : బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు యథావిధి కల్కిపురాణమును వినిన క్రమముగ వేదవిద్య, రాజ్యము, ధనము, గొప్పతనమును పొందుచున్నారు.

పుత్రార్థీ లభతే పుత్రం ధనార్థీ లభతే ధనమ్

విద్యార్థీ లభతే విద్యాం పఠనాత్ శ్రవణాదపి. 33

భా : పురాణ పఠనము లేక శ్రవణము వలన పుత్రార్థి పుత్రుని, ధనార్థిధనమును, విద్యార్థి విద్యను పొందగలడు.

ఇత్యేతత్ పుణ్య మాఖ్యానం లోమహర్షణజో మునిః

శ్రావయిత్వా మునీన్ భక్త్యా యయౌ తీర్థాటనాదృతః. 34

భా : లోమహర్షణ పుత్రుడగు సూతమహర్షి శౌనకాది మహర్షులకు పుణ్యప్రదమగు పురాణ గాథను వినిపించి తీర్థములను పర్యటించుటకు వెడలెను.

శౌనకో మునిభిః సార్థం సూతమామంత్ర్య ధర్మవిత్

పుణ్యారణ్యే హరిం ధ్యాత్వా బ్రహ్మ ప్రాప సహర్షిభిః. 35

భా : ధర్మవేత్తయగు శౌనకుడు మహర్షులతో గూడ పుణ్యారణ్యమున హరిధ్యానము చేయుచు బ్రహ్మ లోకము చేరెను.

లోమహర్షణజం సర్వపురాణజ్ఞం యతవ్రతమ్

వ్యాసశిష్యం మునివరం తం సూతం ప్రణమామ్యహమ్. 36

భా : వ్యాస శిష్యుడు, లోమహర్షుని పుత్రుడు, సమస్త పురాణముల నెరిగినవాడగు సూతమహర్షికి నా నమస్కారము.

ఆలోక్య సర్వశాస్త్రాణి విచార్య చ పునః పునః

ఇదమేవ సునిష్పన్నం ధ్యేయో నారాయణః సదా. 37

భా : సమస్త శాస్త్రములను పర్యాలోచనము చేయుట వలన శ్రీమహావిష్ణువు నిరంతరము ధ్యానింప దగినవాడని ఫలించినది.

వేదే రామాయణే చైవ పురాణే భారతే తథా

ఆదావంతే చ మధ్యే చ హరిః సర్వత్ర గీయతే. 38

భా : వేదములు, రామాయణము, పురాణములు, భారతమున అంతట హరినామము కీర్తంపబడుచున్నది.

సజలజలద దేహో వాతవేగైకవాహః

కరధృతకరవాలః సర్వలోకైకపాలః

కలికులవనహంతా సత్య ధర్మ ప్రణేతా

కలయతు కుశలం వః కల్కి రూపః సభూపః. 39

భా : వాయువేగముగల అశ్వము వాహనముగ గలవాడు, హస్తమందు ఖడ్గము కల్గి కలివంశమును నాశము చేయుచు సర్వలోకములను రక్షించువాడు, సత్యయుగ స్థాపకుడు, వర్షించు మేఘమువలె ప్రకాశించు కల్కి భగవానుడు మీకు శుభము కలుగ జేయుగాక.

ఇతి శ్రీ కల్కి పురాణేఽనుభాగవతే భవిష్యే
తృతీయాంశే ఏకవింశోఽధ్యాయః.

ఇది భాగవతానుబంధము భవిష్యమునగు
శ్రీ కల్కిపురాణమున తృతీయాంశమున
ఇరువది యొకటవ అధ్యాయము.



## మా వద్ద లభించు ఇతర గ్రంథములు

## రచయిత: ప్రొ॥ శ్రీపాద సత్యనారాయణ మూర్తి.

1. పరమ లఘు మంజూష 125-00
2. శ్లేషాలంకార విమర్శః(సంస్కృతము) 150-00

## రచయిత: డా॥ తిప్పాభట్ల రామకృష్ణ మూర్తి.

1. శ్రీమదాంధ్ర మహా భారతము- జనహిత వ్యాఖ్య
   విరాట పర్వము 200-00
2. శ్రీమదాంధ్ర మహా భారతము- జనహిత వ్యాఖ్య
   ఉద్యోగ పర్వము 200-00
3. రస సిద్ధాంతము- ఆంధ్రుల వరివస్య 125-00
4. భారత నిరుక్తి- తిక్కన సరసోక్తి 16-00
5. భారత నిరుక్తి- ఎఱ్ఱన ధర్మోక్తి 20-00
6. శివ సహస్ర నామ నిరుక్తి- అష్టోత్తర శత నామ నిరుక్తితో 60-00
7. తప్పులు లేని శివ సహస్ర నామములు 10-00
8. మహా భారత ప్రశ్నోక్తి (క్విజ్) ( 550 ప్రశ్నలు-సమాధానములు) 15-00

## త్వరలో......

1. రామాయణ క్విజ్
2. భారత నిరుక్తి- నన్నయ రుచిరార్థ సూక్తి. పునర్ముద్రణము.

ఈ గ్రంథములు కావలసిన వారు ముందుగా వాని సొమ్మును మనియార్డరు ద్వారా పంపినచో ప్రింటెడ్ బుక్స్ బుక్ పోస్టులో పుస్తకములు పంపబడును. రిజిస్టర్ పోస్టుకు 14-00 రూ. అదనముగా పంప వలెను.

1. ఎస్. వి. ఫణీశ్వరి,
   18-1-46/J9
   శాంతి నగర్, కె.టి. రోడ్,
   **తిరుపతి.**
   పిన్ : 517 507.
   ఫోన్ : 08574-30423.

2. డా॥ టి. ఆర్. కె. మూర్తి,
   శివాలయం వెనుక,
   **పోలకం పాడు.**
   వయా. తాడేపల్లి పోస్టు.
   గుంటూరు జిల్లా-522 501.
   ఫోన్ : 08645-72093.